# కవితా మహేంద్రజాలం



డాక్టర్ ప్రసాదరాయకులపతి

ప్రచురణ:

డాక్టర్ కులపతి షష్టిపూర్తి అభినందన సమితి
5-1-982, పుత్లిబౌలి, గౌలిగుడా, హైదరాబాద్

KULAPATHI SAAHITHI-KAVITA MAHENDRAJALAM

Dr. Prasadaraya Kulapathi

**First Edition :** June, 1998 



**Cover Illustration :** Sri Bapu

**Cover Design :** Sri Chandra

**Price:** Rs. 150/-

**For Copies :**
Dr. Prasadaraya Kulapathi
B1/C40, 4th Line, Ravindranagar,
Guntur.

# నివేదన

డాక్టర్ ప్రసాదరాయ కులపతి ఆంధ్ర సాహిత్య రంగంలో కులపతి. ఆధ్యాత్మిక సాధనా ప్రపంచంలో కులపతి. మంత్రరహస్య జ్ఞాతగా, ద్రష్టగా, స్రష్టగా కులపతి. అలాంటి కులపతి షష్టిపూర్తి సందర్భంగా చిరకాలంగా అలభ్యంగా వున్న ఆయన రచనలను పునర్ముద్రించాలని డాక్టర్ కులపతి షష్టిపూర్తి అభినందన సమితి (హైదరాబాద్) సంకల్పించింది. ఆయన రచనలలో ప్రధానమైన ఎనిమిది పుస్తకాలను ఆంధ్ర పాఠకలోకానికి అందించే ఈ కృషిలో ఎందరో పెద్దలు, రసజ్ఞులు తోడ్పడ్డారు. వారందరికీ కృతజ్ఞతలు.

కులపతి సాహితి పునర్ముద్రణ ద్వారా భారతీయ తాత్త్విక చింతన మరోసారి సహస్ర దళకమలంలా వికసిస్తుందని మా కాంక్ష. రసజ్ఞ పాఠకలోకం దీనికి సాక్షి. కేవలం రసమహితం మాత్రమే కాక జీవితానికి గమ్యమూ, సార్థక్యమూ కూర్చే ఈ కులపతి సాహితిని రసజ్ఞ పాఠకలోకం సమాదరిస్తుందని ఆశిస్తూ ..

డాక్టర్ కులపతి షష్టిపూర్తి అభినందన సమితి

# ఆహ్వానం

మాంత్రిక ప్రపంచంలో మహేంద్రజాలానికున్న స్థానం సామాన్యమైనది కాదు. ముక్తి మార్గగాములైన జ్ఞానులు, యోగులు-వాళ్ళను వదిలేస్తే మిగతా ప్రపంచమంతా ఆశ్చర్యకరమైన సిద్ధి ప్రదర్శనలకు ఆకర్షితమవుతుంది. సమ్మోహిత మవుతుంది. ఇంద్రజాల మహేంద్రజాల టక్కు టమార గజకర్ణ గోకర్ణ విద్యలను తంత్ర గ్రంథాలలో గమనించవచ్చు. ఈనాడు మంత్ర తంత్ర శక్తులతో అద్భుతాలు ప్రదర్శించే ఇంద్రజాలికులు పోయి హస్తలాఘవంతో, ఆధునిక యంత్రాది పరికరాల సహాయంతో ప్రదర్శన లిచ్చేవారు మిగిలారు. కాకుంటే సమ్మోహన శక్తి-హిప్నాటిజం-చేసేవారు మాత్రం ఉన్నారు.

సాహిత్య రంగంలోను ఇంచుమించు అటువంటి ఇంద్రజాల విశేషాలే చిత్ర-గర్భ-బంధ-ఆశు కవితా మార్గాలు. పాఠకులను అద్భుతరసంలో ముంచివేసే ఆ ప్రక్రియలను, ప్రదర్శనలను ప్రాచీన కాలం నించి అధునాతన కాలం దాకా తెలుగు కవులు ఏ విధంగా విన్యసించారో ఇందులో మీరు దర్శిస్తారు.

పద్యంపైన పద్యం-పద్యం మధ్య పద్యం
శ్లోకంలో పద్యం-బంధంలో పద్యం
సమస్యలో పద్యం-దత్తపదితో పద్యం

వెయ్యేండ్ల తెలుగు పద్య చరిత్రలో కవులు,పండితులు సృష్టించిన వింతలు, విన్యాసాలు, విచిత్రాలు, విశేషాలు, సారస్వత మహేంద్రజాల లీలా విశేషాలు అందుకోండి! ఆనందించండి!

**ఆం**ధ్ర సాహిత్యంలోని అద్భుత సాహితీ విశేషాలను, చిత్ర విచిత్ర కవితా ప్రక్రియలను పాఠకులకు అందించాలనే ఉద్దేశంతో అందిస్తున్న గ్రంథ ఇది. అవధాన-ఆశు కవితా ప్రదర్శనలలో ఉండే అన్ని రకాల విన్యాసాలు ఇందులో ఉంటాయి. సమస్యలు, దత్తపదులు, దత్తాక్షరులు సన్యస్తాక్షరులు, నిషిద్ధాక్షరులు, గూఢార్థభరిత పద్యాలు, బంధ కవిత్వం, గర్భ కవిత్వం మొదలైన విచిత్ర, వినూతన, విశిష్ట విద్యా-విలాసాలు దీనిలో చోటు చేసుకున్నాయి. పూర్వాంధ్ర కవి పండితులు వీటిని ఎలా విన్యసించారో చూపించటంతో పాటు అధునాతన పద్య కవుల కవితలకు కూడా ఇది వేదిక.

ఒక విత్తనాన్ని భూమిలో పెట్టి నీళ్ళు పోస్తే కొన్నాళ్ళకు దాంట్లోనించి మొక్క వస్తుంది. మరి కొన్నాళ్ళకు అది పూలు పూస్తుంది. ఇక కొన్నాళ్ళకు కాయలు కాస్తుంది, పండ్ల నిస్తుంది. ఈ పరిణామం సహజం కావటం వల్ల, ఎప్పుడూ చూస్తుండటం వల్ల మనకు ఆశ్చర్యం కలిగించదు.

అదే పరిణామాన్ని ఒక మాంత్రికుడు వేగంగా చూపితే-అంటే అప్పటికప్పుడు విత్తనం మట్టిలో పెట్టి అది వెంటనే మొలిచి పూలు పండ్లు వస్తే ఆశ్చర్యచకితుల మవుతాము. సృష్టి కర్త చేసే మహేంద్రజాలానికంటే మాంత్రికుడు చేసే మాయకు పరవశించిపోతాము ఎంత విచిత్రం!

సాహిత్యంలోనూ అంతే! ఆలోచించి నెమ్మదిగా ఒక అందమైన పద్యం వ్రాస్తే మెచ్చుకొంటాము. అయితే దానినే అడిగిన వెంటనే తడుముకోకుండా ఆశువుగా చెపితే ఆశ్చర్యపోతాము. వేగ సృష్టిలోని ఆకర్షణ అది. ఆ ఆశుకవిత్వంలోనూ సమస్యలను చమత్కార చతురంగా పూరిస్తే, దత్త పదులను కొత్తగా మెత్తగా పద్యంలో నిలిపితే ఓహో! అని శ్లాఘాశిరః కంపనం చేస్తాము.

వెనుకటి కాలంలో సంస్కృతంలోనూ, తెలుగులోనూ కవులు-ఆశుకవులు ఆ విధంగా చేసి రాజసంస్థానాలలో, ప్రజా హృదయాస్థానాలలో అపూర్వమైన స్థానాన్ని సాధించుకొనే వారు.

ఈనాడూ అటువంటి సమర్థులు లేకపోలేదు. అంతటి వారు కాకపోయినా ఎంతో కొంతటి వారైనా ఉన్నారు. ఆయా పూర్వ, నవ్య కవుల అపూర్వ భావ్య కవితా చిత్రాలను సారస్వతాభిమానులైన పాఠకులకు అందించాలనే సంకల్పంతో ఈ గ్రంథాన్ని అందిస్తున్నాము.

అవధాన రంగంలో కాకలు తీరిన వ్యక్తి ఆశు కవితా రంగంలో అనితర సాధ్యమైన మహత్తర శక్తిని ప్రదర్శిస్తున్న అద్భుతవ్యక్తి . డాక్టర్ ప్రసాదరాయ కులపతి ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రికలో దాదాపు రెండున్నర సంవత్సరాల పాటు 'కవితా మహేంద్రజాలం' పేరిట ధారావాహికంగా చేసిన ఈ రచనను గ్రంథ రూపంలో సంకచించి అందించటంలో తోడ్పడిన వారందరికీ కృతజ్ఞతలు.

డాక్టర్ కులపతి షష్టిపూర్తి అభినందన సమితి

హైదరాబాద్

## తెలుపు నలుపుల.......

గోదావరీ సప్త కూలంకషా మంజు మంజీర ఘలఘల నాదాలు
కృష్ణా తరంగిణీ క్రీడోల్లాస హాస కిలకిలారావాలు
పినాకినీ ధునీ లహరీ లలిత లలిత కలకల స్వనాలు
కారకములూ ప్రేరకములూ అవుతుంటే-
వేదాద్రి నరసింహ విపుల వక్షఃస్థలీ కల్హార మాలికా గంధ వీచికలూ
కమలాద్రి నిలయ మార్కండేయ శివమౌళి చంద్రాంశు నవ సుధా సారధారలూ.

హరిహరనాథ కరుణా కటాక్ష కర్పూర కస్తూరికా ప్రవాహాలూ,
తిరుపతి వేంకటేశ్వర శ్రీపాద పద్మ రేణు పరిమళ మలయ మారుతాలు,
కనకదుర్గా రత్న కిరీట కాంతి కిర్మీరిత దిగంతరాళ సౌందర్యరేఖలూ,
శ్రీశైల శిఖరాంచల జ్యోతిః పుంజ పింజరిత సాంధ్యశ్రీ వైభవాలు
పులకింప జేస్తుంటే-పరవశించిపోయిన ఆంధ్ర కవి
భవ్య చ్ఛందో దర్శనం చేసి దివ్యానుభూతి పొందినవ్య కవితా సృష్టి చేశాడు. నన్నయ
నుంచి నవకవి దాకా నానా రుచిరార్థసూక్తి
నిధులను, నవరస క్షీరాంబుధులను అందించి తరించటమే ధ్యేయం.

ఈ ఉద్దేశంతో, మత కల్లోల ఘూర్ణిత సమాజ సముద్రానికి ప్రశాంత
చంద్రోదయాన్ని ప్రసాదించే భవ్యావేశంతో అక్షర తపస్సు చేసి తాను
పొందిన దివ్యానంద దర్శనాన్ని హరిహర తత్వంగా కవి బ్రహ్మ తిక్కన
అందించిన తీరు చూడండి!

శ్రీయన గౌరినాబరగు చెల్వకు చిత్తము పల్లవింప భ
ద్రాయితమూర్తియై హరిహరంబగు రూపము దాల్చి విష్ణు రూ
పాయ నమశ్శివాయ యని పల్కెడు భక్త జనంబు వైదిక
ధ్యాయిత కిచ్చు మెచ్చు పరతత్వము గొల్చెద నిష్ట సిద్ధికిన్.

దివ్యానుభవాలు, స్వప్న దర్శనాలు నమ్మేవాళ్ళు నమ్ముతారు. నమ్మని వాళ్ళు నమ్మరు. కానీ తిక్కన మన ముందుంచిన అద్భుత చిత్రం-అంతకు ముందు ఏ కవీ భావించని, చూపించని అపురూప దృశ్యం. సంస్తుతిపాత్రమైన కవితా చిత్రం. సగం శివుడు, సగం విష్ణువు. ఒక వైపు చక్రం-మరోవైపు శూలం. ఒక ప్రక్క పీతాంబరం-మరొక ప్రక్క గజ చర్మం- సురనదియును కాళందియు బెరసినటులు తెలుపు నలుపుల మేలి కలయిక గల రూపం-సాహిత్య సృష్టిలో ఇంతటి వింతను ఎవరైనా విన్నారా? కన్నారా?

ఇది ఇంద్రజాలం కాకపోవచ్చు. మంద్రజాలమో! మంత్రజాలమో! హరిహర లీలా జాలమో! తిక్కన సృష్టించిన శబ్దార్థ కల్లోల హేలా రసాలవాలమో!

## అందరు అందరే......

కవిత్వం అడగటానికి, చెప్పటానికీ వేళ ఉంటుంది. సమయం, సందర్భం లేకుండా అడిగితే ఎంత మెత్తని వానికైనా విసుగు పుడుతుంది. కోపమూ రావచ్చు. శ్రీనాథుని వంటి సకల విద్యాసనాథుని ఎవరుపడితే వాళ్ళు ఎక్కడబడితే అక్కడ ఎప్పుడు పడితే అప్పుడు 'పద్యం చెప్పండి' అనో, 'సమస్య పూరించండి' అనో అంటే ఊరుకుంటాడా? వేళగాని వేళ ఒకడెవరో అడిగాడు.

'అందరు అందరే మరియు నందరు నందరె అందరందరే-ఈ సమస్య పూరించండి!'' అన్నాడు-అదీ సదస్సులో, వా డెవడో అల్పుడై ఉండాలి. వెంటనే కవిరాజు నోట పద్యం హాస్యలాస్యంగా వెలువడింది.

ఉ॥ కొందరు భైరవాశ్వములు కొందరు పార్థుని తేరిటెక్కెముల్
కొందరు ప్రాక్కిటీశ్వరులు కొందరు కాలుని యెక్కిరింతలున్
కొందరు కృష్ణజన్మమున కూసినవారలు-ఈ సదస్సులో
అందరు నందరే మరియు నందరు నందరె యంద రందరే!"

భైరవాశ్వములు-కుక్కలు; పార్థుని తేరి టెక్కెముల్=కోతులు; ప్రాక్కిటేశ్వరులు-ఆది వరాహములు (పందులు); కాలుని యెక్కిరింతలు=యముని వాహనములు (దున్నలు); కృష్ణ జన్మమున కూసిన వారలు=గాడిదలు.

సభలోని వారు సరియైనవారు కానప్పుడు ఎంత తీవ్రంగానైనా విమర్శించటానికి శ్రీనాథుడు జంకడు. కొద్దిపాటి చదువుతో అహంకరించే కుపండితులను చూసి బావిలో కప్పలవలె-బయటి ప్రపంచం తెలియని అల్పులను చూసి అతడేమన్నాడో పరికించండి!

తే.గీ!! బోధ మల్పంబు గర్వ మభ్యున్నతంబు
శాంతి నిప్పచ్చరంబు మచ్చరము ఘనము
కూపమండూకములు బోలె కొంచె మెరిగి
పండితమ్మన్యులైన వైతండికులకు.

ఇది శ్రీనాథుడు వితండవాదులైన పండితులను చూసి బాధపడి చెప్పిన పద్యం. రాజమహేంద్రవర పండితులను దృష్టిలో పెట్టుకొని చెప్పాడంటారు. దీని భావ మిది.

నిజమైన పాండిత్యం లేని ఈ వితండవాదులకు జ్ఞానం తక్కువ, గర్వం ఎక్కువ. శాంతమనేదే లేదు. మాత్సర్యం విపరీతం, దేశాటనం లేదు. బావిలోని కప్పలలాగా బెక బెకలాడుతూ తమకు తెలిసిందే సర్వం అని వాగుతుంటారు.

అటువంటిదే మరో పద్యం చూడండి-

నికటమున నుండి శ్రుతిపుట నిష్ఠురముగ
అడవికాకులు బిట్టు పెద్దరుచునప్పు
డుడిగి రాయంచ యూరక యుంట లెస్స
పైప రాకున్న ఎందేవి జనుట లెస్స.

దగ్గర చేరి కర్ణకఠోరంగా కాకులు అరుస్తుంటే ఒక్క రాజహంస ఏం చేస్తుంది? ఊరుకో నన్నా ఊరుకోవాలి. లేదా ఎక్కడకన్నా లేచి వెళ్ళిపోవాలి. వితండవాదులు చుట్టూ చేరి అసహ్యంగా గోల చేస్తూ, గేలి చేస్తుంటే నిజమైన పండితుడు ఏమి చేయాలన్న దాన్ని శ్రీనాథుడు ఇలా సూచించాడు. ఆయనకు కలిగిన అనుభవమే ఈవిధంగా ఆయన చేత చెప్పించి ఉంటుంది.

## ఏయుర్వీం జెల్లు?

విజయనగర ప్రభువు ప్రౌఢ దేవరాయల ఆస్థానంలోని గౌడ డిండిమ భట్టును ఓడించి అతని కంచు ఢక్కను బ్రద్దలు కొట్టించి కవిసార్వభౌమ బిరుదును పాదుకొలిపి కనకాభిషేకాన్ని పొందిన తర్వాత శ్రీనాథుడు సర్వజ్ఞసింగ భూపాలుని ఆస్థానానికి వెళ్ళాడు. వెళ్ళే ముందు సరస్వతి నిలా ప్రార్థించాడట.

సీ॥ దీనార టంకాల తీర్థ మాడించితి దక్షిణాధీశు ముత్యాల శాల
పలుకుతోడై తాంధ్ర భాషా మహాకావ్య నైషధ గ్రంథ సందర్భమందు
పగులగొట్టించి తురుపుట వివాద ప్రౌఢి గౌడ డిండిమ భట్టు కంచు ఢక్క
చంద్రశేఖర క్రియా శక్తి రాయల యొద్ద పాదు కొల్పితి సార్వభౌమ బిరుదు
గీ॥ ఎటుల మెప్పించెదో నన్ను నింక మీద
రావు సింగ మహీపాలు ధీవిశాలు
నిండు కొలువున నెలకొని యుండి నీవు
సరస సద్గుణ నికురుంబ! శారదాంబ

సింగ భూపాలుని గురించి అతడు చెప్పిన ఈ క్రింది పద్యం కల్లోలానికి దారి తీసింది.

కం॥ సర్వజ్ఞ నామధేయము
శర్వునకే రావు సింగ జనపాలునకే
యుర్వీం జెల్లును తక్కొరు
సర్వజ్ఞుం డనుట కుక్క సామజ మనుటే

సర్వజ్ఞుడనే పేరు శివునికీ, సింగ భూపాలునికీ మాత్రమే భూమి పైన చెల్లుతుంది ఇంకెవరి కైనా అలా పిలవటం కుక్కను ఏనుగు-అనటమే అని దీని అర్థం. సింగ భూపాలుడు చాలా సంతోషించి తనను పరమేశ్వరునితో సమానుడని స్తుతించటమే కాక భూమి మీద మరెవ్వరూ ఇంత వారు లేరన్నందుకు పొంగిపోయి గొప్ప సత్కారం చేశాడు.

అక్కడి నుండి కవిసార్వభౌముడు కొండవీడు వెళ్ళాడు. ఆ ఆస్థానంలో అతడు విద్యాధికారి. రాజు పెద కోమటి వేమారెడ్డికి, సింగభూపాలుడికి బలవద్విరోధం. తన శత్రురాజును తన ఆస్థాన కవి అంతగా పొగడటం ఆయనకు కష్టం కలిగించింది. శ్రీనాథుని ఏమిటిదని అడిగాడు.

దానికి శ్రీనాథుడు-"మహారాజా! నేను సింగభూపతిని పొగడ లేదు. తెగడిన పద్య మది. అర్థం చేసుకోలేక స్తోత్రం చేశానని భ్రాంతి చెంది సత్కరించాడు" అన్నాడు. వేమారెడ్డి కూడా ఆశ్చర్యపడ్డాడు. అప్పుడు శ్రీనాథుడు పద్యాన్ని మరో విరుపుతో చదివి వినిపించాడు.

"సర్వజ్ఞ నామధేయము శర్వునికే - రావుసింగజనపాలునకు ఏ యుర్వీం జెల్లును..."

"సర్వజ్ఞ నామము శివునకు మాత్రమే చెల్లుతుంది. సింగభూపతికి ఏ భూమి మీద చెల్లుతుంది? తక్కొరు-అంటే శివుడు గాక ఇతరుని సర్వజ్ఞుడనటం కుక్కను ఏనుగనటమే!

పెద కోమటి వేమారెడ్డి-ఆ చమత్కారానికి ఎంతో సంతోషించి శ్రీనాథుని సన్మానించాడు.

## కుక్కవో నక్కవో...

శ్రీనాథుడు పెదకోమటి వేమారెడ్డి ఆస్థానంలో కొండవీడులో విద్యాధికారి వేమారెడ్డికి, సింగ భూపాలునికి బద్ధవైరం. ఎంత శత్రుత్వమంటే సింగభూపాలుడు తాను తాంబూలం నమిలి ఉమ్మివేసే తమ్మపడిగానికి వేమారెడ్డి అని పేరు పెట్టి అందులో నిష్ఠీవనం చేసి కసి తీర్చుకునే వాడు. అంత ప్రబల

వైరం ఉన్నప్పటికి శ్రీనాథుడు వెళ్ళాడు.

సింగభూపాలుడు పాండిత్య పక్షపాతి, సాహిత్య ప్రియుడు కనుక వచ్చినవాడు ఎక్కడి వాడైనా, ఎవ్వడి వాడైనా విద్వాంసుడు కవి అయితే గౌరవించేవాడు. అందులోను అప్పటికి శ్రీనాథుడు విజయనగర సంస్థానంలో డిండిమభట్టు కంచుఢక్క పగులగొట్టించి కవి సార్వభౌమ బిరుదు స్థాపించి, కనకాభిషేకాన్ని పొంది వస్తున్నాడు. తగిన స్వాగత సత్కారాలు జరిగాయి. రాజు కొలువు తీరాడు. శ్రీనాథుడు సామాన్య ప్రశంసా పద్యాలేవో చెప్పాడు. గోష్ఠి మొదలైంది.

ఒక పండితుడు లేచి 'శ్రీనాథభట్టా! ఈ సమస్య పూరించండి" అన్నాడు.

"కుక్కవొ ఫణివొ నక్కవో కోతివొ పిల్లివొ భూతపిల్లివో?"

శ్రీనాథునితో ఈ పద్యపాదం చదువుతూ ఆయన వైపే చూస్తూ అంటుంటే ఆయనను తిట్టినట్లు గానే వుంది. నువ్వు కుక్కవో, నక్కవో, పామువో, కోతివో, పిల్లివో, భూతపిల్లివో అని-భూతపిల్లి అంటే గ్రామాల్లో అర్ధరాత్రి వేళ పూజలు చేసి దిగంబరుడై రక్తాన్నం పొలిమేరల దగ్గర బలి వేసేవాడు.

శ్రీనాథుడు చిరునవ్వుతో ఒక్కసారి ఆ అడిగిన వ్యక్తివైపు చూశాడు. పద్యపూరణం ఇలా వెలువడింది.

ఉ॥ తక్కకరావు సింగ వసుధావరు డర్థుల కర్థమిచ్చుచో
దిక్కుల లేని కర్ణుని దధీచిని ఖేచరు వేల్పుజెట్టు పెం
పెక్కిన కామధేనువు శిబీంద్రుని నన్నెదు భట్ట! దిట్టవై
కుక్కవొ నక్కవో ఫణివొ కోతివొ పిల్లివొ భూతపిల్లివో

సింగభూపాలుడు యాచకులకు దానం చేస్తుంటే ఎందుకయ్యా ఎప్పటి వారినో కర్ణుని, దధీచిని, కల్పవృక్షాన్ని, కామధేనువును, శిబిని ఎన్నుతావు? నీవు కుక్కవో నక్కవో..

విడిచి పెట్టిన వానికే బాణం తిరిగి వెళ్ళి తగిలింది. అడిగిన భట్టు తలవంచుకున్నాడు. సింగ భూపాలుడు పొంగిపోయినాడు.

శ్రీనాథుని సాహితీ నందనంలో వికసించిన అందాల పారిజాత మా పద్యం. ఆ కవి సార్వభౌముని సాహిత్య జైత్రయాత్రలో ఇటువంటి ఘట్టాలు ఎన్నో! ఎన్నెన్నో!

## ఆశు పద్యమణి

ఆంధ్ర సాహిత్యంలో ఈ శతాబ్దంలో ఆశు కవితా రంగంలో అనన్య సామాన్యమైన ప్రజ్ఞాపాటవాలను ప్రదర్శించినవారు కొప్పరపు సోదర కవులు. వేంకట సుబ్బరాయకవి, వెంకటరమణ కవి-వారి పేర్లు. సాహిత్య జైత్రయాత్ర చేస్తూ, వారొకసారి ఒక పట్టణానికి వెళ్ళారు. ఆ ఊరి జమీందారు పేరు రంగారావు బహద్దర్. ఆయన ఇష్టదైవం వేణుగోపాలస్వామి.

రాజ దర్శనంకాగానే సోదర కవులు"వేణుగోపాలస్వామి మిమ్ము ఆశీర్వదించునుగాక"అని పద్యం చెప్పారు.

జమీందారు సంతోషిస్తూనే ఒక మాట అన్నాడు.

"ఇవాళ మాస శివరాత్రి. మార్కండేయేశ్వరస్వామి ఆలయానికి వెళ్ళి అభిషేకం చేయించి వస్తున్నాను" అని.

అంటే దాని అర్థం ఏమన్నమాట?

'నా యిష్టదైవం వేణుగోపాలస్వామి అన్న సంగతి అందరికీ తెలుసు. ఆ దేవుని పేరు వచ్చేలా

పద్యం ముందు తయారు చేసుకుని రావచ్చు. ఇపుడు నేను మార్కండేయేశ్వరస్వామి పూజ చేసి వస్తున్నాను' అని అంటే ఆ దేవుని పేరు వచ్చే విధంగా పద్యం చెప్పాలి. నిజమైన ఆశుకవు లైతే చెప్పగలగుతారు-అనే భావం ఆయనన్న ఒక్కమాటలో ఇమిడి ఉంది. సోదర కవులు ఆశుకవి చక్రవర్తులు. ఆయన హృదయం గ్రహించి వెంటనే పద్యం ఎత్తుకున్నారు.

శా॥ చండార్కానల దివ్య తేజుడు జగజ్జాలావనైక క్రియా
పాండిత్యుండు రమాధినాయక శచీ ప్రాణేశ నీరేజరుట్
రుండ ప్రాంచిత రత్న మండల రుగారూఢాంఘ్రి యుగ్ముండు మా
ర్కండేయేశ్వరు డేము గాక నిను రంగారాయ భూపాలకా!

రంగరాయరాజా! సూర్యాగ్నులతో సమానమైన దివ్య తేజస్సు కలవాడు, లోకమును రక్షించు సామర్థ్యం కలవాడు, హరి, ఇంద్ర, బ్రహ్మల శిరస్సు లందలి కిరీట రత్నాల కాంతుల చేత ప్రకాశించు పాదాలు కల మార్కండేయేశ్వరస్వామి మిమ్ము కాపాడు గాక.

మార్కండేయేశ్వర అన్నపదం రావటం కోసం శార్దూలాన్ని ఎన్నుకొని రమణీయమైన అర్థం వచ్చే విధంగా వ్యర్థ పదాలు లేకుండా, అంతటి సుదీర్ఘమైన రచనతో సుదృఢ బంధంతో ఆశువుగా చెప్పటానికి ఎంతో గొప్ప నేర్పు కావాలి. ప్రతిభా పాండిత్యాలతో మేళవించిన గంగా ప్రవాహం వంటి ఆశుధార ఉండాలి. అది సోదర కవుల సొమ్ము. ఇటువంటి పద్యాలు వారి సాహిత్య జీవితంలో ఎన్నోసార్లు దర్శన మిస్తాయి. అందులో పై పద్యం ఒక మణిపూస.

## ఇదీ స్వాతంత్ర్యం!

నిడుద పెన్నెరి గుంపు జడగట్ట సగరు ము
మ్మనుమండు తపము గైకొనిన చోటు
జరఠకచ్ఛపకులేశ్వరు వెన్ను గానరా
జగతికి మిన్నేరు దిగిన చోటు
పుచ్చడీకతనంబు పోబెట్టి గిరి కన్య
పతి గొల్వ నా యాసపడిన చోటు
వలరాచ రాచవాడలికాక్షు కనువెచ్చ
కరగిన యల కనికరవు చోటు
తపసియిల్లాండ్ర చెలువంబు తలచి తలచి
మున్ను ముచ్చిచ్చును విరాళిగొన్న చోటు
కనుపవులు వేల్పు బడవాలు కన్నచోటు
హర్షమున జూచి ప్రవరాఖ్యు డాత్మలోన-

కవితా పితామహుడై అల్లసాని పెద్దన ప్రవరుని హిమాలయాలలో తిప్పుతూ చూపించిన అందమైన దృశ్యాలివన్నీ. భగీరథుడు కఠోరంగా తపస్సు చేసిన చోటు, ఆది కూర్మము వీపు కనబడేలా ఆకాశగంగ భూమి మీదికి దిగిన చోటు, పార్వతి పరమేశ్వరునకు సేవ చేసిన చోటు, మన్మథుడు శివుని కంటి మంటలో తగలబడిన చోటు, అగ్ని దేవుడు సప్తర్షుల భార్యలపైన మోహపడి చోటు, రెల్లు గడ్డి కుమారస్వామిని గన్నచోటు-ఇటువంటి వన్నీ హిమాచలం మీద ప్రసిద్ధమైన, చూడదగిన చోట్లు. ఇవన్నీ ప్రవరుడు ఎంతో కుతూహలంతో చూశాడని పెద్దన గారు వర్ణించారు. చాలా చక్కని పద్యమిది. అన లా పద్యం చదివితే మనం కూడా అక్కడికి వెళ్ళి అవన్నీ చూద్దామని అనిపించేంత అద్భుతమైన రచన

అది. కండ్లు మూసుకొని ఆ పద్యం మననం చేసుకొంటుంటే ఆ దశ్యాలన్నీ కంటికి కట్టినట్లు కనిపిస్తాయి. అల్లసాని వారి కవితా శిల్పం అంతటిది. అంత అపూర్వమైనది, అనితరమైనది.

అయితే ఇది ఒక సాహిత్య మహేంద్ర జాలం మాత్రమే. లేనిది ఉన్నట్లు భాసింపజేయటం. నిజానికి ఈ కథ జరిగింది స్వాయంభువమన్వంతరంలో అప్పటికీ పైన చెప్పిన సంఘటనల్లో ఏ ఒక్కటీ జరగలేదు. దక్షపుత్రిక సతి ఇంకా శివుని భార్యగానే ఉంది. పార్వతి పుట్టనూ లేదు. మన్మథ దహనం జరుగనూ లేదు. ఆదికూర్మమూ లేదు. గంగావతారమూ లేదు. కుమారస్వామి పుట్టుకు వచ్చే స్థితే లేదు. అందుకే సంస్కృత మూలం మార్కండేయ పురాణంలో ఇవేవీ లేవు. లేకపోయినా హిమశైలం అనగానే తన ఊహలో ఉన్న దృశ్యాలన్నీ ప్రవరునికి అంట గట్టేశాడు కవితా పితామహుడు.కథాకథనే చిత్యం పట్టించుకోలేదు. విష్ణుమూర్తి అవతారాలన్నీ రాకపోయినా స్వారోచిషుని చేత దశావతారాల స్తుతులు చేయించాడు. అప్పటికి ఒకటి రెండు అవతారాలు మాత్రమే వచ్చాయి. పెద్దనగారు పెద్దవాడు. తెలియక చేశాడని అనలేము. కవి కుండే స్వాతంత్ర్యాన్ని ఉపయోగించుకొని శిల్ప దృష్టితో చేసిన కమనీయ కల్పన-కవితా సత్యం- సారస్వత మహేంద్రజాలం-అందాము.

## పూరణ నైపుణ్యం

అవధాని పంచాననులుగా, ఆశుకవిచక్రవర్తులుగా, కుండినకవిహంసలుగా పేరు గాంచిన కొప్పరపు సోదర కవులు ఒక అవధానంలో పూరించిన సమస్య చూడండి.

"మంచాలన్ బిగియించె గూటముల కమ్మా! బిందియన్ దేగదే"

'మంచాలను గూటాలకు (కట్టు కొయ్యలకు) బిగించారు. బిందె తీసుకురా' అని అర్థం. ఇందులో ఒక దానికీ, మరొకదానికీ ఏ సంబంధమూ ఉన్నట్లు కనబడదు. ఇటువంటి అర్థరహితమైన దాన్ని సోదరకవులు ఎంత చమత్కారచతురంగా, రసరమణీయంగా పూరించారో చూడండి.

శా. కంచున్మించును దోపపాలకయి యాగం బి య్యేడన్ బాలకుల్
కొంచెం బాగక చేయుచుండిరట, బాలుండీయ బ్రొద్దేగెనే
రెంచన్ లాదిపుడాలకాపరియు దా నేతెంచి యాలస్యమే
మంచా లన్ బిగియించె గూటముల కమ్మా! బిందియన్ దేగదే.

పాలకోసం బాలకులు ఆగకుండా ఆగం చేస్తున్నారు. పొద్దు పోయింది. ఆల కాపరి వచ్చి ఆలస్యం ఏమిటంటూ ఆలన్ అంటే ఆవులను గూటాలకు కట్టేశాడు. అమ్మా పాలు తియ్యటానికి బిందె తీసుకురా అనే భావం మనోహరమైన శార్దూలంగా రూపు దాల్చింది. మంచాలన్ అనే మాట ఏమి! అంచు!ఆలన్ అని అర్థం వచ్చేలా చెప్పేటప్పటికి అంతకు ముందు ఎంతో అసందర్భంగా కనిపించిన సమస్య కాస్తా అర్థవంతంగా మారిపోయింది.

అలాగే "కుక్కుట గృహ మందు కాక ఘూకము లుండెన్" అనే సమస్యను కూడా వారు పూరించిన విధం చూడండి.

కం॥ ఒక్కడగు బోయ పక్షుల
వక్కజముగ నెన్నొ జాతులన దగు వానిన్
కక్కురితి తెచ్చి యొక్కట
కుక్కుట గృహమందు కాక ఘూకము లుండెన్

కుక్కుట గృహమందు అంటే కోడి ఇంటిలో కాక ఘూకము లుండెన్. కాకలు, గుడ్ల గూబలు ఉన్నాయి. అనే అసందర్భమైన దాన్ని బోయవాడు రకరకాల పక్షులు తెచ్చి ఒక్కచోట కుక్కడం చేత

అంటే బలవంతంగా కుక్కి ఉంచరా! చేత ఇంట్లో అన్నీ చేరినవి-అని అర్థం సరిపోయింది. పూరణనైపుణ్యానికిది మంచి ఉదాహరణ.

## కీర్తి ఎలా వుంటుంది?

కం॥ నరసింహ కృష్ణరాయని
కరమరుదగు కీర్తివెలసె కరిభిత్ గిరిభిత్
కరికరిభిత్ గిరిగిరిభిత్
కరిభిత్ గిరిభిత్ తురంగ కమనీయంబై

శ్రీ కృష్ణరాయలపై తెనాలి రామకృష్ణుడు చెప్పిన ప్రసిద్ధ పద్యమిది. రాయలవారి కీర్తి-కరిభిత్-శివునిలా (గజాసురుని చంపినవాడు), గిరిభిత్ కరి=ఐరావతంలా, కరిభిత్ గిరి=కైలాసంలా, గిరిభిత్ = వజ్రంలా, కరిభిత్ గిరిభిత్ తురంగ = శివుని, ఇంద్రుని వాహనాలైన నంది, ఐరావతాలలా అందంగా, తెల్లగా ఉంటుందని భావం.

ఇటువంటిదే మరొక చాటుపద్యం చూడండి (కవి ఎవరో తెలియదు)

కం॥ వర బారు వెంకనార్యుని
ధర నిండిన కీర్తి వెలసె ధరజిత్ పురజిత్
ధరధరజిత్ పురపురజిత్
ధర జిత్ పురజిత్ తురంగ ధావళ్యంబై.

బారు వెంకన్న కీర్తి భూమి అంతటా నిండి ప్రకాశించిందట! ఎలా అంటే - ధరజిత్ = కొండను గెలిచిన వజ్రంలా, పురజిత్ ధర = పురాలను జయించిన శివుని కొండ కైలాసంలా, ధరజిత్ పుర = ఇంద్రుని పురంలా, పురజిత్ = శివునిలా, ధరజిత్ పురజిత్ తురంగ = ఇంద్రుని, శివుని వాహనాలైన ఉచ్చైఃశ్రవ, నందులలా, ధావళ్యంబై = తెల్లదనం గలదై - అని భావం.

కీర్తిని తెల్లటి వస్తువులతో పోల్చటం సంప్రదాయం. అయితే పోలిక లెప్పుడు ప్రసిద్ధమైనవిగా, గొప్పవిగా ఉండాలి. హీనమైన వస్తువులను పోలికలుగా ఉపయోగించరాదు.

ఎవరో ఒక కవి చమత్కారం కోసం చెప్పిన అపభ్రంశ శ్లోకం చూడండి-

శ్లో॥ **అస్థివత్ బకవచ్చైవ**
**చల్లవత్ తెల్లకుక్కవత్**
**రాజతే భోజ ! తే కీర్తి !**
**పునస్సన్యాసిదంతవత్.**

భోజ మహారాజా! నీ కీర్తి ఎముకలలా, కొంగలా, మజ్జిగలా, తెల్లకుక్కలా, మళ్ళీ మాట్లాడితే సన్యాసి పండ్లలా రాజిల్లుచున్నది. దీంట్లోవన్నీ హీనోపమలు. ఇటువంటివి వాడకూడదు. స్త్రీ ముఖం గుండ్రంగా ఉంటే చంద్రబింబముతో పోల్చాలే కాని బండి చక్రంతో పోల్చకూడదు. పల్లవి ముఖం పద్మంలా ఉందనవచ్చు గాని సుబ్బమ్మ ముఖం సిబ్బరేకులా ఉందనకూడదు. కవిత్వంలో ఉన్న సంప్రదాయాలు, కవి సమయాలు గుర్తించి రచన చేయాలి.

## సీసంలో శార్దూలం

తెలుగు కవిత్వంలో ప్రాచీనులు చేసిన చిత్ర విచిత్రమైన గరిడీలు, గారడీలు రకరకాలు. అందులో గర్భకవిత్వం ఒకటి. ఒక పద్యంలో మరొక పద్యం ఇమిడి ఉండటం దీని విశేషం. అప్ప కవి

రచించిన ఈ కింది సీస పద్యంలో మొదటి నాలుగు పాదాలలో మత్తేభం, ఎత్తుగీతిలో కందపద్యం ఇమిడి ఉండటం చూడవచ్చు.

సీ॥ వినయ సంపన్న రవిప్రభూత రమణీ నాథా వ యోజేక్షణా నరాష్ట
విభయదాకార హవిర్భుగాయతరిపుప్రాణానిలాహీశ్వరా రమేశ
విలయ కాలానల విక్రమ ప్రథిత సాల్వగ్రావ వృద్ధ శ్రవావరేణ్య
విజయ శీలా యదు వీరకౌస్తుభధరా చక్రీ యశోదాత్మజా ముకుంద

తే.గీ॥ కరివరద పూతనాంతక గరుడగమన సత్యసహిత కామజనక శంకర సఖ
కనకవసన సుందరదేహ వనధిశయన సనకముని వినుత చరణ సరసిజయుగ

విష్ణు స్తుతి పరమైన ఈ సీసపద్యంలో అన్నీ హరి సంబోధనలే. నారాయణుని అనేక కళ్యాణ గుణగణ విశేషణాలు ఇందులో గోచరిస్తాయి. ఇటువంటి వాటిలో అర్థం కంటే దానిలో నిబిడమైన చిత్రశిల్పం ప్రధానం. ఇందులో మొదటి భాగంలో ఇమిడి ఉన్న మత్తేభవిక్రీడితాన్ని చూడండి-సీస పాదంలో మొదటి అక్షరాన్ని వదలి మొదలుపెట్టి 'సభరనమయవ'-లు పూర్తి చేసుకొంటే చివర మళ్ళీ మూడక్షరాలు విడిచి వేయాల్సి ఉంటుంది.

మ। నయ సంపన్న రవి ప్రభూత రమణీనాథా! పయోజేక్షణా !
భయదాకార హవిర్భాగాయతరిపు ప్రాణానిలాహీశ్వరా !
లయకాలానల విక్రమ ప్రథిత సాల్వగ్రావ వృద్ధ శ్రవా!
జయశీలా యదువీరకౌస్తుభధరా ! చక్రీ! యశోదాత్మజా!

ఇక తేటగీతిలో మొదటి అక్షరం నుండి మొదలుపెట్టి కంద పద్యం అయ్యేవరకు రాసుకుంటూ పోయి మిగిలినది వదలివేయటమే-గమనించండి.

కం.. కరివరద పూతనాంతక
గరుడ గమన సత్యసహిత కామజనక శం
కరసఖ కనకవసన సుం
దరదేహ వనధిశయన సనకముని వినుతా!

ప్రతి పద్యంలోనూ మరొక పద్యం ఇమడదు. అలా ఇమిడ్చే అవకాశం కొన్నింటికి ఉన్నది. వాటిని ఎన్నుకొని రెండు ఛందస్సులకూ సరిపోయే విధంగా యతులు, ప్రాసలు రెంటికీ సరిపోయేలా చూసుకుంటూ- ఎంతో జాగ్రత్తగా రచన చేస్తే ఆకర్షణీయమైన గర్భకవిత ఉదయిస్తుంది. మహా ప్రబంధంలో మధ్య మధ్య ఇటువంటివి పాయసంలో జీడిపప్పు లాగా, ద్రాక్ష పళ్ళలాగా రుచిని పెంచేవిగా, అభిరుచిని పెంపొందించేవిగా భాసిస్తాయి.

## చంపకాని కందం!

గర్భ కవిత్వాన్ని గురించి ఇంతకు ముందొక ఉదాహరణ చూశారు. సీసపద్యంలో మత్తేభం, కందం ఇమిడి ఉన్న విధంగానే చంపకమాలలో కందం, గీతం ఇమిడి ఉండే విధంగా రచించవచ్చు. అవధాని శేఖరులు శ్రీ పోతరాజు పురుషోత్తమ రావుగారు తమ పురుషోత్తమ చరిత్ర అశ్వాసాంత పద్యాలలో ఒకటి అటువంటి దాన్ని రచించారు చూడండి.

చం॥ సురనరపూజితా ! సకల సుందర పూరుషసన్నుతాంగ! ధూ
ర్జరహితకారణా! దితిసుత త్రిపురాహరతీవ్ర బాణ ! మం

దర గిరిధీర ! శ్రీ ద్రుహిణ తాత ! రమాధవ ! దుష్టనాశ ! దా
శరథి ! హరీ! స్వభూ ! ప్రథిత సద్గుణ సాగర ! రామచంద్రమా!

శ్రీరామస్తుతి గల ఈపద్యంలోని కందాన్ని చూడండి!

కం॥ నరపూజితా!సకలసుం
దరపూరుషసన్నుతాంగ! ధౌర్త్యరహితదా!
గిరిధీర ! శ్రీ ద్రుహిణతా
త! రమాధవ ! దుష్టనాశ! దాశరథి ! హరీ!

అలాగే గీత పద్యాన్ని కూడా పరికించండి.

తే.గీ ॥ సకల సుందర పురుష సన్నుతాంగ!
దితిసుత త్రిపురాహర తీవ్రబాణ!
ద్రుహిణతాత! రమాధవ ! దుష్టనాశ!
ప్రథిత సద్గుణసాగర! రామచంద్ర!

ఇటీవల విజయవాడ భువన విజయ సంస్థవారు కొప్పరపు కవుల పంగిడిగూడెం శతావధానం వేలూరి శివరామశాస్త్రిగారి గుంటూరి శతావధానం, కాకర్ల కొండలరావు గారి ఏలూరి శతావధానం, పంద్రంగి రామారావుగారి విశాఖపట్నం శతావధానం అచ్చువేశారు. అందులో కవి రత్న, అవధాని పంచానన బిరుదాంచితులు శ్రీ కాకర్ల కొండలరావుగారు ఏలూరులో చేసిన శతావధానం లోని ఒక సమస్యాపూరణం చూడండి-

"కోడి యథేష్టరీతిగను గూసెను రజ్జులు వింతవింతగన్"

భీష్ముడు కర్ణునితో అన్న మాటలు

ఉ॥ ఓడితి వల్ల అర్జునున కూర్జిత బాహుని కెన్నిమారులో
పోడిమి మాట లేల యికపొమ్మని భీష్ముడు పల్క తాల్మిపో
నాడి బొమల్ గుదించి తపనాత్మజుడుగ్రత నేల కాళులన్
గోడి యథేష్టరీతిగను గూసెను రజ్జులు వింత వింతగన్

కొన్ని జంతువులు పోరాటానికి ముందు దూకేప్పుడు కాళ్ళు నేలమీద రాసి పొగరుగా ప్రవర్తిస్తాయి. కర్ణుడు కూడా ఆ విధంగా ధూర్తతను, తీవ్రతను ప్రదర్శించి భీష్ముని ఎదిరించి నోటికి వచ్చినట్లు మాట్లాడాడు. ఇక్కడ కోడి అనే దాన్ని నామవాచకంగా కాక క్వార్థమైన అసమాపక క్రియగా పూరణలో ప్రయోగించడంతో చక్కని అర్థాన్ని ఇచ్చింది.

## పంది కొరికిన పెదవి

తిరుపతి వేంకట కవుల శిష్యుల్లో పేర్కొనదగినవారు శ్రీ వేలూరి శివరామశాస్త్రి. గుంటూరు కాలేజీలో వీరు చేసిన శతావధానం ఆ రోజుల్లో చాలా పేరు పొందింది అవధానారంభంలో వేంకట శాస్త్రిగారు ఆశీఃపురస్సరంగా చెప్పిన పద్యం చూడండి.

చం॥ ఎరుగడు పిల్లకాయ యిటులే నొనరించు శతావధానమున్
సరసులు మీర లెల్లరును సభ్యులు పేర్మి ననుగ్రహింపు డా
దరమున తప్పులన్ విడిచి తథ్యము నొప్పులె చూచి మెచ్చుడీ
తిరుపతి వేంకటేశ కవిధీరుల శిష్యుని వృద్ధికామునిన్.

అవధానం విద్వజ్జనరంజకంగా సాగింది. అందులో పూరించిన ఒక సమస్య-

పంది పటుక్కున్‌గొరికె పంకజలోచన మోవి గ్రక్కునన్

ఉ॥ చెందొవబోలు నెమ్మొగము చెల్వగు తత్కరపల్లవంబు చ
క్కందన మొప్పు కన్నులు వికాసత నొప్పెడు మేను దీవయున్
సుందరమైన రూపు గడుసుం దనమున్ గని మోహవార్ధ్యని
ష్పంది...."

మోహసముద్రమునందు అనిష్పంది యైనవాడు మోవి కొరికెను అని పూరించటంలోని శృంగార చాతుర్యం గమనార్హం. కొందరు పెంపంది, కొప్పంది-అని ఈ సమస్యను పూరించారు గాని, అఖండయతి నచ్చని వారికీ పద్యం బాగా నచ్చుతుంది.

కప్పమీద చంపకం కావలసి వచ్చింది ఒక పృచ్ఛకునికి. కప్పలలాగా అరిచే కుపండితులను మనస్సులో పెట్టుకొని అన్యాపదేశంగా చెప్పిన ఈ పద్యం ఒకవైపు శ్రీనాథుని, మరొకవైపు పండిత రాయలను గుర్తుకు తెస్తుంది.

చం॥ గర రవ రట్టటంచు గరగ్రట గ్రట గ్రటటంచు దు
ర్భరమయి యొప్పు శబ్దముల పల్కుట చూచి సహింపజాలనో
విరసపు కప్ప! ఆవలకు వేగము తర్లుము లేచిపొమ్ము దు
స్తరమగు నల్కబూని యొక త్రాచు నినుం గబళింప నెంచెడున్.

కప్పలాగా దుర్భరమైన ధ్వనితో అరిచే ఓ కుకవీ! నిన్ను ఈ సభలో సహించలేను. వెంటనే ఇక్కడి నుంచి వెళ్ళిపో. లేకపోతే ఆదిశేషుని అవతారమైన పతంజలి వంటి పండితులు నిన్ను మింగేస్తారు- అని ధ్వని. అవధానంలో కూడా ఇలా వ్యంగ్యార్థ రమణీయమైన పద్యాలు కమనీయంగా చెప్పటం సామాన్యమైన విషయం గాదు.

ఇటువంటి చమత్కార చతురాలు, శబ్దార్థ సుందరాలు, పాండితీస్ఫోరకాలైన నూరు పద్యాలు చెప్పి ధారణ తప్పకుండా అప్పగించి వేలూరివారు విజయశ్రీ విలసితులైతే, సంతోష పరవశులై తిరుపతి శాస్త్రిగారు చెప్పిన పద్యాల్లో ఒకటి చూడండి!

మ॥ జగతీనాథులు పెక్కుమంది ముదితస్వాంతంబులన్ కొన్కలం
పగ సొంగంబు సలక్షణంబుగ శరద్వావింశతిన్ బేర్మి హె
చ్చగ మా యేలిన యీ వధాన కవితా సామ్రాజ్య భారంబు మో
యగ బూనంగదవయ్య! తండ్రి ! శివరామయ్యా! చిరంజీవివై.

## నల్లి ధాటి

ఓలేటి వేంకటరామశాస్త్రి, వేదుల రామకృష్ణశాస్త్రి- ఇద్దరూ రామకృష్ణ కవులను పేర ఈ శతాబ్దారంభంలో సుప్రసిద్ధులైన జంట కవులు. పిఠాపురాస్థాన విద్వాంసులుగా అష్ట-శతావధాన దక్షులు, ఆశు కవితా నిపుణులుగా ఈ యువకిశోరాలు చాలా పేరు పొందారు. తిరుపతి వేంకట కవులతో వచ్చిన వివాద సందర్భంగా వీరు చేసిన రచనలు వీరి పాండిత్య ప్రకర్షకు, ప్రతిభా విశేషాలకు నిదర్శనం. వీరివి గూర్చి డా.పాలంకి లక్ష్మీదేవి పరిశోధన గ్రంథం వెలువరించటం వల్ల చాలా విశేషాలు తెలుస్తున్నవి.

రాజావారి కోటలో వీరు చేసిన ఒక అష్టావధానంలో పూర్తిచేసిన సమస్య చూడండి!

రాతికి కోతి పుట్టె రఘురాముని కైవడి సీత కైవడిన్

రాతికి కోతి పుట్టటం విపరీతం- అందులోనూ రాముని వలె, సీత వలె-అసంబద్ధాలు మూడున్నాయి. దీన్ని వీరు పూరించిన తీరు అత్యంత మనోహరం.

ఉ: ఖ్యాతియొసంగ నంజనకు గల్గిన శ్రీ హనుమాను జూచి సం
ప్రీతిని జెంది దేవతలు పేరిమి చెప్పుకొనంగ సాగి రీ
భూతలమందు రావణుని పొల్పడగింపగ నిప్పు డంధ కా
రాతికి కోతి పుట్టె రఘురాముని కై వడి సీత కై వడిన్.

అంధకారాతి అంటే శివుడు. శివుని తేజస్సువల్ల వాయువు ద్వారా అంజనకు హనుమంతుడు పుట్టాడు. 'కైవడి' అంటే 'వలె' అని అర్థం. అలా కాకుండా కై-వడిన్ అని చతుర్థీ విభక్తిమీద-వడిన్-వేగముగా అంటే రమణీయమైన అర్థం. రాముని కొరకు, సీత కొరకు వేగంగా శివ తేజస్సు వల్ల ఆంజనేయుడు ఉదయించాడనే భావం వచ్చి సమస్యాపూరణ సరసంగా సిద్ధమైంది.

ఒక అవధానంలో నల్లి కాటును గురించి సీసపద్యం చెప్పమని అప్పటి ప్రసిద్ధ విదూషక వేషధారి శ్రీనివాసరావు అడిగితే చెప్పిన వైనం చూడండి.

సీ: నల్లి కాటునకు భీతిల్లి యే విష్ణుండు జలధిలో వటపత్ర శాయి యయ్యె
నల్లి కాటునకు భీతిల్లి యే శంకరుం డెల్లవేళల నుండు వల్లకాట
నల్లి కాటునకు భీతిల్లి యే దేవతా జ్యేష్ఠు డబ్జాన నాసీనుడయ్యె
నల్లి కాటునకు భీతిల్లి యే సూర్యుండు పరుగులు వారు నంబరమునందు

సీ: హరిహర హిరణ్య గర్భాదులైన సురలె
నల్లికాటున కిట్లు భీతిల్లుచుండ
మనుజమాత్రులు భీకర మత్కుణాల
ధాటి కోర్వంగ నెంతటి పాటివారు?

దేవతల నివాసాలను నల్లిబాధతో సమన్వయించి అందంగా చెప్పిన ఈ పద్యం ఒక ప్రాచీన చాటువు ననుసరించిందే అనవచ్చు. ఆ చాటువు కూడా పరిశీలించండి!

కం: శివు డద్రిని నివసించుట
రవిచంద్రులు మింటనుంట రాజీవాక్షుం
డవిరళముగ శేషునిపై
పవళించుట నల్లి బాధ పడలేక సుమీ!

## గుణితాల కవిత్వం

ఈ శతాబ్దం మొదట అష్ట శతావధానాలు సంస్కృతాంధ్రాల్లో అలవోకగా చేసి అద్భుత ప్రజ్ఞను ప్రదర్శించిన వారిలో పిసుపాటి చిదంబరశాస్త్రిగా రొకరు. విశేషించి వీరు సరస్వతీ మంత్రోపాసకులు. ధ్యానానుభూతులనెన్నో పొందినవారు. తెలుగుసీమలోనే కాక ఇతర రాష్ట్రాల్లో కూడా సంస్కృతంలో అవధానాలు చేసి రాజసభల్లో, పండిత పరిషత్తుల్లో సన్మానాలు పొందారు. వారి జీవిత చరిత్ర ముద్రితమైతే చదివి ఆ మహాపండితుని ప్రజ్ఞను గురించి రాద్దామని కొన్నాను. ఇంతలో ఉలవపాడు పండితులు విద్వాన్ వి.ఆర్. రామానుజాచార్యులు శాస్త్రిగారి కవితా ప్రజ్ఞను, సమస్యాపూరణ నైపుణ్యాన్ని నాకు రాశారు.

ఒక ఘట్టాన్ని ఉదహరిస్తాను.

1925 ప్రాంతంలో బెజవాడలో చిదంబరశాస్త్రిగారు శతావధానం చేస్తుండగా ఒక పృచ్ఛకుడు ఎవరికీ దిక్కుతోచని సమస్య నిచ్చి సదస్యులను దిగ్భ్రాంతులను చేశాడు. ఆ సమస్య ఇది.

**"కాఖాగాఘాకిఙ కాటన్నాయాటీఙ"**

తపోలబ్ధ శబ్దయోగులైన పిసుపాటి వారు చిరునవ్వుతో " వ్రాసుకోండి" అన్నారు.

అర్థరహితమైన ఈ సమస్య ఎలా పూరిస్తారా అని అందరూ ఆశ్చర్యంతో చూస్తున్నారు. దాన్ని తృణప్రాయంగా భావించి శాస్త్రిగారు ఇలా పూరించారు.

**"చాఛాజాఝాచి ఙ చంచన్నాయా ఛీఙ**
**తాథాదాధా తిఙ తాతన్నాయా థూఙ**
**పాఫాబాభా పిఙ పాపన్నాయా పీఙ"**

ఇది వినేసరికి పృచ్ఛకుడు బిత్తరపోయాడు. కాస్తలో తేరుకొని " ఈ పూరణకేమైనా అర్థముందా? " అని ప్రశ్నించాడు.

"మీసమస్యకర్థముంటే మా పూరణకూ అర్థముంటుం"దన్నారు శాస్త్రిగారు.

అప్పుడు సమస్యార్థాన్ని పృచ్ఛకుడిలా వివరించాడు.

కాటన్నాయడనే ఒక ధనికుడుండేవాడు. అతనికి చదువబ్బలేదు. కాని తాను గొప్పవాడినని పొగడించుకోవాలని తపన. అలా పొగడిన వారికి తృణమో పణమో ఇచ్చేవాడు. మిగతా వారికి పైసా కూడా విదిల్చేవాడు కాదు. ఈ రహస్యం తెలుసుకొన్న ఒక చతుర పండితుడు అతని దగ్గరకు వెళ్ళి తాళం వేస్తూ ఈ సమస్యను గానం చేసి గొప్ప సత్కారం పొందాడు.

అప్పుడు శాస్త్రిగారు " ఈ విశాల విశ్వంలో మీ కాటన్నాయని వంటి వారు చంచన్నాయుడు, తాతన్నాయుడు, పాపన్నాయుడు అనే లుబ్ధాగ్రేసర చక్రవర్తులున్నారు. మీపండితుని కన్న మా పండితులు అధిక విద్యాప్రౌఢులు కనుకనే అన్యాపదేశంగా ఛీ, థూ- అని వారి మూర్ఖతను నిందిస్తూనే పొగడి నటుల భాసింపజేసి గౌరవం పొందారు" అని వివరించేసరికి సభ్యులంతా కరతాళ ధ్వనులు చేసి పిసుపాటి వారి వైదుష్యానికి అంజలి ఘటించారు.

పృచ్ఛకుడు కూడా తానుతొక్కిన తోవను శాస్త్రిగారు గ్రహించి చాతుర్యధుర్యంగా చెప్పేటప్పటికి కాదనటానికి వీలు లేక హృదయపూర్వకంగానే సంతృప్తినీ, సంతోషాన్నీ వ్యక్తపరిచాడు.

## కలల కలకలం

కవిత్వం చెప్పే వాళ్ళు ఒక్కోసారి అదో లోకంలో ఉన్నట్లు కనిపిస్తుంటారు. ఈ ప్రపంచం పట్టని యోగిలా మనసెక్కడో విహరిస్తుంటే చూసే వాళ్ళకు వీళ్ళేదో అయోమయ స్థితిలో ఉన్నారా అనిపిస్తుంటారు. కొందరు ఊహాలోకాల్లో సంచరిస్తుంటే, కొందరు కలల్లో తేలియాడుతుంటారు. ఉపాసకులు తమ ఉపాస్య దేవతానుగ్రహం వల్ల కనే కలలు కొన్ని సత్యార్థగంధులవుతాయని ఆచార్య శంకరులన్నారు.

తెలుగు కవుల్లో తిక్కన స్వప్నంలో హరిహరనాథ దర్శనం పొంది ఆ దేవుని కోరిక ప్రకారం భారతాన్ని ఆయనకు అంకితం చేశాడు.

ఉ: కూర్చుట సూత్న రత్నములకున్ కనకంబునకున్ దగున్ జనా
 భ్యర్చితమైన భారత మపారకృపాపరతంత్ర వృత్తిమై
పేర్చిన దేవదేవునకు ప్రీతిగ నిచ్చుట సర్వసిద్ధి నా
నేర్చిన భంగిచెప్పి వరణీయుడ నయ్యెద భక్త కోటికిన్

అని తాను తరించి లోకానికి తరణోపాయం అందించాడు కవిబ్రహ్మ.

ఆ తరువాత ఎందరో ఆంధ్ర కవులు తమ కలల్లో ఇష్టదైవం కనపడటం, ఆయన ఆదేశం ప్రకారం ప్రబంధ నిర్మాణం చేస్తున్నారనటం జరిగింది. తిక్కన కలలో ఆయన తండ్రి కొమ్మన కూడా కనిపించాడు. మరి కొందరు కవులు కూడా తమ తండ్రులనో,తాతలనో కలలో చూశామని, మాట్లాడామని వ్రాసుకున్నారు. పిఠాపురాస్థానకవులు రామకృష్ణ కవులు 'ఆంధ్ర కవుల అపరాధములు' అని కొన్ని పద్యాలు ప్రకటిస్తూ చమత్కారంగా ఇలా రాశారు.

**గీ:** **ఒకడు స్వప్న ప్రకారము నుగ్గడింప**
**ఎల్ల వారలకు గలదె తెల్లవార్లు?**
**నవ్వుదురను తలంపు లే దెవ్వరికిని**
**పేరు కొననేమిటికి నట్టి బీద కవుల?**

ఒకరికి కల వచ్చింది గదా అని అందరికి కలలు వస్తాయా? చదివే వారు, వినేవారు నవ్వుతారనే ఆలోచన లేకుండా చాలామంది బీదకవులు (స్వతంత్ర కల్పనా దరిద్రులు) కలలను రాసుకొన్నారు-అని విమర్శించారు.

అయితే అన్ని కలలూ నిజమో, కవుల కల్పనలో చెప్పలేము కాని కలల్లో కవిత్వం రాసి, అది మెలకువ వచ్చిన తర్వాత గుర్తు పెట్టుకొని రాసుకొన్నవారు చాలామంది ఉన్నారు. పాశ్చాత్యుల్లో, ప్రాచ్యుల్లో కలల్లో కవితాస్ఫురణ పొందిన వారెందరో ఉన్నారు. అవన్నీ అసత్యాలని కొట్టి పారేయటానికి వీలు లేదు.

ఇంతా రాసిన రామకృష్ణ కవులు-కల్పనో, నిజమో కాని- తిరుపతి వెంకట కవులతో వివాదం వచ్చినపుడు ఒకరోజు వేంకటశాస్త్రిగారు కలలో కనిపించారట.

**ఉ:** **నిద్దుర వోవునప్పుడొక నీరదనీల శరీరు డెవ్వడో**
**అర్ధము రేయి వేళ కలయందు కనంబడియొయ్య నొయ్య మా**
**యొద్దకు వచ్చి తిన్నబడి యున్న మొగంబును మాటి యెద్ది యో**
**నుద్ది వచింప నెంచి పొడనూపిన యట్లులు గాన నౌటయున్**

గీరతములో రాసిన వాటికి పశ్చాత్తాపం ప్రకటిస్తూ దానికి ప్రతిగా భారతం వ్రాయుమని చెళ్ళపిళ్ళ ఆ కలలో కోరితే వీరు భారత రచన ప్రారంభించారట. గీరతంలో మమ్మల్ని తిట్టిన తిట్లన్నీ మీకే చెందుతాయని వేంకటశాస్త్రి గారిని గురించి ఇలా రాశారు.

**ఉ:** **తిట్టుము నీకు తోచిన గతిన్కని దీరగ నింకనేమది**
**ట్టట్టన బోము నీ వనిన వన్నియు నీకె ఘటించు గాని మా**
**కెట్టి యగౌరవమ్ము రచియింపగ జాలవు మేము తాళముం**
**బెట్టితి మాకనంబునకు పృథ్వికి పొమ్మిక వేంకటాచలా!**

కవుల కలలూ కమామీషు ఈవిధంగా ఎన్నో విచిత్రాలకూ,కావ్య నిర్మాణాలకూ దారి తీస్తుంటాయి.

## అవధాన యుద్ధం

తిరుపతి వేంకటకవులకు, కొప్పరపు సోదరకవులకు సాహిత్య యుద్ధాలు జరిగే రోజుల్లో రెండు పక్షాలలోనూ హేమాహేమీలైన కవి పండితులు పాల్గొన్నారు. కొప్పరం గుంటూరు జిల్లా నరసరావుపేట తాలూకాలోని ఒక చిన్న గ్రామం. ఇప్పుడది ప్రకాశం జిల్లాలోకి వెళ్ళింది. ఆ కొప్పరం పక్కన ఏల్చూరు. ఆ గ్రామంలో సోదర కవుల గురుపుత్రులు పోతరాజు లక్ష్మీనరసింహకవి, తిరుపతి వేంకట కవులను

విమర్శిస్తూ చాలా పద్యాలు రాశారు. ఒకసారి వినుకొండలో తిరుపతి వేంకట కవుల శతావధానం. దానికి కావాలని వీరు, వీరి మిత్రులు వెళ్ళి పృచ్ఛకులుగా ప్రశ్నలు వేశారు.

**"కృత్స్ను జ్యోత్స్నల వీడి చెప్పగదవే హృత్స్నేహ మేపారగన్"** అనే సమస్యను అందులోని పదాలు రాకుండా పూరించమన్నారు.

ఏవిధంగానైనా చెప్పగల సమర్థులే జంటకవులు. అయినా ఎందుకో ఆ రోజు 'జ్యోత్స్నాసుందరి' అని మొదలు పెట్టి ఏదో ఒక పద్యం చెప్పారు. అది లక్ష్మీనరసింహకవికి సంతృప్తిగా లేదు. అడిగిన ప్రకారం చెప్పలేదని ఆక్షేపించారు. అప్పుడు తిరుపతి శాస్త్రిగారు దూకుడుగా " అంతకుముందు పత్రికలో తమను విమర్శిస్తూ రాసిన పద్యాలు గుర్తున్నవి కాబోలు- మాకు తోచింది మేము చెప్పాము, అంతకంటే బాగా చేతనైతే చెప్పు చూద్దాము" అన్నారు. వెంటనే లక్ష్మీన రసింహకవిగారు లేచి ఈ క్రింది పద్యం ఆశువుగా చెప్పారు.

**శా: మృత్స్నారాశిని గల్గు శబ్దతతినెంతే గాంచి ధీయుక్తి**
**ప్రో ద్యత్స్నిగ్ధాత్మకు లిచ్చుచుండిన సమస్యల్ చెప్పు నాతం డుద**
**న్వత్స్నానంబొనరించిన ట్టిదగు గావ్యానికీర్తిన్ సభన్**
**కృత్స్ను జ్యోత్స్నల వీడి చెప్పగదవే! హృత్స్నేహ మేపారగన్**

తిరుపతి శాస్త్రిగారు దానిలోని కొన్ని పదాలను విమర్శించటం మొదలుపెట్టారు. అసలు సమస్య ఇచ్చినపుడే ఆయనకు కొంచెం కోపం వచ్చింది.

"చెప్పగదవే! అంటే స్త్రీ లింగ సంబోధనగదా" అని ముందు అన్నారు.

" నన్ను కావగదవే! స్వాహా వధూవల్లభా" అని అగ్నిని సంబోధించే పెద్దన పద్య ప్రమాణం విన్న తర్వాత " సరేలే! కానీ - మృత్స్నారాశి- అంటే భూమి అని అర్థం ఎలా?" అన్నారు. 'శోణమృత్తి కారాశియో యనమెరసె సంధ్య' అనే మనుచరిత్ర ప్రమాణం విని "ఉదన్వత్స్నానము అంటే సముద్ర స్నానం గదా! మంచి పద్యాలు -సమస్యలు చెప్పినవాడు ఏ గంగా స్నానమో, పుణ్య నదీ స్నానమో చేసిన వానితో సమానమనాలిగాని,సముద్రస్నానం చేసిన వానితో సమానమేమిటి?" అన్నారు.

"అన్ని నదులు సముద్రంలో కలుస్తాయి గదా! ఇంకా ఎక్కువ పుణ్యమే వస్తుంది. సముద్రస్నాన సంప్రదాయమూ మనకు ఉన్నది-" అని కవిగారి సమాధానం.

అలా వారూ, వీరు శాస్త్ర చర్చ ఒకరిపై ఒకరు పద్యాలు గుప్పించుకోవటం జరిగింది. సభాధ్యక్షులు సబ్ కలెక్టర్ పరబ్రహ్మశాస్త్రిగారు జోక్యంచేసుకొని ఇద్దరినీ శాంత పరిచారు.

ఇదంతా నవ్వుతూ చూస్తున్న వేంకటశాస్త్రిగారు కూడా అప్పుడు తిరుపతి శాస్త్రిగారితో- " ఆయన చెప్పిన పద్యం చక్కగా ఉంది. ఎందుకులే ఇంకా విమర్శించటం? మేము సరిగా చెప్పాలనుకుంటే ఇటువంటి రీతిలోనే చెప్పేవా ము" అని సర్దుబాటు చేశారు.

ఆ ఘట్టాన్ని స్మృతికి తెచ్చుకొంటూ తరువాతి కాలంలో బ్రహ్మశ్రీ మిన్నికంటి గురునాథ శర్మగారు నరసింహకవిగారిని మహాకావ్య నిర్మాణానికి పూనుకోమ్మని కోరుతూ ఇలా అన్నారు.

**చం: ఎరుగవు గాక నీవు పరికింప సమీర కుమారు వైఖరిన్**
**తిరుపతి వేంకటేశ్వరుల దీకొని సత్సభ విన్నకొండ నీ**
**వరపిన పద్య వర్షమున బమ్మెరవారె? అధీశుడౌ కలె**
**క్టరు పనిబూని అడ్డుపడడా! పరపూర్వుడు బ్రహ్మశాస్త్రియున్**

## తనయుడే తమ్ముడు

అష్ట, శతావధానాలు చేయటం, ఆశు కవిత్వం చెప్పటం మోజుపడే రోజుల్లో, ఈ శతాబ్ది ప్రథమార్థంలో గుడివాడ వాస్తవ్యుడు - పంద్రంగి రామారావు అనే యువకుడు (వ్యాకరణం ప్రకారం యువ అనాలి) విశాఖపట్నంలో ఇంటర్మీడియెట్ చదువుతూ 1915 లో శతావధానం చేశాడు. ఆనాటి పురప్రముఖులు రాజా శ్రీ విక్రమదేవవర్మ, సెట్టి లక్ష్మీనరసింహం, కేతవరపు వేంకటశాస్త్రి, ప్రభల లక్ష్మీనరసింహం మొదలైన పండితులు ఆ ప్రదర్శనను ఎంతో ప్రశంసించారు.

ఒక పృచ్ఛకుడు బిందు పూర్వక గ్ల ప్రాస ఆంగ్లేయ పదాలు విడిచి యుద్ధ వర్ణన శార్దూలంలో చెప్పమన్నాడు. వెంటనే అవధాని-

శా: ఆంగ్లేయాది పదమ్ములన్ విడిచి పద్యం బొండు యుద్ధంబుపై
నం గ్లుప్తంబుగ చెప్పుమం చడుగగా న్యాయంబె యే దెట్టు లు
న్నం గ్లిష్టమ్ములుగా తలంపబడు ప్రశ్నల్ వేయగా జెల్ల దె
న్నం గ్లేశమ్ముల బెట్టగూడదు పథానం బందునన్ బ్రాసలోన్

ప్రాస, ఛందస్సు, వర్ణన- ఇన్ని నియమాలతో అడగటం న్యాయం కాదు. అయినా చెపుతాను వినండి అంటూ చెప్పిన పద్యమిదిగో-

శా: జంగ్లా రాగము పాడుచున్ ఘనముగా సంతోషమున్ బూను చీ
జంగ్లీ జాతి కపోతముల్ రణమున్ సారథ్యమున్ సల్ప ద
త్స్వాంగ్లశ్రేణులు హైందవుల్ రిపుల సంహారంబు గావింపగా
నింగ్లీకంబును బోలు రక్త మిలపై నేరుల్‌వలెన్ బారెడున్

వయసున పిన్నవాడైనా అవధానంలో ఎంతో నేర్పును జూపించిన ఈ కవి పూరించిన మరొక సమస్య చూడండి-

**తనయుడు తన తమ్ముడయ్యె తప్పో యొప్పో**

పూరణ ఇది - కందపద్యం

మనమున వరుసల నరయక
యినజుడు పోరియు పిదపను నెరుగన్ వరుసల్
జనని వచింపంగ యముని
తనయుడు తన తమ్ముడయ్యె తప్పో యొప్పో

కర్ణుడు- యమతనయుడు- ధర్మరాజు తన తమ్ముడని తెలుసుకొన్న అంశాన్ని తెలుపుతూ పూరించటం వల్ల మంచి చమత్కారం వచ్చింది.

ఒక పృచ్ఛకుడు సీసం మీద సీసం చెప్పమన్నాడు. సీసం- ఒక ఛందస్సు- ఒక లోహం. లోహంతోపెన్సిళ్ళు,తుపాకి గుండ్లు, అచ్చక్షరాలు తయారుచేసేవారు. ఇవన్నీ వచ్చేలా -వచ్చిన పద్యం- ఎంతో ఒయ్యారంగా -శబ్దార్థ సుందరంగా సాగింది.

**ఆబాల గోపాల మఖిల హస్త ములందు చెన్నొందు పెన్సిళ్ల చెఱువు గనియె**
**అచ్చొత్తగా చేయు నక్షరసంచయం బద్దాని చేతనే అందమొందె**
**వ్యాఘ్రమ్ము నైనను శీఘ్రమ్ముగా జంప జాలిన గుండ్లను సలుప దగియె**
**వింతగా తన పేర వృత్తంబు గాంచియుసంకీర్తనంబున సాగుచుండె.**

అధిక మూల్యంపు లోహంబు లమరియున్నవెండి బంగారములబోలు చుండె ననియు
సీసమున కెప్ప సాటిగా చెల్లవంద్రువీని యుపయోగ భారముల్ తెలియ మెందు.

మహాపండితులు శ్రీ కాశీ కృష్ణాచార్యుల వారు- ఈ తమ శిష్యుని ఆశీర్వదిస్తూ చెప్పిన పద్యం- ఆ రామారావుగారి సమర్థతకు చక్కని నిరూపణ.

ఉః చెందెను కీర్తి కాంత నిను - చేతికి నందితి వీవు నింక నా
కెందుల కీవధాన ధరణీశత? యీపయి దీని మోయ నీ
కుం దగు కృష్ణరామ యనుకొంచు సుఖమ్మున నింట నుంటనా
కుందగు పోయివత్తునిదె కొమ్మిక శిష్యకులావతంసమా!

## రసమా కవిత!

తెలుగు సీమలో పిఠాపుర సంస్థానం సాహిత్య పోషణకు ప్రసిద్ధి కెక్కింది. 1979లో శ్రీమాన్ మాడభూషి వేంకటాచార్యులవారు గుంటూరు నుంచి వచ్చి రాచకొలువులో శతావధానం చేశారు. అంతకుముందు ఇటువంటి ప్రక్రియ అక్కడ ఎవరూ కనీవినీ ఎరుగరు. ఆ మహాప్రజ్ఞకు గంగాధరప్రభువు పరమానందభరితుడై ఆచార్యులవారికి ఘనసన్మానం చేసి పంపారు. తరువాత తన ఆస్థాన పండితులతో ముచ్చటిస్తూ " మన ఆస్థానంలో ఇటువంటి విద్య ప్రదర్శించేవారెవరూ లేరా!" అని ప్రశ్నించారు.

అప్పుడు కొలువులో ఉన్న దేవులపల్లి సోదరులు లేచి " ఈ ప్రక్రియ ఇలా చేయాలని ఇన్నాళ్లూ అనుకోలేదు కాబట్టి చేయలేదు. మాడభూషివారు చేసిన రీతిలోనే మేమూ చేసి దేవరవారి ముందు మా ప్రజ్ఞ ప్రదర్శిస్తా" మని మరునాడు అసామాన్య ప్రతిభా పాండిత్యాలను చూపుతూ శతావధానం చేశారు. తన ఆస్థానంలోనే అంతటి వారున్నందుకు రాజు పొంగిపోయి తన రాజ్యాన్నే వారికి దానమిచ్చాడట. అయితే కవి పండితులు రాజ్యాన్నేం చేసుకుంటారు? మళ్ళీ ఆయనకే ఇస్తామంటే ఇచ్చింది తీసుకోవటం కుదరదన్నాడు రాజు. తమ ప్రతినిధిగా పరిపాలించమన్నా అంగీకరించలేదు. చివరకు అతి కష్టంమీద గంగాధర రాజావారి కుమారునకు ప్రభుత్వం అప్పగించారు సోదరకవులు.

ఆ రోజుల్లో జమీందార్లకు రాష్ట్ర రాజధాని మదరాసులో బంగాళాలుండేవి. పిఠాపురంవారికి కూడా పెద్ద బంగాళా ఉండేది. అందువల్ల ఆ సంస్థాన విద్వాంసులు తరచుగా మదరాసులో కూడా ప్రదర్శన లిస్తుండేవారు. దేవులపల్లి సోదరులు పిఠాపురంలోనే కాక మదరాసులో కూడా, 1895,96 లలో అవధానాలు చేశారు.

ఒక అవధానంలో పండితుడొకడు కాళిదాసు రచనగా ప్రసిద్ధమైన

శ్లోః ద్రౌపద్యాః పాండుతనయాః పతిదేవర భావుకాః
న దేవరో ధర్మరాజః సహదేవో భావుకః

ద్రౌపదికి పాండవులు భర్తలు, మరదులు, బావలు అవుతారు. అయితే ధర్మరాజు మరదికాడు, సహదేవుడు బావకాడు) అనే శ్లోకాన్ని అచ్చ తెనుగులో అనువాదం చేయమని కోరాడు. సోదర కవులు చెప్పిన పద్యమిది-

చంః జము కొడు కీదు పట్టియును, జన్న వుటొరెపు రేని కందు తూ
ర్పుమనియగాని వెజ్జులకు పుట్టినవారును, బావగార్లు,రేం
డ్లు మరదు లౌదు రైదుగురిలో గడు జిన్నతడెన్న బావగా
డు మరది గాడు పెద్ద యతడున్ దగ ద్రోపది కెంచి చూచినన్

జము కొడుకు-యముని కుమారుడు- ధర్మరాజు, ఈదు పట్టి= వాయుపుత్రుడు భీముడు, జన్నపుటో రెపురేని కందు= ఇంద్రుని బిడ్డ అర్జునుడు; తూర్పు మనియగాని వెజ్జులకు పుట్టినవారు= ప్రాచీ దిశా ప్రభువు ఇంద్రుని వైద్యులైన అశ్వినీ దేవతలకు పుట్టినవారు-నకుల సహదేవులు - వీరు బావలు, భర్తలు,మరదులవుతారు. పెద్దతడు మరది కాడు- చిన్నతడు బావ కాడు. అచ్చ తెలుగులో ఈ రచన చేయటం నిజంగా ప్రజ్ఞకు నికషోపలమే.

రాజసన్నిధిలో సాహిత్య గోష్ఠి జరుగుతుండగా లాక్షణిక చక్రవర్తిగా పేరు గన్న కూచిమంచి వేంకటరాయకవి తమ ప్రపితామహుడైన తిమ్మకవి రసిక జన మనోభిరామంలోని ఈ కింది పద్యాన్ని

కం: నదమా పొక్కిలి జాంబూ
నదమా మైచాయ కోక నదమా పదమా
పదమా జడ నడుము వియత్
పదమా నూగారు గూఢ పదమా చెలికిన్

చదివి " ఈ రోజుల్లో ఈ విధంగా చెప్పే వాళ్ళున్నారా?" అన్నాడట! వెంటనే దేవులపల్లి వారు లేచి ఆశువుగా

**కం: రసమా తను రుచిజితసా**
**రసమా వదనంబు వనధర సమూహితసా**
**రసమానమా కచము సా**
**రసమా నడ నుడువు లమృత రసమా చెలికిన్**

శరీర కాంతి పాదరసం వలె ఉంది. ముఖము-సారసం-పద్మం వలె ఉంది. జుట్టు మబ్బుల గుంపు సారముతో సమానము. నడక సారసము= హంసతో సమానము. మాటలమృత రసము. ఇంత అద్భుత పద్యాన్ని చెప్పటానికి ఎంత అపార పాండిత్యం ఉండాలి? అందులో ఆశువుగా. సోదర కవుల శక్తి అసామాన్యం.

## బొట్టు పెట్టకుము....

శ్రీ మారేపల్లి రామచంద్రశాస్త్రి స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొని కారాగార శిక్ష ననుభవించిన త్యాగమూర్తులు. 1874 లో పుట్టి తెలుగు నలువగా పేరు గాంచిన వీరిని విశాఖపట్నంలో అంతా కవిగారనే అనేవారు. శ్రీ పురిపండా అప్పలస్వామి వీరిని గురించి చెపుతూ " పండితుడు, భాషావేత్త, తెలుగు నలువ, సంస్కర్త, దేశనాయకుడు, నటుడు, నాట్యాచార్యుడు, నీతిమంతుడు, విశాఖలో కిరీటం లేని సమ్రాట్టు,ఆయన ఆడింది ఆట, పాడింది పాటగా సాగింది కూడా. ఆబాల గోపాలం, ఆయన నెరుగని వారు లేరు. ఆయనను ఆరాధించని వారు లేరు" అన్నారు.

కవి గారు 16 వ ఏటనే అవధానాలు చేశారు. 'సారమతుల్ మానవలయు చదరంగం బున్ ' అనే సమస్యను విశాఖపట్నం అవధానంలో పూరిస్తూ పనిపాటలను పాడుచేసే ఈ వ్యసనాన్ని మానుకోటం అవసరమనే భావం వచ్చే విధంగా పూరించిన వైనం చూడండి.

కం: దూరాలోచన బుద్ధి న
పారముగా నొసగెనేని పని పాటులు వి
స్తారముగ పాడు చేయుట
సారమతుల్ మానవలయు చదరంగంబున్

1923 లో 'సరస్వతి' అనే పత్రికలో వేటూరి ప్రభాకర శాస్త్రి గారు"ఇంకం గుంకుమ బొట్టు పెట్టకుము తన్వీ! ఫాలభాగంబునన్" అనే సమస్యనిచ్చి పూరణలనాహ్వానించారు. చాలా పూరణలు

వచ్చాయి. అందులో మారేపల్లి వారిది ఉత్తమంగా ఉన్నదని వేటూరి వారు శ్లాఘించారట. ఆపూరణ ఇది-

శా: బింకంబుల్ పలుమారు పల్కె సభల పేరందు బల్ కోర్కెన్ని
శ్శంకన్ తానటు చేయజాల కిటు దేశద్రోహియై ఖైదనన్
జంకె నీ పతి పేరు మాపుకొనియెన్ చావన్న వే రున్నదే?
**ఇంకం గుంకుమ బొట్టు పెట్టకుమః తన్వీ! ఫాలభాగంబునన్**

ఓ తన్వీ! నీభర్త పేరు పొందే కోరికతో బింకంగా సభల్లో మాట్లాడాడు. సత్యాగ్రహం చేసి జైలుకు వెళ్ళవలసి వచ్చినపుడు భయపడి ముందుకు రాలేదు. పేరుమాసిపోయింది. చావంటే వేరే ఇంకేమిటీ? నీ భర్త చచ్చిన వాడి కింద లెక్క కనుక నీవు నొసట కుంకుమ పెట్టుకోవద్దు.

గాంధీ గారి చేత ప్రభావితుడైన శాస్త్రిగారు ఇలా పూరించటం ఆయన వ్యక్తిత్వానికి తగిన విధంగా ఉంది. ఈ సమస్య ఒక పదం మార్పుతో పూర్వం మోచర్ల వెంకన్న పూరించినదే. వెంకటగిరి ప్రభువుల ఆస్థానంలోఆయన ఆశువుగా గంటకు వంద సమస్యలు పూరిస్తానంటే పండితులిచ్చిన సమస్యల్లో ఇదొకటి. 'కుంకుమ' బదులుగా 'కస్తురి' ఆయన కిచ్చిన పాదంలో ఉంది.

శా: పంకేజానన! నేటిరేయి వినుమీ! పంతంబుతో రాహువే
శంకాతంకము లేక షోడశకళా సంపూర్ణు నేణాంకునిన్
బొంకం బార్చెదనంచు పల్కెను తగన్ బొంచుండి నే వింటిన్నీ
వింకంగస్తురి బొట్టు పెట్టకుము తన్వీ! ఫాలభాగంబునన్

అని వెంకన్న గారి పూరణ

ఓ సుందరీ! రాహువు పంతంతో ఈ రాత్రి చంద్రుని మీద దాడి చేస్తాడట. నే పొంచి విన్నాను. చంద్రునిలో మచ్చ ఉన్నది. నీ ముఖం చంద్రబింబం వంటిదైనా మచ్చలేనిది. నల్లని కస్తురి బొట్టు పెట్టుకొంటే వాడు నిన్ను చంద్రుడనుకోవచ్చు. కనుక నీవు ఈరోజు కస్తూరి బొట్టు పెట్టుకోవద్దు- అని శృంగార భావ చమత్కారధోరణిలో ఆయన పూరించాడు.

మారేపల్లి వారి పద్యాల్లో ఆనాటి గాంధీ ఉద్యమ ప్రభావం ఎక్కువగా ఉండటం వల్ల దేశభక్తి లక్షణాలు బాగా కనిపిస్తాయి. "దేశసేవయే కాదె సర్వేశు సేవ" అనే సమస్యను వారీ దృష్టితోటే ఇలా పూరించారు.

గీ: తాను పుట్టి వసింపగా తావొసంగి
తాను తనవారు బ్రతుక నాధారమగుచు
పరమ పురుష స్వరూపమై పరగుచుంట
దేశ సేవయే కాదె సర్వేశు సేవ.

## శేష - శేఖర ప్రతిభ

**శత శతవధాన హర్షితాస్థాన దత్త**
**కనక జయ ఘంటికా సింహ కంకణరవ**
**ముఖరి తాశాంత సద్యశః పూర్తి సుకవి**
**సింహ బిరుదుండు వేంకట శేషశాస్త్రి**

శివ భారత కర్త శ్రీ గడియారం వేంకట శేషశాస్త్రి అవధాన ప్రజ్ఞను తెలిపే పద్యమిది. అలాగే

రాణాప్రతాపసింహచరిత్ర రచించిన దుర్భాక రాజశేఖర శతావధాని గారుకూడా అవధానులే. వీరిద్దరు కొన్నాళ్లు జంట కవులై అవధాన విహారం చేశారు. 1920-26 సంవత్సరాల మధ్య వీరు చేసిన అవధానాలు సరస్వతీ సముపాసనా చిహ్నాలై ప్రకాశించాయి. ఒక అవధానంలో వీరి కిచ్చిన సమస్య

"ముది పూబోడిరొ! చెంత చేరగదవే మోమెత్తి మాటాడవే!"

ఓముసలమ్మా! శృంగార క్రీడకు రమ్మనే భావం వచ్చేలా ఉన్న దాన్ని అందంగా మలచిన తీరు చూడండి.

మః అదయుండై చెలరేగి మన్మథుడు పుష్పాస్త్రమ్ములన్ జిమ్మెడున్
గదియున్ వచ్చి సమీర భూతము కడున్ గారింప జొచ్చెన్ ముదా
స్పదుడే చంద్రుడు శత్రుడయ్యెగరమున్ బాధాకరం బయ్యె గౌ
ముది, పూబోడిరొ! చెంత జేరగదవే మోమెత్తి మాటాడవే!

ముది-ముసలి అనే అర్థం నిలవకుండా పైన 'కౌ' అనే అక్షరం కలిపి కౌముది చేసి - వెన్నెల అనే అర్థం వచ్చేలా తీర్చి మదనుడు పూలబాణాలు విడుస్తున్నాడు. మలయమారుతం హింసిస్తున్నది. చంద్రుడు శత్రుత్వం వహించాడు. కౌముది-వెన్నెల బాధాకరంగా ఉంది. ఓపూవు వంటి శరీరం కలదానా! చెంతజేరు- మాట్లాడు- అని ప్రియుడు- ప్రియురాలిని బ్రతిమిలాడుకొనే దృశ్యం సిద్ధించి శృంగారరస బంధురమైన పద్యం రూపొందింది.

ఒకచోట కవిని దొంగతో ఉపమించమని పృచ్ఛకుడడుగగా చెప్పిన పద్యమిది.

**మః పదమున్ మెల్లన చేర్చి, శబ్దముపయిన్ భావంబు సంధించుచున్**
**గదియన్ జిత్రతరార్థ జాతము నలంకారమ్ములం గొంచు న**
**మ్ము దమారంగ రసాంతరస్థితి దగన్ బొందించి దోషైక దృక్**
**పదమున్ బూనెడు సత్కవీంద్రు డలరున్ బాటింప జోరున్ బలెన్**

అవధానంలో అలవోకగా చెప్పిన పద్యంలా కాక ఆలోచనాంచితమై శ్లేషాశ్లేషితమై అద్భుతంగా ఉందీ రచన. దొంగ మెల్లగా అడుగులు వేస్తూ ఏ చప్పుడు వినిపించినా,మనసు దాని మీద ఉంచుతూ చిత్రమైన వస్తువులు, డబ్బు, అలంకారాలు తీసుకుంటూ, దోషం మీద దృష్టి ఉంచుతూ జాగ్రత్తగా కార్యసిద్ధి పొందుతాడ[illegible]గే కవి పదములను మెల్లగా కూర్చి శబ్దములు ఆలోచించి సంధించి, చిత్రార్థాలు గల అలంకారాలను గ్రహిస్తూ తప్పు లేకుండా,కవితా రససిద్ధిని సాధిస్తాడు. పదములు, శబ్దములు, అలంకారములు,చిత్రతరార్థజాతము మొదలైన పదాలు రెండర్థాలలో ప్రయుక్తాలై ఈ పద్యానికి వన్నె తెచ్చాయి.

అల్లసాని పెద్దన మను చరిత్రలోని అవతారికలో కవిని దొంగతోపోల్చిన ప్రసిద్ధ పద్యం కూడా పరికించండి. ఇది కూడా మత్తేభమే.

**"భరమై తోచు కుటుంబ రక్షణకుగా ప్రాల్మాలి చింతన్ నిరం**
**తర తాళీ దళ సంపుట ప్రకర కాంతారమ్మునం దర్థపున్**
**దెరువాటుల్ తెగి కొట్టి తద్ఘ పరిష ద్విఖ్యాత చౌర్య క్రియా**
**విరతుండై కొరతన్ బడున్ కుకవి పృథ్వీభృత్సమీప క్షితిన్"**

అయితే ముఖ్యమైన భేదం ఒకటి - కవితా పితామహుడు కుకవిని దొంగతో - దోపిడీ వానితో పోల్చగా వీరు సుకవిని పోల్చి సమర్థించటం విశేషమే.

ఒక అవధానంలోనే వీరు చేసిన చంద్రోదయ వర్ణన ప్రజ్ఞా ప్రాభవాని కొక నిదర్శనం.

**ఉ: క్రమ్మెరతి శ్రమన్ చెలుల కన్గవ కల్వలు నిద్ర నొందె నం**
**దమ్మగు ముంగురుల్ మొగముదమ్ముల దుమ్మెద లాడుచుండె నా**
**గ్రమ్మె జిలుంగు పైట తొలగన్ చనుజక్కవ లానె వెన్నెలల్**
**సమ్మదమందె లోకము కళానిధి వెల్గెడు రాత్రి వేళలన్**

చంద్రుడు వస్తే కలువలు వికసించటం, తామరులు ముడుచుకోవటం, చక్రవాకాలు బాధపడటం ప్రసిద్ధి. ఇక్కడ అలా కాక రతి శ్రమ వల్ల కాంతల కనుగలువలు నిద్ర పొందాయి. ముఖ పద్మాలలో తుమ్మెదలాడుతున్నట్లు ముంగురులు కమ్మాయి. పైట తొలగి చనుజక్కవలు వెన్నెలలు గ్రోలుతున్నవి- అనటం ద్వారా విరోధాభాసాలంకారం మనోహరంగా భాసించింది. రాజశేఖర, వేంకట శేషకవుల ప్రతిభ ఇటువంటిది.

## పింగళి - కాటూరి అవధానం

కేతన తోడ పొత్తునకు కేల్గలపన్ దలపోసికాదు మీ
చేతము మెచ్చగా కవిత చెప్పగ నేర్తు మటంచుగాదు ని
ఖ్యాతికి కా దికేమనిన సద్యతనాంధ్ర కవి ప్రపంచని
ర్మాతకు భక్తిమై ఉడుగరల్ ఘటించెడి పూన్కియే జుడీ.

అని చెళ్ళపిళ్ళవారికి గురుభక్తితో సౌందరనంద మహాకావ్యాన్ని అంకితమిచ్చిన జంటకవులు పింగళి, కాటూరి. పింగళి లక్ష్మీకాంతంగారు,కాటూరి వేంకటేశ్వరరావుగారు గురువరులైన తిరుపతి వేంకట కవుల ప్రభావం వల్ల, ఆనాటి సారస్వత వాతావరణ ప్రభావం వల్ల మొదట్లో అవధానాలు చేశారు. 1918లో ముదునూరి శతావధాన సభలో వీరి ప్రార్థన చూడండి.

**ఉ: సుంతయు సంస్కృతాభ్యసన శోభ వహింపని కైత నెట్టులో**
**కొంత గ్రహించి తెంపుమెయి కోవిద సన్నిధి వేంకటేశశ్రీ**
**కాంతులు మేలు సల్ప సమకట్టిన యీ యవధాన మందు నా**
**వంతయు లోపముండక జయప్రద మౌనటు చూడు మంబికా!**

సంస్కృతం అంతగా రాదని చెప్పటం వినయం చేత మాత్రమే. తెలుగు కవిత్వం చెప్పటానికి కావలసిన గీర్వాణం బాగానే ముదిరింది. అవధానం విజయవంతమైంది.

నెల్లూరులో శతావధానం చేస్తున్నారు. మహాపండితులు వేదం వేంకట రాయశాస్త్రిగారు.

**"కాంతా రమ్మనియెన్ మునీంద్రుడు చమత్కారంబు దీపింపగన్"**

అని సమస్య ఇచ్చారు. పూరించబోతున్నారు పింగళి,కాటూరి, సభలోనిపండితులొకరు "పద్యపూరణలో తిరుపతి వేంకటకవులు చెరొక చరణం చెప్పేవారట గదా! మరి మీరూ అలానే చెపుతారా!" అన్నారు.

"ఒక చరణమ్మతండు మరియొక్కటి నేను మరొక్క టాతడున్
సకల కవీంద్ర సంతతులు సమ్మతితో తలయూపి మెచ్చగా
ప్రకట తరాశుధార దనరన్ రచియింపగ నేర్తుమయ్య! నూ
టికి సెలవయ్యె? ఇంక మరి డెబ్బది మాటలు చెప్పనేటికిన్"

అని పలికి మా గురువులు నెగ్గించుకున్నారు.ఒక్కోసారి చరణం మధ్యలోనే మరొక రందుకునేవారు. ఒక శబ్దం ఒకరు, మరొక శబ్దం రెండవవారు చెప్పిన సందర్భాలూ ఉన్నవి. అవసరమైతే మేము చెరొక

అక్షరం చెపుతూ పద్యం పూర్తిచేయగలను" అని జంటకవులన్నారు

"ఈ సమస్య అలాగే పూరించండి చూద్దాం" అన్నారు పృచ్ఛకులు అప్పుడు చెప్పిన పూరణ ఇది

**శా: దంతుల్ ఘోటకముల్ పదాతులును చెంతన్ గొల్చి రావచ్చుదు**
**ష్యంతున్ గన్గొని కణ్వమౌని యిటు రాజా! రమ్మనన్ మీకు మీ**
**అంతేవాసులకున్ సుఖమ్మె యన నీయండన్ సుఖమ్మండె మా**
**కాంతారమ్మనియెన్ మునీంద్రుడు చమత్కారంబు దీపింపగన్**

మునీంద్రుడు కాంతను రమ్మని సట్టు కనిపించే సమస్యను పదముల విరుపుతో మార్చి కాంతారమ్మ + అనియెన్ అనటంవల్ల విచిత్రమైన అర్థ స్ఫూర్తి కలిగింది. ఏనుగులు, గుర్రాలు, కాల్బంట్లతో దుష్యంతుడు వేటకు వచ్చాడు. కణ్వముని చూసి 'రాజా! ర'మ్మని ఆహ్వానించాడు. రాజు 'మీకు, మీ శిష్యులకు క్షేమమా' అని అడిగాడు. ముని 'నీ అండ వల్ల మాఅడవి అంతా (కాంతారమ్మ) సుఖమే' అని సమాధానం చెప్పాడు.

ఆ రోజుల్లో సంప్రదాయబద్ధంగా చదువుకున్న వాళ్లే అవధాన రంగంలో ప్రవేశించేవారు. వీరో, ఇంగ్లీషు చదువులు చదివి కూడా ఈ ప్రదర్శనలు చేయటం ఆశ్చర్యకరంగా ఉండేది. ఈ విషయాన్నే ఒక అవధానంలో పృచ్ఛకుడడిగితే చెప్పిన పద్యం చూడండి.!

**గీ: ఆంగ్ల భాషను చదివి శతావధాన**
**మొనరువం బూనినార లహోయటంచు**
**గేలి చేసెద రేమొ ఆ గోల కూడ**
**నేర్చి నారము కొంత మన్నింపు డయ్య!**

ముదునూరు శతావధానంలో విప్రలంభాన్ని ఉత్సాహసుందరం చేయమన్న ఒక ప్రాశ్నికుని భావన కనుగుణంగా ఉత్సాహంలో చెప్పిన పద్యం గమనించండి.

**పతిని బాసి పత్ని సతిని బాసి భర్తయున్ మనో**
**గత మనోజ బాధలకును గ్రాగి వెచ్చ నూర్చుచున్**
**వెతలు జెందుచున్ మయూర పిక తుషార పర్వతా**
**గత సమీరులన్ విరోధి గణముగా గణింతురే!**

విరహంతో బాధపడే భార్యాభర్తలు నెమళ్ళను, కోయిలలను,మలయమారుతాన్ని శత్రువులుగా భావిస్తారని దీని భావం.

తరువాతి కాలంలో ఉత్తమ కవులుగా పేరు గాంచిన వీరు చిన్నతనంలో చేసిన చిత్ర కవితా విలాసాలు చిత్రంగానే ఉన్నాయి.

## తెలుగు మీసానికి సవాల్!

తిరుపతి వేంకటకవులలో వేంకట శాస్త్రిగారికి మీసం ఉండేది. ఒక సభలో ఎవరో అడిగారు- 'వైదిక ధర్మ నిష్ఠులైన పండితులకు మీసం ఉండవచ్చునా?' అని. దానికి చమత్కారంగా- 'శాస్త్రవిరుద్ధమని, తప్పని తెలిసి కూడా సంస్కృతాంధ్రాలు రెండు భాషలకూ మేమే కవీంద్రులమని చెప్పటం కోసం పెంచాము. ఎవరైనా రోషం చెందితే మమ్మల్ని గెలవండి. అప్పుడు మీసం తీసివారి కాళ్ళకు మొక్కుతాము' అని అర్థం వచ్చే పద్యం చెప్పారు.

ఉ॥ దోసమటం చెరింగియును దుందుడు కొప్పగ బెంచి నారమీ
మీసము రెండు బాసలకు మేమె కవీంద్రుల మంచు జెప్పగా
రోసము కల్గినన్ కవివరుల్ మము గెల్చుడు గెల్చిరేని యీ
మీసము దీసి మీ పద సమీపములన్ దలలుంచి మ్రొక్కమే!

పండిత మార్తాండులు గిడుగు రామమూర్తి గారు వెంకట శాస్త్రిగారి అధ్యక్షతన తెలుగు వ్యాకరణ విశేషాలు ప్రసంగిస్తూ "ఈ పద్యంలో తప్పున్న" దన్నారు. వేంకటశాస్త్రిగారికి ఆశ్చర్యం కలిగింది! "అదేమిట"న్నారు "కవి వరుల్ మము గెల్చుడు అంటే కవి వరులారా! మమ్ము గెలవండి అని గదా! క్రియ మధ్యమ పురుష-కర్త మీరు ఉత్తము. 'గెల్చిరేని'లో 'గెల్చిరి' ప్రథమపురుష. కర్త ననుసరించి మధ్యమ పురుష క్రియ ఉండాలి. అనగా గెల్చితిరేని అని ఉండాలి. వ్యాకరణ శాస్త్ర దృష్టితో ఇది దోషం" అన్నారు గిడుగువారు. చెళ్ళపిళ్ళ వారి కేమీ పాలుపోలేదు. సమర్థించే మార్గమేమీ లేదు. నవ్వుతూ "గిడుగు పిడుగే" అని ఊరుకున్నారు.

ఇంతకూ సంస్కృతాంధ్రాలు రెంటికి కవీంద్రుల మన్నారు జంట కవులు. 'మీసం రెండు భాగాలు. ఒకటి సంస్కృత భాగం, మరొకటి తెనుగు భాగం. ఈ అర్థాన్ని తీసి కొప్పరపు కవులు-వీరితో వివాదం వచ్చినప్పుడు 'తెనుగు కవిత్వంలో మిమ్ము ఓడిస్తాము. చేతనైతే తెనుగు మీసం నిలుపుకోండి' అంటూ ఈ పద్యం చెప్పారు.

సీ॥ అష్టావధానంబునాచరిం చెదరేని అద్దాని మించి చేయంగ లేమొ
అశుకవిత్వంబు నల్ల బూనెదరేని అద్దాని మించి చేయంగ లేమొ
శతఘంట కవనంబు సల్పబూనెద రేని అద్దాని మించి చేయంగలేమొ
నేత్రావధానంబు నేర్పుసూపెదరేని అద్దానిమించి చేయంగ లేమొ
తే॥గీ॥ ఆంధ్రమున నిన్నియిన్ని పద్యంబులన్న నింత కాలంబులో నన్ననిందరన్న
నిట్టి వర్ణోత్కరంబన్న నేమి వెరవు తెనుగు మీసంబు నిలుపంగ దివురు డింక!

మొదట్లో రెండు జంటలూ బాగా స్నేహంగా ఉండేవే. మదరాసులో కొప్పరపు కవులు అవధానాలు, అశుకవితా సభలు చేస్తుంటే చూసి పరవశించిన వేటూరి ప్రభాకర శాస్త్రిగారు గురువు గారికి సోదర కవులను మెచ్చుకుంటూ ఇలా రాశారు.

శా॥ ఆలోచించుట లేదు కల్పనకు పద్యారంభ యత్నంబు ము
న్నే లేదించుక ప్రాసకేని యతికేనిం గొంకు గన్పట్టదే
ఆలస్యం బునుగల్గబోదు బళిరా ! అయ్యారె! ఇవ్వారి కిన్
ప్రాలేయౌ గదా! ఆశు ధార కవితా ప్రారంభ నిర్వాహముల్.
దానితో సంతోషించి కొప్పరపు వారికి చెళ్ళపిళ్ళ వారు
శా॥ అయ్యా ! కొప్పరపుంగవీశ్వరులు! మీ యాస్యంబు మే మెన్నడే
నొయ్యం జూడగలేదు శిష్యు డొకడోహా! యంచు మెచ్చెన్మిమున్
వెయ్యార్లియ్యగ శక్తి లేదు కొనుడీ వెయ్యారు లేయంచు మే
మియ్యం బూనిన పద్యముల్ మనుడి! మీ రెచ్చో నిరాఘాటులై.

మీకు వెయ్యారులు రూపాయ లివ్వలేము. మా పద్యాలనే వాటితో సమానంగా భావించి స్వీకరించండి-అని మొదలు పెట్టి చాలా పద్యాలు వ్రాసి పంపారు. దానికి సమాధానంగా కొప్పరపు వారూ సుందర పద్యావళి కానుక ఇస్తూ ఇలా అన్నారు.

శా॥ లాతింబోని రసజ్ఞ శేఖరుల నుల్లాసంబు కల్పించి వి
ఖ్యాతిం జెందిన మీకు పద్యములనీ గాంక్షించినా మివ్వి మీ
చేతః ప్రీతి ఘటింప నేరవయినన్ జేకొంద్రుగా కాప్తులై
శీతాంశోర మృతార్పణంబును నుడిం జింతించి ధీరోత్తముల్!

గొప్ప కవిత చెప్పే మీకు పద్యాలనిస్తున్నాము. ఇవి మీకు నచ్చుతాయో, లేదో? అయినా చంద్రునికి కూడా పూజలో అమృత నైవేద్య మిచ్చినట్లు ఇస్తున్నాము-అని గౌరవంతో సోదర కవులు పలికారు. కాల వైపరీత్యం వల్ల తరువాత వారికి వీరికి విరోధం వచ్చిందనుకోండి.

## ఆచార్య గర్జన

గువ్వల చెన్నడనే వాడు అల్లసాని పెద్దనగారు రాయలవారితో యుద్ధానికి వెళ్ళినప్పుడు ఇంట్లో ఇబ్బందిగా ఉంటే కట్టెల మోపులు వేసి పోయేవాడట. పెద్దనగారు తిరిగి వచ్చి వాడికి కట్టెల ఖరీదు ఇవ్వబోతే తీసుకోక తన మీద పద్యాలు చెప్ప మని ప్రార్థించాడట. అప్పుడు కవితా పితామహుడు-

కం॥ గుడి కూలును నుయి పూడును
వడి నీళ్ళన్ జెరువు తెగును వనమును ఖిలమౌ
చెడనిది పద్యం బొక్కటె
కుడి యెడమల కీర్తి గన్న గువ్వల చెన్నా!

కం॥ అంగీలు పచ్చడంబులు
చంగావి మెరుంగు సేలు సరిగంచుల మేల్
రంగుల దుప్పట్లును నీ
గొంగడి సరిపోలవన్న! గువ్వల చెన్నా!

అని మొదలు పెట్టి చాలా పద్యాలు చెప్పాడట. అయితే ఈ కింది పద్యాన్ని చూస్తే గువ్వల చెన్నడు చదువుకొన్న వాడనీ, దాత అనీ తెలుస్తుంది.

కం॥ ఎరుగుదువు సకల విద్యల
ఎరుగని వొక రెండు కలవవే వేవన్నన్
పిరికితనంబును లోభము
గురుతెరుగవు జగతి నెన్న గువ్వల చెన్నా!

పెద్దనకూ, ఇతనికీ సంబంధించిన కథ నమ్మదగినదిగా కనపడదు. ఏదైతే నేమి తమకు ఉపకారం చేసిన వారి మీద కవులు పద్యాలు చెప్పటం మాత్రం పరిపాటి. కొమాండూరు కృష్ణమాచార్యుల వారు ఇరవయ్యవ శతాబ్ది ప్రథమార్థంలో ఉన్న పండిత కవులు. గుంటూరు వాసులు. వారొకనాడు మండు వేసవిలో వడగాడ్పుల మధ్య తమ పొలమున్న గ్రామానికి పోతున్నారు. తోవలో విపరీతంగా దప్పికైంది. అప్పుడొక గొల్లవాడు చల్లని మజ్జిగ ఇచ్చి దాహం తీర్చాడు. వెంటనే అతనికి పద్యాన్నిలా బహూకరించారు ఆచార్యుల వారు.

మ॥ పురజిత్ఫాల మహోగ్ర నేత్ర జనిత స్ఫూర్జన్మహాగ్నిచ్ఛటా
పరుష స్ఫూర్తి వహించి వీచెడు మహావాతంబు ప్రాణాంకురో
త్కరమున్ మ్లానము నొందజేయ-మము తక్రంబిచ్చి రక్షించితో
పురుష గ్రామణి!గోప మాత్రుడవె! నీ పుణ్యంబు సామాన్యమే?

ఆ గోపాలుడికి ఈ పద్యం అర్థం కాలేదు. సంస్కృత పద సమాసబంధురమైన శైలి కొమండూరి వారిది. వారి వైపు ప్రశ్నార్థకంగా చూశాడు. అది గ్రహించి అర్థం చెప్పారు కవిగారు.

"త్రిపురాలను తగలబెట్టిన రుద్రుడి మూడో కంటి మంట లాగా ఎండకాస్తున్నది. వడగాడ్పు కొడుతున్నది. ప్రాణం అలసిపోతున్నది. ఈ స్థితిలో మజ్జిగ ఇచ్చి కాపాడావు. నీవు మామూలు గొల్లవు కాదు. నీ పుణ్యం సామాన్యమైనది కాదు".

అర్థం తెలిసిన తర్వాత అంత గొప్ప పద్యం తన మీద చెప్పి నందుకు ఎంతో కృతజ్ఞత ప్రకటించాడతను.

ఒకప్పుడు తిరుపతి దేవస్థానం అధికారుల్లో కొందరి వల్ల వీరికి మనఃక్లేశం కలిగింది. వెంటనే అది ఇలా పద్య రూపం ధరించింది.

చం॥ కలవు నిధుల్ సహస్రములు గాని భవద్ధనరాసులన్నియున్
కలియుగ ధర్మపాలకుల కైవస మయ్యెను భక్తకోటి నిన్
బిలచిన గాని పల్క వరిభీకరమూర్తివె!యైన నిన్ను నీ
కలిమిని గూడ బంధితునిగా నొనరించిరె వేంకటేశ్వరా !

నీ దగ్గర అనంత ధనరాసు లున్నాయి అయితే అవి కలియుగ ధర్మపాలకుల వశమై ఉన్నాయి. భక్తులు పిలిచినా నీవు పలకటం లేదు. వాళ్ళేమన్నా నీ కలిమితో సహా నిన్ను బంధించారా? అని ప్రశ్నించారు. ఇక్కడ కలియుగ ధర్మపాలకు లంటే కలియుగ ధర్మాలను పాలించే వారని ఒక అర్థం. కలియుగ మందు ధర్మపాలకులని పైకి కనపడే అర్థం.

ఆచార్యుల వారి ఇంటికి దగ్గర ఒక విష్ణ్వాలయ ముంది. అక్కడి పాలకులు అధర్మవర్తనులై వీరిని నిందిస్తూ ఉండే వారు. ఒకసారి అది మితిమీరింది. కొమండూరి వారి కోపం శార్దులమై దూకింది.

శా॥ గంతుల్ మానుము కాకమా! యట సముద్ర ప్రాంత వైఖానసా
క్రాంత ప్రాకృత దేవతాలయములన్ రండా సమాజంబులో
గంతల్ బొంతలు పైని కప్పుకొని భేర్ ధ్వానమ్ములనే సల్పు నీ
కంతన్ బాండితి కల్గెనే కటురటత్ కాకోల కుక్షింభరా!

ఇటువంటి వ్యాఘ్ర గర్జనలు ప్రత్యగ్ర భీకరాలై చాలా వచ్చాయి. ఆశువులో కూడా సమాన పటిష్ఠ రచన వారిది. ఆంధ్ర హర్ష చరిత్ర, ఆంధ్ర హంస సందేశము, వైజయంతీ వైభవము, శ్రీకృష్ణ లీలా విలాసము మొదలైన గ్రంథాలెన్నో రచించిన కృష్ణమాచార్యుల వారు పండిత కవి వర్యులు.

## గురునాథవాణి

**19**వ శతాబ్దం చివర ఉదయించి తొంభై సంవత్సరాలకు పైగా జీవించి అపార సాహిత్య సేవ చేసినవారు బ్రహ్మశ్రీ మిన్నికంటి గురునాథశర్మగారు. ఉభయ భాషా ప్రవీణులుగా, వేదాంత పారాయణులుగా జగద్గురు కళ్యాణానందభారతీస్వామి శిష్యులుగా, నిరంతర పంచాక్షరీ మంత్ర జపపరాయణులుగా సారస్వత తపోయోగులైన శర్మగారు భాగవతం ఏకాదశ, ద్వాదశ స్కంధాలు అనువదించారు. కావ్యాలే గాక, వేదాంత గ్రంథాలెన్నో రచించారు. చిన్నతనంలో కొప్పరపు సోదర కవుల ప్రభావం వల్ల అవధానాశు కవితా విహారం చేవారు. ఆ సందర్భంగా ఆశువుగా ఎన్నో సమస్యలు పూరించారు. గుంటూరు జిల్లా మాచెర్లలో జరిగిన అవధానంలో ఇచ్చిన సమస్య -

ప్రాగ్భాగంబున నస్తమించె రవియున్ ప్రత్యూష కాలంబునన్

తూర్పున ఉదయవేళ సూర్యుడు అస్తమించాడని దీని భావం. శర్మగారి పూరణ చూడండి!

శా॥ వాగ్భామా ప్రతిమాన!రాహు వదన వ్యామిశ్రుడై యుంటనో
దిగ్భా సంవృత భూరివారిద సముద్దీప్త ప్రభాచ్ఛన్నసం
యుగ్భానుండయి యుంటనో యిటులనే నూహించి వ్రాక్రుచ్చెదన్
ప్రాగ్భాగంబున నస్తమించె రవియున్ ప్రత్యూష కాలంబునన్

గ్రహణం పట్టడం వల్లనో లేక మబ్బులు కమ్ముకోటం వల్లనో పొద్దున సూర్యుడు కనపడటంలేదని పూరణ అర్థం.

అదే విధంగా మరో సమస్య -

అల్లుడ నయ్యెదన్ మగడ నయ్యెద మేల్ మనుమండ నయ్యెదన్

దీనికి పూర్వ పూరణ ఉంది. ఒక వేశ్య ఇంటికి విటుడొకడు వచ్చాడు. వేశ్య అతనికి తన కూతురును, మనవరాలిని చూపి ఇలా అన్నదట !

ఉ॥ మొల్ల సుగంధి కూతురది ముంగిట నున్నది దాని జూడు నే
నెల్ల విధంబులన్ రతుల నేలెడు దానను నన్ను చూడు ను
త఼్ుల్ల సరోజ గంధి వరపుత్రిక పుత్రిక దాని జూడు నా
కల్లుడ వయ్యెదో మగడ వయ్యెదో నా మనమండ వయ్యెదో!

మంచి వయసులో ఉన్న అందగత్తె నా కూతురుంది. ప్రౌఢ శృంగార నిపుణను నే నున్నాను. కొత్తగా రంగప్రవేశం చేసిన మనమరాలుంది. మరి వీళ్ళలో ఎవరు కావాలి? ఆ కూతురిని వరించి అల్లుడివవుతావా? నన్ను వరించి మగడివవుతావా? లేక మనుమరాలిని వరించి మనుమడివవుతావా?

దానికి

ఉ॥ మొల్ల సుగంధి కూతురది ముంగిట నున్నది దాని మాన నీ
వెల్ల విధంబులన్ రతుల నేలెడు దానవు నిన్ను మాన ను
త఼్ుల్ల సరోజ గంధి వరపుత్రిక పుత్రిక దాని మాన - నీ
కల్లుడ నయ్యెదన్ మగడ నయ్యెద నీ మనుమండ నయ్యెదన్ -

నే నెవరినీ వదలను. నీకు అల్లుడిని, మగడిని, మనవడిని అన్నీ అవుతాను - అన్నాడా నరసుడు.

ఈ సమస్యను కొంచెం మార్చి అక్రమ సంబంధం కాకుండా సక్రమ సంబంధం వచ్చే విధంగా చెప్పమని పృచ్ఛకుడడిగాడు. శర్మగారి పూరణ ఎంత ఔచిత్య సుందరంగా వచ్చిందో పరికించండి! ఆలోచనామృతమైన పద్యమిది -

ఉ॥ ఎల్ల సురల్ వినంగ హరి యిట్లనె భూ సుత సీత బొందితిన్
నీళ్ళను మున్గినట్టి ధరణీ సతిఁ గౌగిట గ్రుచ్చి యెత్తితిన్
తల్లికి తల్లియౌ సతి నెదన్ ధరియించితిగాన భూమికిన్
అల్లుడ నయ్యెదన్ మగడ నయ్యెద మేల్ మనుమండ నయ్యెదన్

దేవతలు వినగా విష్ణువిలా అన్నాడు- భూపుత్రిక సీతను పెండ్లాడాను (రామావతారం). భూమిని పెళ్ళాడాను (వరహావతారం) లక్ష్మిని పెళ్ళాడాను (సముద్ర మథనాంతరం) - ఇక్కడ విష్ణుపాదంలో గంగ పుట్టింది. విష్ణువు భార్య భూదేవి. కనుక గంగ భూమికి కూతురి వరస. గంగ సముద్రుని భార్య. నదులన్నీ సముద్రుని భార్యలు గదా! సముద్రంలో పుట్టింది లక్ష్మి. కనుక లక్ష్మి గంగ కూతురి వరుస. భూమికి మనవరాలి వరుస. కూతురిని తల్లీ అని పిలవటం ఉంది. ఈ గమనికతో

భూమికి, భూసుత సీతకు, గంగాసుతలక్ష్మికి-మూడు తరాలవారికి విష్ణువు భర్త కనుక అల్లుడు, మగడు, మనవడు వరసలు సరిపోయాయి. ఇ వన్నీ ధర్మబద్ధమైన బంధాలే కనుక సక్రమ వివాహ బంధం రావాలన్న పృచ్ఛకుని ప్రశ్న సరిపోయింది.

మరో చిన్న సమస్యా పురణలోని చమత్కారం చూడండిడ!

సీత పిలిచెను రాముని భ్రాత యనుచు.

సీత రాముని సోదరా అని పిలిచిందట! పూరణ-

శా॥ నార చీరలు దాల్చి అందముగ కంద
మూల ఫలములు దిని పర్ణశాల నున్న
లక్ష్మణాగ్రజు గనుచు విలాసముగను
సీత పిలిచెనురా! ముని భ్రాత! యనుచు,

ముని వేషధారి యైన రాముని సీతముని సోదరా! రమ్మ'ని చతురోక్తితో పిలిచిందట! శర్మగారి ప్రజ్ఞ అంత సూక్తి సురభిళం! ప్రత్యగ్ర మనోహరం!

## రాళ్లపల్లి వినతి

శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణ శర్మగారు ఆంధ్ర సారస్వతంలోని అద్భుతమూర్తి. చమత్కార చతురతతో, పదునైన పలుకులతో, మెత్తని నుడికారంతో శర్మగారి వచనాశైలి విమర్శా రంగంలో సుప్రతిష్ఠితమైంది. డా. చిలుకూరి నారాయణరావుగారు శర్మగారిని గురించి ఒక మిత్ర గోష్ఠిలో ఇలా అన్నారు.

అ. వె. రాళ్ళపల్లిలోన రాళ్ళెన్ని పుట్టెనో
రాళ్ళలోన వజ్జరాలు పుట్టె
వజ్జరాలలోన వలపెట్టు పుట్టెరా!
కీర్తనీయ చరిత ! కృష్ణశర్మ!

శ్రీ తిరుమల రామచంద్ర- శర్మగారి ఏకసంథాగ్రాహ శక్తిని గురించి మంచి సంఘటన ఉదాహరించారు. ఒకప్పుడు మైసూరులోని పరకాల మఠంలో శ్రీకృష్ణ బ్రహ్మతంత్ర పరకాలయతీంద్రులతో పండితశిరోమణి చామరాజ నగరం శ్రీకంఠశాస్త్రి ఒక పూర్వగాథ చెప్పారు. అప్పయ్య దీక్షితులవారు వీథిలో ఏదో కలకలం వినిపిస్తే కూతురిని పిలిచి అదేమిలో కనుక్కోమన్నారు. ఆమె మంచి కవయిత్రి. వాకిటిలోకి పోయి వచ్చి తురుష్కుల అలజడిని గురించి చక్కని శ్లోకం చెప్పింది. మరి కొన్ని చాటువులతో పాటు ఆ శ్లోకాన్ని స్వామివారికి శాస్త్రి నివేదించారు. స్వామికి ఆ శ్లోకం నచ్చింది. పక్కనే ఉన్న చక్కని చిన్నవాణ్ణి చూసి- "అనంతూ! ఈ శ్లోకం గుర్తు పెట్టుకోరా" అన్నారు. శ్రీ కంఠశాస్త్రి "ఒకసారే గదా నేను చదివింది" అన్నారు. "పరవాలేదు. గుర్తు పెట్టుకుంటాడులే" అన్నారు యతీంద్రులు, ఆ చిన్నవాడే అనంతకృష్ణ శర్మగారు. చిన్నవాడు అంతటి ధారణాశక్తి కలవాడు.

అనంతకృష్ణ శర్మగారికి పండితునిగా, పరిశోధకునిగా, విమర్శకునిగా వచ్చినంత పేరు కవిగా రాలేదు. ఎన్నో మధుర కవితలు, కమనీయ కావ్యాలు వెలయించారు. తలచిన వెంటనే పద్యం ఆశువుగా అందంగా చెప్పగలవారు. అయినా ఎందుకో అవధానాలు ఆశుకవితా ప్రదర్శనల జోలికి పోలేదు. సంస్కృతాంధ్రాలు రెంటిలో సమాన ప్రజ్ఞతో కవనం చెప్పగల దిట్ట శర్మగారు. ఒకప్పుడు మైసూరులో పిసుపాటి చిదంబరశాస్త్రిగారు అవధానం చేస్తున్నారు. అష్ట శతావధాన విద్యాచతురాననులైన

పినుపాటి వారు మంచి పకడ్బందీగా అవధానాన్ని నడుపుతున్నారు. ఆహూతులైన శర్మగారు కొంచెం ఆలస్యంగా-మధ్యలో చేరుకొన్నారు. ఒక పండితుడిచ్చిన "చంద్రశేఖరోప్యర్క శేఖరః" అనే సమస్యను శాస్త్రిగారు అవధానంలో పూరించారు. అడిగిన విద్వాంసుని కెందుకో ఆ పూరణ తృప్తి కలిగించలేదు. శర్మగారు చెప్తే బాగుంటుందని సదస్సులో అభిప్రాయపడ్డారు. కాదనలేక ఆయన ఇలా పూరించారు.

శ్లో ॥ నిర్జనాటవీ మధ్య దుస్థితే
భిన్నభిత్తికే కంటకాంచితే
శూన్య దేవతామందిరే భవత్
చంద్రశేఖరోప్యర్కశేఖరః

మనుషులు లేని అడవిలో దేవాలయం శిథిలమైంది. గోడలు పడిపోయాయి. ముళ్ళు, జిల్లేళ్ళు మొలిచాయి. శివలింగం పక్కన జిల్లేడు చెట్టు మొలిచి లింగంపైన ఆక్రమించుకొంది. దానితో చంద్రశేఖరుడు కూడా అర్కశేఖరుడైనాడు. ఇక్కడ అర్క శబ్దానికి జిల్లేడని అర్థం. అందమైన ఈ పూరణ అందరికి తృప్తి కలిగించింది.

కాళిదాసు రఘువంశానికి అనువాదం చేశారు శర్మగారు. ఎంత బాగా చేసినా ఏదో అసంతృప్తిగా ఉంది. ఆవేదన ఇలా వెలువడింది.

మ॥ పదపుష్టిం బరికించి శబ్ద విధులం బాటించి యర్థంబులన్
గొదుకుల్ పుట్టక దిద్ది భావముల నిక్కుల్ సూచి పద్యంబులన్
బొదిగింపంగల మింతె కాని యది యేమో తక్కువై తోచునా
కొదువం దీర్పు కవిత్వ బీజ మది మాకున్ జిక్కునో చిక్కదో!

శబ్దాలు, అర్థాలు, అలంకారాలు, భావాలు అన్నీ చూసి పద్యాలు చెప్పవచ్చు. కానీ ఎక్కడో ఏదో (కవిత్వమనే వస్తువు) తక్కువైనట్లు అనిపిస్తుంది. అది చిక్కుతుందో చిక్కదో అని శర్మగారు బాధపడినారు.

ధనంకోసం, పదవుల కోసం ఆయన ఎన్నడూ వెంటబడలేదు. వెంపరలాడలేదు. గౌరవప్రదమైన జీవనం మాత్రమే పరమేశ్వరిని కోరుతూ ఇలా అన్నారు.

మ॥ ధనమే యిమ్మని నిన్ను నే నడుగనో తల్లీ! తలంపన్ ధనం
బనబై నొత్తిన రాజముద్రయె గదా! ప్రాణంబుతో నీ జగం
బున నున్నన్ని దినాలు కొందరయినన్ మోదింపగా గౌరవం
బున జీవింప ననుగ్రహింపు మదియే పూర్ణంబగున్ భార్గవీ !

## రెండు వైపులా పదునే!

**18**వ శతాబ్దం చివర - 19వ శతాబ్దం ప్రథమార్థంలో ఉన్న కవుల్లో అడిదము సూరన సుప్రసిద్ధుడు. ఈ వంశంలోని ఒక పూర్వకవి - నీలాద్రి-కళింగరాజు ఆస్థానంలో ఉంటూ , ఒకసారి రాజుతో పాటు యుద్ధంలో పాల్గొని అపూర్వ ధైర్యసాహసాలు ప్రదర్శించాడట. మహారాజు చాలా సంతోషించి ద్రవ్య రూపమైన బహుమతితో పాటు ఒక అడిదము (కత్తి) కూడా ఇచ్చాడట. అప్పటి నుంచి వారి ఇంటి పేరు అడిదమువారుగా మారింది. సూరకవి ముందు 23 పురుషాంతరాలు కవులేనట.

చం॥ ఇరువది మూడు పూరుషము లిప్పటి కయ్యె కవిత్వ వృత్తిచే
నరపతు లెల్ల మెచ్చ పదునాల్గు తరంబులు మించు పిమ్మటన్
వెరవగు జీవన స్థితి లభించుట తొమ్మిది యయ్యె పురుషాం
తరములు నిక్కళింగ వసుధాధిపు చెంగట నాశ్రయించుటన్.

నూరకవి చెప్పిన చాటువిది. ఆయన తండ్రి బాలభాస్కరుడు శుద్ధాంధ్ర రామాయణకర్త. స్వగ్రామం రేగ. తండ్రి తరువాత నూరకవి ఆ ఊరు విడిచి విజయనగరం దగ్గర చీపురుపల్లె చేరాడు. మరొక కవితో మాట్లాడేప్పుడు ఇద్దరి పద్యరూప సంభాషణ ద్వారా ఆ విశేషాలు తెలుస్తున్నాయి.

కం॥ ఊ రెయ్యది? చీపురుపలి-
పేరో? సూరకవి, యింటి పే? రడిదమువార్
మీ రాజు? విజయరామ మ
హారాజ తడేమి సరసుడా? భోజుడయా!

రేగ, కంచరము గ్రామాలలో ఇతనికి మాన్యా లుండేవి. అయితే అవి ఎప్పుడూ సరిగా పండేవి కావు. విసిగిపోయిన సూరన వాటిని గూర్చి చెప్పిన పద్యం చూడండి-

చం॥ గరిసెలు వ్రాతగాని యొక గంటె డెరుంగము మాన్య దేశముల్
తిరిగి యభీష్ట వస్తువులు తెచ్చి భుజింతుము సర్వకాలమున్
సురుచిర సత్కవిత్వనిధి - సూర కవీంద్రున కేల కల్గె కం
చరమును రేగ మేక మెడచన్నుల వంటివి రెండు మాన్యముల్ !

ఎప్పుడూ దేశం తిరిగి కవిత్వం చెప్పి డబ్బు తెచ్చుకోవటమే గాని, పొలాల మీద ఏమీ వచ్చేది కాదు. విజయనగర ప్రభువు పెద విజయరామరాజు నాటికి ఇతను కుర్రవాడు. రాజుగారు అహంకారి అని ప్రతీతి. నాటి రాజుల కది సహజం . ఒకసారి తురక సరదారు దండయాత్ర చేస్తే ఇత నేమన్నాడో గమనించండి-

గీ॥ మెత్తనైనట్టి అరటాకు మీదగాక
మంటమీదను చెల్లునే ముంటివాడి
బీదలైనట్టి సరదార్ల మీద గాక !
కలదె క్రొవ్వాడి బాదుల్లఖాను మీద

ముల్లుకు అరిటాకు మీద చెల్లినట్లుగా మంటమీద చెల్లుతుందా? కాలిపోతుంది. అలాగే రాజుగారి జులుం కింది సరదార్ల మీదనే కాని, నవాబుగారి సేనాపతి బాదుల్లాఖాను మీద చెల్లుతుందా- అని భావం.

అయితే రాజుగారు గెలిచాడు. అప్పుడు మళ్ళీ ప్రశంసిస్తూ పద్యంచెప్పాడు.

శా॥ ఢిల్లీ లోపల గోలకొండపురి నిండెన్ నీ ప్రశంసల్ గులాల్
బల్లాలం బొడిపించి హమ్మని అరబ్బా నెక్కి పైకొంచు బా
దుల్లాఖానుని బారద్రోలితివి నీ దోశ్శక్తి సూ బాలకున్
మళ్ళింపం దరమౌనె శ్రీ విజయరామా! మండలాధీశ్వరా!

అటైనా, ఇటైనా, ఎటైనా చెప్పగలవాడు, చెప్పి మెప్పించగలవాడు సూరకవి. పెద విజయ రామరాజు తరువాత ఆనంద గజపతి కొద్దికాలం రాజ్యం చేశాడు. అనంతరం చిన విజయరామ మహా రాజు ప్రభువైనాడు. ఆయన ఆస్థానంలో సూరకవి ప్రభ బాగా ప్రకాశించింది. పెద్దాపురంలో ఒకప్పుడు రాజు లంతా చేరారు. వారితో వారి ఆస్థాన కవులూ వచ్చారు. సూరకవి తన ప్రభువు నిలా స్తుతించాడు.

ఉ॥ రాజు కళంకమూర్తి రతిరాజు శరీర విహీను డంబికా
రాజు దిగంబరుండు మృగరాజు గుహాంతర సీమవర్తి వి
భ్రాజిత పూసపాడ్వి జయరామ నృపాలుడు రాజుగాక యీ
రాజులు రాజులే పెను తరాజులు గాక ధరా తలంబునన్

ప్రతిరాజులోనూ ఏదో లోపం ఉంది. రాజు-చంద్రుడు -అతనిలో మచ్చ ఉంది. రతిరాజు మన్మథుడు-అతనికి శరీరం లేదు. అంబికా రాజు శివుడు ఆయన దిగంబరుడు. మృగరాజు సింహం- అది ఇల్లూ-వాకిలీ లేక గుహలో ఉంటుంది. కనుక ఈ రాజు లెవరూ రాజులు కాదు. మా విజయరామరాజు మాత్రమే రాజు. మిగతా రాజులంతా తరాజులే-అన్నాడు. పద్యం చదువుతూ, చెయ్యి ఊపుతూ ఉంటే తరాజులని తమనే నిర్దేశించాడని మిగతా రాజులకు కోపం వచ్చింది. ఆక్షేపణలు బయలుదేరాయి. అయితే వెంటనే సూరకవి లేచి · "అయ్యా ! నేను మిమ్మల్నెవరిని ఉద్దేశించలేదు. పద్యంలో మొదటి రెండు పాదాలలో చెప్పబడిన రాజులనే నేను అధిక్షేపించాను గాని, మిమ్మల్ని కాదు. ఈ రాజులలోని 'ఈ' పైవాటికే అన్వయిస్తుంది" అని చమత్కారంగా సమాధానం చెప్పి వారిని శాంతపరిచాడు. అంతటి ప్రతిభ సూరకవికే చెల్లింది.

## పిన్నవాడవు..!

తిరుపతి వేంకట కవులకు, కొప్పరపు సోదర కవులకు సాహిత్య యుద్ధం ప్రారంభమైన తరువాత అటువైపు కొందరు, ఇటువైపు కొందరు చేరి పద్యాలు, విమర్శలు ఎదిరిపై గుప్పించటం జరిగింది. ఆ ఊపులో వేలూరి శివరామశాస్త్రిగారు కల్లోలం రేపిన వారిలో ప్రముఖులు. తరువాతి కాలంలో పెద్దవారైన తరువాత గొప్ప యోగిగా, భక్తునిగా, నిష్పాక్షిక విమర్శకునిగా పేరు తెచ్చుకొన్నారు. యౌవనోద్రేకంలో గురువులను ఇతరులు ఎదిరించటం సహించలేక సోదర కవుల మీదికి కయ్యానికి కాలు దువ్వారు.

చం॥ తిరుపతి వేంకటేశ కవిధీరుల శిష్యుఁడ నాదు పేరు వే!
లురి శివరామశాస్త్రి యని లోకము వాకొను నాఢ్యమైన వ్యా
కరణము జీవనంబు అధికారము కావ్య పురాణ నాటకా
కరముల చేయబాలుదు నఖండము నాగ శతావధానమున్

కావ్యాలు, పురాణాలు, నాటకాలు అధ్యయనం చేశాను. వ్యాకరణం నాజీవనం, అఖండంగా శతావధానం చేస్తాను. తిరుపతి వేంకట కవుల శిష్యుణ్ణి" అని చెపుతూ కొప్పరవు సుబ్బరాయ కవి-సోరద కవులలో అగ్రజుని మీదకు దూకాడు. సువర్ణ ఘంటాకంకణ విభ్రాజితులై, ఆశుకవి చక్రవర్తులై, శతావధాని సమ్రాట్టులై, చండప్రచండులై, రంగమార్తాండులై, దుర్నిరీక్షులై వెలుగుతున్న సుబ్బరాయ కవి మీద చెప్పిన ఈ క్రింది పద్యం ఎంత దూకుడుగా ఉందో చూడండి.

ఉ॥ గంటలు కట్టు కొంటివట! గంటకు వందలు వేలు పద్యముల్
గెంటెదనంచు నేడు పరికించెద గెంటుట యెట్టిదో నినున్
గెంటెద నీ వధానమున గెల్చెద నీ రసధారయందు నీ
ఘంటిక లూడగొట్టెదను కాచుకొనం గమకింపు మిత్తరిన్

గంటకు నాలుగు, అయిదు వందల పద్యాలు చెప్పేవారని కొప్పరపు కవులను గూర్చి వావిలికొలను సుబ్బారావుగారి వంటి తపస్వి చెప్పారు. విరోధం వచ్చిన తరువాత ఆ ధోరణిని విమర్శించటం మొదలు పెట్టారు తిరుపతి వేంకటకవులు, వారి పక్షీయులు. శివరామశాస్త్రిగారు "నేను కూడా మీవలె చెపుతాను. మిమ్ము మించి మీ గంట లూడగొట్టిస్తాను'-అని ఇలా పద్యాలు రాసి, వాటి ప్రతులను గన్నవరంలో కొప్పరపు కవులు కవితా ప్రదర్శనకు వచ్చినచోట పంచిపెట్టారట! సభలో కలకలం బయలుదేరింది. అగ్రాసనాధిపతి ఒక ప్రతి తెప్పించి చూశారు. వేంకట సుబ్బరాయ కవికి ఆవేశం వచ్చింది. శివరామకృష్ణశాస్త్రిని చూసి పద్య వర్షం కురిపించారు. ఆ వాగ్ధాటికి తట్టుకోలేక శాస్త్రిగారు బయటికి వెళ్ళిపోతున్నారు. వెంటనే సుబ్బరాయుడుగారు చెప్పిన పద్యాలు చూండి !

గీ॥ రోసమున్న నిజంబైన మీసమున్న
పారిపోవంగ కూడదు పందవగుచు
ద్వైతవనమున పాండవోత్తముల చేత
సింధుపతి పడ్డ పాట్లు కాంచెదవు రమ్ము!

చం॥ తిరుపతి వెంకటేశ కవిధీరుల శిష్యుల మంచు చాటి మా
గురువులు వారటంచుననుకొన్న ప్రభాకరశాస్త్రి ముఖ్యు లి
ప్పురుసున దుర్వివాదముల పాలయి దుర్యశమున్ గడించిరే
హర హర! బాల్య చేష్ట విడనాడని నీ వొకరుండు దక్కగన్

రోషముంటే, మీసమంటే ఎదురు నిలబడు. పారిపోవద్దు. ఆనాడు పాండవుల చేతిలో సైంధవునికి పట్టిన గతి నీకు పడుతుంది. అయినా నీలాంటి శిష్యుడేగా ప్రభాకరశాస్త్రి! ఆయన ఇలా ప్రవర్తించాడా? దుర్వివాదాలు చేసి అపకీర్తి తెచ్చుకొన్నాడా? పిల్లతనం పోని నీ వొక్కడివి ఇలా ప్రవర్తిస్తున్నావు-అని భావం' వచ్చేవిధంగా పద్యాలు చెపుతూ ముక్తాయింపుగా కింది పద్యం చెప్పారు.

ఉ॥ ఆశలడంగి నీ గురుల యంతటి వా రెదిరింపలేక ఆ
వేశము దక్కియుండిరిక పిన్నవు కాగలవాడ విప్పు డే
ఆశు కవీంద్ర సింహముల కాగ్రహము కలిగింపబోకు వ
త్సా! శివరామశాస్త్రి! సుగుణాఢ్యుడవై యశమున్ గడింపుమా!

అప్పటికప్పుడు వచ్చిన ఈ పద్యంలో ఎంత కవితా సంపద ఉన్నదో గమనించండి. వత్సా! అనటంలో వాత్సల్యం. పిన్నవాడవు. కాగలవాడవు. ఇప్పుడే పెద్దలతో ఎందుకు? మేము సింహాలము. నీవు వత్సవు-దూడవంటివాడివి-అని శ్లేష. ఆశలడంగి నీ గురువులంత వారు- నీ గురువులైన తిరుపతి వేంకట కవులంతవారే మమ్మెదిరింపలేకపోయినారు. ఇక నీవెంత అని ఒక అర్థం, ఆశలడంగి-నీగు - తొలగు. ఉరుల యంతటివారు-మేరుపర్వతం వంటివారు-అని మరొక అర్థం.

## శాపమూ - అనుగ్రహమూను

అడిదము సూరకవి శాపానుగ్రహ సమర్థుడు. ఆయనంటే అంతా ఆ రోజుల్లో భయపడేవారు. ఆయనే తనను గురించి చెప్పుకొన్న పద్యం చూండి-

చం॥ గడియకు నూరుపద్యములు గంటము లేక రచింతు తిట్టగా
దొడగితినా పెటిల్లుమని దోర్లిపడున్ కులశైల రాజముల్
విడువ కనుగ్రహించి నిరుపేద ధనాధిపతుల్యు జేతునే
నడిదమువాడ సూరన సమాఖ్యుడ నా కొకరుండు సాటియే?

ఇందులోని శాపశక్తికి ఉదాహరణలను సూరకవి జీవితం నుంచి ఎన్నో చూపవచ్చు. ఒకసారి కోపంతో సరవయ్య అనే వ్యక్తి "వీణ్ణి పాంగరవ" అని తిట్టాడట! " ఆ పామే నిన్ను గరవ అయ్యో సరవా' ' అన్నాడట సూరన. వెంటనే పాము కరవటం, అవతలివాడు చావటం జరిగిందట.

అలానే ఒకరోజు ప్రయాణమధ్యంలో ద్వారపూడి అనే గ్రామంలో ఎండకు అలిసి మజ్జిగ ఇమ్మని నాలుగైదిళ్ళలో అడిగితే ఉంచుకొని కూడా వారు ఇవ్వలేదుట. దాంతో కోపగించి "దూరమైపోయెరా పాడి ద్వారపూడి" అనేప్పటికి ఆ సాయంత్రం ఊళ్ళో ఏ ఆవూ, గేదే పాలివ్వలేదట. సంగతి తెలుసుకొన్న గృహస్థులు వచ్చి ప్రార్థిస్తే శాపం తిప్పటం, మళ్ళీ మామూలుగా పశువులు పాలివ్వటం జరిగిందని కథ.

ఒకనాడు అడవిలో పోతుంటే బోయవాళ్ళు దోపిడీలు చేయటానికి వచ్చి ఎదుర్కొన్నారు.

అయితే వాళ్ళకు కంటిముందు హనుమంతునితో, సుగ్రీవునితో, లక్ష్మణునితో విల్లెక్కుపెట్టిన శ్రీరాముడు కనపడటం వారికి స్మృతి పోవటం జరిగాయి. ఆ తరువాత ఈ విషయం బయటికి వచ్చి రావురంగరాయణింగారు సూరకవిని అడిగారట. అప్పుడు కవిగారు చెప్పిన పద్య మిది -

మ॥ హనుమంతుండెదుటన్ దివాకరసుతం డా చెంత సౌమిత్రియున్
దను సేవింపగ జానకీ విభుడు వాత్సల్యంబుతో నిల్చి యిం
పున నన్నెప్పుడు గాచుచుండగను ఈ బోయాధముల్ కిన్కచే
నను జంపం గలవారె? రావుకులజన్మా! రంగరాయోత్తమా!

మరొక రోజు మరడాము గ్రామం దగ్గర తోటలో బసచేసి వంట చేసుకొని భోజనం చేయటానికి కూరాకుల మల్లయ్యను ఒక అరిటాకిమ్మని అడిగాడు. ఇవ్వకపోవటమేగాక వాడు చులకనగా మాట్లాడాడు. దాంతో ఆయనకి కోపం వచ్చింది. ఎదురుగా నుయ్యి కనిపించింది. నోటి వెంట శాపవాక్కు వెలువడింది. "కూరాకుల మల్లిగాడు కూలెన్ నూతన్" ఏతాము తోడుతున్న మల్లిగాడు ఆ నూతిలో కూలిపోయాడు. ఇటువంటి దృష్టాంతాలు చూసే "సూరకవి తిట్టు...సుత్తిపెట్టు" అని పుట్టింది. ఇది కూడా ఆయనే చెప్పాడో, ఎవరైనా చెప్పారో?

ఇంత కోపిష్టి మనిషి కూడా ఇష్టమైన వ్యక్తిని ఎంతైనా స్తుతించే లక్షణం గలవాడే.

శ్రీమంతుడైన ఒక మన్నె దొరను ఎంతగొప్పగా వర్ణించాడో పరికించండి-

కం॥ అర్బుదములు న్యర్బుదములు
బర్బర దేశాధిపతులు పడిగావులు నీ
దర్బారున బడియుందురు
దోర్బల సంపన్న! మన్నెదొర యెరకన్నా!

దేశాధిపతులు పడిగాపులు కాచేంత గొప్పవాడు కాదా దొర. అయితే అల్పసంతోషి అయిన సూరకవి నోటబడ్డాడు. అదృష్టం పండింది.

పాణుగుపాటి వెంకన్న మంత్రిమీద ఇత నొక శతకమే చెప్పాడుట. గొప్ప దాతయైన ఆ మంత్రి ఇతని మనసున కెక్కినవాడు. ఒక పద్యం చూడండి-

కం॥ చుక్కలవలె కర్పూరపు మొక్కలవలె నీదు కీర్తి ముల్లోకములన్
క్రిక్కిరిసి పెక్కుటిల్లెను.
వెక్కసముగ పాణుగుపాటి వెంకనమంత్రీ !

బొబ్బిలిలో సూరకవి ఒక సమస్య ఇచ్చారు. "మీరును మీరు మీరు మరి మీరును మీరును మీరలందరున్" తనను విమర్శించే వారికి తగిలి వచ్చేట్లు దాన్నిలా పూరించాడు.

ఉ॥ సారతర ప్రబంధములసంఖ్యముగా నొనరించునట్టి యీ
సూర కవీంద్రునిన్ జుణిగి చూతమటంచును మాటిమాటికిన్
ఈరసమెత్తి దుష్కృతుల నిచ్చినవారలనోరు మొత్తుడీ..

మహాప్రబంధ నిర్మాత అయిన సూరకవిని విమర్శించే వారి నోళ్ళమీద మొత్తండి - అని భావం.

ఇంతటి సూరకవీ-చమత్కార ప్రియుడే. ఇంట్లో వాళ్ళావిడ కొడుకుమీద పద్యం చెప్పమని అడిగింది. "అందరి మీదా చెవుతారు, అబ్బాయిమీద మాత్రం ఒకటి చెప్పరాదా" అన్నది. కొడుకు భాస్కరుడు-బాచన్న-కొంచెం కురూపి. ఫక్కున నవ్వి సూరన ఇలా అన్నాడు.

కం॥ బాచా బూచులలోపల
బాచన్నే పెద్ద బూచి పళ్ళుం దానున్
బూచంటే రాత్రి వెరతురు
బాచన్నను జూచి పట్టపగలే వెరతుర్.

బూచి అని పిల్లలను భయపెడతారు-వికృతంగా ఉండే దయ్యం అని. బూచి, బాచన్నలలో బాచన్నే పెద్ద బూచిట! ఎందుకంటే రాత్రులు మాత్రమే బూచంటే భయపడతారు. వీడిని చూసి పగలే భయపడతారు. అని.

## ఆశుకవితా నిరసనం

పీఠాపురం సంస్థానంలో ఆస్థాన కవిగా ఉంటూ రాజావారి అభిమానానికి ఎంతగానో పాత్రులైనవారు శ్రీ పానుగంటి లక్ష్మీనరసింహారావుగారు (1865-1940). వారు రచించిన పాదుకా పట్టాభిషేకం, రాధాకృష్ణ, కంఠాభరణం వంటి నాటికలు రంగస్థలంపైన ఎన్నోసార్లు ప్రదర్శితాలై, బహుళ ప్రజాదరాన్ని పొందినవి. అయితే ఇప్పటికి ఎక్కువగా జనుల నోళ్ళలో నానేవి వారి 'సాక్షి' వ్యాసాలు. ఆంగ్లలోని స్పెక్టేటర్-పద్ధతిలో సమకాలీన సమాజాన్ని విమర్శిస్తూ లోపాలెత్తి చూపుతూ వారు రాసిన ఈ గ్రంథాలు, ఆ రోజుల్లో సంఘంలో దుమారాన్ని రేపాయి. రచయితలలో ఒక్కొక్కళ్ళకు ఒక్కొక్క ప్రవృత్తులుంటాయి. నాటకాల్లో, సభల్లో పద్యాలను పాడి పాడిగా చదవాలే గాని, సంగీతంతో రాగయుక్తంగా చదవరాదని పానుగంటి వారి అభిప్రాయం. కవిత్వాన్ని మింగేసే మితిమీరిన, శ్రుతిమించిన సంగీతాన్ని విని, నాటకాల్లో మైలు పొడుగు రాగాలు తీసే నటులను చూసి అటువంటి అభిప్రాయం ఏర్పడి ఉంటుంది. అలాగే ఆశుకవిత్వంమీద కూడా కొన్ని వింత అభిప్రాయాలేర్పరచుకొన్నారు. అయినా అడపాదడపా చాటువులు ఆశువుగా చెప్పినవారే. ఒక మాటు రాజావారి దివాణంలో ప్రఖ్యాత వైణికులు సంగమేశ్వరశాస్త్రిగారి కచ్చేరి జరిగింది. గానానంతరం రాజావారు శాస్త్రిగారిని మెచ్చుకొని సత్కరించారు. అప్పుడు పానుగంటివారు లేచి రాజావారి కళాభిమానాన్ని సహృదయతను ప్రశంసిస్తూ ఒక చక్కని పద్యం ఆశువుగా చెప్పారు.

సీ॥ స్వజను ల నే రీతి పరిపాలన మొనర్తు వాశ్రితు నెవ్వాని నాచరింతు
వాదాయమున నెంత యర్థుల కిచ్చెద వె దెటు చేసిన భృత్యు నెద గణింతు
వవని పాలన నేది యార్జించినాడవు కవిత గానంబు నే పవిది విందు
వెట్లుగా పృథుసౌఖ్య మీక్షింపగా నుంటి వాత్మ సంస్తుతుల కేమందువయ్య !
గీ॥ సరిగ ధని సగమ పనిని సరిగ గరిమ మరి మరిగ పాప నినిగని సరి సరి యను
వీణ కాని 'మా' వెనక్క 'నే' వీణ వరుస మీద 'నీ' వెనక్క 'మా' సూర్యమేది నీశ !

సీస పద్యంలోని ఎనిమిది ప్రశ్నలకు ఎత్తుగీతిలో వీణాస్వర విన్యాసంతో జవాబు లిచ్చారు. యథా సంఖ్యంగా ఈ వీణ 'మా' వెన్క 'నీ' అంటున్నది. కానీ నీ వెనక 'మా' ఉంటుంది. మా అంటే లక్ష్మి అని ఇందులో చమత్కారం.

ఆ రోజుల్లో కవులు జంటలుగా ఏర్పడి ఆశుకవిత్వం చెప్పటమూ, అవధానాలు చేయటమూ ఎక్కువగా ఉండేది. వేగంగా చెప్పటం కోసం ఎలా పడితే అలా చెపుతారనే దురభిప్రాయం బాగా ఏర్పడి కంఠాభరణ నాటకంలో రామలక్ష్మణులనే ఇద్దరు సుబ్బిసెట్టి అనే వర్తకుని దగ్గరకు వెళ్ళి ఆశుకవిత్వం చెప్పటం అనే ఘట్టాన్ని హాస్య ప్రధానంగా సృష్టించారు. వారిద్దరూ అతనిమీద ఎన్నో పద్యాలు చెప్పారు. అయినా సెట్టిగారు పట్టించుకోలేదు. అప్పుడు వారిలా చెప్పారట.

రాముడు: శ్లేష్మి! శ్లేష్మీ! యనుచును
శ్లేష్మముగా బల్కినాము చెలువుగ లలితో
మేష్టీరు వగుదువు సెట్లకు
నుష్మగ శ్రీ సుబ్బిగుప్త ! సుకవుల తృప్తా!

లక్ష్మణుడు:
కం॥ బచ్చుండవు నెరదాతల
మచ్చుండవు శత్రువులకు మహితజ్వాలా
చిచ్చుండవు కవివర్యుల
మెచ్చుండవు మేటి సుగుణవుట్టీ! సెట్టీ!

సెట్టిగారు కష్టంమీద ఒక బేడ ఇచ్చారట! మళ్ళీ కవులిలా అన్నారట.

కం॥ తోడా లివ లేవో గుడి
ఘోడాయే నివ్వలేవా? కొమరుగ దలపన్
బోడెమ్మ చాకలికి వలె
బేడా యిచ్చెదవు దూడ పేడా? అరయన్

ఈ పద్యం విని వర్తకునికి కోపం వచ్చింది. మా ఉత్సవాల ప్రోగ్రాంలో మీ పేరు లేదు పొమ్మన్నాడు. మళ్ళీ వెంటబడుతూ కవులిలా పలికారు.

కం॥ ఉగ్రము పూనెదవేలా?
ప్రోగ్రాం కాగితములోన పేరి జేర్చితివా?
కుగ్రామ వాస మమ్ముల
నిగ్రహలము లోకమెరుగ నీ సిగదరగా!

విసిగి సెట్టి రెండు రూపాయలిచ్చి "ఇక పొండి" అన్నాడు. తృప్తి చెందని కవులు మళ్ళీ పద్యం చెప్పారు.

కం. రెండిచ్చితి రెండిచ్చితి
మెండిచ్చితి పొండటంచు మేలంబేలా
కండూయ మానదేహా!
మండూకము వంటి కంఠ! మరి మరి శుంఠా!

ఇలా సాగుతుంది నాటకం. ఆశుకవిత్వమంటే, ఆశుకవు లంటే వారి కున్న చులకనభావం ఈ ఘట్టంలో స్పష్టంగా కనిపిస్తుంది. బహుశా పానుగంటి వారికి కలిగిన అనుభవాలటువంటి కావచ్చు.

## తాంబూల భోగం

ఒకసారి కవితాప్రియులైన మిత్రులు కొంతమంది సరదాగా కబుర్లు చెప్పుకొంటున్నారు. అందులో ఒక రిద్దరు పద్యాలల్లే వాళ్ళు కూడా ఉన్నారు. సాహిత్యంలోని చమత్కారాలను గురించి చర్చ వచ్చింది. ఎన్నో రసవత్తర విషయాలు దొర్లిపోతున్నవి. ఇంతలో ఒకడు లేచి అందమైన కంద మొకటి అన్నాడు.

కం. పండిన దెండిన దొక్కటి
ఖండించిన పచ్చి దొకటి కాలిన దొకటై
తిండికి రుచియై యుండును
ఖండితముగ దీని తెల్పు కవియుం గలడే!

మరొక్కడు లేచి " సరే,అదేదో ఆలోచించి చెప్పవచ్చు. అయితే చెప్పేవాడు కవి కావాలని ప్రాశ్నికుడంటున్నాడు. అతను కవి కావచ్చు. కాని సమాధానం కూడా పద్యంలోనే చెప్పాలా? చెప్పేవాడు కవి కావాలా? ఇదేమిటయ్యా" అన్నాడు.

" కవి అంటే పండితుడని అర్థం ఉంది. " కవిర్మనీషీ పరిభూ స్స్వయంభూ" అని కదా! ఆ అర్థం తీసుకుంటే సరిపోతుంది. ఇంతకూ ఆ పద్య గత భావమేమిటో విడగొట్టండి" అని ఇంకో మిత్రుడన్నాడు.

అప్పుడు వేరొక కవి మిత్రుడు లేచి " నేనూ ఒక పద్యం చెపుతాను. దాన్ని కూడా వివరించాలి' ' అంటూ చదివాడు.

**"కం. శిల వృక్షలతల బుట్టిన**
**చెలువలు ముప్వురను గూడి చిడిముడి పడుచున్**
**తలవాకిట రమియింతురు**
**సలలితముగ దీని నెరుగు నరసుడు కలడే?**

వారిలో సూక్ష్మగ్రాహియైన విద్వాంసుడు లేచి ఈ రెండు పద్యాల పరమార్థం ఒకటేనని ఇలా వివరించాడు.

పండినది, ఎండినది = పోక(వక్క): ఖండించిన పచ్చిది= తమలపాకు, కాలినది= సున్నం. ఈ మూడూ కలిపితే తాంబూలం అయి రుచిగా ఉంటుంది.

అదే విధంగా శిల నుంచి పుట్టింది= సున్నం, వృక్ష జనితం= వక్క, లతనుంచి పుట్టింది = తమలపాకు. ఈ ముగ్గురినీ కాంతలతో పోల్చి చమత్కారంగా తలవాకిట= నోటిలో ; రమియింతురు= కలుస్తారు. మూడూ కలిస్తే తాంబూలమై రాగరసం ఉదయిస్తుంది.

అయితే తాంబూలమంటే ఇంతమాత్రమే కాదు. దీనిలో ఎన్నో విలువైన సుగంధద్రవ్యాలు చేర్చి శ్రీమంతులు,రాజన్యులు వాడుకొనేవారు- స్వచ్ఛమైన కస్తూరి, పచ్చకర్పూరం, జాజికాయ,జాపత్రి మొదలైనవి. అల్లసాని పెద్దన మనుచరిత్రలో తాంబూలాన్ని గురించి ఒక గొప్ప విశేషం చెప్పాడు. ప్రవరుడు హిమాలయంలో దారితప్పి పోతుంటే అతనికి ఒక సువాసన సోకింది.అది తాంబూలపు తావి. దాన్ని బట్టి దూరాన ఎక్కడో ఒక స్త్రీ ఉన్నదని తెలిసింది. ఎందుకంటే అది ఆడుదాని పొలకువ తెలిపే గాలి. ఆ పద్యం చూడండి.

**కం: మృగమద సౌరభ విభవ**
**ద్విగుణిత ఘనసార సాంద్ర వీటీ గంధ**
**స్థగితేతర పరిమళమై**
**మగువ పొలుపు దెలుపు నొక్క మారుత మొలసెన్**

దీన్ని బట్టి తాంబూలాల్లో ఆడ తాంబూలం వేరు, మగ తాంబూలం వేరు అని తెలుస్తున్నది. ఈ భేదం ప్రబంధకాలంనాటి రసికులకు బాగా తెలుసు. స్త్రీల వాటిలో మృగమద సౌరభ విభవ ద్విగుణిత ఘనసారముంటుంది. అంటే కస్తూరి ఒక పాలైతే పచ్చకర్పూరం రెండు పాళ్ళన్న మాట. మగవాళ్ళు వేసుకొనే తాంబూలంలో ఆ నిష్పత్తి వ్యత్యస్తంగా ఉంటుంది. అంటే కస్తూరి రెండు పాళ్ళు కర్పూరం ఒక పాలు కస్తూరీ కర్పూరాలు ఆ మోతాదుల్లో వేసుకొని తాంబూలం సేవించటంచేత స్త్రీ పురుషులకు కావలసిన భిన్నశక్తి పుష్టి కలుగుతుందిట!

అయితే ఎటువంటి తాంబూలమైనా గాజులు గలగలలాడే చేత్తో ఇస్తేనే మంచి కవిత్వం వస్తుందని పెద్దన అంటాడు.

చ. **నిరుపహతి స్థలంబు రమణీప్రియదూతిక తెచ్చి యిచ్చు క**
**ప్పురవిడె మాత్మ కింపయిన భోజన ముయ్యెల మంచ మొప్పు త**
**ప్పరయు రసజ్ఞు లూహ తెలియంగల లేఖక పాఠకోత్తముల్**
**దొరకిన గాక! యూరక కృతుల్ రచియింపు మటన్న శక్యమే?**

ఎప్పుడు పడితే అప్పుడు కవిత్వం రాదు. ఇష్టమైన భోజనం,రమణీప్రియ దూతిక అందించే తాంబూలం ఆపైన ఉయ్యాల మంచం, ఎదురుగా రసికులు, లేఖకులు ఉంటే ఆ పారవశ్యంలో వస్తుందట. కవిత్వ శృంగార కళానుభవాలన్నింటికి తాంబూలంతో సన్నిహిత సంబంధం ఉందని ప్రాచీనులు భావించేవారు. ఏమైనా వారి రాగభోగాలు గాఢమైనవి.

## వీటీ రసేన....

క్రీడాభిరామంలో గోవింద మంచనశర్మ, టిట్టిభసెట్టి పూటకూళ్ళమ్మి ఇంటివైపు వెళుతుంటే ఎదురుపడ్డ వ్యక్తిని చూసి ఇలా అనుకొన్నారు.

ఉ: వీడిదె తెల్ల నాకులను వీడెము సేయుచు నిట్లు వచ్చుచు
న్నాడు మదించి తిండి తినినాడు సుమీ యిటమీద నేడకో
తేడగ బోయెడిన్ కరణ దేశపు జాణడుగాగ నోపు నీ
బాడు పణోపహార పరిపాటి యెరుంగగవచ్చు వీనిచేన్

ఆ కరణ దేశపు జాణడు కమ్మగా కడుపునిండా తిని, తాంబూలం వేసుకొని వస్తున్నాడు. దాన్ని తెల్ల నాకులు వేసుకొని వస్తున్నాడంటాడు రచయిత. లేత ఆకుపచ్చ రంగుతో మిసమిసలాడే తమలపాకులను తాంబూలానికి ఇష్టపడతారు తెలుగువారు. ఎన్ని తిన్నా రుచిగా ఇంకా కావాలనిపించేలా ఉంటాయవి. వాటిని రాయలసీమలో తెల్లాకులు అంటారు. నల్లాకు వేరే ఉంది. అదీ తమలపాకే.అయితే చాలా ఘాటుగా ఉంటుంది. కింద తరగతి పనివారు నల్లాకు, కొంచెం సున్నం నలిపి,ఒక వక్కతో కలిపి నోటిలో పెట్టుకొని, ఆ ఘాటు ననుభవిస్తూ ఆకలి తెలియకుండా మధ్యాహ్నం దాకా పనిచేస్తుంటారు. తమలపాకులతో - ముఖ్యంగా తెల్లాకులతో వ్యాపారం చేసేవారే తెల్లాకుల ఇంటి పేరుతో ప్రసిద్ధ కుటుంబాలు గుంటూరు ప్రాంతంలో ఉన్నాయి.

పెద్దన రమణీప్రియ దూతిక తాంబూలం ఇస్తుంటే తీసుకోవాలంటే, భర్తృహరి ప్రియురాలికి తెల్లనాకులను గోళ్ళతో తుంచి ఇవ్వటం అదృష్టం అంటాడు.

చం: శిల మొన మూలమున్ దునిమి చెన్నగు వేణు కరీర కాంతిచే
లలితములైన దర్భ కబళంబులు లేళ్ళకు నిమ్ము కానలో
కలిత వయోంగనా మృదులగండ సుపాండుర నాగవల్లికా
దళములు గోళ్ళ ద్రుంచి వనితాతతి కైన నొసంగు మిమ్ములన్

-ఏనుగుల లక్ష్మణకవి అనువాదం

జీవితంలో రెండే మార్గాలు- అడవిలో తపస్సు చేసుకోవటం, లేదా సుందరులతో శృంగారానుభవం- ఈ మాటనే వక్రోక్తితో అడవిలో లేళ్ళకు దర్భలందివ్వు లేకపోతే ఇంట్లో ప్రియురాలికి గోళ్ళతో తుంచి తమలపాకు లందివ్వు - అని భర్తృహరి రమణీయంగా పలుకుతాడు

అయితే మహారాజులు, మహామంత్రులు కవి పండితులు, వీరులకు తాంబూలం ఇవ్వటం ఉంది. తెనాలి రామకృష్ణుడా దృశ్యాన్ని అద్భుతంగా వర్ణించాడు.

మః పలుకుం దొయ్యలి మోవికాంతికెన యౌ బాగాలు నయ్యింతి చె
క్కుల బోలుం దెలనాకు ల య్యువిద పల్కుల్ వంటి కప్రంపు ప
ల్కులతో గూడిన వీడియం బొసగె నాకున్ పద్మనాభా ర్చనా
కల నా పావన హస్త కంకణ ఝుణత్కారంబు తోరంబుగన్

సరస్వతి పెదవి కాంతితో తులతూగే వక్కలు, ఆమె చెక్కుల వంటి తెల్లాకులు, ఆమె పలుకులవంటి కర్పూరపు పలుకులతో వేదాద్రి మంత్రి హస్తకంకణాలు ఝుణ ఝుణ నినదిస్తుండగా వీడియ మిచ్చాడు. మగవారు కూడా ఆ రోజుల్లో కంకణాలు ధరించేవారు.

ఈ తెల్లాకులే కాక పచ్చని పండుటాకులు వాడటం కొన్నిప్రాంతాలలో ఉంది. సరస్వతి తెల్లగా ఉంటుంది గనుక ఆమె చెంపలను తెల్ల నాకులతో పోల్చాడు తెనాలి కవి. మామూలుగా స్వర్ణవర్ణంగా ఉండే కాంతల కపోలాలను తమలపాకులతో పోల్చటం సాహిత్యంలో ఉంది. కొన్ని ప్రాంతాల్లో పెద్ద ఆకులతో ఒక జాతి తమలపాకు పండితే బంగారు రంగు తిరిగి చాలా రుచిగా ఉంటుందిట.

ఒక ప్రౌఢురాలి ఇంటికి ఇద్దరు రసికులు వెళ్ళారు. ఆతిథ్యమర్యాదలైన తరువాత తాంబూల సేవనం జరిగింది. అప్పుడు వారిలో ఒకడిలా అన్నాడు.

శ్లో: చూర్ణ మానీయతాం తూర్ణం పూర్ణచంద్ర నిభాననే!

"పున్నమిచంద్రుని వంటి ముఖం కలదానా! కొంచెం సున్నం తెచ్చిపెట్టు"

రెండవ వాడిలా అన్నాడు.

పర్ణాని స్వర్ణ వర్ణాని కర్ణాంతాయత లోచనే!

"చెవులదాకా విస్తరించిన పెద్ద కన్నులదానా! బంగారు రంగుగల ఆకులు తెచ్చిపెట్టు'.'

ఆ చతురురాలు రెండూ తెచ్చి ముందు రెండోవానికి ఆకులిచ్చి, తరువాత మొదటివానికి సున్నమిచ్చింది.

మొదటివాడు ' నేను ముందడిగితే అతనికి ఆకులు ముందెందుకు ఇచ్చా'వన్నాడు.

ఆమె నవ్వుతూ అతను ఒక అణా ఎక్కువిచ్చాడన్నది. నిజమే మరి! రెండవవాడు చెప్పిన శ్లోకభాగంలో ఒక 'ణ' ఎక్కువగా ఉంది. ఇది అణాలున్న కాలంలో పుట్టిన శ్లోకమై ఉంటుంది. మొత్తంమీద తాంబూలానికీ, రాసిక్యానికీ, కవిత్వానికీ ఎంతైనా దగ్గరి సంబంధమూ, అనుబంధమూ.

కాళిదాసంతటి మహాకవి కూడా పరమేశ్వరిని ప్రార్థిస్తూ

"కవిత్వ పరిపాటి మగాధిపసుతా,ఘోటీకులా
దధిక ధాటీ ముదారముఖ వీటీ రసేన తనుతాం" అన్నాడు.

హిమశైల పుత్రిక తాను వేసుకొన్న తాంబూలపు రసంతో నా కవిత్వాన్ని గుఱ్ఱంలాగా కదనుతొక్కించునుగాక - అని ప్రార్థించాడు. గొప్ప వీడెపు శక్తి అటువంటిది.

## హయవిలాసం

మోచర్ల వెంకన్న గొప్ప ఆశుకవి. ఆయన వెంకటగిరి సంస్థానంలో సమస్యలను ఆశువుగా పూరిస్తుంటే ఇచ్చిన సమస్యలలో ఒకటి " గుఱ్ఱానికి నైదు కాళ్ళు కోడికి వలెనే" దాన్ని ఆ కవి ఇలా పూరించాడు.

కం: మఱ్ఱాకు పాన్పుగా గొని
బొఱ్ఱన్ బ్రహ్మాండ పంక్తి బూనిన ముద్దుం
గుఱ్ఱడ! విను- వన్నెలు గుహు
గుఱ్ఱానికి నైదు కాళ్ళు కోడికి వలెనే.

మొదటి భాగం విష్ణువు సంబోధన, మర్రియాకు మీద పడుకొన్న ఓ బాలముకుందా! విను. కుమారస్వామి వాహనమైన నెమలికి వన్నె లైదు. కాళ్ళుమాత్రం కోడికున్నట్లే. ఇక్కడ గుహుగుర్రం అంటే కుమారస్వామి వాహనమని అర్థం. గుర్రం ప్రాచీనకాలంలోసామాన్య వాహనం కావటంచేత ఆ శబ్దము దాని పర్యాయపదాలైన అశ్వం, వాజి మొదలైనవి వాహనమనే అర్థంలో వాడేవారు. భారతంలో ఇంద్రుడు జలగర్భమైన అగ్నిని వాజిగా గలవాడు అని వర్ణించారు. ఇరమ్మదాగ్ని ఇక్కడి సంకేతం (గుర్రం ఆకారంగల అగ్ని-సముద్ర జలంలోనిది. ఔర్వాగ్ని మరొకటి కూడా ఉంది.)

యోవాజినం గర్భ మపాం పురాణం
వైశ్వానరం వాహన మభ్యుపైతి
నమోస్తు తస్మై జగదీశ్వరాయ
లోక త్రయేశాయ పురందరాయ - ఆదిపర్వము

మన వాఙ్మయంలో గుర్రం జ్ఞానానికి సంకేతంగా అనేక సందర్భాల్లో కనిపిస్తుంది. వేదాలను దొంగిలించిన రాక్షసుడు హయగ్రీవుడు. వాణ్ణి సంహరించిన విష్ణువూ హయగ్రీవుడే. ఆ ఆకృతిని ధరించటంలో విశేషం ఉంది. మంత్రశాస్త్రంలో హయగ్రీవుని జ్ఞానదాతగా వర్ణించారు.

శ్లో: జ్ఞానానందమయం దేవం నిర్మల స్ఫటికాకృతిం
ఆధారం సర్వ విద్యానాం హయగ్రీవ ముపాస్మహే.

బ్రహ్మాండ పురాణంలో అగస్త్యునికి లలితా తత్వోపదేశం చేసింది హయగ్రీవుడే. అశ్వమేధంలో కూడా అశ్వం జ్ఞానశక్తికి ప్రతీక. భాగవతంలో ఒక చిత్రమైన కథ ఉంది. దధీచి బ్రహ్మ విద్యానిష్ఠుడైన మహర్షి. ఇంద్రుడా విద్యకోసం మహర్షిని ఆశ్రయించాడు. దధీచి త్రిలోకాధిపతికి ఆ విద్యను ఉపదేశించాడు. తాను నేర్చుకొన్న తరువాత ఇంద్రుడికి అంతటి మహావిద్య ఇతరులెవరికీ తెలియకూడదు అని, అనిపించింది. మరెవ్వరికైనా చెపితే శిరస్సు ఖండిస్తానని దధీచిని బెదిరించి వెళ్ళిపోయాడు. కొన్నాళ్ళకు అశ్వినీ దేవతలు వచ్చారు. వాళ్ళకు బ్రహ్మజ్ఞానం మీద ఆపేక్ష కలిగి దధీచిని ప్రార్థించారు. మహర్షి పరిస్థితి వివరించారు. అప్పుడు అశ్విను లొకమార్గం చెప్పారు.

“విద్య చెపితే తల నరుకుతానని గదా ఇంద్రుడు చెప్పింది. నరికితే చచ్చిపోతానని మీరు భావిస్తున్నారు. అలా కాకుండా మేము మీ తలనరికి దాచిపెడతాము. ఒక గుర్రం తల మీకు పెడతాము. మీరు మాకు బ్రహ్మజ్ఞానం ఉపదేశించండి. ఇంద్రుడు వచ్చి మీ తల నరికి వెళ్తాడు. అప్పుడు మేము వచ్చి మీ అసలు తల అతికిస్తాము.” దధీచి అంగీకరించాడు.

ఆవిధంగా దధీచి హయగ్రీవుడై బ్రహ్మోపదేశం చేశాడు.

కాళిదాసు “ఘోటీకులా దధిక ధాటీం కవిత్వ పరిపాటీం”- గుర్రంవలె కదనుతొక్కే ధాటి గల కవిత్వ మిమ్మని ఖేటేశ్వరియైన పరమేశ్వరిని ప్రార్థించాడు.

ఆధునికులలో మహాపండితుడైన బెల్లంకొండ రామారావుగారు హయగ్రీవోపాసన చేసి విద్యాప్రాప్తిని పొందినట్లు చెప్పుకొన్నారు. మేరుతంత్రంలో అశ్వారూఢ అని ఒక దేవతను గురించి ఉంది. సకలాభీష్ట ప్రదాయినిగా ఆమెను ఆరాధిస్తారు. అంతర్వేది పుణ్యక్షేత్రంలో గుర్రాలక్క అమ్మవారి గుడి ఉంది. ఆమెను గురించి కవులు బాగా వర్ణించారు. గోదావరి జిల్లా శివకోడు వాస్తవ్యులు శ్రీ నున్న సత్యప్రసాదరావు గుర్రాలక్క శతకం రాశారు. అందులో పద్యాలు చూడండి.

కం. **అంతర్వేది క్షేత్ర**
**మ్మెంతయు ప్రాశస్త్య మొంది యొసగుట కీ వే**
**యెంతైన కారణంబగు**
**కుంతీసుత రక్షకసఖి! గుర్రాలక్కా!**

కం. వరకల్కి రూపుడగు హరి
వరణీ యాశ్వంబుపైన వరలెడు భంగిన్
వరదాత్రి ! నీవు హయమున
గురుతరముగ వరలుచుంటి గుర్రాలక్కా!

కల్కి అవతారంలోవిష్ణుమూర్తి గుర్రమెక్కి వస్తాడని పురాణ వాక్కు. ఈ దేవత కూడా అలాంటిదేనట.మొత్తంమీద మన సాహిత్యంలో గుర్రం శక్తికీ, జ్ఞానానికీ సంకేతంగా దర్శనమిస్తూంది. పాశ్చాత్య వాఙ్మయంలో కూడా ఇటువంటి లక్షణాలే ఉన్నాయి. పెర్సియస్ అనే వీరుడు సంహరించిన మెడూసా అనే రాక్షసి రక్తం నుంచి పెగేసస్ అనే గుర్రం పుట్టింది. దాని కాలు హెలికాన్ పర్వత శిఖరానికి తగలగా అక్కడ ఒక నీటి ఊట పుట్టింది. దానికి గుర్రం ఊట అని పేరు. ఆ నీళ్ళు తాగిన వారు మహాకవులవుతారని అంటారు. ఆ పెగేసస్‌గుర్రమే అశ్వినీ నక్షత్రంగా ఉందట!

## కవితా లక్షణం

కవిత్వం ఏవిధంగా ఉండాలి అనే అంశంమీద తెలుగు కవుల్లో చాలామంది చక్కని కవిత్వం చెప్పారు. ప్రబంధకవులలో పెద్దన్న అయిన పెద్దన ఇలా అన్నాడు.

చం. ఘనతర ఘూర్జరీ కుచయుగక్రియ గూఢముగాక ద్రావిడీ
స్తనగతి తేటగాక అరచాటగు నాంధ్రవధూటి చొక్కపుం
జనుగవబోలె గూఢతయు చాటుదనంబును లేకయుండ చె
ప్పిన నదె పో కవిత్వ మనిపించు నగించటు కాక యుండినన్

ఘూర్జర కాంతలు వక్షోజా లసలు కనపడకుండా నిండుగా కంచుకం తొడుక్కుంటారు. కవిత్వం అంత గూఢంగాలోపల ఏమున్నదో తెలియకుండా ఉండకూడదు. ఇక ద్రవిడాంగన లున్నారు. వారసలు కంచుకం తొడుక్కోరు. పైట కూడా వేసుకోరు. (పయ్యెదయు సిగ్గు పాలిండ్ల బ్రాకనీరు,కంచి అరవతలసమాస్త్ర ఖడ్గలతలు' అని శ్రీనాథుడుకూడా అన్నాడు). కవిత్వం మరీ అంత బట్టబయలుగా ఉండకూడదు. (ఇప్పుడు ద్రావిడాంగనల వేషం మారిపోయింది. ఎక్కడో కుగ్రామాలలో పూర్వపు తీరు ఉండవచ్చు) ఆంధ్ర స్త్రీలు రవికలు వేసుకొంటారు. పైట వేసుకొంటారు. అయినా అత్యంతాకర్షణీయంగా ఉంటారు. కవిత్వం అలా ఉండాలి. లేకపోతే నగుపాటు పాలవుతుంది. అనుభవజ్ఞుడైన పెద్దనగారు ఇలా చెపితే పుత్తేటి రామభద్రకవి సకల కథాసార సంగ్రహంలో ఇటువంటి పద్యాన్నే రచించాడు.

చం. అరవత గుబ్బ చన్వలె బయల్పడనీకను ఘూర్జరాంగనా
గురు కుచ యుగ్మముంబలె నిగూఢము గాకను ఆంధ్రదేశ పుం
గరిత చనుంగవంబలె ఒకానొక యించుక కానిపించినన్
సరసులు మెత్తు రక్కవిత జాణలకున్ కడు రంజకంబగున్

పదముల పోహళింపులో మార్పేగాని భావం రెండింటిలోనూఒకటే. ఈ రామభద్రుని ఇంటిపేరు అయ్యలరాజా, పుత్తేటియా- అనే సందేహం ఒకటి అందరిలో ఇంకా ఉంది.

కాశీఖండంలో శ్రీనాథుని సంబోధిస్తూ వేమారెడ్డి ఇలా అన్నాడు.

ఈక్షోణిన్ నినుబోలు సత్కవులు లే రీ నేటి కాలంబునన్
దక్షారామ చళుక్య భీమవర గంధర్వాప్సరోభామినీ
వక్షోజద్వయ గంధసారఘుసృణద్వై రాజ్యభారంబు న
ధ్యక్షించున్ కవిసార్వభౌమ భవదీయ ప్రౌఢ సాహిత్యమున్

కవిసార్వభౌముని సాహిత్యం దక్షారామంలోని అప్సరసల ఉత్తుంగస్తన కుంకుమ చందన సామ్రాజ్యాన్ని అధ్యక్షించేదట. కవిత్వానికీ, కాంతల పయోధరాలకూ సన్నిహిత సంబంధాన్నే భావించారు వారంతా.

విద్యా వివాదానికై విజయనగరానికి వెళ్ళినప్పుడు అక్కడి ముమ్మకవితో శ్రీనాథుడు చెప్పిన పద్యంలో ఒక గొప్ప విశేషం ఉంది.

సీ. పంపా విరూపాక్ష బహుజటాజూటికా రగ్వ ధప్రసవ సౌరభ్యములకు
తుంగభద్రా సముత్తుంగ వీచీఘటా గంభీర ఘుమఘుమారంభములకు
కర్ణాటకామినీ కర్ణహాటక రత్న తాటంక యుగధాళధళ్యములకు
కళసాపుర ప్రాంత కదళీ వనాంతర ద్రాక్షాలతా ఫల స్తబకములకు

గీః నిర్ణిబంధ నిబంధమై నెనయు కవిత తెలుగునను సంస్కృతంబున బలుక నేర్తు
ప్రౌఢ దేవేంద్రరాయ భూపాల వదుని సమ్ముఖంబున దయజూడు ముమ్మ సుకవి!

ఈ పద్య సీస పాదాల్లో పంపా విరూపాక్షుని జటలలో అలంకరించే రేలపూల వాసనలూ, తుంగభద్రానదిలోని ఎత్తైన అలల ఘుంఘుమ నాదాలూ,కన్నడ కామినుల చెవుల కమ్మల్లోని రత్నాల ధళధళలు,కళసాపుర ప్రాంతంలోని అరటి తోటల్లోని ద్రాక్షపళ్ళ రుచులు తన కవిత్వంలో ఉంటాయని చెప్పాడు. అంటే కవిత్వానికి - తావి,నాదం, కాంతి, రుచి ఉంటాయని గ్రహించాలి.

కవిత్వం సహజంగా లలితంగా ఉండాలి. ఎప్పుడైనా అవసరమైతే కొంచెం కాఠిన్యం ఉండవచ్చు. అయితే అది ఎంతవరకంటే " సూనాస్త్ర ప్రమదా మదస్ఫురిత వక్షోజాత కాఠిన్య'స్థితిని దాటకూడదు. రతీదేవి పొంగిన స్తనాల గట్టిదనంవరకు పరవాలేదట.

పెద్దన గారి మాటలలో చెపితే-

"చేతి కొలంది కౌగిటను జేర్చిన కన్నియ చిన్ని పొన్ని మే
న్మాతల చన్నుదోయివలె ముచ్చట గావలె పట్టి చూచినన్"

ఇప్పటివారికి ఈ ఉపమానాలు కొంత ఎక్కువ శృంగారంగా, మితిమీరిన కాముకత్వంగా కనిపించవచ్చు. కాని అప్పటి వారి కవి సహజాలు. వారి యోగభోగాలు రెండూ మోతాదు మించినవే.

## చమత్కార చాటువులు

చమత్కార చాటువులలో చిత్ర రచనా సమన్వితమైన వాటిని కొన్నింటిని ఇంతకు ముందు చూశాం. అటువంటివే మరికొన్ని పరిశీలించదగినవి, ప్రశంసింపదగినవి-

సీః రాముడెవ్వరి గూడి రావణు మర్దించె? వరవాసుదేవుని పట్నమేది?
రాజమన్నారుచే రంజిల్లు శరమేది? వెలయ నాలుగు వంటి విత్త దేది?
సీతను చేకొన చెరచిన ధనువేది? సభవారి నవ్వించు జాణ యెవడు?
అల రంభ కొప్పులో అలరుమాలిక యేది? శ్రీకృష్ణుడే యింట వెలగుచుండు?

గీః అన్నిటికి చూడ నైదేసి అక్షరములు ఒనర నిరుదెస చదివిన నొక్క తీరె
చెప్ప గలిగిన నే నిత్తు చిన్ని మాడ చెప్పలేకున్న నవ్వుదు చిన్ని నవ్వు

పై ప్రశ్నల భావం సులభంగానే ఉన్నది గనుక సమాధానాలు మాత్రమే ఇస్తున్నాను. వరుసగా - లోకమూకతో, రంగనగరం, లకోరికోల, జంబీరబీజం, పంచాస్యచాపం, నందసదనం.

పూర్వకాలం సాహితీ ప్రియులు పదిమంది చేరితే ఇటువంటి ప్రశ్నలు, జవాబులు, పాండిత్య

ప్రకటనలు ఉండేవి. ఇటువంటి వాటిని తూలనాడే కాలపు పరిస్థితులను చూసి విశ్వనాథ సత్యనారాయణగారొక చక్కని పద్యం పలికారు.

కం॥ తొలినాళుల పద్యార్థము
తెలియనిచో పాఠకునిది తెలియమి యీ నా
ళుల వ్రాసిన కవి దోషము
కలి ముదిరిన కొలది వింతగతులను చెలగున్

వెనుకటి రోజుల్లో ఏదైనా పద్యానికి అర్థం తెలియకపోతే చదువరి అపండితుడి కింద లెక్క. ఇప్పుడో అర్థంకాకుండా రాయటం కవి దోషమనే కలి కాలం వచ్చిందని కవి సమ్రాట్టు అధిక్షేపించారు.

మరికొన్ని చిత్ర చాటువులు చూడండి!

ఆ.వె॥ మామి డేల పూచు మండు వేసంగిలో
బాలు డేల పోవు పసల వెంట?
రాజు సేన నేల రహి చేర్చుచుండును?
మూట నొక్క మాట ముద్దు కృష్ణ?

జవాబు-కాయనే-మామిడికాయలు కాయటానికి, బాలుడు గొడ్లు కాయటానికి, రాజు సేనను చేర్చేది కాయటానికి- రక్షించటానికి-మూటికి ఒకే మాటతో సరిపోయింది. (అయితే ఇక్కడ కాయు, కాచు శబ్దాల మధ్య తేడాను రచయిత పట్టించుకోలేదు)

హనుమంతుని సముద్రలంఘన, లంకా దహనాలను ఒక కవి ఇలా వర్ణించాడు.

కం॥ ఎంచగ చతుర్థ జాతుడు
పంచమ మార్గమున నేగి ప్రథమ తనూజం
గాంచి తృతీయంబచ్చట
నుంచి ద్వితీయంబు దాటి యొప్పుగ వచ్చెన్

పృథివి, జలం,అగ్ని, వాయువు,ఆకాశం - పంచభూతాలు, చతుర్థ జాతుడు=నాల్గవ వాడైన వాయువు కుమారుడు హనుమంతుడు. పంచమ మార్గమున నేగి= అయిదవ దైన ఆకాశమార్గాన పోయి, ప్రథమ తనూజను గాంచి= మొదటిదైన భూమి పుత్రిక సీతనుజూచి, తృతీయంబచ్చట నుంచి= మూడవ దైన అగ్ని నచ్చట ఉంచి, ద్వితీయంబు దాటి= రెండవదైన జలం-సముద్రం దాటి -ఒప్పుగ వచ్చెను.

ఒక స్నేహితురాలు మరో స్నేహితురాలిని నీ భర్త పేరేమి టని అడిగిందట. దాని కామె సమాధానం ఇచ్చిన వైనం చూడండి.

చం॥ మమతను తన్ను నొక్క చెలి మానిని! నీ విభునామ మేమనన్
కమలజగంధి పల్కె కరి,కంధి, ప్రజాపతి, చంద్రి కాతప
త్రముల త్రివర్ణ యుక్తముగ వ్రాసిన సందుల మధ్య వర్ణముల్
క్రమముగ నిచ్చు నామె పతి గాంచిన నామ మటంచు నొప్పుగన్

కరి, కంధి, ప్రజాపతి,చంద్రిక,ఆతపత్రము-ఈ అయిదు మాటలకూ మూడక్షరాల పదాల నేరి వాటి మధ్య అక్షరాలు కలిపితే ఆమె భర్త పేరు వస్తుందట.

సారంగ,సాగర, విధాత,కౌముది, గొడుగు- వీటి నెన్నుకొంటే రంగధాముడు- అనేపేరు వస్తుంది.

కఠినురాలైన కాంతను ఒక కవి ఇలా అంటాడు.

గీ: కిసలయంబున నీ మేను పొసగ జేసి
నరగ కీదీసి యాయూడ్చి సాగుడిచ్చి
చేసె కాబోలు దాత నీ చిత్త మరయ
కాక కల్గునే నీ కిట్టి కఠిన బుద్ధి

కిసలయ మంటే చిగురు. కి, యలు దీసి నకు గుడిస్తే సిల అవుతుంది. బ్రహ్మ నీ మనసును రాయితో చేశాడని కని భావం

ప్రశ్న - జవాబు

తెలుగు సాహిత్యంలో చిత్ర విచిత్రమైన విషయాలను పద్యాల్లో ఇమిడించిన సందర్భాలెన్నో వున్నాయి. ఇటీవలి క్విజ్, పజిల్సు వంటివి ఎప్పుడూ ఏ సందర్భంలోనూ ఏదో రూపంలో ఉంటూనే ఉంటాయి. అటువంటి వాటిని కొన్నింటిని వివరిస్తాను. పెద్ద బాలశిక్ష ,చాటుపద్య మణిమంజరి రత్నాకరాల వంటి గ్రంథాల్లో ఇవి ఉదాహృతాలే.

ఏనుగు సింహంబు నెలనాగయును గూడి ఒకమాటలోపల నుండవలయు
పాయక వస్త్రముల్ పాషాణమును గూడి ఒక మాటలోపల నుండవలయు
ఫణిరాజు ఫణివైరి ఫణిభూషణుడు గూడి ఒక మాటలోపల నుండవలయు
రారాజు రతిరాజు రాజరాజును గూడి ఒకమాటలోపన నుండవలయు
దీని యర్థంబు చెప్పంగ ధీనిధులకునెలలు పన్నెండు గడువిత్తు నేర్పుగాను
చెప్పునాతడు భావజ్ఞ శేఖరుండు లక్షణోపేంద్ర!ప్రౌఢరాయ క్షితీంద్ర!

ఏనుగు, సింహం, స్త్రీ కలిసిన మాట- నాగకేసరాలు. కాకి, గుడ్డ,రాయి కలిసిన మాట- కాకిబొంతరాయి.పాము,గరుడుడు, శివుడు కలిసిన మాట గరుడేశ్వరం రాజు,మన్మథుడు, కుబేరుడు కలిసిన మాట- రాజమదనకుబేరం- ఇవి చెప్పటానికి పాండిత్యం, స్ఫురణ ప్రధానం.

ఇటువంటిదే మరొకటి

ఏమి చేయక వృథా ఏటి నీరేగును? భూపాలు డేటికిన్ పుట్టువాడు?
తుంగముస్తెల ప్రీతి తొణుకాడు వేనికి? సభవారి నవ్వించు జాణ యెవడు?
రాజహంస నివసించు కాసారమెయ్యది? వీరు డెద్దానిచే విజయమందు?
లజ్జయెవ్వరి కమూల్యపు టలంకారంబు చేవాంగులకు చేన జీవనంబు
అన్నిటికి జూడనైదేసి అక్కరములు ఒనర నిరుదెస చదివిన నొక్క తీరె
చెప్పగలిగిన నే నిత్తు చిన్నిమాడ చెప్పలేకున్న నవ్వుదు చిన్నినవ్వు

సీస పాదాలలోని ఎనిమిది ప్రశ్నలకూ అయిదక్షరా లున్న సమాధానం చూడాలి. తిప్పి చదివితే అదే రావాలి. వీటి సమాధానాలు చూడండి- కాలువ ఏం చేయకపోతే వృథాగా పోతుంది. కట్ట కట్టక,రాజెందుకు పుడతాడంటే నేల నేలనే (భూమిని పాలించటానికి) తుంగముస్తెల మీద వేటికి ఎక్కువ ఇష్టం- కిటికోటికి (పందులకు): సభవారిని నవ్వించే జాణ-చతురుడు-వికటకవి, కలహంస నివసించే సరస్సు- సురసరసు;వీరుడు దేనిచేత గెలుపొందుతాడు=చేతి హేతిచే (కత్తిచే) సిగ్గెవ్వరి కలంకారము;=కులస్త్రీలకు; సాలెవారికి బ్రతుకు దేనివల్ల= నేత చేతనే.

ఇలాంటిదే వేరొకటి-

సీ॥ నక్షత్ర వీథికి నాథుడెవ్వండొకో? రంగగు గుడిలోని లింగమేది?
వాహనంబులమీది వన్నెకు మొదలేది? దేవతా ఋషులకు తిండి యేది?
నరకాసురుని గన్న నాతి నామంబేది? పొలతి చక్కదనాన బొల్పనేది?
తల్లికి కడగొట్టు తనయునిపైనేది? కమలాప్త బింబంబు కవ్వునేది?

గీ॥ **అన్నిటికి జూడ రెండేసి అక్షరములు అదు లుదుపంగ తుదలెల్ల ఆదు లగును**
**చెప్పు నాతడు భావజ్ఞ శేఖరుండు లక్షణోపేంద్ర ! ప్రౌఢరాయక్షితీంద్ర!**

ఈ సీసపాదాలలోని ప్రశ్నలకు జవాబులు రెండక్షరాలలో ఉండాలి. ప్రతి జవాబుకూ చివరి అక్షరం తరువాతి జవాబుకు మొదటి అక్షరం కావాలి. దీని జవాబులు గమనించండి.

తారాపంక్తికి ప్రభువు - శశి (చంద్రుడు) గుడిలోని లింగము - శిల (రాయి)

వాహనాల మీది రంగుకు మొదలు = లక్క ఋషులకు ఆహారం= కంద (దుంప)

నరకుని కన్న తల్లి= ధర(భూమి) స్త్రీలను ఎవరితోపోలుస్తారు= రంభ

తల్లికి చివరి కొడుకుపైనే ఉండేది= భ్రమ సూర్యబింబాన్ని కప్పేది= మబ్బు

మరొక చిన్న పద్యం- ప్రశ్న సమాధానమూ ఒకే వాక్యంలో ఉండే విశేషం.

కం: **ఎద్దీశున కశ్వంబగు**
**గ్రద్దన నేదడవి తిరుగు ఖరకంటకియై**
**హద్దు గనేవాడు ఘనుడు**
**పద్దుగ నుత్తరము లిందె పదయంగానే.**

ఈశుని వాహన మెద్ది? ఏది-ఎద్దు + ఈశునకు ఏది + అడవి - ఏదు+ అడవి (ఏదుపంది) అడవిలో ముళ్ళతో తిరిగేది, హద్దుగ ఏవాడు ఘనుడు =హద్దు గనేవాడు గొప్పవాడు. ఇటువంటివి మనోవికాసం కలిగించటానికి పాండిత్య వృద్ధికి తోడ్పడగలవు.

## కన్యకు నైదు జంఘలు!

కావ్యాలలో చాటువులలో పండిత కవులు సందర్భవశాత్తు అనేక శాస్త్రవిశేషాలు చెప్పటం కద్దు. అందులో జ్యోతిశ్శాస్త్ర విషయాలు ప్రాస్తవికంగా ప్రతి ప్రాచీన కావ్యంలోనూ ఉన్నాయి. రాశి చక్రానికి సంబంధించిన చమత్కారాలతో ఉన్న ఒక పద్యాన్ని పరికించండి!

ఉ. కన్యకు నైదు జంఘలును కన్యకు నారు కుచంబు లెన్నగా
కన్యకు నాల్గు కన్బొమలు కన్యకు నేడు విశాల నేత్రముల్
కన్యకు ద్వాదశంబు నులికౌనును కల్గు సులక్షణాఢ్య కా
కన్యకు నీకు నింక పది కావలె కస్తురి రంగనాయకా!

కన్యకు ఐదు పిక్కలు, ఆరు వక్షోజాలు, నాలుగు కన్బొమలు, ఏడు కండ్లు, పన్నెండు నడుములు ఉన్నవిట. ఆమె మంచి లక్షణాలు గలదట! ఇవన్నీ ఉండటం సాధ్యమా? ఉంటే లక్షణవతి అవుతుందా? ఎంత భయంకర వికృతాకారం అవుతుందో?

ఈ పద్యం అర్థం కావాలంటే కొద్దిపాటి జ్యోతిశ్శాస్త్ర పరిజ్ఞానం కావాలి.ముందు రాశిచక్రంలో ఉండే రాసుల పేర్లు, వాటి వరుస తెలుసుకోవాలి.

1. మేషం 2 వృషభం 3. మిథునం 4. కర్కాటకం 5. సింహం 6. కన్య 7. తుల 8. వృశ్చికం 9. ధనుస్సు 10. మకరం 11. కుంభం 12. మీనం.

కన్యకు అయిదు జంఘలంటే- కన్య నించి అయిదవది మకరం. ఆమె పిక్కలు మొసళ్ళవలె ఉన్నవని అర్థం. కన్యకు ఆరు కుచాలంటే కన్య నించి ఆరవది కుంభం. ఆమె స్తనములు కుండలవలె ఉన్నవని అర్థం. కన్యకు నాల్గు కన్బొమలు అంటే నాల్గవది ధనుస్సు. వింటి వలె ఉన్నవని, కన్యకు నేడు విశాల నేత్రముల్, అంటే - ఏడవది మీన రాశి- కండ్లు చేపలవలె ఉన్నవని అర్థం. కన్యకు పన్నెండు

కాను అంటే కన్యారాశి నుండి పన్నెండోది సింహం. ఆమె సింహమధ్యమ అని అర్థం. కన్యకు నీకు పది కావలెఅంటే పదవది మిథునం గనుక ఆమెకు నీకు పెండ్లి కావాలి అని అర్థం.

ఇటువంటి చతురమైన పద్యాలు, శ్లోకాలు సంస్కృతాంధ్రాలలో అక్కడక్కడ గోచరిస్తూనే ఉంటాయి. ఒక చాటు శ్లోకం చూడండి.

శా: సంతప్తాదశ మధ్వజాది గతినా సమ్మూర్ఛితా నిర్జలా
తుల్యా ద్వాదశ పద్ద్వితీయ మతిమన్ ఏకాదశాభస్తనీ
సాషష్ఠీ శరమధ్యమా చ నవమ భ్రూ సప్తమీ వర్జితా
ప్రాప్నోత్యష్టమ వేదనాం త్వమధునా తూర్ణం తృతీయో భవ

ఒక కన్య ఒక యువకుని ప్రేమించింది. పెండ్లి చేసుకొని సుఖపడాలని మనసారా కోరుతున్నది. మన్మథ బాధతోఎంతో తీవ్రంగా వేదన చెందుతున్నది. ఆమె బాధ చూడలేని స్నేహితురాలు అతని కీ విషయం చెపుదామని వెళ్ళింది. అక్కడ ఇతరులు కూడా ఉన్నారు. వారికి తెలియకుండా ఇతనికి మాత్రమే విషయం తెలియాలి. కనుక గుప్తంగా ఉండేలా చెప్పాలి. ఆ యువకునికి జ్యోతిష్యం తెలుసు. మిగతావారికి తెలియదు. ఆసంగతి ఎరిగిన చతుర సఖి ఈ శ్లోకాన్ని చెప్పి అతనికి తన మిత్రురాలి బాధ తెలిపింది.

ఏమయ్యా! నా స్నేహితురాలు- సంతప్తాదశమ ధ్వజాది గతినా- దశమ అంటే మకరం. ఆది అంటే మేషం -అనగా మేక వలె ఉంది. మూర్ఛపొందింది. తపిస్తున్నది. తుల్యము - నాల్గవ రాశి కర్కాటకము, ద్వాదశం మీనం, నిర్జలా- నీళ్ళు లేనిది. నీళ్ళ నుండి బయటపడిన చేపలాగా ఎండ్రకాయలాగా ఆమె కొట్టుకొంటున్నది. ఆమె ఎంత అందగత్తెయో తెలుసునా! ఏకాదశాభస్తని అంటే కుంభకుచ. శరమధ్యమ అయిదవదయిన సింహము నడుము వంటి నడుము గలది. నవమభ్రూ - తొమ్మిదవదైన ధనుస్సు వలె వంగిన కనుబొమలు కలది.సప్తమీ వర్జిత - ఏడవది తుల అంటే సాటిలేనిది. సాషష్ఠి- అరవది కన్య. ఆమె కన్య -పెండ్లికానిది. అష్టమ వేదనాం ప్రాప్నోతి ఎనిమిదవది వృశ్చికము. తేలుకుట్టినట్టు (మదన బాధచే) ఎంతో వేదన చెందుతున్నది. నీవు ఈ సంగతి తెలుసుకోలేకపోతున్నావు. ద్వితీయ మతిమన్ - రెండవది- వృషభం. ఓ యెద్దు మొద్దు స్వరూపా! ఇప్పటికైనా తెలుసుకొని తృతీయోభవ- మూడవది మిథునం. అంటే ఆమెను పెండ్లాడి దంపతులు కావలసినది.

ఇటువంటి విశేషాలు కవిత్వంలో చమత్కారావహముగా ఉండి ఆనందాన్ని కలిగిస్తుంటాయి. ఇటీవల గుంటూరులో జరిగిన శతావధానంలో ఒక పృచ్ఛకుడు మేషాది రాసులలో కనీసం ఆరింటిని కూర్చి అమ్మవారి మీద పద్యం చెప్పమంటే శ్రీ మేడసాని మోహన్ చెప్పిన పద్యం గమనించండి.

మ: అనిమేషంబుగ నీ మహాకృతిని భావాంతర్గతిన్ జూచి సం
జనితోల్లాసము మై నుతింతు వృషభాంచద్వాహనాత్మేశ్వరీ!
నిను కన్యామృదుమూర్తిగా మిథున సందీప్తార్థ్య నా సింహ వా
హనగా మ్రొక్కుచు నుంద్రు భక్తులు సమస్తాకార! కుంభస్తనీ!

ఇందులో మేష,వృషభ, కన్యా,మిథున, సింహ,కుంభ శబ్దాలు రాశుల పరంగా కాక పరమేశ్వరీపరంగా వివిధ విశేషణాలు వచ్చే విధంగా చెప్పటం విశేషం.

## పింగళి కోరిక

ఈ శతాబ్ద ప్రథమార్థంలో పేరుగాంచినకవులలో పింగళి లక్ష్మీకాంతంగా రగ్రగణ్యులు. కాటూరి వారితో కలిసి సౌందరనందము మొదలైన గ్రంథాలు రాశారు. తర్వాత ఎవరికి వారు విడిగా కొన్ని పుస్తకాలు రాసుకొన్నారు. మధుర పండితరాజము, ఆంధ్ర సాహిత్య చరిత్ర, సాహిత్య శిల్ప సమీక్ష గౌతమ వ్యాసాలు, రేడియో వ్యాసాలు మొదలైనవి పింగళివారి రచనలు. ఆంధ్రాయూనివర్సిటీలో ఆచార్యునిగా ఉన్నప్పుడు కొంతమంది శత్రువర్గం వారు సౌందరనంద మంతా కాటూరి వారే రాశారనీ, లక్ష్మీకాంతంగా రస లేమీ రాయలేదనీ పనిగట్టుకొని తెలిసిన వారు వాల్తేరు రైలు స్టేషనులో ఈ ప్రస్తావన తెచ్చారు. వెంటనే ఆశువుగా కవిగా రీ పద్యం చెప్పారు.

ప్రీణిత సద్రసజ్ఞుడగు పింగళికాంతుని కావ్య శిల్ప ని
ర్మాణ ధురీణ బుద్ధి గరిమంబున కిర్వురె సాక్షు లి మ్మహిన్
వాణికి వాణియైన గురువర్యుడు చెళ్ళిళ వేంకటేశుడున్
ప్రాణము ప్రాణమైన గుణరమ్యుడు కాటూరి వేంకటేశుడున్.

నేను కవిత్వం చెప్తానో లేదో, చెప్పానో లేదో సౌందరనందంలో నా పాలెంతో తెలిసిన వారిప్పటికీ ఉన్నారు. సరస్వతీమూర్తి అయిన చెళ్ళపిళ్ళ గురువర్యుడు, ప్రాణ మిత్రుడు కాటూరి ఇతరు లేమన్నా పరవాలేదులే ' అన్నారు గురువుగారు గతించినప్పుడు వారు పలికిన పద్యాలు " శ్లోకః

ఆంధ్ర కవితా జగద్గురు డమరపురికి
తరలిపోయెను శిష్య సంతతుల విడిచి
సహజ గీర్వాణవాణీ ప్రసక్తులైన
దేవతలు చెప్పగల రింక తెలుగు కవిత.

చెళ్ళపిళ్ళవారు అమరావతికి వెళితే సహజంగా సంస్కృత ప్రసంగం చేసే దేవతలు ఈయన ప్రభావం చేత తెలుగు కవిత్వం చెపుతారట!

మరల తిరుపతి వేంకటేశ్వరుల జంట
కలిసె ముప్పది యేండ్ల పైకాలమునకు
సాగగల దింక దిక్పాల సభల యందు
అద్భుతావహ శతావధానాంధ్ర కవిత.

తిరుపతి శాస్త్రిగారు వెంకటశాస్త్రిగారి కంటె ముప్పది యేండ్ల ముందే స్వర్గస్థులైనారు ఇప్పుడు మళ్ళీ వీరు వెళ్ళగానే జంట కవులు శతావధానం దిక్పాలక సభలలో చేస్తారు.

మా గురుం డిప్డు దిగిన వాఙ్మయపు గద్దె
ఉర్వి ననధిష్ఠితంబయి ఉండగలదు
అనభిగమ్యము నప్రధృష్యమ్ము నౌచు
విక్రమార్కుని సింహాసనక్రమాన.

మా గురువెక్కిన వాఙ్మయ సింహాసనం ఇంకోరు ఎక్కేది గాదు. అది విక్రమార్కుని సింహాసనం. దానిని ఎవరూ సమీపించలేరు. అధిరోహించలేరు అంటే అంతటి వారు రాబోరు అని భావం.

పింగళివారు గంభీరులని, గర్విష్ఠి అనీ కొందరు అనుకొనేవారు. దానికి వారే ఇలా చెప్పారు.

కం॥ దూరస్థులు నను గని గం
భీరుడు దుర్లభు డటంచు బెగ్గిల చెంతన్
చేరినవా రనుకొందురు
కూరిమి చవిచూచి గంగిగోవు నటంచున్

దూరాన ఉన్నంతసేపూ గంభీరుణ్ణేమో గాని, దగ్గరకు వచ్చిన వారు నన్ను గంగిగోవు వంటి వాడనుకొంటారు.

తెలుగు పండితులలో ఆ రోజుల్లో ఎంతో ఠీవి, ఆత్మగౌరవం గల వ్యక్తి పింగళివారు.

కం॥ గురులకు దేవునకుం గా,
కొరులకు చేమోడ్పి యెరుగ నుద్యోగమునన్
వరువడము దారి బోవక,
పరువును ప్రాభవము చెల్లుబడి సాగింతున్.

గురువుకు, దేవుడికి తప్ప ఇతరులకు చేతుల జోడించని ప్రవృత్తి వారిది. అంతేకాదు విచ్చలవిడిగా సభలకూ, పత్రికలకూ పోయే తత్వం లేనందువల్ల సాహిత్యరంగానికి కొంత దూరమైనారు.

కం॥ విచ్చలవిడి పత్రికలకు
రచ్చలకును బోవ నేను వ్రాసిన కొంచెం
బచ్చొత్తి చూచుకొనియెడి
ముచ్చట సాధారణముగ పొడమదు నాకున్

అన్నారు.

అయితే ఎప్పుడైనా ప్రసంగిస్తే ఆ సభలో ఆయన ఉపన్యాసమే తలమానికముగా, ప్రామాణిక సుందరంగా భాసించేది. అలానే ఏ వ్యాసమైనా వ్రాస్తే ఆ పత్రికకే అది అలంకారంగా ఉండేది.

తన హృదయ తత్వాన్ని వారీ విధంగా చెప్పకొన్నారు.

గీ॥ ధర్మములు రెండు నాకు నీ తనువు నందు
ఋతము పల్కుట కృతము స్మరించుకొనుట
సత్య దూరులతో చెల్మి సల్పలేను
మేలు మరచిన వాని క్షమింపలేను

అయన సత్యభాషి, కృతజ్ఞుడు. అబద్ధీకుడు, కృతఘ్నుడు - అంటే అటువంటి వ్యక్తిని సహించగలిగే వాడు కాదు.

దైవ భక్తుడై సాహిత్య హృదయుడైన పింగళి వారు తన జీవిత వాంఛను చెప్పకొన్నారు. భవ్యావేశం కలిగినప్పుడు అమర గంగాస్నాతుడై సూర్యమండలంలో ప్రవేశించాలని వారి కోరిక.

కం॥ భావంబున తలచెద భ
వ్యావేశుడనైన సమయమందున నా యీ
జీవుడు నిర్ఝరతటినీ
ప్లావితుడై సూర్యమండలము చొరబారన్

కవితా యోగి అయిన లక్ష్మీకాంతంగారికి ఈ కాంక్ష సిద్ధించే ఉంటుంది.

## భృంగ పంచకం

సాహిత్యంలో అన్యాపదేశ కవిత్వం రచించి, పేరు గాంచిన కవులెందరో ఉన్నారు.ధ్వని ప్రస్థాన మనోహరమైన ఈ మార్గానికి ఎవరైనా మురిసిపోక తప్పదు. తెలుగులో భృంగ పంచకము అనే పేరుతో అటువంటివి అయిదు పద్యాలు కనిపిస్తున్నాయి. శ్రీనాథ మహాకవి వీటిని రచించాడని చాలా మంది పండితుల అభిప్రాయం. ఆ పద్యాల చుట్టూ చక్కని కథకూడా ప్రస్తరించారు.

ఒక మహారాజుకు సౌందర్యవతి అయిన భార్య ఉండేది. రాజులకు ఎందరో భార్య లుంటారు.

అందులో ఆమె చిన్న భార్య అని అనుకోవచ్చు.మహారాజువల్ల పరిపూర్ణ తృప్తి చెందని ఆవిడ కామబాధ పాలై పరితపిస్తున్నది. ఆ రాజ్యం మహామంత్రి వృద్ధుడు కావటంతో, ఆ స్థానంలో ఆయన కుమారుడు ఆ పదవిలోనికి వచ్చాడు. అతను మంత్రాంగ నిపుణుడే కాక, అసాధారణ సౌందర్య విభాసితుడు కూడా. అతనిమీద రాణిగారి కన్నుపడింది. చాతుర్యధుర్య అయిన చేటికచేత రాయబారాలు నడిపించింది.

అతనూ తక్కువ వాడేమీ కాదు. వచ్చిన అవకాశాన్ని వదులుకొనే అరసికుడూ కాడు. అయితే, రాజభార్యా సంగమం ప్రమాదం కనుక జాగ్రత్తగా వ్యవహరించాలి. కామాతురత భయాన్ని అతిక్రమించి పురికొల్పగా, చీకటి పడిన తరువాత రాణిగారి దూతిక ఏర్పరచిన సంకేతాన్ని అనుసరించి,ఆమె భవనానికి చేరుకున్నాడు.మదనక్రీడాపారవశ్యంలో వారికి సమయం తెలియలేదు.

ఇంతలో మహారాజుగారు నెమ్మదిగా తన భవనం నుంచి బయలుదేరి ఇక్కడికి వస్తున్నాడు . ఆరోజు సప్తమి లేక అష్టమి అయి ఉంటుంది.చంద్రుడు కూడా కాస్త ఆలస్యంగా ఉదయించాడు.ఈ పరిస్థితిని చూసిన చెలికత్తె తుమ్మెదపైన పెట్టి అన్యాపదేశంగా మంత్రిని ఇలాహెచ్చరించింది.

మాయురె భృంగమా ! వికచమల్లికలన్ విడనాడి తమ్మిలో
నీయెడ పూవుదేనియల నింపు జనింపగ గ్రోలి సొక్కియున్
బోయెదనన్న భ్రాంతి నిను బొందదు రాజుదయించె నిప్పుడే
తోయజపత్రముల్ వరుసతో ముకుళించె జలింపకుండుమా !

ఓ తుమ్మెదా ! మంచి మల్లెలను విడనాడి తామరపువ్వులోని మకరందం మీద మోజుతో ఇక్కడ చేరావు. ఎంతసేపటికీ విడిచిపెట్టి వెళ్ళిపోదామని అనుకోవటంలేదు. చంద్రుడు ఉదయించాడు. తామరరేకులు ముడుచుకున్నవి.ఇప్పుడు బయటికి పోలేవు. కదలిక లేకుండా జాగ్రత్తగా ఉండు.

దీనిలోని ధ్వని - ఓ మంత్రి శేఖరా ! నీ భార్యను విడిచి, రాణితో క్రీడిస్తూ ఆలస్యం చేశావు.ప్రభువు వస్తున్నాడు రాజ శబ్దానికి ప్రభువు , చంద్రుడు అనే అర్థాలున్నాయి ! అయినా భయపడక దాక్కో . లోపల ఉన్న ఇద్దరూ ఈ హెచ్చరికను గుర్తించి జాగ్రత్తపడ్డారు, ఈ పద్యం విన్న మహారాజు గారు చెలికత్తెను ప్రశ్నిస్తే, ఆమె తామర - తుమ్మెదలను చూసి చెప్పానని చమత్కరించింది.

మంత్రి దాగినచోటు ఇరుకు, గాలి లేదు. బాధతో అటూ ఇటూ కదులుతున్నాడు. మహారాజు ఆ సంగతి కనిపెడితే ప్రమాదమని చెలికత్తె. చతురిక మళ్ళీ ఇలా హెచ్చరించింది.

అళికులవర్య ! పద్మముకులాంతరమందు వసింప నేరమిన్
జలనము సెందె దేమి నవసారసమిత్రుడు రాకయుండునా
తొలగక యందె యుండు మిక తోయజవైరి తిరంబె రాత్రి యీ
కలవర మేల తుమ్మిదను గానక యూరట యురకుండుమా !

తుమ్మెదా ! ముకుళితమైన తామరలో ఉండలేక కదులుతున్నావెందుకు! ఈ చంద్రుడు స్థిరమా ? సూర్యుడు రాకుండా ఉంటాడా? కలవరపడక ఊరటతో ఊరుకో.

మంత్రిపరంగా వచ్చే అర్థం ఓ మంత్రివరా ! నీవు దాక్కొన్న ఇరుకు ప్రదేశంలో ఇబ్బందిగా ఉండవచ్చు స్థిరంగా ఉండు. ఆయన వెళ్ళిన తరువాత ఒంటరి సమయం వస్తుంది. అప్పటిదాకా సద్దుచేయక జాగ్రత్తగా ఉండాలి.

ఆ మాటలు విని మంత్రి ధైర్యంతో, ఓర్పుతో వేచి ఉన్నాడు. అతని ఇంటి దగ్గర ధర్మపత్ని ఇతన్ని గురించి ఆందోళన చెంది, రహస్యంగా వాకబు చేసింది. భర్త వ్యవహారాలు ఆమెకు కొంత తెలును. రాణిగారి ఇంటికి వెళ్ళాడని తెలుసుకొని, అక్కడ ఏమి ప్రమాదం వచ్చిందో అని ఆదుర్దాతో బయలుదేరి వచ్చింది. ఆమె వచ్చి బయటపడి విచారణ చేస్తే గుట్టు రట్టవుతుంది. అందుకని చతురిక ఆమెకు ఇలా

అన్యాపదేశంగా కర్తవ్యబోధ చేసింది.

అలినీ! తత్తరమేల నేడు నిదె నీ యాత్మేశుడౌ భృంగమున్
జలజాసక్త మకరంద పానవశతన్ సానందుడై యున్న వా
డులు కింతేనియు లేక నీ వరుగుమీ యొప్పారు నిప్పాట నీ
చెలువుండుం బరతెంచు వేకువను రాజీవంబు పుష్పించినన్

ఆడు తుమ్మెదా! నీ భర్త పద్మినీ మకరందపాన వివశుడై ఉన్నాడు.ఆనందంలో మునిగి ఉన్నాడు. నీవు భయపడవద్దు. తెల్లవారి రాజీవం విచ్చుకోగానే, నీ నాథుడు వస్తాడు. ప్రస్తుతానికి నెమ్మదిగా వెళ్ళిపో.

మంత్రి భార్య జరిగింది గ్రహించి వెళ్ళిపోయింది. రాజు రాణితో మదనకేళిలో తేలి, అలసి నిద్రించాడు. రాణి కూడా ఆ స్థితికే వెళ్ళింది. తెల్లవార వచ్చింది. ఇక దాక్కున్న మంత్రి వెళ్ళిపోవటానికి అవకాశం వచ్చిందని గ్రహించి చతురిక మంత్రి కర్థమయ్యే విధంగా ఇట్లా అన్నది.

పతి నిద్రించిన వేళ రా దగునయో పద్మారి ! యీ కేళికా
యతనంబందు రతిశ్రమ న్విభుడు నిద్రాసక్తుడై యుండె నీ
శత పత్రేక్షణ మోము వాంచినది నీసామర్థ్యముం జూపదో
కతి వేగంబుగ నేగుమా తొలగి మాయాత్మల్ సుఖం బందగన్.

ఈపద్యభావాన్ని గ్రహించి, మంత్రి జాగ్రత్తగా ఇవతలకు వచ్చి వేగంగా వెళ్ళిపోయాడు. మరునాటి ఉదయం అవసరమైన రాచకార్యాలు ఉండటంవల్ల విశ్రాంతి తీసుకోకుండానే హడావిడిగా మంత్రి కొలువుకూటానికి వెళ్ళాడు. మహారాజు పేరోలగంలో ఉన్నాడు. పైనున్న తెరల చాటున నుంచి రాణి చూస్తున్నది. కొలువుకు వచ్చే తొందరలో మంత్రి ముందు రోజు రాత్రి ప్రేమపారవశ్యంలో రాణి తన మెడలో వేసిన పచ్చల హారాన్ని తీసి దాచకుండా అలాగే వచ్చాడు. దాన్ని రాజు చూస్తే గుర్తుపడతాడు. ప్రమాదం రాణి కలతచెంది ఈ అపాయాన్ని ఎలాగైనా తొలగించమని చెలికత్తెను కోరింది. చతుర అయిన చతురిక మారువేషంతో ఒక భట్టువలె వచ్చి, ఆస్థానమంతా కలయజూసి ఈ పద్యం చదివింది:

అతుల సభాంతరస్థిత బుధావళి కెల్ల జొహారు, వీరరా
హుతులకు మేల్జొహారు, సతతోజ్జ్వల విక్రమ సార్వభౌమ సం
తతికి జొహారు, వైభవవితాన పురందరుడైన యట్టి భూ
పతికి జొహారు, మానపరిపాల జొహారు ప్రధాని శేఖరా !

అందరినీ స్తోత్రం చేసినట్లు కనిపించినా తనను ప్రత్యేకంగా మానపరిపాల అనటం మంత్రికి పట్టిచ్చినట్లుగా ఉంది. భట్టును చూసి చతురిక అని గ్రహించి, తనను చూసుకొని, తడుముకొని, పచ్చల హారాన్ని గురించి తెలుసుకొని, మెడలో నుంచి ఇతర హారాలతో దాన్నీ కలిపి బయటకు కనబడకుండా తీసి, కవిత్వానికి సంతోషించి ఇస్తున్నట్లుగా కుహనాభట్టుకు బహూకరించాడు. మిగతావారు, రాజు ఏవో బహుమతులిచ్చి పంపారు. ఈ అయిదు పద్యాలలో ఇమిడిన అందమైన కథ ఇది.

## కవితా రసికత అంటే...

కృష్ణదేవరాయలవారి ఆస్థానకవుల్లో నందితిమ్మన ప్రసిద్ధుడైన వ్యక్తి. ఆయనకు 'ముక్కుతిమ్మన' అన్న పేరు రావటానికి కారణాలేవైనా,పారిజాత పరిమళాలను ఆఘ్రాణించి, అందించిన కవిగా తెలుగు

సాహిత్యంలో ప్రత్యేక స్థానం ఆయనది. చెప్పవలసిన అవసరంవల్లనో, రాయలవారు కోరటంవల్లనో లేక, ఏదైనా పండిత వివాదఘట్టంలో తటస్థించిందో గాని తిమ్మన ఈ పద్యం చెప్పాడు.

ఉ. స్థాన విశేష మాత్రమున తామరపాకున నీటిబొట్టు ! నిన్
పూనిక మౌక్తికం బనుచు పోల్చిన మాత్రన గర్వ మేటికిన్ ?
మానవతీ శిఖామణుల మాలిక లందున కూర్పవత్తువో?
కానుక లీయవత్తువొ ? వికాసము నిత్తువొ? విల్వ నిత్తువో?

తామరకపాకు మీద నీటిబొట్టు తళతళా మెరుస్తూ ఉంటుంది. దాన్ని ముత్యంతో పోలుస్తారు. అంతమాత్రాన అది నిజమైన ముత్యం కాదు, అలాగే అల్పుడు ఉన్నత స్థానంలో ఉన్నా గొప్పవాడు కాడు.

ఇదే భావాన్ని మరింత తీవ్రంగా ఏ రామలింగడో చెప్పినట్టు ఈ కింది పద్యానికి ప్రఖ్యాతి వచ్చింది.

ఉ. పండితులైన వారలు సభాస్థలి నుండగ, అల్పు డొక్క డు
ద్దండత పీఠమెక్కిన బుధప్రకరంబున కేమి లోటగున్ ?
కొండొక కోతి చెట్టు కొన కొమ్మకు నెక్కిన క్రింది మత్త వే
దండ మహోగ్ర సింహములు తాలిమి నుండవె రాజచంద్రమా !

భట్టుమూర్తికి రాయలు అర్థసింహాసన మిస్తే సహించని వికటకవి ఇలా అన్నాడని ప్రతీతి. ఇదే సందర్భంలో పెద్దన ఈ క్రింది పద్యం చెప్పినట్లుగా కొందరు భావిస్తున్నారు.

ఉ. ఈకలు నల్లనైనవని ఎంచి విశాల రసాల శాఖి, ను
త్సేకముతోడ నెక్కి వికసించి, ఫలంబులు నీవు మేయుచున్
కోకిల రీతి నుందు వనుకొన్నను ఉందువు గాక పాపపుం
గాకమ ! నీకు తన్మధుర గానము కల్గునె ఎన్ని పల్కినన్?

కాకి, కోకిల రెండు నల్లగానే ఉంటాయి. చెట్టుమీద కూర్చుని చివుళ్ళో, పళ్ళో తింటూ నేను కూడా కోకిలనే అని కాకి అనుకుంటే అది చెల్లుతుందా?

సంస్కృతంలో కూడా కోకిల, కాకులను గురించిన ప్రసిద్ధ శ్లోక మున్నది.

కాక: కృష్ణః పిక: కృష్ణ :
కో భేద: పిక కాకయోః!
వసంతకాలే సంప్రాప్తే!
కాకః కాకః పికః పికః!!

కాకి, కోకిల రెండు నల్లగానే ఉన్నా వసంతకాలం వచ్చినప్పుడు నోరు విప్పగానే ఏది ఏదో తేలిపోతుంది. అదేవిధంగా, పండితుడు కాని వాడు పండిత వేషం వేసుకున్నా, సింహాసనం పైన కూర్చొన్నా నోరు తెరిచి నాలుగు మాటలు మాట్లాడితే,ఎవరు ఏమిటో, ఎవరి సత్తా ఏమిటో తేలిపోతుంది.

ఒక రోజు రాయలవారు అంతఃపురం మేడపై నుంచి కిందికి దిగి వస్తూంటే, ఆయన ప్రియభార్య చిన్నాదేవి అభ్యంగన స్నానం చేసి, కోకముడివేయకుండా ఊరికే చుట్టుకొని, కొంగు దోపుకొని తల ఆర్పుకుంటున్నదట. ఆ భంగిమలోని అభ్యంగన మంగళాంగిని చూసి మోహితుడైన రాయలు దగ్గరకు పోయి చీర లాగేశాడట. దిగంబర అయిన చిన్నాదేవి సిగ్గుతో, తన చేతితో మర్మావయాలను దాచుకొన్నది. తరువాత ఏం జరిగిందో గానీ,రాయలవారి మనసులో నవరత్నాంగుళీయకంతో ఉన్న అందమైన ఆమె చేయి కామనిధానాన్ని కాచుతున్న నాగకుమారునిలాగా

తోచింది. " స్ఫురిత ఫణామణీ ద్యుతుల పొల్పగు నాగకుమారుడోయనన్ అని ఒక పాదాన్ని సభలో అన్నాడట. మరి పెద్దనగారో, తిమ్మనగారో ఈ సమస్యను పూరించారని వినికిడి.

చ. వరుడు చెఱంగు పట్టినను వల్వ తొలంగ లేమ సిగ్గు ప
ట్టురుతర రత్నముద్రికల నొప్పగు డాపలికేల మూయగా
గర మమరెం గరంబపుడు కామనిధానము కాచియున్నవి
స్ఫురిత ఫణామణీద్యుతుల పొల్పగు నాగకుమారుడో యనన్.

అంతఃపుర విషయాలు తెలిసినవారు గాని ఇలా పూరించలేరు కనుక, ఇది అరణపు కవి తిమ్మనగారిపూరణ అని కొందరి అభిప్రాయం. లేక, కవి తన సహజమైన ఊహతో పద్యాన్ని పూర్తిస్తే, ఈ కథ దాని చుట్టూ అల్లుకుని ప్రచారంలోకి వచ్చిందేమో కూడా.

పారిజాతా పహరణాన్ని కృతి నందికొన్న రాయలు చీని చీనాంబరాలతో, అగ్రహారాలతో, రత్నహారాలతో పాటుగా మణికుండలాలను కూడా బహూకరించాడట. వాటిని ధరించి తిమ్మన తన ఇంటి అరుగు మీద కూర్చొని ఉంటే,ఒక భట్టుకవి ఈ విధంగా స్తోత్రము చేశాడు.

క. మా కొలది జానపదులకె
నీ కవనపు రీవి యబ్బునే కూపనట
ద్వేకములకు ? గగనధునీ
శీకరముల చెమ్మ ! నంది సింగయ తిమ్మా!

తిమ్మకవి పరవశించిపోయి, తన కర్ణకుండలాలలో ఒకదాన్ని భట్టుకు బహూకరించాడు. మరునాడు ఒంటి కుండలంతో వచ్చిన తిమ్మనను చూసి, అదేమిటని రాయ లడిగితే జరిగిన సంగతి, భట్టు చెప్పిన పద్యం తిమ్మన వినిపించాడట. రాయలవారు " ఆ పద్యంలో "గగన" అన్నచోట "నాక ' అని ఉంటే మరింత బాగుంటుంది కదా" అన్నారు. వెంటనే, తిమ్మన రెండో కుండలం తీసి రాయలవారి చేతిలో పెట్టాడట. రాయల వారు దాన్ని తీసుకున్నాడో లేదో గాని మళ్ళీ మంచి రత్నకుండలాలను బహూకరించాడు . వారి రసికత అట్టిది.

## పెద్దన పెద్దరికం

శ్రీకృష్ణదేవరాయల ఆస్థానంలో ఆంధ్ర కవితా పితామహుని స్థానం అగ్రగణ్యం, అనితరం అయినటువంటిది. రాయలు కొలువు తీరినప్పుడు అష్టదిగ్గజకవులు ఎన్ని పద్యాలో ఆశువుగా చెప్పి ఉంటారు. అందులో మనకు దొరికినవి చాలా తక్కువ. పెద్దనగారు చెప్పిన ఈ క్రింది పద్యం ఆయన అద్భుత పాండిత్యానికి నిదర్శనం.

మ. శరసంధాన, బల, క్షమా, గురుతరై శ్వర్యంబులన్ కల్గి, దు
ర్భర షండత్వ, బిలప్రవేశ, చలన, బ్రహ్మఘ్నతల్ మానినన్
నర, సింహ, క్షితి మండలేశ్వరుల ఎన్నన్ వచ్చు నీసాటిగా
నరసింహక్షితి మండలేశ్వరుల కృష్ణా ! రాజ కంఠీరవా !

అర్జునుడు బాణ సంధానంలో, సింహం బలంలో, భూమి క్షమాగుణంలో, ఈశ్వరుడు ఐశ్వర్యంలో గొప్పవారే. అయితే వారిని నీతో పోల్చటానికి వీలులేదు. ఎందుకంటే, నపుంసకత్వం, గుహలో దూరి ఉండటం, నిశ్చలత్వం లేక కదులుతూ ఉండటం, బ్రహ్మహత్యా దోషం వరుసగా వారిలో ఉన్నాయి. అందువల్ల వారికంటే నీవు గొప్పవాడివి - అన్న అర్థం వచ్చే విధంగా పెద్దనగారు నర సింహ క్షితి మండలేశ్వరుల శబ్దం మీద శ్లేషను ప్రయోగించి, చమత్కారమంతమైన ఊహను చేసి,

నరసింహ ప్రభువు కుమారుడైన కృష్ణరాయలను కీర్తించాడు. వెంటనే. రామకృష్ణుడు మహారాజుతో పోల్చటానికి బిలప్రవేశ దోషం గల్గిన సింహం పనికిరాదని చెబుతూనే, సంబోధనలో సింహ సామ్యాన్ని తెస్తూ - 'రాజ కంఠీరవా' అనటం బాగాలేదని అన్నాడు. అప్పుడు కవితా పితామహుడు 'మనవడా ! అంతకంటే మంచి పద్యం చెప్పు' అని అన్నాడు వెంటనే తెనాలి కవి చెప్పిన పద్య మిది.

మ. కలనన్ తావక ఖడ్గఖండిత రిపుక్ష్మా భర్త మార్తాండ మం
డల నిర్భేద మొనర్చి ఏగు నెడ తన్మధ్యంబునన్ హార కుం
డల కేయూర కిరీటధారి అగు నారాయణున్ కాంచి లో
కలగం బారుచు ఏగె నీవ అను శంకన్ కృష్ణ రాయాధిపా !

యుద్ధంలో రాయలు చంపిన శత్రురాజు సూర్యమండలాన్ని భేదించుకొని పోతూ, ఆ మండల మధ్యంలో హారాలు, కుండలాలు, కేయూరాలు, కిరీటం ధరించిన నారాయణుని చూసి - 'రాయలు ఇక్కడ కూడా ఉన్నాడేమో ' అని జంకుతూ వెళ్ళాడట.

రాయలు సాక్షాత్తు నారాయణు డంతవాడని, అంతేకాక తదంశ సంభూతుడని స్ఫురణ వచ్చే విధంగా చెప్పిన ఈ పద్యం నిజంగానే నిర్దుష్టమై నిరూపమానమై అలరారింది.

అలాగే, పెద్దనగారు మరోసారి తెలుగు తురుష్క భాషల సమ్మేళనంతో మణిప్రవాళ పద్ధతిలో ఈ కింది పద్యం చెప్పారు.

సమర క్షోణిని కృష్ణరాయల భుజాశాతాసిచే పడ్డ దు
ర్దమ దోర్దండ పుళిందకోటి యవన వ్రాతంబు సప్తాశ్వ మా
ర్గమునన్ కాంచి సెబాసహెూ హరిహరంగా ఖూబు ఘోడాకి తే
తుముకీ బాయిల బాయిదే మలికి యందు ర్మింటికిన్ పోవుచున్

ఇది వినగానే తిమ్మన ఓఢ్ర భాషా సమ్మేళనంతో రాయల కళింగ విజయాన్ని వర్ణిస్తూ మరో పద్యం చెప్పారు.పెద్దన మత్తేభాన్ని దూకిస్తే తిమ్మన శార్దూలంతో విజృంభించాడు.

రాయగ్రామణి కృష్ణరాయ భవదుగ్ర క్రూర ఖడ్గాహిచే
గాయం బూడ్చి కళింగ దేశ నృపతుల్ కానిర్ఝరీ పోషణీ
మాయా భీకుముటూరు లోటు కుహటూ మాయా నటాజా హరే
మాయాగ్నేయ మడేయటంద్రు దివి రంభాజారునిన్ యక్షునిన్

అష్టదిగ్గజ కవులలో అల్లసానివారు పొందిన గౌరవాలు ఎవరూ పొందలేదు. రాయలు మరణించిన తరువాత ఆ దుఃఖంతో పెద్దనగారి హృదయం నుంచి వెలువడిన సీసంలో ఆ మధురస్మృతులు తొణికిసలాడుతున్నాయి.

సీ. ఎదురైనచో తన మదకరీంద్రము డిగ్గి కేలూత లొసగి ఎక్కించుకొనియె
కోకట గ్రామాద్యనే కాగ్రహారంబు లడిగిన సీమల యందు నిచ్చె
మనుచరిత్రం బందుకొనువేళ పురమేగ పల్లకి తన కేల పట్టి ఎత్తె
బిరుదైన కవి గండపెండేరమున కీవె తగుదని తానె పాదమున తొడిగె
" ఆంధ్ర కవితా పితామహ అల్లసాని "పెద్దన కవీంద్ర!" అని నన్ను పిలుచునట్టి
కృష్ణరాయలతో దివి కేగలేక బ్రతికి యున్నాడ జీవచ్ఛవం బనగుచు.

కోరిన చోటల్లా అగ్రహారా లిచ్చాడు. దోవలో ఎదురుపడితే పట్టపు టేనుగును ఆపి, చేయూత ఇచ్చి, ఎక్కించుకున్నాడు. మనుచరిత్ర కృతి, సమర్పణ వేళ తానెక్కిన ఊరేగింపు పల్లకిని చేత్తో పట్టి ఎత్తాడు. నిండు సభలో కవు లందరిలో శ్రేష్ఠునిగా పూజించి, తన కాలికి బంగారు గండపెండేరాన్ని

తొడిగాడు. బహుశా, ఈ అనంత సాహిత్య ప్రపంచ చరిత్రలో ఏ దేశంలోనూ, ఏ కవి కూడా ఇంతటి గౌరవ మర్యాదలు పొంది ఉండడు. ఆ మధురస్మృతులను శాశ్వతం చేసి, వ్యక్తిగతమైన అనుభవాన్ని సాధారణీకరణ ధర్మం చేత విశ్వజనీనంగా మార్చిన అద్భుత సన్నివేశ మిది.

రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ గారు రాయలనాటి ప్రబంధకవుల పరిధవాన్ని గురించి వ్రాస్తూ సభలో చెప్పిన పద్యాలు, సమస్యాపూరణలు ఇవన్నీ రాజు ముఖాన్ని చూస్తూ, ఇతర కవలును చూస్తూ, ఒకరికంటే ఒకరు బాగా చెప్పాలనీ, తమ పాండిత్య ప్రాభవాలను ప్రదర్శించుకోవాలనీ, అహమహమికలతో చెప్పినవి కాబట్టి, వాటివల్ల మనోవిభ్రమం కలిగినంతగా హృదయ స్పందన కలుగదని అంటూ, రాయుల మృతి తరువాత పెద్దన చెప్పిన పద్యాలు రాయలు తన సాహిత్య జీవితం మొత్తం చెప్పిన పద్యాలకంటె మిన్నగా, రసనిర్భరంగా ఉన్నవని ఉద్ఘాటించారు.రాయల మరణం తరవాత ఓఢ్రరాజు దండయాత్రకు వస్తే, ధర్మావేశ వివశుడైన కవితా పితామహుని నోట వెలువడిన ఈ పద్యం తాటాకు మీదకు ఎక్కి, గజపతి సన్నిధానానికి వెళ్ళి అతను సిగ్గుపడి వెనుతిరిగిపోయేలా చేసిందట. ఆ పద్య మిదిగో :

రాయరావుతు గండ రాచయేనుగు వచ్చి యారట్లకోట గోరాడునాడు
సంపెట నరపాల సార్వభౌముడు వచ్చి సింహాద్రి జయశిల చేర్చునాడు
సెలగోల సింహంబు చేరి ధిక్కృతి కంచు తల్పుల కరుల ఢీ కొల్పునాడు
ఘనతర నిర్భర గండపెండెర మిచ్చి కూతు రాయల కొనగూర్చునాడు
ఒడ లోరుంగవో? చచ్చితో? ఉర్విలేవో? చేరజాలక తలచెడి జీర్ణమైతో?
కన్నడం బెట్లు చొచ్చెదు గజపతేంద్ర! తెరచి నిలు కుక్క సొచ్చిన తెరగుదోప.

## నత్తులో మీసం

ఇరవయ్యో శతాబ్ది ప్రథమ భాగం తిరుపతి వేంకటేశ్వర యుగమని సారస్వతాభిమానుల అభిప్రాయం. వారు నానా రాజ సందర్శనం చేసి, చెప్పిన పద్యాలు,చేసిన అవధానాలు కవితా ప్రియుల నోళ్ళతో అప్పుడూ, ఇప్పుడూ ఆడుతూనే ఉన్నాయి. వెంకటగిరి సంస్థానంలో చెలికాని గోపాలరావుగారికి పెట్టుకున్న అర్జీ పద్యంలో ఎంత శైలీ సౌందర్యం, ఆత్మవిశ్వాసం ప్రకటితమయ్యాయో చూడండి.

సీ. దర్శనీయంబు గోదావరీ తీరంబు వాసంబు సద్గుణావాస ! మాకు
షడ్దర్శనీవేది చర్ల బ్రహ్మయశాస్త్రి గురువరేణ్యుడు ధరాభరణ ! మాకు
అష్టశతావధానాది సత్క్రియ మంచి నీళ్ళ ప్రాయము కలానిపుణ ! మాకు
శబ్ద శాస్త్ర ప్రశస్త ప్రభావం బాత పత్రమ్ము దివ్యచారిత్ర ! మాకు
పండిత ప్రీతి నొప్పు మీవంటి నృపతు లధిక దివ్యప్రతాప ! మాన్యమ్ము మాకు
విమల మధురాశుధారా కవిత్వసరణి కేళికాభూమి మాకు గోపాలరాయ !

ఊరు, గురువు పేరు, విద్యా విశేషాలు, వ్యక్తిగత విషయాలు చెప్పినప్పటికీ, కవితా పదార్థ స్పర్శ సోకటంచేత అటువంటి పద్యాలకు శాశ్వతత్వం కలిగింది. సంస్థానాధిపతి రాజగోపాలకృష్ణయాచేంద్రుల ముందు రాజులకు, కవులకు, ఉన్న సంబంధాన్ని ప్రాచీనకాలం నుంచి ఇటీవలి కాలం వరకూ ఉన్న వ్యక్తుల ఘటనలతో పోలుస్తూ చెప్పిన పద్యం విసర్గ రమణీయంగా ఉంది.

సీ. అలభోజు జెప్పంగ నారంభమును జేసి కాళిదాసుని జెప్పి గాని మాన
రల విక్రమార్కు యోగ్యత చెప్పగా బూని భట్టి జెప్పకమున్నె గట్టిపెట్ట
రల్ల రాజనరేంద్రు నారంభమును జేసి నన్నయ జెప్పక మున్నె మాను
రల కృష్ణదేవరాయల జెప్పగా బూని పెద్దన జెప్పక రద్దు సేయ

ఇప్పటిది గాదు మీకు గవీంద్రులకును గలదు సంబంధ మిది పూర్వకాలమున న
రేంద్ర ! శ్రీ రాజగోపాలకృష్ణ యాచభూప బహదూర్ ! మహారాజ ! భూరితేజ !

భోజకాళిదాసులు, భట్టివిక్రమార్కులు నన్నయ రాజనరేంద్రులు, పెద్దన కృష్ణరాయలు ఆచంద్ర తారార్కంగా ప్రకాశించిన సాహితీ వల్లభులు.

గంటకు నూరు పద్యాలు చెప్పటమంటే చాలా గొప్పగా ఉండేది. అంతటి శక్తి కలిగిన తమను రాజు ఆదరించాలని ఆయనకు విన్నవించుకున్నారు.

ఉ. గంటకు నూరు పద్యములు గట్టిగ జెప్పగ జాలినట్టి మా
వంటి కవీంద్ర సంతతిని బండితులై తనరారునట్టి మీ
వంటి ధరాపురందరు లవారణకారుణికత్వ మేర్పడన్
గంటికి ఱెప్ప రీతిగను కన్గొను టొప్పును గాదె, భూవరా !

వెంకట గిరి సభలో ఇచ్చిన ఒక కఠిన సమస్య ఇది. " సంధ్యావందన మాచరింపవలదా శౌచీతి బంధంబులన్" రతి బంధములతో సంధ్యావందన చేయటం ఎట్లా ? అసంబద్ధమైన ఈ ప్రశ్న సభంగభంగిమతో జంట కవులు సాధించిన తీరు ప్రశంసనీయం.

శా. వింధ్యాద్రి ప్రభ నొప్పు బల్కుచములన్ వేపట్టి పెంపొందు కా
మాంధ్యం బార్పగలేక వెఱ్ఱివలె నేలా మంచి యీ రాతిరిన్
వంధ్యం జేసెదు ? కాముకేళి అనగా పాండిత్యమా? లేక నీ
సంధ్యావందనమా ? చరింపవలదా? చౌశీతిబంధమ్ములన్.

ఛాందసుడైన విప్రునితో వేళాకోళంగా ఒకరన్న తీరును పద్య నిబద్ధం చేసి, మన్మథక్రీడ అంటే మీ పాండిత్యం. సంధ్యా వందనం అని అనుకుంటున్నావా? వివిధ బంధాలతో చరించాలి - అని హెచ్చరించటం ద్వారా ఒక శృంగార తరంగం ఉవ్వెత్తున ఎగసింది.

అలానే, అర్జునుడు సుభద్ర చేయి పట్టుకోవడం మీద సీస పద్యం చెప్పమంటే వచ్చిన పద్యం చూడండి.

సీ. కాషాయ వస్త్రమ్ము గని పాఱిపోకుము నీకైన వేషమో నీరజాక్షి !
పెద్ద గడ్డము చూచి బెదరిపోయెదవేల ? నీకైన వేషమో నీరజాక్షి !
రుద్రాక్ష పూసలు ఱొమ్మొత్తునని పోకు,నీకైన వేషమో నీరజాక్షి !
వెలిబూదె యంటునం చులికి పడెద వేల ? నీకైన వేషమో నీరజాక్షి !
యనుచు దన కర మర్జును డదిమి పట్ట బెద్ద లేమందురో, యను భీతిజేసి
వదలి పోలేక పోలేక వదలిపోవు చున్నయటు లీ సుభద్ర తానున్న దహహ !

ఈ పద్యంలోని సీస పాదాలలోని ద్వితీయార్థం ఒకటిగానే ఉండటం ఏమి విశేషం అని అనిపించవచ్చు. పద్యం తొందరగా పూరించడానికి వేసిన ఎత్తుగడ అని అనిపించవచ్చు. సుభద్రకు నచ్చచెప్పాలనే అదుర్దాను అవి ప్రకటించటం మాత్రమే కాక, అక్కడ మరొక ఉక్తి చాతుర్యం ఉంది. సభలో జంట కవులుగా ఇద్దరు నిల్చొని సన్యాసి వేషానికి కారణాలను ఒకరు చెబుతూంటే,రెండవవారు " నీకైన వేషమో నీరజాక్షి!" అని అంటూంటే అదొక అద్భుత సౌందర్యంగా భాసించే కవితా విలాసం.

విశాఖపట్టణంలో జరిగిన అష్టావధానంలో మీసాలను గురించిఒకటి వర్ణనగా, ఒకటి సమస్యగా చక్కటి పద్యాలు ప్రభవించాయి అప్పటికి వేంకటశాస్త్రిగారికి మీసా లుండేవి.

"దోసమటం చెఱింగియును దుందుడు కొప్పగ బెంచినార మీ, మీసము " అని అహంకారోక్తులు పలుకుతున్న రోజులవి. మీసాలవల్ల నష్ట మేమిటన్ని పృచ్ఛకు డడిగినప్పుడు ఆ కారణాలను వెతికి,

సీసంగా పేర్చవలసి వచ్చింది.

సీ. మెసవుచో నన్నంపు మెతుకులో జిక్కిన బైవారి నెల్ల నవ్వంగ జేయు
దన ముద్దియను ముద్దుగొనినచో నత్తులో దవిలి యత్యంత బాధను ఘటించు
పొడుము పీల్చిన రెల్లుకడ లంకవృద్ధిచేసినయట్లు మాలిన్యమును ఘటించు
తేనె పానము సేయుచో నెఱుంగక కొంచెముగ దగిల్చిన దెలుపున ఘటించు
పొట్టి దౌ చుట్ట గాల్చినప్పు డొక కొంత కాక దగిలిన సురసుర కాలి పొడు
వాసన ఘటింపజేయు వహ్వా ! యటైన వాసి మీసాలు లౌకికాగ్రేసరులకు.

అన్నం తినేటప్పుడుమీసాల్లో మెతుకు ఇరుక్కుంటే చూసేవారికి నవ్వుపుడుతుంది. ముద్దియను ముద్దు పెట్టుకుంటే నత్తులో తగిలితే బాధ. నశ్యం పీలిస్తే, మూతిపైని వెంట్రుకలకు తగిలి మాలిన్యాన్ని కలిగిస్తుంది.తేనె తాగేటప్పుడు పొరపాటున తగిలితే, తగిలిన భాగం తెల్లబడుతుంది. చుట్ట కాల్చేటప్పుడు చివరిదాకా పీలిస్తే, ఆ కాడ తగిలి పొరపాటున వెంట్రుకలు కాలి దుర్వాసన రావచ్చు. అయినా సరే, లౌకికులకు మీసాలు వాసినే కలిగిస్తాయి.

తెలుగూళ్ళలో మీసాలన్నపు కథ ఒకటి ఉన్నది. వరి బాగా పండనిరోజుల్లో సంపన్నులు మాత్రమే వరి అన్నం తినగలిగేవారు. అది అప్పటి రోజుల్లో గొప్ప కొంతమంది డాంబికంగా ప్రవర్తించేవారు. ఇంటిలోపల ఏ జొన్నన్నమో తిని, నాలుగు బియ్యపు గింజలు వేరే వండించి, ఒకటి రెండు మీసాల్లో ఉంచుకొని బైట పదిమందిలోకీ వచ్చేవారు. తాము వరి అన్నమే తింటున్నామని అందరూ అనుకోవాలని తాపత్రయం. ఒక గృహస్థు నలుగురిలో బయట మాట్లాడుతున్నప్పుడు వాళ్ళమ్మాయి చిన్నపిల్ల అమాయకురాలు లోపలినుంచీ ఆదుర్దాగా వచ్చి - " అయ్యా! మీసాల అన్నం పిల్లి తినిపోయిందే " అని అరిచింది. అప్పుడు అసలు సంగతి బయటపడగా అతను సిగ్గుపడవలసి వచ్చింది.

అదే అవధానంలో ఇచ్చిన - మరొక మీసపు సమస్యను ముద్దు పెట్టుకొనేటప్పుడు కొంత పెనుగులాడితే ముక్కు నత్తులో మీసం ఇరుక్కున్నదాన్ని - జంట కవులు సమస్యలో ఇలా సంఘటించారు.

ఉ. హాసము మోమునన్ జెలగ నంగజు ప్రేరణచే బ్రియుండు దన్
మోసము చేసి మోవిగొన, ముద్దియ పెనగసాగి, నప్డు వా
డా సఖితోడ బల్కు నిటు, "లక్కట! యల్లరిమాను, నత్తులో
మీసము చిక్కుకున్నది సుమీ ! యిటు మో మటు త్రిప్పబోకుమీ !"

## భవ్యాశుధార

మహాకవి కాళ్ళకూరి నారాయణరావుగారు 'మనోరంజని' మాసపత్రికను నడిపేవారు. దాంట్లో ఆనాటి సాహిత్య విశేషా లెన్నో వచ్చేవి. ప్రజ్ఞా పక్షపాతులైన కాళ్ళకూరి వారికి కొప్పరపు సోదర కవులంటే ఎంతో అభిమాన గౌరవా లేర్పడ్డాయి. వారి కవితా సామర్థ్యాన్ని ఎన్నోసార్లు ప్రత్యక్షంగా సమీక్షించి, పరీక్షించిన తరువాత కలిగిన నిశ్చితమైన అభిప్రాయ మది.

ఒకానొక అవధానంలో కత్తెరను గూర్చి కవిరాజ విరాజితం చెప్పమని ఒక పృచ్ఛకు డడిగితే ఒక కవిపుంగవుల జంట ఈ పద్యం చెప్పింది.

రవికల గుడ్డలు చొక్కల గుడ్డలు రంగుగ గుట్టెడు వారలకున్
సవరుగ దొర్లకు నెత్తులమీదను క్షౌరము చేసెడి వారలకున్
భవనము లందున దివ్వెల నెప్పుడు బాగొనరించెడు వారలకున్
మివులగ కత్తెర కావలయుం జుమి మిత్రుడ వింటవెమేదినిలోన్.

కొప్పరపు వారు కాకినాడలో ఉన్నప్పుడు కాళ్ళకూరివారు అదే ప్రశ్న వేశారు. దానికి వెంటనే సోదర కవులు ఉన్న పాటున ఎనిమిది కవిరాజ విరాజితాలు చెప్పారుట. అందులోని ఒక పద్యం చూడండి -

ఇరువురు గూడి యొనర్చునెడన్ బను లె ప్పగిదిన్ నెరవేరెడునో
యిరువురు కాంతల సందున కాంతు డదెంత సుఖం పడజాలునో యొ
క్కరునకు నొక్కరుడే గతి తోడ్పడగా వలెనో క్రియలందున క
త్తెర మన కత్తెరగెల్ల వివేకనిధీ ! తగ బోధ యొనర్చు జుమీ !

రెండు పద్యాలలో ఉన్న తారతమ్యాన్ని అతి సామాన్యుడు కూడా గమనించగలడు.

సోదర కవులు ఆశుకవితా ప్రదర్శన చేసే ప్రతి సభలో కొత్త కథ ఇమ్మని పృచ్ఛకులు కోరిన నియమాలతో చెపుతామని ఘంటాఘోషంగా ప్రకటించేవారు. ఎందుకంటే అప్పటికి ప్రతిపక్షులు ప్రసిద్ధ విషయాలమీద వర్ణన పద్యాలు రాసి పెట్టుకొని, వాటిని సభలో ఆశు కవితా ప్రదర్శన వేళ మధ్యలో చదివేవారని దుష్ప్రచారం చేశారు. గుంటూరు సీమలో తిరుపతి వెంకట కవులు -

విప్ర వినోది సంచివలె వేలుగ వర్ణనలన్ని చేసి యా
కొప్రపు వారు చెంత నిడు కొందురు..." అని రాశారు

అయితే అవేవీ సత్యం కాదనీ, ఏది అడిగినా, అడుగుతూ ఉండగానే సోదర కవులు పద్యాలు, చెప్పేవారనీ నాటి పండితులంతా ఎన్నిసార్లో ప్రశంసించారు.

కం: తడయరు ప్రశ్నం బడిగిన
తడవరు పల్కుకుగాగ తడబడ రెపుడున్
మిడుకరు కుడుపులు తోచక
నడివడి వచియింత్రు మున్ను వల్లించినటుల్

ఉ॥ ధోరణి నిర్ఝరాంబువని తోపగ గంటకు మూడు నూ ర్లసా
ధారణ వేగయుక్తి బుధతండము మెచ్చగ పల్కి పద్యముల్
ధారణ తప్పకుండ నవధానశతం బొనరింపజాలునో
సూరివరేణ్యులార ! మిము జూడ మహాద్భుతమయ్యె మా కిలన్.

అని భక్త కవివర్యులైన వావిలికొలను సుబ్బారావుగారు ప్రస్తుతి చేశారంటే ఇక వేరే ఏం చెప్పాలి?

కాకినాడలో గంజాము వారి ఇంట చెప్పిన సీతాకళ్యాణంలో వసిష్ఠుడు దశరథునితో విశ్వామిత్రుని ప్రభావాన్ని గూర్చిచెప్పిన మాటలు ఈవిధంగా వర్ణించబడినవి.

సీ. చటుల తపోగ్నిచే జగమెల్ల నుడికించి భవ్యమౌ బ్రహ్మర్షి పదవి గాంచె
మేనకాంగన తోడ మే నొక్కటిగా జేసి వలనొప్పగా శకుంతలను గాంచె
స్వర్గంబునకు ప్రతి స్వర్గంబు నిర్మించి యట త్రిశంకు మహేంద్రు నట్టులుంచె
కారాని దోసగుల గావించి దయనెంచియల హరిశ్చంద్రుని ఖ్యాతుజేసె
గీ॥ బమ్మ దిమ్మని తిమ్మని బమ్మగాగ చేయ నేర్పు గలాడు కౌశికు డితడు
చండకోపుడు సకలాస్త్రశస్త్ర వేదివీని కోరిక దీర్పు మూర్వీకళత్ర !

క్రీడాభిరామంలో శ్రీనాథుని ఈ క్రింది పద్యం విశ్వామిత్ర వర్ణనే.

సీ॥ అఖిల ప్రపంచంబు నన్యథా కల్పించెపటురోష రేఖ సాఫల్య మొంద
త్రైశంకవంబైన తారకా మండలంబాకాశ మార్గంబునందు నిలిపె
ఆమ్నాయ మాత, గాయత్రీ మహాదేవిప్రణుతించి బ్రహ్మర్షి పదము గాంచె
మాలినీతీర నిర్మల సైకతములలోమేన కాప్సరసతో మేలమాడె

గీ॥ ఎవ్వ డాతండు సామాన్య ఋషియె తలప తాటకా కాళరాత్రికి దాశరథికి
కాలకంధర కోదండ ఖండనునకు కార్ముకాచార్యవర్యుండు గాధిసుతుడు

అయితే కొప్పరపువారిది ఆశువు. ఆశువులో శ్రీనాథుని పద్యానికి సమతూకంగా ఉండే విధంగా చెప్పగలిగారంటే వారి శక్తి ఎంతటిదో ఊహించవచ్చు.

ఒక కథను ఆశువుగా చెప్పే సమయంలో ఏదో ' అనగా అనగా ఒక రాజు' అన్నట్లుగాక పాత్రల మధ్య సంభాషణను పద్యాలలో చెప్పడం ఒక్కోసారి సోదరకవు లిద్దరూ చెరొక పాత్రారోపణం చేసుకొన్నట్లు సంభాషణలు సాగించటం అత్యంత రంజకమైన దృశ్యం. శ్రీరాముడు శివధనుర్భంగానికి లేచినప్పుడు సీతకు, ఆమె చెలికత్తెకు జరిగిన ప్రసంగం ఎంతో మనోహరంగా వచ్చిందో చూడండి-

సీతమ॥ మగ డీతండగు నీ కటం చనెదు కొమ్మా ! తమ్మి పూరేకు బో
ల్పగ నేమేను గలట్టి యీ సరసుడే బావంది ముక్కంటి విం
టి గుణం బెక్కిడు నొక్కొ ! యుక్కుగల మన్నీ లెందరో చేరి సి
గ్గుగొనం జూడమె? యింత భాగ్య మిక నాకున్ దక్కునే? నిక్కమే !

సఖి

చ॥ విరులను వ్రాలి సోయగము వ్రీలకయుండి మరందమాను న
త్తరి మృదులంబునై యులి విధంబున దారువునంట దొల్చుచో
కరము కఠోరమౌ యలిముఖంబున నీ సుకుమారమౌళి సుం
దరతరమూర్తి యుగ్రమగు ధర్మము బూన మహోగ్రమౌ జుమీ !

ప్రకృతిలోని సంఘటనను కథలో జోడించి చెప్పటం వస్తు కవితా పద్ధతి. మహాభిషుడు గంగను మోహించిన ఘట్టం చెపుతుండగా వీవన గాలికి దీప మారిపోయింది. ఆ విషయాన్ని జోడించి చెప్పిన ఈ పద్యం సోదర కవుల భవ్యాశుధారా ధోరణికి నిదర్శనం.

చం॥ విషయపు తాళవృంతమున పెంపగు గాలిని దీప మారె నా
విషమశర ప్రయుక్తమగు భీమ మహాశుగ శక్తి నమ్మహా
భిషుని హృదంతర స్థితిని వెల్గెడు జ్ఞానపు దీప మారె గా
విషయ సుఖంబులం దెగడు విజ్ఞులిసీ ! యని యేవగింపగన్

## ధన్యకవయిత్రి

**ఆ**తుకూరి మొల్ల కవయిత్రులలో అగ్రశ్రేణికి చెందినది. ఈమె రామాయణానికి సాహిత్యంలో శాశ్వతమైన స్థానం ఉంది. కవిత్వం సరళంగా.సులభంగా అర్థమయ్యే విధంగాఉండాలి గాని, నిగూఢంగా అర్థక్లేశంతో ఉండరాదని అంటుంది ఈ రచయిత్రి.

ఆ.వె. తేనె సోకనీరు తీయన యగు రీతి
తో డనర్థమెల్ల తోచకుండ
గూఢ శబ్దములను గూర్చిన కావ్యమ్ము
మూగ చెవిటి వారి ముచ్చటగును.

బంధగర్భ చిత్ర కవిత్వాలతో క్లిష్టంగా ఉండే ప్రబంధాలను చూసి ఆమె ఇలా చెప్పి ఉంటుంది. ఈమె శ్రీకృష్ణదేవరాయల కాలం నాడు ఉండేదని, ఆయన ఆస్థానానికి కూడా వెళ్ళిందని ప్రతీతి. రాయల నామె ఈ సీస పద్యంతో స్తుతించిందట!

సీ. అతడు గోపాలకుండితడు భూపాలకుండెలమి నాతనికన్న నితడు ఘనుడు.
అతడు పాండవపక్షు డితడు పండిత రక్షుడెలమి నాతనికన్న నితడు ఘనుడు
అతడు యాదవ పోషి ఇతడు యాచకతోషియెలమి నాతనికన్న నితడు ఘనుడు.
అతడు కంసధ్వంసి ఇతడు కష్టధ్వంసియెలమి నాతనికన్న నితడు ఘనుడు
గీ. పల్లె కాతండు పట్టణ ప్రభు వితండు స్త్రీల కాతండు పద్మినీ స్త్రీల కితడు
సురల కాతండు తలప భూసురుల కితడు కృష్ణుడాతండు శ్రీమహాకృష్ణు డితడు
(శ్రీ రావూరి దొరసామిశర్మ సేకరణ)

కృష్ణుని, కృష్ణరాయలను పోల్చి అతనికంటే ఇతడే గొప్పవాడని మొల్ల చమత్కరించింది. ఆ రోజుల్లో రాయలవారిని కృష్ణునితో పోల్చటం ఎక్కువగా ఉండేది. కొంద రాయనను కృష్ణుని అవతారమే అనేవారు.

ఒకసారి రాయల సభలో రాముని తమ్ములు గొప్పవారా, ధర్మరాజు తమ్ములు గొప్పవారా అనే చర్చ వచ్చిందంట. పండితులు రకరకాలుగా వాదించారు. చివరకు రాయలవారు ధర్మరాజు తమ్ముళ్ళే గొప్పవారని తీర్పు చెప్పారట. అప్పుడు వెనక శ్వేతచ్ఛత్రం పట్టిన రజకుడు "ఈ జన్మలో కూడా తమకు పాండవ పక్షపాతమేనా ప్రభూ?" అన్నాడట.

దాంతో తనను కృష్ణావతారంగా పొగడిన వానికి -"'ఏంకావాలో కోరుకో. ఏదైనా సరే ఇస్తాను' ' అన్నారు.

వాడు దురాశకు పోయి-"దేవరకోట ఇప్పించండి" అని అడిగాడు. అంటే విజయనగర ప్రభువుగా తనను చేయమని వాడి కోరిక. అలా అడుగుతాడని తోచని రాయలవారు దిగ్భ్రాంతులైనారు. తిమ్మరుసు ప్రజ్ఞామూర్తి గనుక ఒక్క క్షణం ఆలోచించి రాజ్యంలోని దేవరకోట అనే ఊరును వాడికి ఇనాముగా ఇప్పించి, కొలువునుంచి బయటికి పంపించి దేవిడీమన్నా చేశాడు. రాజాస్థానాలలో విశేషాలిలా ఉంటాయి.

మొల్ల పద్యాన్ని విన్న వికటకవి తెనాలి రామకృష్ణుడు తన సహజధోరణిలో దానిని అనుకరిస్తూ పద్యం చెప్పాడు. ఈశ్వరుని, ఎద్దును పోలుస్తూ చెప్పిన పద్యమిది.

సి. అతడింబకు మగం డీత డమ్మకు మగం డెలమి నాతని కన్న నితడు ఘనుడు
అతడు శూలము ద్రిప్పు నితడు వాలము ద్రిప్పు నెలమి నాతనికన్న నితడు ఘనుడు
అత డమ్మునేయు నితడు కొమ్మునడాయునెలమి నాతని కన్న నితడు ఘనుడు
అతని కంటను చిచ్చు నితని కంటను బొచ్చునెలమి నాతనికన్న నితడు ఘనుడు
గి. దాత యాతండు గోనెలమోత యితడు దక్షుడాతండు ప్రజల సంరక్షు డితడు
దేవుడాతండు కుడితికి దేవుడితడు పశుపతి యతండు శ్రీమహాపశు వితండు
'శ్రీ రా. దొ. శర్మ సేకరణ)

మొల్ల ఆశుకవితా నైపుణ్యాన్ని చూడాలనే ఉద్దేశంతో రాయలు పండితులను పరీక్షించమని కోరగా అందరూ రామకృష్ణునే పృచ్ఛకునిగా ఉండమన్నారట! అప్పు డతను గుమ్ము, బుస్సు, రింగు, బొణుగు అనే మాటలు నాలుగు సీస పాదాలలో రావాలని, గజేంద్రుని రక్షించటానికి వచ్చే విష్ణుమూర్తి వర్ణన చేయాలని అడిగాడు. వెంటనే మొల్ల చెప్పిన పద్యం-

సీ. అనిలా ఖిహత దక్షిణావర్త శంఖంబు గుంఫితంబై కేల గుమ్ము రనగ
గొడుగయి తరమగా పడగ లెక్కెడ దట్టి భుజ గాధిపతి మీద బుస్సురనగ
చరచి విబ్బరముగా వరతెంచు బ ఖగరాజు రెక్క గాడ్పులు మింట రింగు రనగ
దొంత బ్రహ్మాండ పంక్తులు బొజ్జలో నుండి బెరాకి యొక్కొకమారు బొణుగురకోగ

గీ. కూసి కనుచూపు మేరకు కోక విసరి వెరకు వెరవకు వెరవకు వెరవ కనుచు
సుద్ద విడివచ్చి గజరాజు నొద్ద వ్రాలె ఆర్త రక్షణచణుడు నారాయణుండు
(శ్రీ నడకుదుటి వీరరాజులు సారస్వత వాస్యముల నుండి)

మొల్ల ప్రజ్ఞా ప్రాభవాలు, ఆశుకవి కవితా సామర్థ్యం ఇటువంటి పద్యాలవల్ల తెలియవచ్చు. అయితే ఆమె నిజమైన కవితా మాధుర్యం తెలియాలంటే రామాయణం చదివితీరాలి. అందులోని పద్యాలు సుమసుకుమారాలు. నగర వర్ణన చేస్తూ రాజకుమారులను వర్ణించిన ప్రఖ్యాత పద్యం ఎంత శైలీ మనోహరమైనదో చూడండి!

ఉ. రాజులు కాంతియందు రతిరాజులు రూపమునందు వాహినీ
రాజులు దానమందు మృగరాజులు విక్రమ కేళియందు గో
రాజులు భోగమందు దినరాజులు సంతత తేజమందు రా
రాజులు మానమందు నగరమ్మున రాజకుమారు లందరున్.

ఈ ఉత్పలమాలలోని మొదటి రాజ శబ్దం మాత్రం చంద్రుని చెపితే మిగతా వన్నీ శ్రేష్టతా వాచకాలు. ఆ ఊరిలోని రాజకుమారులు కాంతిలో చంద్రుని వంటివారు. రూపంలో మన్మథులు, దానంలో సముద్రులు, పరాక్రమంలో సింహాలు, భోగంలో దేవేంద్రులు, తేజస్సులో సూర్యులు, అభిమానంలో దుర్యోధనులు. ఈ పద్య రచన ఎంత అందమైనదంటే తరువాత ఎందరో దీన్ని అనుకరించారు.

" నీలమేఘ చ్ఛాయ బోలు దేహమువాడు ధవళాబ్జపత్ర నేత్రముల వాడు
కంబు సన్నిభమైన కంఠంబు గలవాడు బాగైన యట్టి గుల్భముల వాడు..."

అయిన శుభలక్షణాలున్న రాముని కొలిచి జీవితాన్ని చరితార్థం చేసుకొంది మొల్ల.

## పూరణ ప్రాగల్భ్యం

శ్రీకాకుళం జిల్లా పాలకొండ తాలూకా శ్రీహరిపురం అగ్రహారంలో జన్మించి రాజమహేంద్రవరంలో నివసిస్తున్న గానకవితా విశారద 'శాంతిశ్రీ' బొత్సకవి హరికథలు, బుర్రకథలు, నవలలు, నాటకాలు సుమారు వందవరకు రచించినారు. శ్రీమదజ్జా డాదిభట్టవారి అంతేవాసులై సంగీత, సాహిత్య హరికథలను అభ్యసించిన ఈ రచయిత, భువన విజయాది సభలలో ఎన్నో చోట్ల పాల్గొని, బహువిధ చిత్ర కవితా స్రష్టగా అలరారినారు.కొన్ని సమస్యా పూరణలు, వర్ణనలు, అనువాదాలు వీరి ప్రజ్ఞాపాటవానికి నిదర్శనంగా నిలిచాయి.

సమస్య-
**అతివకు చూడ నొప్పెసగె నారు కుచమ్ములు మూడు మోములున్,**
పూరణ-

**చం. అతి పతిభక్తి చే నలరు న య్యనసూయను జేరి మ్రొక్కి మా
పతుల నొసంగుమం చడుగు వాణి, భవాని, రమాలతాంగియున్
చతురత మీర ప్రార్థనలు సల్పగ మోదము కల్గె నంత న
య్యతివకు-చూడ నొప్పెసగె నారు కుచమ్ములు మూడు మోములున్.**

పతులను బిడ్డలుగా మార్చిన అనసూయను ముగురమ్మలు ప్రార్థించగా, ఆమె సంతోషించింది. ఇక తమ పతులకు స్వ స్వరూపాలు వస్తాయని ముగ్గురు తల్లులఅవయవాలూ సంతోష చిప్పొతా

లయ్యాయని భావం.

నవగ్రహాలను, త్రిమూర్తులను, వారి భార్యలను, దశావతరాలను ఒక కందంలో ఇమిడ్చమని కోరగా చెప్పిన పద్యం-

కం. ఇన శశి కుజ బుధ గురు కవి
శని ఫణికేత్వజుల అజుల సతులను ఝష కూ
ర్మ నరహరి వర్ణి భార్గవ
ఘన రామ త్రితయ బుద్ధ కల్కుల గొల్తున్.

బంధ కవితా రచనలోను బొత్సకవి ఆరితేరిన వారు. పుష్పమాలికాబంధా న్నొకదాన్ని చూడండి-

కం. వీరా। పరాత్పరా! వి
స్తారాచారా! సురారి దరకర సురణా!
ధీరా! ధరా ధరాగ్రా
గారా! ధీరా మరాగ ఖరపుర హరణా!

సంస్కృత శ్లోకాన్నిచ్చి అనువాదం చేయమన్నప్పుడు చెప్పింది-

క్వతిష్ఠ తస్తే పితరౌ మమేతి
అపర్ణయోక్తే పరిహాస పూర్వం
క్వవా మమే వశ్వసురౌ తవేతి
తామీరయన్ సస్మిత మీశ్వరో స్యాత్!!

అనువాదాన్ని చిన్న కంద పద్యంలో లలిత సుందరంగా తీర్చిన తీరు పరికించండి.

కం. నా కున్న తల్లిదండ్రులు
మీకేరీ అని అపర్ణ మేలము లాడన్
నాకున్న అత్తమామలు
నీ కేరీ యనుచు నగు త్రినేత్రుని గొల్తున్.

మామూలు పద్ధతులలో సమస్య పూరించటం సాధ్యం కానప్పుడు క్రమాలంకారంతో పూరించటం పండిత కవుల పద్ధతి. ఆ మార్గాన్నే అనుసరించవలసి వచ్చింది ఒక సమస్యా పూరణలో.

సమస్య-రావణుడన్న రామునకు, రామునకున్ ఉమ తల్లి కోడలౌ

పూరణ:

ఉ. భూ వనితా సుతం గొనుచు బోయె నెవండు? బలుండు వాలి సు
గ్రీవున కేమి యౌనొ? వెలిగెం దగ వేరికి? కొండ కూతురే
పావని? పూజ్య యెవ్వతె? ప్రభావతి కృష్ణున కేమి కావలెన్?
రావణు, డన్న, రామునకు రామునకున్, ఉమ, తల్లి, కోడలౌ

మరొక సమస్య ..

శ్వశురునిగోరె సాధ్వి స్తనవస్త్రము తానె త్యజించి అద్దిరా !

పూరణ:

అశమిత భీష్మగ్రీష్మ సమయంబున ఊష్మభరంబు నోర్వగా
వశమది గాక ప్రాణులకు ప్రాణము త్రాణము వాయుదేవునిన్
నిశచరియైన భీము రమణీమణి అల్ల హిడింబ డంబునన్
శ్వశురుని గోరె సాధ్వి స్తనవస్త్రము తానె త్యజించి అద్దిరా !

ఈ సమస్య సంస్కృతంలో నవద్వీప పరీక్షా సభలో అయ్యలసోమయాజుల గణపతి శాస్త్రిగారి కిచ్చింది. పూరణ కూడా వారి మార్గాన అనుసరించిందే. ఆ శ్లోకం కూడా చూడండి!

శ్లో. హిడింబా భీమదయితా నిదాఘే ఘర్మ పీడితా
స్తనవస్త్రం పరిత్యజ్య వధూ: శ్వశుర మిచ్ఛతి.

వనలక్ష్మిని పుష్పవతి అయిన కన్యకతో పోలుస్తూ చెప్పి రాగరంజితమైన గీతం గమనించండి !

గీ. చిగురు చెంగావి గల చీర చెలువు దోప
తళుకు గల పూలకాంతి కంచెల చెలంగ
రమణ రాగమంజరులు భార మ్మనంగ
పరగ వనరమా యువతి పుష్పవతి యయ్యె.

ఇటువంటి బహువిధ చమత్కార చారువులైన రచన లెన్నో చేసి, బొత్సకవి ఆంధ్ర సరస్వతీ వరివస్య చేశేరు.

## పినాకి జటా శశిరేఖ

తెలంగాణాలో సమర్థవంతంగా హృదయం స్పందింపజేసే కవిత చెప్పిన వారిలో శ్రీ అనుముల కృష్ణమూర్తి ఒకరు. సరదాగా ఆశువు చెప్పేవేళ అందమైన పద్యాన్ని పలికే నేర్పు వీరి ప్రత్యేకత. అక్కడక్కడ గోష్ఠులలో, ఆశుకవితా సభలలో వీరు చెప్పిన పద్యాలు ఆపాత రమణీయాలై రసోల్బణాలై రాజిల్లుతున్నాయి. సరస్వతీ స్తుతిగా వచ్చిన ఒక మత్తేభ విక్రీడి వీక్షించండి!

మ. స్వర మైత్రిం బడి సాగి వచ్చిన మనోజ్ఞమ్మైన నాదమ్ము చె
చ్చెర రాగాకృతి దాల్చి నట్టుల వచ స్సీమంతినీ ! నీ హృదం
తర సౌభాగ్యమె భావనన్ బడి రసానంద స్థిరమ్మైన అ
క్షర రమ్యాకృతి దాల్చి వేదమగు శాస్త్రమ్మైను కావ్య మ్మగున్

తన కవితా తత్వాన్ని వివరిస్తూ ఇలా చెపుతాడు కవి:

ఉ. నా కవితా సరస్వతికి నాలుక లే దొక గుండె దక్క మే
లౌ కనుచూపు లే దలుక లా వగు నశ్రువు దక్క తాను తా
నై కదలంగ లే దొకరి ఆసర వెంబడి దక్క ఇంక నే
సాకును జూపి తాను మనజాలునొ నల్వురి నోటి ముత్యమై?

తేట మనస్సు, భావనాబలం కలవారు తన కవితలోని బహుళార్థాలను బహురీతుల గ్రహించగల రన్న ఆత్మవిశ్వాసాన్ని ఈ కింది పద్యం తెలియజేస్తుంది.

తే. గీ. పద పదార్థ రసస్ఫూర్తి పలువిధాల
నోచుకొను వారి కొలది నానుడులలోన
రసవదర్థమ్ము లక్ష తీర్లగును భావ
నల బలముబట్టి తేట మనస్సుబట్టి

భావనా స్రవంతి కొత్త తీయదనాలతో ప్రవహిస్తుంది. అందులో పదాలను తెప్పలుగా జేసి ఆ నది మధ్యలోకి వెళ్ళి మునిగి కొత్త ముత్యా లేరి తెస్తానంటారు శ్రీకృష్ణమూర్తి.

చం. కనపడు ఆరు కోట్ల మెడకాయలపై తలకాయ లూగ నా
మనమున దోపనిమ్ము నవమాధురు లూరెడి భావనాస్రవం

తిని పదజాలమున్ విరిచి తెప్ప నొనర్చి మునింగి తెత్తు నీ
యనుమతి నీయవమ్మ! తెనుగమ్మ! సరాసరి క్రొత్త ముత్తెముల్

నన్నయ, తిక్కనల నాడున్న పరిస్థితులు వేరు. ఈనాటి పరిస్థితి వేరు. ఈ దారిద్ర్యం వేరు. వారి తపస్సు వేరు. ఈ తులనాత్మక భావన చెప్పిన పద్యం ఎంత వేదనను దాచుకొన్నదో చూడండి!

ఉ. నన్నయ తిక్క నాదుల పునాదులు వేరు మనాదిలేని వా
రున్న దినాలు వేరు మనమున్న దినమ్ములు వేరు వారి క
ధ్వాన్నపు కూటి గుడ్డలకు వాచిన దేబెయెదల్ కనుల్ మొగా
లున్నవొ? లేక బోలెడు మహోజ్వలమైన తపస్సె యుండెనో?
విశ్వమే నా కావ్య సింధువు
రసికుడే నా కాత్మబంధువు

అని పలికిన అనుముల వారు. తన కవితను రసజ్ఞులు మెచ్చినపుడు పొందిన సంతోషం ధరించిన రసాకృతి పరికించండి!

ఉ. ఇందరి అండ జూచుకొని ఏ కవి పొంగడు? మాతృవా క్సుధా
బిందువు లే గళమ్మున స్రవింపవు? వార్షుక మేఘ మాకస
మ్మందున గాంచి యే నెమలి యాడదు? కావ్య రసజ్ఞలోక మా
నందము నొంద నే కవి పినాకి జటా శశిరేఖ కా డిలన్.

ఈ పద్యాన్ని ఒక ఉపన్యాసకుడు చాలా సభలలో తను పాడుతుంటే, ఎన్నో సంవత్సరాలు ఇది అతగాడిదే అని అనుకొని తరువాత ఇదే గాక ఇటువంటి వెన్నో ఇతరుల పద్యాలను తనవిగా చెప్పుకోవటం ఆ గాయకు కవి అలవాటని తెలుసుకొని అతని అల్పతకు విచారించాను.

మెట్టు రామేశ్వరస్వామి అంటే అనుములవారికి ఎనలేని భక్తి. కవితా సింధువుగా జాలువారినప్పుడు పుట్టిన తరంగాలలో పరికించండి-

మ. గణియింపన్ వలె మత్తు రాకృత మహాఘ మ్మెల్ల పోగా మిగి
ల్చిన పున్నెమ్మును కోటి జన్మలు గతించెన్, లెక్క లేవీ? అసల్
ఋణమున్ వడ్డిని తేల్చుకోదలచి రానెంతున్ బయల్దేరి వ
చ్చిన వెన్కన్ మొహమాట ముండదు సుమీ! శ్రీమెట్టు రామేశ్వరా!

మ. ఎద నీవై మెదడేమొ గౌరియయి నా యీ నాల్కయే వాణియై
పది మాటల్ దులిపింపరాదె! కవితా బంధాలలో చిక్కినే
నెదురీతన్ బడలేను నీ దరికి రానేలేను ఏరీతి జే
రెద నారీతిగ చేరుకోదగవె! నన్ శ్రీమెట్టు రామేశ్వరా!
మహాకవి భవభూతి సమకాలీనుల మెప్పు కాంచలేక-
ఉత్పత్స్యతేస్తుమమ కోపి సమాన ధర్మః
కాలో హ్యయం నిరవధి ర్విపులా చ పృధ్వీ

తనతో సమాన హృదయధర్మంగల సహృదయుడు ఈ విశ్వంలో ఎప్పుడో ఒకప్పుడు పుట్టకపోడని అన్నట్లుగానే కృష్ణమూర్తిగారు అనుకొన్నారు.

ఉ. నీ కథ కంత మంచు రమణీ! ఎవడాడు? హిరణ్మయమ్ము ల
స్తోకరస ప్రపంచ పరిధుల్ సువిశాలము లీవు మెచ్చినన్

నాకు సమాన ధర్ముడయినన్ భజియించు త్వత: ప్రసన్నని
ర్వ్యాకుల రామణీయకత అస్మ దుపార్జిత వా గ్గగమ్మునన్

విగళిత వేద్యాంతరమైన రసభావసిద్ధి గల కవితాత్మ ఆవేశించినవ్యక్తిగా కృష్ణమూర్తిగారికి సారస్వత లోకంలో ఉన్నతమైన స్థానం ఉంది హృదయ వీణ పలికించే దివ్యనాదం వీరి కవితలో వినిపిస్తుంది.

## కాదేదీ కవితకనర్హం!

సముద్ర జన్యాలైన వస్తువులలో శంఖం విలువైనది. సామాన్యంగా ఎక్కువ వామావర్త శంఖాలు దొరుకుతాయి. దక్షిణావర్తం లభిస్తే దానిని ఎంతో అదృష్టంగా పరిగణిస్తారు. దానిలో నుండి ప్రణవనాదం వినిపిస్తుందని పూజావస్తువులలో దానికి అత్యధిక ప్రాధాన్యమిస్తారు. కొన్ని ప్రసిద్ధ క్షేత్రాలలో పురాతన దక్షిణావర్త శంఖాలను జాగ్రత్తగా దాచి భక్తులను స్పృశించనిచ్చి దాని నాదాన్ని వినే అవకాశమిచ్చి, దాని మహత్వాన్ని వివరిస్తుంటారు.

దామెర వెంకట భూపాలుడు గొప్ప జమీందారు. ఆయన పూజా గృహంలో ఇటువంటి శంఖ మొకటి ఉండేది. ఆనాటి పెద్దలు, పిన్నలు దాని గురించి ఎంతో వర్ణించుకొని ఆనందించేవారు. ప్రసిద్ధ పండితుడు శిష్టు కృష్ణమూర్తి కవి ఆ శంఖాన్ని గురించి మంచి ఊహలతో పద్యాలు చెప్పాడు.

సీ. చిగురు విల్తుని అప్ప చేబూను నడిదంపు రకపు పసిండి పరం జనంగ
కొనసాగి దెసలల్లి కొన బ్రాంకు నతని కీర్తి ప్రతాపముల చేరిక యనంగ
చెలియలి కను వేడ్క చెంత కరుగు దెంచి నిలుచున్న చిన్న జాబిలి యనంగ
ఆబిడ కీల్గంట నమరింప గూర్చిన కొమరారు బంగారు కెప్పు యనగ
గీ. పరగు నిందలి దక్షిణావర్త శంఖ మౌర!దామెరకుల కలశాబ్ధి సోమ!
విభవ నిర్జిత సుత్రామ! విమలనామ! సద్గుణ స్తోమ వెంకట సార్వభౌమ!

సముద్రం నుంచి పుట్టిన వారు లక్ష్మీచంద్రులు. బంగారు కుప్పెలో బిగించిన తెల్లని శంఖం లక్ష్మీదేవిని చూడటానికి వచ్చిన బాలచంద్రుని వలె ఉన్నదట! ఇటువంటి చమత్కారోహలు పై పద్యానికి అలంకార సౌందర్యాన్ని తెచ్చిపెట్టాయి.

శిష్టు సర్వశాస్త్రి అనే పండితుడు కూడా ఈ శంఖాన్ని తన భావనాచాతురితో ఇలా వర్ణించాడు.-

కం. కలిమి చెలి బొడ్డు బిడ్డకు
పొలుపుగ పాల్వోయనిడిన పొంబాలడ నా
నలరారు నిందు దగు ని
వ్వల మురి వేంకట నృపాల! వరగుణ శీలా !

లక్ష్మీదేవి బ్రహ్మకు పాలు పోయటానికి వాడే బంగారు పాలడలాగాశంఖ మున్నదట! పాలడ అంటే పసిపిల్లలకు పాలు పోసే చిన్ని పాత్ర అని నిఘంటువులు చెపుతున్నవి.

చం. తరుణ శశాంక శేఖరుడు దామెర వెంకట భూమి పాలు డా
దరమున జల్పు పూజనల దానములన్ ముద మంది మిత్రుడై
సిరి నిడువాది కానయిడ చెచ్చెర నాతడు పంప వచ్చి ను
స్థిరమగు శంఖసేవధిగ ధీ దలపోయుదు దివ్య శంఖమున్

దామెర వెంకట ప్రభువు చేసే పూజలకు. దానాలకు చంద్రమౌళీశ్వరుడు తన మిత్రుడైన

కుబేరుని ఆజ్ఞాపిస్తే అతని నవనిధులలో నొకటైన శంఖం ఇక్కడ స్థిరముగా ఉండిపోయినది అని కవి చాతుర్యధుర్యంగా అన్నాడు.

పూజకు ఉపయోగిస్తున్న బంగారు ఉద్ధరిణె కూడా కవి చేత పద్యాలను పలికించింది. పద్మాలయ చేతిలో ధరించే వీణ వలె కృష్ణుని చేతి మురళి వలె, పద్మాలను ప్రబోధించే సూర్యుని కిరణం వలె అన్నపూర్ణ చేతిలోని బంగారు గరిటెవలె ఈ ఉద్ధరిణె ఉంది.

సీ. వక్షస్థలీల సీద్వనజాలయా హస్తవాస్తవ్య హాటకవల్లకి యన
విశ్వజనీన తావిశ్రుత మహిమయుజ్మ్మరజిత్కర స్ఫుర న్మురళి యనగ
పద్మ ప్రబోధన ప్రథమాన తేజస్కభాస్కర ప్రత్యగ్రభాను వనగ
సన్నుత కాశీస్థి తాన్నపూర్ణాశయ స్థల లసత్తపనీయదర్వి యనగ
గీ. తగి పసిడి యుద్ధరిణె మించు దామరా నయాంబునిధి పూర్ణిమాచంద్ర యాదవేంద్ర
తరుణ కరుణాకటాక్ష విస్ఫురణ పూర్ణ విభవ విద్యా వినిస్తంద్ర! వేంకటేంద్ర!

అగ్గిపుల్లా, సబ్బుబిళ్ళా, కుక్కపిల్లా-కాదేదీ కవితకనర్హం ఉద్ధరిణెవంటి వస్తువులమీద కూడా చతురాలైన ఊహలు చేసిన శక్తి ఎంతైనా ప్రశంసనీయం.

ఆ జమీందారు తోటలో ఒక చక్కని పారిజాత వృక్షం. తొడిమతో తెల్లని పూలు పూచేవి. దానిని శిష్టు కవి ఎలా చూడండి!

మత్తకోకిల-
శోణవృంతము పారిజాతక సూనమొప్పకు వేంకట
క్షోణినాయక! యత్తమామల కొల్చుసేయమరుంగునన్
రాణ నొద్దిక మీర నిల్చిన నల్వ చెల్వ సముల్ల సత్
శోణిమాయత చిత్రకాంకన శోభమాన ముఖంబునాన్.

సరస్వతి తెల్లగా ఉంటుంది. కొత్తగా పెండ్లై అత్తవారింటివారికి సేవ చేయాలి. ఒక పక్కగా ఒద్దికగా సిగ్గుతో నిల్చుముఖం ఎర్రబడింది. ఆ దృశ్యం వలె ఈ అరుణవృంత పారి అలరుతూన్నదట.

ప్రబంధకవులలో ఏతాదృశ కల్పనలు, శిల్ప విన్యాసాల ధోరణులు ఎన్నో ఉండేవి.

## వాలిని పెండ్లియాడె....

పద్య కవిత్వానికి పట్టాభిషేకం చేయాలనే పట్టుదలతో, ప్రాచీనాంధ్ర కవితా సరస్వతికి పట్టు పరుపులు పరచాలనే దీక్షతో అసేతు శీతాచలమేకాదు. ఆవలి తీరాలలో అమెరికా, యూరప్ ఖండాలలో కూడా ఆంధ్ర కవిత్వ మాధుర్యాన్ని అందించటానికి నిరంతర కృషి చేస్తున్న సాహితీ కృషీవలుడు శ్రీ కనుమలూరి వెంకటశివయ్య. సభలలో, సారస్వత సమాజంలో, పత్రికలలో, ఆకాశవాణి మొదలైన ప్రచార, ప్రసార సాధనాలలో వచన కవిత్వం పెద్ద పీట వేసుకొని కూర్చుంటున్న వేళ వెయ్యేండ్ల వెలుగు గల పద్యం ప్రధాన స్థానం వహించాలని కంకణం కట్టుకొని వీరవ్రత నిష్ఠులైన కవితాశూరుడీ సహృదయ శిరోమణి. సాహితీ రూపకాలలో-నేతృత్వం వహించి భువన విజయాలలో రాయలుగా, ఇంద్ర సభలలో ఇంద్రునిగా, వైకుంఠ సభలో విష్ణువుగా, కైలాస సభలో శివునిగా ప్రధాన పాత్ర ధరించి పద్యమకరంద ధారలతో ప్రజలను పరవశింప చేస్తున్న ప్రజ్ఞాశాలి వెంకటశివయ్య గారు.

ఆయా సందర్భాలలో సాహితీ రూపకాది వివిధ సభలలో సమయోచిత పద్ధతిలో వారు పూరించిన సమస్యలు, పలికిన పద్యాలు కొన్ని ఉదాహరిస్తున్నాను.

సమస్య: రాయలుకేల దాల్చె సతి రత్నసమంచిత నూపురమ్ములన్.

పురుషాగ్రణి, వీర శ్రేష్టుడు కృష్ణరాయలు. అటువంటి వాడు భార్య కాలి అందెలను చేత ధరించాడనటం అనౌచిత్యం. దానికి వీరు పూరించిన పూరణ చూడండి!

ఉ॥ పాయకతాల్పు మంచు పతి భార్య కొసంగెను ముద్దుటందియల్
పాయకతాల్పు భార్య పొరపాటున తాల్పదదొక్క శార్వరిన్
జాయవయిన్ గడున్గనలె-చాన ధరించెను-తల్లి పల్కెరా
రా!యలుకేల ? తాల్చెసతి రత్న సమంచిత నూపురమ్ములన్.

ఒక భర్త తన భార్య మీద ప్రేమతో రత్నాలు పొదిగిన అందెలు చేయించి ఇచ్చాడు. తన సతి వాటినెప్పుడూ ధరించాలని అతని కోరిక. ఆమె అలానే ధరిస్తున్నది. ఒక నాటి రాత్రి ఏ పని ఒత్తిడి వల్లనో పతిదగ్గరకు వెళ్ళేప్పుడే పొరపాటున మరిచిపోయింది. అతనికికోసం వచ్చింది. ఆ సంగతి తెలుసుకొని ఆమె నుపురాలు ధరించింది. అతని తల్లి "నాయనా! రా రా! అలుకేల? కోపమెందుకు నీ భార్య అందెలు వేసుకుందిరా" అని చెప్పింది. ఇదీ కథ. ఒక అందమైన శృంగార ఘట్టం మన కనులముందు నిలిచింది. రాయలు-కేలదాల్చె-అన్న చోట రాయలు కాక "రారా - అలుకేల" అలుక-ఏల-అనటంలో చక్కని విరుపు వచ్చి చక్కని పూరణ లభించింది.

మరొక సమస్య:

ఇంద్ర పదద్వయంబుకవిసెన్ కట్టా! అయశ్శృంఖలల్

వెంకట శివయ్యగారు ఇంద్రపాత్ర ధారియైనపుడు ఈ సమస్య ఇవ్వబడటం-పూరణ సమయోచితంగా చమత్కార సారంగా ఉండటం విశేషం.

పూరణ చూడండి!

మ॥ స్తవనీయమ్మగు సత్కవిత్వనిధియై శాస్త్రార్థ సంవేదియై
అవనిన్ గల్గిన భోగభాగ్య పరిత్యప్తానందుడై పొంగి క్రూ
రవిధిన్ హాలికుడై విషాదములు మీరన్ క్రుంగు శ్రీనాథ సత్
కవిరాజేంద్ర పదద్వయంబు కవిసెన్ కట్టా! అయశ్శృంఖలల్

కవి సార్వభౌముడైన శ్రీనాథుని చివరి రోజులలో పడిన బాధలను గుర్తు చేస్తూ "ఆంధ్ర నైషధకర్త అంఘ్రి యుగ్మంబున దగిలియుండెను గదా! నిగళయుగము" అనే పద్యాన్నిస్మృతికి తెస్తూ ఈ పూరణ-ఇనుప సంకెళ్ళు పడినవి ఇంద్రుని పదములకు కాదు-కవీంద్రుని పాదములకు అని తెలుపుతుంది. ప్రతిభా పాటవానికి చాతురీధురీణతకు ఇదొక మచ్చు తునక.

ఇంకొక సమస్య.

వాలిని పెండ్లియాడె హరిబాణుడు సర్వజగద్ధితంబుగన్.

ఇది పూర్తిగా అసంబద్ధమైన విషయం. విష్ణువు, బాణుడు వాలిని పెండ్లి చేసుకోవటమేమిటి? ఈ అసంబద్ధతను కనుమలూరి వారు కూర్చి తీర్చిన తీరు పరికించండి!

ఉ॥ పూలలలిన్ సిగన్ దురిమి భూధరకన్య విభూతిరేఖలన్
ఫాలమునందు తీర్చి శివభర్తృక భావము గోరి దీక్ష షట్
కాలములన్ శివుంగొలువ కాయజసూను సమాను తత్సినీ
వాలిని పెండ్లియాడె హరిబాణుడు సర్వజగద్ధితంబుగన్.

హరి బాణుడు అంటే విష్ణువు, బాణుడు అని విడిగా గాక, హరిబాణముగా గలవాడు అని బహుబ్రీహి సమాసం చేస్తే శివుడన్న అర్థం వస్తుంది. వాలికి ముందు సినీ అనే అక్షరాలు చేరిస్తే పార్వతి అనే అర్థం వస్తుంది. శివుడు పార్వతిని పెండ్లాడాడు అనేది ప్రధానమైన అంశం. పైమూడు పాదాలు

దానికి తగిన బిగింపు. వర్ణన, శబ్దజాలం మీద కవికి గల అధికారాన్ని ఇటువంటి రచనలు తెలియజేస్తవి.

వేరొక సమస్య

పన్నుల రాజ్యమయ్యె బహథా రఘునాథుని సీమ జూడగన్.

ఒకనాటి దశరథ రాముడుగాని, చోళాధిపతి రఘునాథనాయకుడుగాని ప్రజలను పన్నులతో బాధించిన వారు కారు. సమస్య నిచ్చిన వ్యక్తి ఏ రాముని మనస్సులో పెట్టుకొన్నాడో గాని వెంకట శివయ్య గారి పూరణ మాత్రమిది.

ఉ. కిన్నెరమీటినట్లు వనకేకి ముదమ్మున నాడినట్టులున్
పిన్నవయస్సులోన అతి విస్తృతపాండితి గల్గి కైతలన్
చెన్నుగ చోళ దేశమున చెప్పెద రందరు విద్యలందు వ్యు
త్పన్నుల రాజ్యమయ్యె బహథా రఘునాథుని సీమ జూడగన్.

రఘునాథ నాయకుని రాజ్యము పన్నుల రాజ్యముగాదు-వ్యుత్పన్నుల రాజ్యము అనగా పండితుల సీమ అని రమణీయమైన అర్థము కల్పించబడింది. అంతేగాక సమస్యలోని యతి దోషము కూడా పూరణలో పరిహరింపబడింది.

ఇటువంటి చమత్కార రచనలేగాక నవరస భరితమైన "శివామోదము" వంటి కావ్యాలను రచించి వెంకట శివయ్యగారు సరస్వతీ పరివస్య చేస్తున్నారు. వారి నుండి ఆంధ్ర భారతికి ఇంకా ఎంతో సేవ జరగాలని, జరుగుతుందని సాహితీ హృదయుల ఆశ:

## గాడిద కాళ్ళు పట్టుకొని ..

విజయవాడ వాస్తవ్యులు, శాతవాహన కళాశాల ఉపన్యాసకులు శ్రీ పింగళి వెంకట కృష్ణారావుగారు లలిత కవితా నైపుణ్యం చమత్కార చారు వైఖరి గల కవివర్యులు. వరూధినీ ప్రవరాఖ్యము, ధ్రువమొదలైన నాటికలు రచించి భువన విజయాది సాహితీ రూపకాలలో పాల్గొని వివిధ సందర్భాలలో వీరు చెప్పిన సమస్యా పూరణలు మొదలైన వాటిని కొన్ని ఉదాహరిస్తున్నాను.

సమస్య: కోతిని బట్టుకొని గుణకోవిదుడందురు జ్ఞానులెప్పుడున్

పూరణ-

ఉ॥ నాతి పయోధరాద్రి తన నర్తనరంగము క్రోధమోహ మా
యాతరు జాల లంఘన విహారము సంసృతి భార సంకటో
పేతము మానసం బొక కపీంద్రము గాదె కపాలి గొల్చియా
కోతిని బట్టుకొని గుణ కోవిదుడందురు జ్ఞానులెప్పుడున్

మనస్సనే కోతి స్త్రీల కుచశైలాల మీద ఆడుతుంది. క్రోధమోహాలనే మాయాపక్షాల మీద దూకుతూ ఉంటుంది. శివుని గొల్చి దాన్ని పట్టుకొని నియమించగలవానిని లుజ్ఞాను పండితుడంటారు. 'హృదయకపి మత్యంత చపలం' అన్న శంకరాచార్యుల మార్గంలో పింగళి వారు మంచి పద్యాన్ని నిర్మించారు.

మరొక సమస్య:

రమ్మును భక్తులెప్పుడును త్రావుచునుందురు మోక్షసిద్ధికై.

రమ్ము, జిన్ను, బీరు మొదలైన పదార్థాలు మద్య విశేషమును స్ఫురింపజేస్తాయి. భక్తులు తాగటం-అందులో మోక్షంకోసం. ఈ అనౌచిత్యాన్ని తొలగించి 'వేదసారమ్మును' తాగిస్తున్నారు

కృష్ణారావుగారు.

గుంటూరు రఘునాథనాయక సభలో చేసిన ఈ పూరణ చూడండి!

ఉ। ఇమ్ముగ ధర్మవేదియు మునీంద్రుడు దివ్య పరాశరాత్మజుం
డిమ్మహి దు:ఖసాగరము నీదగ పంచమ వేద భారతా
ఖమ్ము రచించె గీత పరమార్థము జేయుచునట్టి వేద సా
రమ్మును భక్తులెల్లరును త్రావుచు నుందురు మోక్షసిద్ధికై

చౌడేపల్లి భువన విజయంలో ధూర్జటిగా పాల్గొన్నప్పుడిచ్చిన సమస్య

'రావణు కంఠమున్ గొరికె రాత్రి పుటుక్కున కుక్క మక్కువన్'

పూరణ-

ఉ॥ భావ రసోజ్వలంబు లగు పాటల మాటల రామచంద్రు డా
రావణు జంపినట్టి కథ రాతిరి నాడుచు తోలు బొమ్మలన్
పోవగ దీప సంతతులు బొమ్మల నొక్కటి జారిపోయె నా
రావణు కంఠమున్ గొరికె రాత్రి పుటుక్కున కుక్క మక్కువన్

రామాయణం తోలుబొమ్మలాట ఆడుతూ ఉండగా రాత్రి దీపాలు పోయాయి. రావణుడి బొమ్మ చీకట్లో జారిపోయింది. ఆటగాళ్ళకు దొరకలేదు. తరువాత ఆ రావణుని తోలుబొమ్మను కుక్క కొరికింది. ఇటువంటిదే పూర్వం మోచర్ల వెంకన్న పూరించిన సమస్యలలో 'సుగ్రీవుని ఎడమకాలు శునకము కరిచెన్'- అనేది ఉంది. ఇదీ తోలుబొమ్మలాట అర్థంలోనే పూరించారు.

కొత్తగూడెంలో రామరాజభూషణ పాత్రలో పూరించిన సమస్య

నస్యము వాడు వాని వదనంబున నిండె సుగంధ వీచికల్

పూరణ:

ఉ॥ నస్య మవశ్య మొక్కనికి నాందిగ నే పనికైన గాని చం
ద్రాస్యను ముద్దులాడ నతడా యమ కంపుకు తాళలేక తా
నాస్య సుగంధపున్ తములపాకుల ముద్దుల ముద్ర వేసి న్
నస్యము వాడు వాని వదనంబున నిండె సుగంధ వీచికల్

అటువంటిదే చమత్కార సారమైన వేరొక సమస్య-

గాడిద కాళ్ళ పట్టుకొని కావ్యగతార్థ మెరుంగ మేలగున్

పూరణ:

ఉ॥ వా డొక వ్యర్థు డాయె నని పల్కె కుమారుని జూచి తండ్రియున్
వీడవు దుష్ట సంగతి వివేక విహీనత నొజ్జ నెప్పుడున్
పాడి దొరంగి పల్కెదవు వారు మహాత్ములు బుద్ధి కల్గి ఓ
గాడిద!కాళ్ళు పట్టుకొని కావ్యగతార్థ మెరుంగ మేలగున్

తండ్రి చెడిపోతున్న కొడుకు చూసి "ఒరే గాడిదా! గురువులను తిడుతున్నావు. వారి కాళ్ళు పట్టుకొని చదువుకో' అని చెపుతున్న తీరు ఇందులో హాస్యలాస్యమై విలసిల్లింది.

అల్లము, బెల్లము, ఉల్లి, చల్ల-దత్తపది భారతార్థంలో కాళహస్తి సభలో చెప్పింది- ధృతరాష్ట్రుడు తన కుమారుడైన దుర్యోధనునితో చెపుతున్న ఘట్టం.

ఉ॥ అల్ల మురారి తోడు గల దచ్చుట పార్థున కెప్పుడున్ రణం
బెల్ల ముదావహం బనుచు నేరికి చెప్పగ సాధ్యమే విధా
త్రుల్లిఖితంబు తప్పదు మరొక్కరి మాట వినంగ నేర వం
చల్లన నాంబికేయుడు నిజాత్మజు కేర్పడు జెప్పె నప్పుడున్.

రామకృష్ణుని పాత్రలో వికట కవిత్వం ఎలా వచ్చింది అన్న ప్రశ్నకు గీత పద్యంలో చెప్పిన సమాధానం గందరగోళంగా ఉండి, తెనాలి కవి ఏమి చెపుతున్నాడని అయోమయంలో పడేస్తుంది.

గీ॥ కవి కక కట కకకవి కగ కనకనుక
దీక నకలి కడి కకాకళి కక
కజకనకని కవోకలె కకకని కక
కరకముకన కజూకచె కనకపుకడె

ఇది క భాషలో చేసిన చమత్కారం, కలు తీసివేస్తే అసలు వాక్యం వస్తుంది-వికటకవిగ నను దీవనలిడి కాళిక జననివోలె కనికరమున జూచెనపుడె.

ఇక ఇంద్ర సభలో చేసిన ఇంద్రస్తుతి పింగళి వారి వర్ణన నైపుణిని ప్రదర్శిస్తుంది-చూండి.

సీ॥ రంభా పరీరంభ జృంభణముబులె కాదు జంభాసురాది భంజనుడ వీవు
మందార వనమందు విందారజమెకాదు బృందార కానంద పృథుల నిధివి
మేరు విహార మమృత పానమేగాదు గోత్రవిపక్ష దక్షుండ వీవు
యాగాల భాగాల భోగాల కే గాదు మేఘాల నియమించు మేటి వీవు

గీ॥ మునుపు నీకు మారు నరుని భూమివరుని పొగడి కామార్థ సిద్ధుల పొందినాము
కవుల నలరింపు సత్కార గరిమ తోడ వేయి కన్నుల వెలుగొందు వేల్పురేడ!

సరస శైలి, చాతుర్యము, సూక్తివైచిత్రి గల వెంకట కృష్ణారావు గారి కలం నుంచి కమనీయ కావ్య సంచయం రావాలని ఆశిద్దాము.

## పాండిత్యవీరం

భువన విజయము, ఇంద్రసభ, బ్రహ్మసభ మొదలైన సాహితీ రూపకాలలో తెనాలి రామకృష్ణుడు, పాల్కురి సోమనాథుడు మొదలైన వైవిధ్యంగల పాత్రలు ధరిస్తూ, సాహిత్య ధర్మాసనంలో విప్లవ కవి పాత్ర ధరించి సంచలనాత్మకుడైన వ్యక్తిగా పేరు గాంచిన శ్రీ పి.ఎస్. ఆర్. ఆంజనేయప్రసాద్ కళ్యాణ వీణ, విజయవిపంచి మొదలైన పద్యకావ్యాలు, హరికథలు, బుర్రకథలు రచించి సాహిత్య సరస్వతీ వరివస్య చేస్తున్న ప్రతిభా సంపన్నులు. వివిధ రూపకాలలో వీరు రచించిన, పూరించిన సమస్యలు, పద్యాలు కొన్ని ఉదాహరిస్తున్నాను.

సమస్య:

మీసము లేని వారలె సుమీ! కవిధీరులు ధాత్రి లోపలన్.

పూరణ-

ఉ. ధీ సముదీర్ణులైన గురుదేవులు తిర్పతి వేంకటేశ్వరుల్
భాసిత సంస్కృతాంధ్ర ప్రతిభా కవితా మహితాశు ధోరణుల్
ఏ సభనైన నిల్వగ జయించుట సాధ్యమె పోటీ నిల్వ రే
మీ? సములేని, వారలె సుమీ కవిధీరులు ధాత్రి లోపలన్.

తిరుపతి వేంకట కవులతో పోటీ ఎవరు? ఉంటే ఎదురు నిలవరా? వారే సుమా కవిధీరులు- మీసము మీసముగా నిలవక, ఏమీసములు లేని అని విభాగం కావటంతో చాతుర్యం భాసిస్తున్నది.

మరొక సమస్య

నీతి రహితుడైన వాడె నృపుడుర సుమతీ!

నిజమైన రాజు నీతిరహితుడు కారాదు అవినీతి రహితుడు కావాలని అర్థం వచ్చేలా చేసిన పూరణ చూడండి!

కం. దాత యన నిచ్చు వాడే
నేత యనన్ ప్రజల సేవ నిలిచిన వాడే
ఖ్యాతి గను ధైర్యమున నవి
నీతి రహితుడైన వాడె నృపుడుర సుమతీ!

ఇంకొక సమస్య..

అన్నను భర్తగా గొనిన అమ్మలమిన్న అదృష్ట రాశియే!

పూరణ:

ఉ. పన్నుగ పార్వతీ రమణి పాపము! భర్తగ బిచ్చగాడు సాం
బన్నను పొందె-కాననము పాలయి కష్టము లందె మున్ను రా
మన్నను పొంది సీతజగ మందున పూజలు లేని వాని బ్ర
హ్మన్నను పొందె వాణి అని అన్ని విధంబునీ యుగంబులో
ఎన్నిక గన్న వాడనుచు ఇంతుల మే లలమేలుమంగ వెం
కన్నను భర్తగా గొనిన అమ్మల మిన్న అదృష్ట రాశియే!

అన్న కాదు వెంకన్న అని పేరులోకి మార్చటం వల్ల- అంతకు ముందు పాదాలలో చూపిన ఉపపత్తులవల్ల పూరణ సౌందర్య సంభరితమైంది.

వేరొక సమస్య:

గ్రహములు రెండె మానవుని కష్ట సుఖమ్ముల కెల్ల హేతుభూతమున్.

పూరణ:

చం. ఇహపర సాధనమ్ము లయి ఈశ్వరి మాయ నెరుంగగా నవ
గ్రహములె జీవి జీవికకు కారణ మంచు తలంపబోను నా
తహ తహలోని స్వార్థమున దాగిన మూగిన ద్వేష రాగముల్
గ్రహములు రెండె మానవుని కష్ట సుఖమ్ముల కెల్ల హేతువుల్.

లోకంలో మన కష్ట సుఖాలకు నవగ్రహాలు కారణమని అంటారు. అలా కాదు ద్వేష రాగాలే కారణమని చమత్కారం చేసి పూరించారు శ్రీ ఆంజనేయ ప్రసాద్.

పౌరాణిక ఘట్టానికి చెందిన మరి ఒక సమస్యే:

"రంభం గూడి శకుంతల గనియెన్నా రాజర్షి హర్షంబునన్"

విశ్వామిత్రుడు రాజర్షిగా మేనకను కలియటంవల్ల శకుంతల పుట్టింది. రంభను కాదు కలిసింది అయితే మదనకేళీ అరంభయిన మేనకను కలవటం వల్ల జరిగింది అని చేసిన సుందరమైన సూక్తి సురభిళమైన పూరణ చూండి!

శా. శంభో శంకర! పాహి పాహి యని విశ్వామిత్రు డుద్య త్తపో
శుంభత్వంబున నిల్వ నాతని మహస్సున్ గెల్వలే కచ్చరన్
జంభారాతియె పంప మేనకసుమాస్త్ర ప్రౌఢ కేళీ కళా
రంభన్ గూడి శకుంతలన్ గనియె నా రాజర్షి హర్షింబునన్.

రామలక్ష్మణ భరత శత్రుఘ్న శబ్దాలతో భారతార్థంలో పద్యం-

గీ. కందురా మరి పాండురా ణ్ణందనులను
లక్ష్య లక్షణ విద్యాసులక్ష్మణులను
వినయ భరతుల సద్యశో విలసితులను
సకల శత్రుఘ్నులను ధర్మ సంయుతులను.

రామ శబ్దం రామరి అనే దాంట్లోనూ లక్ష్మణ శబ్దం సులక్ష్మణ శబ్దంలోనూ ఇమిడాయి. వినయభ-రతుల-భ అంటే కాంతి రతులు అంటే ఆసక్తి గలవారు. శత్రుఘ్నులంటే రిపులను చంపేవారు.

పాండిత్య వీరం గల ఇటువంటి పూరణలతోపాటు వర్ణన వైచిత్రి కూడా చాలాచోట్ల కనిపిస్తుంది. బ్రహ్మ సభలో చెప్పిన బ్రహ్మ వర్ణన ఎంత చమత్కారభరితమో పరికించండి!

సీ. సిరి ఉరమ్మున నుండ తిరిగి మూ డడుగులు బిచ్చమెత్తిన వాని పెద్ద బిడ్డ!
అయిన వారల మధ్య అగ్గిని రగిలించు ముళ్ళ మాటల దేవమునికి తండ్రి!
నలుగురి నోళ్ళలో నాని నాట్యము సల్పు చదువుల దొరసాని చక్కనయ్య!
మనసులో పుట్టియు మనసులో పెరిగియు మనసును కాల్చు మన్మథుని అన్న!

గీ. నిలకడయె లేని చిత్రమౌ నిసుగువయ్యు తాతవై నిల్చినట్టి విధాత నీవు
పూని భువిలోన పూజలు లేని దేవ! తీ రెరుంగని సృష్టి మనీది!

శ్రీ ఆంజనేయప్రసాద్ కలం నుంచి ఇటువంటి చాతురీ ధురీణాలు, సరస గుణపారీణాలు అయిన రచనలు మరిన్ని రాగలవని ఆశిద్దాము.

## అంగముచేతబట్టి ...

అధునాతన సాహితీ రూపక పాత్రధారులలో ఏ పాత్ర నిచ్చినా అత్యంత సమర్థంగా నిర్వహించగల దక్షుడు శ్రీ మొవ్వ వృషాద్రిపతి. సంగీత సాహిత్యాలలో పరిణతమైన ప్రజ్ఞ, నటుడుగా అపారమైన అనుభవం అతని వ్యక్తిత్వానికి వన్నె తెచ్చాయి. తిరుమల తిరుపతి దేవస్థానం వారి సహాయంతో ముద్రించిన ఆధ్యాత్మిక గ్రంథాలు, పద్య గద్య ప్రబంధాలు అతనికి రచనారంగంలో సముచితమైన స్థానం తెచ్చాయి. భువన విజయాది సాహితీ రూపకాలలో అతడు పూరించిన సమస్యలు బహు ప్రజా ప్రశంసలందుకొన్నాయి. వాటిలో కొన్ని ఉదాహరిస్తున్నాను.

సమస్య:

రంభకు మూతిపై మొలిచె రమ్య నవాంకురమైన మీసముల్.

నూత్న యౌవనారంభంలో ఉన్న యువకుని మూతిపైన మీసాలు మొలిచాయి అనే అర్థం వచ్చేలా చేసిన పూరణ చూడండి.

ఉ: శుంభ దభంగ గర్వముగ చొక్కుచు వాడిమి వాలు చూపు సం
రంభము తోడ స్త్రీల మృదు మానసముల్ హరియించి తన్మ నో
జంభరమై విహారముల వర్తిల నెంచెడు నూత్న యౌవనా
రంభకు మూతిపై మొలిచె రమ్య నవాంరకురమైన మీసముల్.

మరొక సమస్య:

**అమ్మకు కూడ భార్య గల దామెను ఏమని పిల్వగా దగున్.**

పూరణ:

ఉ. ఇమ్ముగ మోహినీ తనువు నెత్తిన శ్రీపతికిన్ బురారికిన్
సమ్మతి నాత్మజు డయిన స్వామి- అయప్ప స్వమాత కై వికుం
ఠమ్మున కేగి శ్రీనలిన నాథుల గాంచి తలంచె నిట్లు మా
యమ్మకు కూడా భార్య గల దామెను ఏమని పిల్వగా వలెన్?

విష్ణువు మోహిని రూపం దాల్చినప్పుడు శివునివల్ల పుట్టిన వాడు అయ్యప్ప. కనుక అయ్యప్ప తల్లి విష్ణువు. అతని భార్య లక్ష్మి. ఆమెను అయ్యప్ప ఏమని పిలవాలి? శాస్త్రకే ఈ సందేహం కలిగిందట!

వేరొక సమస్య:

కటి పైకెత్తి లతాంగి దుమ్ము దులిపెన్ కాయంబు కంపింపగన్.

పూరణ:

మః చటులంబై సుడిగాలి వీచె నతి విస్తారంబుగా లేచి ముం
గిట నున్నట్టి సమస్త వస్తువుల మ్రింగెన్ దుమ్ము - ఆ రాత్రి పం
డుటకై చీపురు దాల్చి చీకటుల యందున్ వాల్చి యున్నట్టి కం
కటి పైకెత్తి లతాంగి దుమ్ము దులిపెన్ కాయంబు కంపింపగన్.

కటి కాదు-కంకటి - అనగా మంచం పైకెత్తి ఆమె దుమ్ము దులిపిందని చమత్కారసారమైన అర్థం వచ్చి అందం మిన్నందుకున్నది.

ఇంకొక సమస్య:

అంగము చేతబట్టి అతడందరి శీర్షములన్ పగిల్చెడిన్

వినగానే అశ్లీలంగా ఉన్నట్లు అనిపించినా పూరణ విన్న తరువాత కవి సామర్థ్యం ద్యోతకమవుతుంది.

**ఉ: ముంగిట నిద్ర జెందు తరి పొందుగ నింటికి కన్న లెట్టగా**
**దొంగల గాంచి విక్రమమె తోడుగ చివ్వున లేచి యుద్ధతిన్**
**పొంగి సమీప దేశమున పూర్ణ దృఢస్థితి నున్న భగ్న ఖ**
**ట్వాంగము చేతబట్టి అతడందరి శీర్షములం బగిల్చెడిన్.**

ఇంటి ముంగిట నిద్రపోతుంటే దొంగలు పడ్డారు. ధైర్యసాహసాలున్న అతడు వెంటనే లేచి విరిగిన మంచపు కోడు పక్క నుంటే తీసుకొని,ఆ దొంగల తలలు పగలగొట్టాడు. 'ఖట్వము' అంటే మంచం. 'ఖట్వాంగము' అంటే దాని కోడు.

మనము,ధనము, వనము, క్షణము- రామాయణార్థంలో దత్తపది కోరినప్పుడు చెప్పిన పద్యం-

చం: మన మురియాడుచుండ ననుమానపు తీవ్రత దాసి దుష్టబో
**ధనమున కైక తీవ్ర చలిత వ్యథ భర్తను జూచి, మీదు జీ**
వనము గదా! రఘూద్వహుడు వానిని కానకు బంపి సౌమ్య ఈ
క్షణముల నా కుమారునకు కట్టుడు పట్టము నీ క్షణంబనెన్

రామాయణార్థంలోనే చేరు,కూరు, తీరు, ఊరు కూర్చిన తీరు చూడండి. కార్తవీర్యార్జునుని మంత్రులు రావణుని హెచ్చరించిన ఘట్టం ఇలా పద్యమైంది.

ఉ: చేరువ లేడు భూపు డని చిత్తము వచ్చిన రీతి పల్క చే

కూరునె రావణా! జయము క్రూర బలుండగు కార్తవీర్యు చే
తీరుదు వింక నీదు భుజతేజము జూపుము శౌర్య మున్న రా
చూరున వీరులున్ విజయ ముండక వందలు వందలుందురా?
'కొడుకును గాంచి రైక ముడి గొబ్బున విప్పి కవుంగిలించెడున్"

అనే సమస్యలోని అసభ్యతను తొలగించి తీరుగా పూరించిన తీరు పరికించండి.

చం: వడి వడి కూలికిం జనియె పల్లె పడంతి యొకర్తు ప్రొద్దునన్
బుడుతని ఇంటిలో విడిచి ప్రొద్దొక యించుక వ్రాలినంత నె
వ్వడి నిలు జేరవచ్చి యట పాలకు నేడ్చెడి ముద్దు కూనయౌ
కొడుకును గాంచి రైక ముడి గొబ్బున విప్పి కవుంగిలించెడున్

పాలకోసం ఏడుస్తున్న కొడుకుకు పాలివ్వటం కోసం రైక ముడి విప్పి దగ్గరకు తీసుకోవడం మాతృ లక్షణం.ఆ భావన ఇక్కడ ఎంతో రసవంతంగా ప్రస్ఫుటమై, ఈ సమస్యా పూరణకు రామణీయకత తెచ్చింది.

బల్లి, చెల్లి, పిల్లి, గిల్లి- దత్తపది రామాయణార్థంలో పూరించిన విధం గమనించండి-

ఉ: బల్లిదుడైన రాఘవు డపార ముదంబున కాలమప్పుడే
చెల్లిన చాపమున్ విరిచి సీతను పెండిలి యాడ భీతి కం
పిల్లి ధరావరుల్ శరణు వేడిరి మౌని గణంబు భక్తి రా
ల్లి నమో నమో యనుచు కేల్గవ మోడ్చి మతించి రింపుగన్

ఈ విధమైన సాహితీ శక్తి పుష్కలంగా ఉన్న శ్రీ వృషాద్రిపతి- కృష్ణదేవరాయ ప్రబంధాన్ని నిర్మించటం ఉండటం ముదావహం. అది చారిత్రక ప్రబంధాలలో ఉన్నత స్థానాన్ని అందుకోగలదని ఆశిద్దాము.

## జారులు పిల్చిరమ్మ...

అసిధార మొదలైన పద్య కావ్యాలు, బలరామ విజయము మొదలైన నాటకాలు బాల వాఙ్మయానికి చెందిన కథా , గేయ, నాటికా సంపుటులు ఎన్నో రచించటమే కాక,స్వయంగా నటులై, గాయకులై, భువన విజయాది సాహితీ రూపకాలలో బహు పాత్రధారులై ప్రకాశిస్తున్న కవివర్యులు శ్రీ అన్నపర్తి సీతారామాంజనేయులు. వివిధ సందర్భాలలో వేదికలపై వారు పూరించిన సమస్యలు, చెప్పిన పద్యాలు కొన్నింటిని దిఙ్మాత్రంగా చూద్దాం.

సమస్య:

అమవస నాటి వెన్నెల లహా! తలపోయగ నద్భుతం బగున్.

పూరణ:

చం॥ అమర వనంబు సాటి యిది అప్పటికిప్పుడు రాక యీ నికుం
జములును కేళికూళులును చంద్రశిలల్ మన కేళి భూములై
కమల ముఖీ! తనర్చినవిగా అల పున్నమి నాటి రేయి, నే
డమవస-నాటి వెన్నెల లహా! తలపోయగ నద్భుతం బగున్

ఈనాడు అమావాస్య- అలనాటి పున్నమి వెన్నెల లద్భుతంగా ఉన్నాయి. అని పదాల మలుపుతో చమత్కారం సాధించారు.

సమస్య:

**జారులు పిల్చి రమ్మ గిరిజా! పతి కాదన డేగు వేగమే!**

జారుడు పిలిస్తే తన భార్యను -పార్వతిని- శివుడు పోయి రమ్మంటున్నాడు. ఈ అసంబద్ధతనుచాలామంది పూజారులు అనే పదాన్ని వేసుకొని పూరించారు. వీరు మరొక పద్ధతి ఆలోచించి దైత్యరాజారులు అని ప్రయోగించి అర్థవంతంగా పూరించారు.

పూరణ:

ఉ॥ ఊరక చూచుచుండు టిపు డొప్పునె? స్వర్గము తల్లడిల్లగా
దారుణ కర్ముడై మహిష దానవు డేపున నెల్ల వేల్పులన్
గారియ వెట్టుచుండె వరగర్వితు నాతని ద్రుంప దైత్య రా
జారులు పిల్చి రమ్మ గిరిజా! పతి కాదన డేగు వేగమే-

జార శబ్దంతోటే మరొక సమస్య

**జార కులావతంసమును సాకదగున్ నృపతుల్ కవీశ్వరా!**

సుగంధ ద్రవ్యాన్ని ఇచ్చే పునుగుపిల్లిని ఊహించి చేసిన ఈ అందమైన పూరణ శబ్దాధికారానికి చిహ్నం.

ఉ॥ సార విచార ధీరులను చారు కవిత్వ మహత్వ పూర్ణులన్
సూరి వరేణ్యులన్ మనిచి సూక్తి మరందము లాను రీతిగా
సార సుగంధ బంధుర ప్రశస్తిని గోరినచో పునుంగు మా
ర్జార కులావతంసమును సాకదగున్ నృపతుల్ మునీశ్వరా!

వేరొక సమస్య:

దివ్వె వెలుగుచుండిన గదిన్ నలుమూలల నిండె చీకటున్

పూరణ-

ఉ॥ రవ్వకు రేచి ప్రాణ విభురాయిడి పెట్టుట చాలు; నీ వటుల్
జవ్వని! మారు మోమగుట చందురు గప్పిన మేఘ పంక్తి నా
నివ్వటిలంగ నీ కురుల నీలిమ - ముద్దియ! నీ ముఖేందుడన్
దివ్వె వెలుంగు చుండిన గదిన్ నలుమూలల నిండె చీకటుల్

ప్రేమ ఘట్టాన్ని వర్ణిస్తూ ప్రియురాలి ముఖం చంద్రుని వంటిదనీ, ఆమె కేశాలు మబ్బుల వంటివనీ, ఆమె ముఖ చంద్రుడొకవైపు దీపంలాగా వెలుగుతున్నా రెండోవైపు జుట్టు చీకటులు నలుమూలల కమ్ముకుంటున్నవనీ కల్పన. శృంగార మధురమైన ఈ భావన అన్నపర్తి వారి రస కవితా సృష్టికొక మచ్చుతునక.

ధూమపానాన్ని వర్ణిస్తూ ఆంజనేయులుగారు చెప్పిన పద్యాలలో కొత్త కొత్త ఊహలకు- పరిశీలనకు నెలవైన ఒక సీసాన్ని చూడండి!

**సీ॥ లక్షాధికారికి భిక్షాధికారికి సమత పాటించెడి సామ్యవాది**
**తాను దగ్ధ మగుచు తన భక్త సంతతి కానంద మొసగెడి త్యాగమూర్తి**
**శరణన్న వారిని కరుణతో దరిజేర్చి పట్టు సడలనీని జట్టుకాడు**
**యాచన కొక వింత ఆధిక్య మొదవించి వృత్తి గౌరవ రీతి పెంచువాడు.**

గీః ఇప్పుడిప్పుడె మహిళల కిష్టు డగుచు స్త్రీకి స్వేచ్ఛ నొసంగిన తీవ్రవాది
అభ్యుదయ వాది, రసికుండు, నాప్తు డరయ ధూమపానమ్ము నరులకు తోడునీడ

గర్తపురము, పుష్పోత్సవము, శ్రీనాథుడు,సాహిత్య పీఠము- నాలుగు పదాలుపయోగించి. శివ స్తుతి చెప్పమన్నప్పుడు వచ్చిన పద్యం.

మః విలయంబున్ బొనరింప గర్త, పురముల్ భేదించు శూరుండు పా
ముల గైసేసెడి దిట్ట, భక్తజన హృత్పుష్పోత్సవంబుల్ సదా
చెలగం జేసెడి వేల్పు, యోగపదసు శ్రీనాథుడా రాజతా
చల సంవాసి సదాశివుండు మనుచున్ సాహిత్య పీఠమ్ములన్.

గోలకొండ, తానీష, జుల్మాన, భద్రాచలం- శబ్దాలతో భాగవతార్థంలో పద్యం కోరినప్పుడు చెప్పినది-

శాః చాలుం జాలును గోల - కొండ దిగువన్ శంకింపకే నిల్వుడీ
ఏలా భీతిల? రండు నాకరము తా నీషత్కరం బూగదున్
సోలం బోవదు రాల వాన పది రోజుల్ మానకే పోసినన్
బాలుర్ వృద్ధులు రండు నసర్వు లిదిగో భద్రాచలం బయ్యెడున్.

గోల-కొండ దిగువ, తాను ఈషత్ కరంబు, పది రోజుల్ మానక, గోపులకు భద్రమైన అచలము గోభద్రాచలము- ఈ విధంగా గోవర్ధనోద్ధరణ ఘట్టంలో కృష్ణుడు పలికిన సందర్భాన్ని తీసుకొని చెప్పిన పద్యం ఆంధ్ర సంస్కృత భాషలలో ఆంజనేయులుగారి పాండితీ ప్రాభవాన్ని తెలుపుతున్నది.

ప్రవరుడు, వరూధిని, స్వరోచి,మనోరమ- శబ్దాలతో రామాయణార్థంలో చెప్పిన పద్యం- ఆ పాత్రల పేర్లను గాక, శ్రేష్టుడు,సైన్యం, కాంతి,మనస్సుకు అధిపతి అనే అర్థాలలోనికి మార్చి చెప్పిన పద్యం ఎంత రమణీయంగా ఉందో చూడండి.

చం॥ అవు నిది నీ మనోరమణు డంపిన ఉంగరమింక నమ్ము మీ
బవరమునందు నిక్కము ప్లవంగ వరూధిని తోడ మా రఘు
ప్రవరుడు నిల్వ తత్ప్రదరవహ్నికి తోడయి తత్స్వరోచి రు
ద్భవ నావదావ కీలలిక భస్మము సేయవె రాక్షసేశ్వరున్.

పద్య నిర్మాణంలో, పాండితీ ప్రకర్షలో,చమత్కార ధోరణిలో అత్యంత ప్రజ్ఞగల ఆంజనేయులుగారి లేఖిని నుంచి ఇంకా ఉదాత్త కావ్యాలను నాటకాలను,సాహితీ ప్రక్రియలను ఆశిద్దాము.

## శ్రీశ్రీ కి విశ్వనాథ...

ఇప్పటి అవధానులలో విజయవాడ సయ్యద్ అప్పలస్వామి కళాశాల ఆంధ్రోపన్యాసకులు శ్రీ పాలపర్తి శ్యామలానంద ప్రసాద్ పేర్కొన దగినవారు. కవి పండితుల, పీఠాధిపతుల ఆశీస్సులందుకొని, 'అవధాన కళాసరస్వతి' అన్న బిరుదును కూడా పొందినవారు. అరవై, డెబ్బై అష్టావధానాలు,మరి కొన్ని ద్విగుణిత,చతుర్గుణిత అష్టావధానాలు చేసి పరిణత ప్రజ్ఞాయుతుడుగా కీర్తి గాంచిన వీరి అవధానాలలోని కొన్ని సమస్యా పూరణలను,తదితర పద్యాలను ఉదాహరిస్తున్నాను.

సమస్యః శ్రీశ్రీకివ్ విశ్వనాథ శిష్యుండయ్యెన్

కం॥ ప్రశ్రయత గొల్చు వారికి
నాశ్రయుడై నిల్చువాడు అంబిక పతియున్
మిశ్రిత తమాల రుచిగళ
శ్రీ శ్రీకివ్ విశ్వనాథ శిష్యుండయ్యెన్.

ఈశ్వరుని విభూతికి శాసనీయు డయ్యాడని భావం.
సమస్య- **దానిని గని దాగని దని దాగ దనిరిగా..**
పూరణ-

కం. **తా నేమోకాకి గూటుల**
**మానుగ పెంపొంది యిపుడు మధుర స్వరముల్**
**పూని వెలార్చెడు నల్లని**
**దానిని గని దాగని దని దాగ దనిరిగా!**

దాగనిది అని దాగదు అనిరిగా - అని భావం.
మరొక సమస్యః **స్త్రీలకు పెండ్లి యెందులకు చీమల బారుకు చక్కె రేటికిన్**
పూరణ-

ఉః **లీలగ భర్త వెంట లవలీలత వోలిక నంచరించుచున్**
**హేళిని పుత్రులం గని ముదంబుధి తేలక, తీయ తీయగా**
**రాలిన పంచదార తిని ప్రాకుచు పోవుట నేర్వకున్నచో**
**స్త్రీలకు పెండ్లి యెందులకు ? చీమల బారుకు చక్కెరేటికిన్?**

ఇందులో రెండు ప్రశ్నలు రెండు సమాధానాలు వచ్చే విధంగా క్రమాలంకారం పాటించిన తీరు మనోహరంగా ఉంది.

టమాట, పుటాటొ, కాబేజి,కారెట్ పదాల నుపయోగించి భారతార్థంలో పద్యం కోరినప్పుడు విస్సన్నపేట అవధానంలో చెప్పిన పద్యం-

ఉ॥ **వచ్చుట మాటయే తిరిగి పాండవు లా వనవాస మెల్ల నే**
**పొచ్చెము లేక చేసి మరి పొల్పుగ యుద్ధపు టా టొనర్తురే**
**అచ్చము రాజ్యమేల తమ కాబె? జితత్వముగూర్చి వారికిన్**
**రచ్చ యొనర్పమే యమ పురంబున కారెటు వారు నాగరుల్**

వచ్చుట+ మాటొ, యుద్ధపుఅట, ఆబె-జి తత్వము, కారుఎటు- ఇలా పదాల స్వరూపం మార్చి కూర్చటంలోనే కవి సామర్థ్యం ద్యోతక మవుతున్నది.

కడపలో స్పాట్ వాల్యుయేషన్ పేపర్లు దిద్దే రోజుల్లో అక్కడ అవధానం చేస్తూ ఎండ,మండ,కొండ, కండ-దత్తపది -అధ్యాపక మనఃస్థితిని వర్ణిస్తూ చెప్పిన పద్యం.

ఉ॥ **ఎండలు నిప్పులై కురియ నెల్లరి దేహము లుక్కపోతచే**
**మండగ మల్లెపూవుల సుమాళము లింటిని గుర్తు చేయగా**
**కొండల చుట్టునున్ కడపకున్ గల వానిని చూచి యూర్చుచున్**
**కండలు పిండి పేపరుల కట్టలు దిద్దెడి వారి మెచ్చెదన్.**

ఆకిరిపల్లి అవధానంలోచెప్పిన దత్తపది - అంచిత, కుంచిత, వంచిత,సంచిత - భాగవతార్థంలో-

ఉ॥ **అంచిత భక్తిభావమున ఆత్మ నమర్పణ బుద్ధి చేత ఆ**
**కుంచిత దేహ యయ్యు నను గూల్చిన దీ యమ యంచు విశ్వస్ప**
**ద్వంచిత యయ్యె నంచు భగవానుడు మేలు నొనర్ప గోరి తత్**
**నంచిత మెల్ల పోవ కడు చక్కని రూపము నిచ్చె కుబ్జకున్.**

కృష్ణుడు కరుణతో త్రివక్ర అయిన కుబ్జ శరీరాన్ని సుందరంగా మార్చిన ఘట్టాన్ని గ్రహించి

రమణీయంగా తీర్చిన రీతి ఇందులో కనిపిస్తుంది.

అదేవిధంగా మరొక చోట గలగల,జలజల,వలవల, మలమల- దత్తపది భారతార్థంలో చెప్పమంటే చెప్పిన చంపకం ఆఘ్రాణించండి.

**చం॥ గలగల పారు పుణ్యనదిగా వెలుగొందెడు వంశమందు క**
**జ్జలజల మొల్క జేసిన నృశంసుడు రా జని పెద్ద లాడ క్రే**
**వల వలదన్న పల్కులను వాయు సుతుండును రోజుచుండ కో**
**మల మలయానిలం బటుల మాధవు సత్కృప ప్రోచె ద్రౌపదిన్.**

ద్రౌపది వస్త్రాపరణ ఘట్టాన్ని తీసుకొని, ఒక్క మొదటి గలగల మాత్రం ధ్వన్యనుకరణ శబ్దంగా తీసుకొని, మిగతా వాటిని పదాల విరుపుతో అర్థవంతమైన భంగి భావించి కావించిన సృష్టి అత్యంత మనోహరం.

వర్ణన అడిగినప్పుడు కొప్పరపు సోదర కవుల ఆశు కవితా శక్తిని గురించి పలికిన పద్యం, నిజంగా వారి సామర్థ్యాన్ని కన్నులకు కట్టినట్లు చూపుతున్నది. చూడండి.

ఉ: ధీ ప్రకృతి ప్రభాకృతి గతి స్ఫురణన్ శత లక్ష కోటి సం
ఖ్యా ప్రమితాశు పద్యముల నచ్చముగా కలకండ యచ్చులున్
కప్రపు మే ల్పొడుల్ బలు జగంబున చల్లిన కీర్తి మండితుల్
కొప్రపు సత్కవీశులకు గూర్చెద కోటి నమస్కృతుల్ మదిన్.

ధార, ధారణ,పాండితి, ప్రతిభ తగుపాళ్ళలో అలరారుతున్న శ్రీ శ్యామలానంద ప్రసాద్ మంచి భవిష్యత్తు గల యువకవి. ఆంధ్ర సరస్వతి కీతని రచనలు పూజా కుసుమాలు కాగలవు.

## సానింగొల్చిన ..

చీరాల వైకుంఠపు వాసులు, కళాశాల ఉపన్యాసకులు శ్రీ ప్రతాప సుబ్రహ్మణ్యశాస్త్రిగారు సంగీత సాహిత్య కోవిదులు. హరికథలు చెప్పటంలో ఆరితేరినవారు. భువన విజయాది సాహితీ రూపకాలలో బహు పాత్రలు ధరించి తమ ప్రజ్ఞా ప్రభావాల్ని ఎన్నో సభలలో ప్రదర్శించినవారు. వారు పూరించిన సమస్యలు కొన్నింటిని ఉదాహరిస్తున్నారు.

సమస్య: సానిం గొల్చిన వారి కబ్బును గదా! సౌశీల్య సౌభాగ్యముల్

సానిని- వేశ్యను కొలిస్తే సౌశీల్యం, సౌభాగ్యం కలగడం అసంబద్ధం. దీన్ని వీ రెలా సుసంబద్ధం చేశారో చూడండి.

**శా॥ దీనుండన్ దురితాత్ముడన్ జడుడ నో దేవాది దేవోత్తమా!**
**నీ నామంబు జపించి మామక మనోసిరేజమున్ త్వత్పద**
**ధ్యానాసక్తుడనై సమర్పణము చేయం బూనితిన్ శ్రీనివా**
**సా! నిన్ గొల్చిన వారి కబ్బును గదా! సౌశీల్య సౌభాగ్యముల్**

శ్రీనివాసా! అని పైనుంచి కలుపుకొని సంబోధించడంవల్ల అర్థం చక్కగా పరిపోయింది.

మరొక సమస్య: పగలు శశాంకు డంబరము పైన వెలింగెను తీక్ష్ణకాంతితో

పగటివేళ చంద్రుడాకాశంపైన తీక్ష్ణకాంతితో ప్రకాశించాడుట. కాల నియమ విరుద్ధమైన దృశ్యం ఇది. సూర్యుడు రాత్రివేళ కనిపించాడని మరొక విధమైన సమస్య. ఇటువంటి వాటిని విద్వత్కవులు తమ చాతుర్యంతో రకరకాలుగా పూరించారు. ప్రతాపవారి పూరణ ఇది-

చం॥ మొగ మటు త్రిప్పెదేల! వలపుం బువుబోణి! చలమ్ముతో సుమా
శుగముల గ్రుమ్ముచుండెను ప్రసూనశరుం డిటు శీతవాతముల్
తగిలెడు వెచ్చగా చరణదాసు డ నే నెటు బోదు నెందు కీ
పగలు? శశాంకు డంబరము పైన వెలింగెను తీక్ష్ణకాంతితో.

వైరం- పగ- అనే శబ్దానికి బహువచనం చేసి ప్రణయ కలహఘట్టాన్ని తీసుకొని, చంద్రుడు వేడి వెన్నెల ప్రసరింపజేస్తున్నాడు. దాసుని తప్పులు దండంతో సరి అని ప్రియురాలిని ప్రియుడు బ్రతిమాలాడుకోవటం ఈ దృశ్యం.

వేరొక సమస్య: స్వాముల వారికిన్ కడుపు పండి జనించిరి పుత్రరత్నముల్

ఈసమస్యలో రెండు వైరుధ్యాలు, ఒకటి పురుషునికి గర్భం కావటం, రెండవది సన్యసించిన స్వాముల వారికి కావటం. ఈ రెండు కష్టాలనుంచి సమస్య ఎలా గట్టెక్కిందోచూడండి.

ఉ॥ కామితముల్ ఘటించుటకు కావలె సంతతి యంచు దంపతుల్
నీమము తోడ తాపసిక నిష్ఠ మునింగి ప్రపత్తియుక్తులై
యేమరు పాటు లేక భజియించిరి భద్రగిరీంద్ర సంస్థిత
**స్వాముల -వారికిన్ కడుపు పండి జనించిరి పుత్రరత్నముల్**

సంతానం కోరిన దంపతులు నియమనిష్ఠలతో భద్రగిరీంద్ర సంస్థిత స్వాములను,అంటే - భద్రాచలంమీద వేంచేసి ఉన్న సీతారాములను భజించగా, వారికి కడుపుపండి పుత్రరత్నాలు కలిగారని భావం.

మగ, పగ, వగ, పొగ - దత్తపది భారతార్థంలో చెప్పిన పద్యం పరికించండి.

చం॥ మగ లటు ద్యూత మందు అవమానము వంచన పొంది యోడి పో
వగ వగ నొందు నా ద్రుపదవల్లభపుత్రి శిరోజ సంపదన్
పొగరున వట్టి యీడ్చెను ప్రబుద్ధుడు కౌరవరాజ సోదరుం
డగ పడునే దురాత్ముల కహంకృతి యుక్తుల కార్య ధర్మముల్

మగలు, భర్తలు జూదంలో ఓడిపోగా పగబట్టిన ద్రౌపది కేశపాశాన్ని పొగరుతో దుశ్శాసనుడు వట్టి ఈడ్చాడు. గర్వితులైన దుష్టుల కార్యధర్మాలు కనపడతాయా అని భావం.

అదే విధంగా ప్రసిద్ధమైన పురాతన సమస్య నొకదాన్ని చూడండి.

అమ్మా! రమ్మని పిల్చె భార్యను మగం డయ్యర్ధరాత్రంబునన్.

దీన్నికూడా చాలామంది కవులు చాలా రకాలుగా పూరించారు. కొంతమంది సీతమ్మ, సుబ్బమ్మ ఇలా పేరుగా మార్చారు. మరొకరు మారునమ్మటమ్మా- మన్మథుని పుష్పబాణమా! అని పూరించారు. ప్రతాపవారి పూరణలో మరోవిధమైన చమత్కార ముంది.చూడండి.

శా॥ సొమ్ముల్ దెచ్చితి పూలు దెచ్చితిని కస్సున్ బుస్సునున్ మాని నీ
విమ్మాడ్కిన్ నిదురింపగాదగునె? లేవే నన్ను గారింపకే
నెమ్మోమున్ తిలకింప వచ్చితిని సందేహింపకే నిద్ర పె
ద్దమ్మా! రమ్మని పిల్చె భార్యను మగం డ య్యర్ధరాత్రంబునన్

సుబ్రహ్మణ్య శాస్త్రిగారు ఏతాదృశ కవితాసృష్టితో పద్య విద్యా భారతిని తనవంతుసేవ యథాశక్తి చేస్తున్నారు.

# పుంస్త్వము లేని భర్త...

గురుకుల క్లిష్టాముమురారిః కవిః - అన్న విధంగా సంప్రదాయ పద్ధతిలో గురు శుశ్రూష చేసి వివిధ శాస్త్రాధ్యయనం చేసిపండితవర్యుడుగా కీర్తి గాంచిన వారు శ్రీమాన్ కోగంటి సీతారామాచార్యులవారు. చిరకాలం గుంటూరు సంస్కృత కళాశాలలో పనిచేసి విశ్రాంతి తీసుకున్న ఆచార్యులవారు రామాయణ భారత పురాణ ప్రవచనంలో దిట్ట. చిన్నప్పుడు అవధానాలు చేసి, ఆశు కవిత్వం చెప్పి, వయసు వచ్చిన తరువాత ఇటీవలివరకు భువన విజయాది సభలలో సమస్యాపూరణలు చేసి, చక్కని కవిత్వం సృష్టించిన కోగంటి వారి సమస్యా పూరణలు కొన్ని ఉదాహరిస్తున్నాను.

సమస్య: రాముని జంపె రావణుడు.రక్కసులెల్ల మెచ్చు లాడగన్.

పూరణ:

ఉ॥ మన మొప్ప పుష్పకము తేరకు గైకొని సర్వ లోకముల్
దామస వృత్తి పెం దిరుగు దర్పముతో ననరణ్యు స త్తపో
భూమికి నేగి కిమ్మనని పుణ్యుని మంత్రులు తోడు తోడుగా
రా ముని జంపె రావణుడు రక్కసు లెల్లరు మెచ్చు లాడగన్

మంత్రులు తోడుగా రాగా, మునియైన అనరణ్యుని రావణుడు చంపాడని భావం. ఇక్ష్వాకు వంశంలో రామునికి పూర్వుడైన ఈ పుణ్యాత్ముని జంపి అతనిచేత దశకంఠుడు శప్తుడైనాడు.

మరొక సమస్య:

పూరణ: ప్రాఙ్నగమందు క్రుంకె నదె భానుడు వెచ్చరి! వంతయేటికిన్?
ప్రాజ్ఞవహాభిరామము శిరమ్మొడలెల్లను రత్నమాలికా
రుజ్ఞచయ మ్మలంకృత మురోజయుగమ్ము ప్రియుండు రాడొ నీ
దృజ్ఞకరమ్ము కుందెడు గదే! ఇదె తోచు సుధాకరుండు తా
ప్రాఙ్నగ మందు క్రుంకె నదె భానుడు నెచ్చెలి! వంత యేటికిన్?

ప్రాసాక్షరాలు కూర్చడంలోను,సమస్యలోని అసంబద్ధతను తీర్చడంలోను కోగంటివారు సముచితమైన చాతురిని ప్రదర్శించారు.

వేరొక సమస్య: ప్రవరుడ నే వరించితిని బ్రాణము ప్రాణముగా వరూధినిన్

దీన్ని కొందరు కైతవ ప్రవరుడ అని వేసుకొని పూరించారు. కోగంటివారు చేసింది మరొక కొత్త అందంతో అలరారుతున్నది. చూడండి.

పూరణ-

చం: రవి కడ చన్న పిమ్మట శర ద్రజనీ ప్రభ లుల్లసిల్లు వే
ళ, వనిత కోర్కె లూరగ విలాసముగా తనయంత తానుగా
గవుగిట గ్రుచ్చి యెత్తి రతి కౌతుకమున్ ప్రకటింప కాదనన్
ప్రవరుడనే? వరించితిని ప్రాణము ప్రాణముగా వరూథినిన్

ఇంకొక సమస్య: పుంస్త్వములేని భర్త అవుబో! కొమరున్ సతిగాంచు బెట్లొకో!

ప్రాసాక్షరంగా మరో పదంలేని దీనికి పాండితీ ప్రకర్షతో పదాలను నిర్మించి ఆచార్యుల వారు చాతురీధురీణంగా పూరించిన పద్ధతి అద్భుతం. పరికించండి!

ఉ॥ కింస్విత్తియంత మోరకులకే తగు పెద్దల గొల్చి నేర్చి వి
ద్వాంస్త్వయ మన్న కీర్తి గొని పండితు డొప్పును రచ్చగెల్చుటే
పుంస్త్వమునాడు, నేటి కది పోయి ప్రజం గను టయ్యె గాన నా
పుంస్త్వము లేని భర్త యవుచో! కొమరున్ సతి గాంచు టెట్లొకో!

హాస్య లాస్యానికి నెలవైన సమస్య నొకదాన్ని చూడండిః

సమస్యః నస్యము వాడు వాని వదనంబున మించు సుగంధ వీచికల్

చుట్ట, బీడి, సిగరెట్టు జాతిదే నస్యం. అది ముఖాన్ని సుగంధభరితం చేస్తుందా?

పూరణః

ఉ॥ దాస్యము సేతు వేల? శతధాయిక నస్యము మాను మన్న వై
రస్యము బూను దీవు కలరా యిటువంటి రసజ్ఞు లెందు? స్వా
రస్య మి కెట్టు లబ్బు? నవురా! యన నేమిని, పూవు టత్తరున్
నస్యము వాడు వాని వదనమ్మున మించు సుగంధ వీచికల్

పూల అత్తరు కలిపిన నస్యం వాడటంవల్ల సుగంధం వచ్చిందట! ప్రాసలోను,అర్థంలోను క్లేశం గల మరొక సమస్య: భాస్కరు డుద్యమించినను పాయవు చీకటు లట్లయౌ గదా!

పూరణః

ఉ॥ తస్కరునట్లు కేతు వెడదన్ కసి బూని గ్రహింప జూచు తే
జస్కరు బొంచినా డమవసన్ గ్రహణం బది కూడిరా,మహా
హస్కరతన్ వడిన్ బరపు నా రవి బట్టిన యట్టి వేళలో
భాస్కరు డ్యుదమించినను పాయవు చీకటు లట్లయౌ గదా!

సూర్యుని గ్రసించాలని కేతువుగ్రహణ వేళ వచ్చాడు. ఇక సూర్యుడెంత ప్రయత్నించినా చీకట్లు పోతాయా? అది గ్రహణ ధర్మాన్ననుసరించక తప్పదు కదా- అని భావం.

చాతుర్యానికి నిలవైన మరొక సమస్య- శంభుడు ఖగరాజు నెక్కి జలనిధి దాటెన్.

అంభోజ నేత్ర దన్నగ
జంభారిం గెలిచి పారిజాతము గొనగా
సంభావింపగ సురలును
శంభుడు ఖగరాజు నెక్కి జలనిధి దాటెన్.

ఇక్కడ గరుడునెక్కి సముద్రము దాటింది శంభుడు గాదట, సత్యభామను సంతోషపెట్టటానికి ఇంద్రుని గెలిచి పారిజాతం గ్రహిస్తే దేవతలు, శంభుడు సంభావించగా కృష్ణుడు గరుడు నెక్కి సముద్రం దాటాడట.

ఆచార్యులవారు పూరించిన ఒక సంస్కృత సమస్య కూడా వారి ఉభయ భాషాపాండితికి నిదర్శనంగా గమనించండి.

సమస్యః పాదే తాడిత శిరా నృపతిర్జహాస

కాలితో తలను తన్నినా రాజు నవ్వాడట. శృంగార ఘట్టంలో ప్రియురాలితో ఓడి పందెం ప్రకారం తాడిత శిరుడై రాజు సంతోషించాడని కల్పన.

శ్లో॥ శృంగార హరిమ మనోహర బంధనేషు
సల్లాప హాస మృదుతాభర విహ్వలేషు
తై స్సైర్జితః పణతయాచ తథా ప్రియాయాః
పాదేన తాడిత శిరా నృపతిర్జహాస

ఇంతటి కవితా పాండితీ శక్తిగల కోగంటివారు ఎన్నో కావ్య నాటకాది రచనలు చేశారు. అవన్నీ వెలుగులోనికి రావటం తెలుగు భాషావధూటి అలంకారానికే అవుతుంది.

## రాయలకు తెలుగు రాదట!

రాజమహేంద్ర కవీంద్ర సమాజములో శ్రీబులుసు వేంకట రామమూర్తి అవధానాశు కవితా విద్యల్లో పేరెన్నికగన్న వారు. భారతదేశ నలుమూలలా కొన్ని వందల అవధానాలు చేసి ఆశు కవితా ప్రదర్శన లిచ్చి పండిత ప్రశంసలందిన వారు. వారు అవధానాలలో పూరించిన సమస్యలను కొన్ని ఉదాహరిస్తున్నాను.

**సమస్య: కుట్మల దంతి! నీ యుునికి కోరిక లీరిక లెత్తె నిత్తరిన్**

ఇది కఠిన ప్రాస. దీనికి ఇతర పదాలు ప్రాసకు దొరకవు. ఆధునికులు ఆంగ్ల పదాలను ప్రయోగించి దీన్ని పూరించారు. బులుసు వారూ అలాగే చేశారు.

ఉ॥ పిట్మను షార్టుహేండు టయిపింగును ప్యాసయి వెస్టు కోస్టు యె
స్టేట్మినరల్సు లోన పని సేయు స్టెనో యొకనాడు బీచ్చిలో
ఖాట్మను నా బరంగు దొరగారి కుమార్తెను జూచి యిట్లనెన్
కుట్మల దంతి! నీ పయిన కోరిక లీరిక లెత్తె నిత్తరిన్

సమస్యలో క్లిష్టార్థం లేదు గాని ప్రాసకు తగిన చక్కని పదాల నెన్నుకుని శృంగార భృంగారువుగా దీన్ని పూరించటంలో కవి నైపుణ్యం భాసిస్తున్నది.

మరొక సమస్య: రాముని కూతుగాంచగనె రంజిలె హస్తి పురీశు డత్తరిన్

హస్తి పురీశుడంటే ధృతరాష్ట్రుడని గాని, దుర్యోధనుడని గాని కాక- దుష్యంతుడని అన్వయించి చెప్పిన పూరణ పద్యం గమనించండి.

ఉ॥ కోమల భావ సంజనిత కోవిద సన్నుతు డున్నతుండు శో
భామయ లీల వేటకు నపార ముదంబున నేగి తత్ర్పజా
క్షేమము లారయన్ కడు ప్రసిద్ధుడు కణ్వుని ఆశ్రమాన నౌ
రా! ముని కూతు జూచి మది రంజిలె హస్తి పురీశు డత్తరిన్

మునికూతురు శకుంతల రాముని లోని రా పైకి కలిపి, ఔరా+ ముని అని తేవడంతో రమణీయార్థం వచ్చింది.

వాలీబాలు,క్రికెట్,కోకో, కబాడీ అను పదాలను రామాణార్థంలో కూర్చటం- దత్త పది.

పూరణ-

శా॥ వాలీ! బాలుని వోలె పల్కెదవు నీవా? రాము శాసించుటలే
లీలామానుష వక్రి కెట్టు తెలియన్ లేశంబు చూడంగ తా
గేలన్ వెట్ట కపీంద్ర వర్యులను కో కొమ్మంచు దానేలె దు
శ్శీల! నా రుమ దాక బాడియగునే! సిగ్గేల లేకుండగన్

పోతన పదాన్ని నాలుగు పాదాదులలోనూ భిన్నార్థంలో పెట్టి పోతన పైనే పద్యం కోరినప్పుడు చెప్పింది.

**ఉ॥ పోత నవీన పద్ధతుల పోసెను పద్యములందు రాము ప్రా**
**పో! తన ప్రాగ్భవంబొ! పరిపూర్ణ తరంబగు తెన్గు భాష తీ**
**పో! తనరార జూపె పరిపూతము భాగవతంబునందు నా**
**పోతన సత్కవీశ్వరు డపూర్వ కవిత్వ కళా విశేషముల్.**

పంది, నంది, కంది, మంది పదములు పాదాదిలో వచ్చేలా సి.పి.బ్రౌను పైన ఉత్పలమాల చెప్పమంటే వచ్చిన పద్యం చూడండి.

**ఉ॥ పందిరి మల్లెతావులయి పర్విడుచుండగ తెల్గు బాన లో**
**నందిన తన్మయత్వమున నత్తరి బ్రౌనువరుండు కీర్తి ప్రా**
**కం దిశలందు వ్యాఖ్యల నిఘంటుల రాసి తెనుంగు సాహితీ**
**మందిర మందు నిల్పె తన మానిత నామము శాశ్వతంబుగన్**

వేరొక సమస్య: రాయల వారికిన్ తెలుగు రాదు గదా! రసమున్ గ్రహింపగన్
పూరణ::

**ఉ॥ శ్రీయుతు డాంధ్ర భోజుడు పఠించి రచించిన యట్టి విష్ణుచి**
**త్తీయము కావ్య మష్ట కవి దిగ్గజముల్ వినగా పఠింప చై**
**నీయులు వచ్చి రా సభకు నిర్మల రీతిని చూచు చుండి రా**
**రాయలవారికిన్ తెలుగు రాదు గదా! రసమున్ గ్రహింపగన్**

రాయలవారి విష్ణుచిత్త కావ్య పఠన వేళ సభలోని విదేశీయులు మర్యాద కోసం వింటూ వారిని చూస్తున్నారు. వారికి రసం గ్రహించటానికి తెలుగు రాదు గదా? అని భావం.

నన్నయ మీద పద్యం కోరినప్పుడు దూకిన శార్దూలం. ఇది.

శా॥ శ్రీకారంబును జుట్టి తెన్గు కవితా క్షేత్రంబులన్ పండితా
నీకం బెంతయు మెచ్చు కావ్య రచనా నిర్మాణ బీజంబులన్
సాకల్యంబుగ నాటినావు సుకవీశా! నాటి బీజాంకుర
శ్రీకంబుల్ విరియంగబూచి ఫలియించెన్ కావ్య లోకంబులన్

వీరేశలింగం గారి పైన పలికిన సంఘ సంస్కార భావ ప్రబోధకమైన వర్ణన:

శా॥ బూజుల్ పట్టిన పాత పద్ధతుల తప్పుల్ కొన్ని వీక్షించి ని
ర్వ్యాజ స్థైర్యముతో నెదుర్కొని సమర్థంబైన దీక్షారతిన్
తేజోవంతముగా నొనర్చెన కడు తృప్తిన్ సంఘ సంస్కారముల్
భ్రాజిష్ణుండగు కందుకూరి కవి సేవల్ భావనాతీతముల్.

కార్తీక శోభను వర్ణించమని అడిగినప్పుడు చెప్పిన హృద్యమైన పద్యమిదిగో!

ఉ॥ వెన్నెల నింపి మానవ పవిత్ర హృదంతరమందు భక్తి భా
వోన్నత రీతులన్ జిలుకుచున్న శరత్సమయమ్ము భాగ్య సం
పన్నములైన సస్యములు మానవ కోటికి నందు నట్లు సే
య న్నుతి కెక్కువా కార్తిక మహా! చనుదెంచె రసోజ్వలంబుగన్

ప్రసన్నమైన శైలి, ధారాళమైన ధార- చాతుర్య ధుర్యత - బులుసు వారిని అవధాన ప్రపంచంలో ఉన్నత స్థాయిలో నిలబెట్టాయి.

## కాకరకు నల్ల కలువలు

తెలంగాణాలో ఉదయించి అవధాన సరస్వతికి అపారమైన సేవ చేసిన వారిలో అష్టకాల నరసింహరామశర్మగారు పేర్కొనదగిన ప్రముఖులు. ఇప్పటికి నూటికి పైగా అవధానాలుచేసి, ఎన్నో గ్రంథాలు రచించి శర్మగారు, తెలుగు భారతిముద్దుబిడ్డలై ప్రకాశిస్తున్నారు. విశేషించి మెదక్ జిల్లా

అనంతసాగర్ సరస్వతీ క్షేత్రానికి వీరు చేసిన సేవ అనన్య సామాన్యమైనది.వివిధ ప్రదేశాలలో వీరు కావించిన అవధానాలలో పూరించిన సమస్యలు, దత్తపదులుకొన్ని-

ద్రౌపది, గాంధారి,కుంతి, కృష్ణ శబ్దాలతో రామాయణార్థంలో ఉత్పలమాల కోరినప్పుడు చెప్పిన పద్యంః

ఉః ద్రౌపదివై ధరాసుతను తప్పక చూడుము అన్ని చోటులన్
తాపము తీర్చు నేర్పు గల దక్షుడు గా ధరియిత్రి మించుమా!
నీ పనితోడు కుంతియయి నిల్చెడు నంగదు డర్థి నుంగరం
జూపి గ్రహించి చూపుమ అయోనిజ భావిని కృష్ణతన్ గనన్.

ఇందులో ఉపయోగించిన శబ్దాలకు అర్థాలను వారే ఈవిధంగా సభలో చెప్పారు.

ద్రౌపది-ద్రతగతిపదుడు ద్రుపదుడు వాయువు. అతని కుమారుడు ద్రౌపది-హనుమంతుడు- వేగంగా వెళ్ళేవాడు. కుంతి- కుంతాయుధధారి, కృష్ణత- సంతోషం.

మరొక దత్తపది- అంగీ,లుంగీ, చుంగీ, పుంగీ శార్దూలంలో అభిసారికను గురించి.

శాః అంగీకారము కల్గి యుండియును భీత్యాలోలయై వచ్చు మే
లుం గీళ్ళున్ దలపోసి మల్లె పొదరిల్లున్ జాటుగా జేర జూ
చుం గీరామృతవాణి నిచ్చు ప్రియుకై సొక్కంగ గాటంపు పెం
పుం గీడ్పడ్డ మనోజ వేదన మెయిన్ బో నాయికన్ నేన నూ!

సభంగ ప్రక్రియలో పదాల నిమిడ్చి చెప్పిన ఈ తీరు చాలా ప్రశస్తం. అదేవిధంగా మరొక దత్తపది- ఖగము,భగము,నగము,సగము ఉత్పలమాలలో పార్వతీ వర నిశ్చయం.

పూరణ-

ఉః ఆదర మొప్పగా ఖగముఖాతుల వాహనుల బ్రమందుచున్
మోదము తోడ నాసుభగ ముగ్ధ మనోహరమూర్తి పార్వతిన్
మేదుర తుష్టి నా నగము మేకొని శంభున కీయ జూడగా
బో, దరినుండి యింపెనగ ముగ్ధులు గారొకొ నంది రాణ్ముఖుల్!

ఖగ ముఖాతుల వాహనులు= విష్ణువు మొదలైనవారు, సుభగముగ్ధ= అందమైన, అమాయకమైన, ఇంపెనగ ముగ్ధులు గారొకొ= ప్రీతితో మురియరా!

సమస్యలను పూరించటంలో అలరిన నేర్పునకు కూడా కొన్ని ఉదాహరణలు చూడండి.

హనుమంతుని పెండ్లి యాడి రార్గురు కాంతల్

అనే దానికి పూరణ-

కంః మనములు నచ్చిన వారల
గొనగా తమ జన్మ భగణ కూటము దోషా
శనులున్ దొలగగ కొలిచిరి
హనుమంతుని, పెండ్లి యాడి రార్గురు కాంతల్

గ్రహదోష నివారణకై హనుమంతుని కొలిచి తత్ఫలంగా తమ కిష్టమైన వారిని పెండ్లాడారని భావం.

ఇంకొక సమస్య- రాతిరి నడుజాము నందు రవి యుదయించున్

పూరణ-

కం: మా తండ్రి యేమి చూచెనో
చేతం గానట్టి వాని చేసెను మగనిన్
పోతువలె నిదుర వోవును
రాతిరి నడుజాము నందు - రవి యుదయించున్

అసంతృప్త అయిన భార్య తన భర్త చేతగానివాడని, శృంగార వేళ దున్నపోతులా అర్ధరాత్రి నిద్రపోతాడని అలాగే తెల్లవారి సూర్యుడుదయిస్తాడని భావం.

వేరొక సమస్య: **మదగజ యానకున్ రవిక మాత్రము చాలును చీర యేటికిన్-**

ఇది ఎందరో పూరించిందే. అయితే వీరు పూరించిన తీరుకొంత విలక్షణంగా ఉంటుంది.

**చం: విదిత కళావిలాస గతి విశ్రుత మూర్తి సుశిల్ప రత్నమున్**
**గదలక చెక్కుచుండ నది గాంచెడు వారలు తన్మయంబుతో**
**వదలక చూచి శిల్పి గని వల్కిరి మార్పున కోర్వ కిట్టు లీ**
**మదగజ యానకున్ రవిక మాత్రము చాలును చీర యేటికిన్?**

ఒక శిల్పాన్ని మార్చడానికి శిల్పి చెక్కుతుండగా, ఆ మార్పులు ఇష్టం లేనివారు,చేసిన మార్పులు చాలు,ఇక వద్దని చెప్పిన ఘట్టం.

మరో సమస్య: కాకర తీగలకు నల్లకలువలు పూచెన్

పూరణ:

**కం: చాకిత రాదే మగువా!**
**పాకద అవసరము ప్రొద్దుపోయెడు నీవే**
**కోక లుతికి ఆరేయుము**
**కాకర తీగలకు -నల్లకలువలు పూచెన్**

కలువలు పూచె అంటే రాత్రి కావచ్చిందని భావం

మధ్య తరగతి వాని జీవన స్థితిని గూర్చిన వర్ణన అత్యంత స్వభావ సుందరంగా ఉన్న తీరు చూడండి.

గీ: బ్రతుకు బరువైన ఈనాటి ప్రజలు చూడ
నడి బజారున నిల్చి పన్నగులు నగుచు
ఎడతెరపి లేని క్యూల నీ మిడి బ్రతుకుల
జరుపు చున్నారు జీవిక సాగుకొరకు

ఈవిధంగా అవధానాలు చేయటమే కాక, కావ్య రచన కూడా చేసి ప్రఖ్యాతి గన్న నరసింహరామశర్మగారికి ఉజ్వల భవిష్యత్తు తప్పక ఉంటుంది. సరస్వతీ కరుణ వారి యందు మరింతగా ప్రకాశిస్తుంది.

## రవిక చాలును !

గోనకాచవిభుడు విఠల రెడ్డి రచించిన రంగనాథరామయణోత్తర భాగం, తిక్కన నిర్వచనోత్తరరామాయనము , కంకంటి పాపరాజు . ఉ త్తర రామాయణాలను వాల్మీకి రచనతో పోల్చి, పరిశోధన చేసి ప్రశంసనీయమైన గ్రంథం రచించిన వారు డా. మారుటూరి పాండురంగారావు. శివ పంచశతి మొదలైన పద్య కావ్యాలు నిర్మించటమే కాక, సాహితీ రూపకా లెన్నింటిలోనో పాల్గొని

చతురవచోనిధిగా పేరు గాంచారు. వారు భువన విజయాది సభలలో పూరించిన సమస్యలు కొన్ని ఇస్తున్నాను.

సమస్య: తను పెండ్లాడు మటంచు కోరెను సుతున్ ధర్మ ప్రకారంబునన్,

పూరణ:

మ. ఘను డా శంతను పత్ని సత్యవతి దీక్షా దక్షుడౌ భీష్మునిన్
గని యో ధీర ! భవ త్సహోదరులు సంతానంబు లేకుండనే
చని రా స్వర్గము రాజవంశ పరిరక్షార్థంబు నీ వొక్క కాం
తను పెండ్లాడు మటంచు కోరెను సుతున్ ధర్మ ప్రకారంబునన్.

సత్యవతీ దేవి తన కుమారులైన చిత్రాంగద విచిత్ర వీర్యులు సంతానం లేకుండా మరణించిన కారణం చేత, ఒక కాంతను పెండ్లాడమని కోరిన రీతి వర్ణితమై, తను-కాంతనుగా మారి సారవంతమైన పూరణ లభించింది.

అదే విధంగా మరో సమస్య- "తన సుతు గూడి గర్భమును దాల్చెను కోమలి యేమి చెప్పుదున్!"

పూరణ-

చం. తన సుత యంచు నైన దయదాల్పడు దానవ వంశ గౌరవ
మ్మునకును భంగమైన యెడ - మూర్ఖుడు ప్రేమ నెరుంగ బోడు బా
ణుని కడ నేమి ప్రాప్త మగునో కద! యెట్లు వచింతు మీన కే
తనసుతు గూడి గర్భమును దాల్చెను కోమలి యేమి చెప్పుదున్?

బాణ సుత-ఉష - మీనకేతన సుతుడు-ప్రద్యుమ్న పుత్రుడైన అనిరుద్ధుని కూడి గర్భం దాల్చింది-అని రమణీయమైన పూరణ- మీనకేతనగా రూపొందటం వలన వచ్చింది.

వేరొక సమస్య- పంది పటుక్కునన్ గొరికె పంకజలోచన మోవి గ్రక్కునన్.

పూరణ-

ఉ. సుందర దివ్య కావ్య రసనశోభలు వోని కళామయీ సుఖా
నంద సుధా మరంద సుమన: ప్రణయమ్మున శీఘ్ర వేగియై
నందన పారిజాత శయనమ్మున నుద్ధుర వృత్తి భర్త పెం
పంది పటుక్కునన్ గొరికె పంకజలోచన మోవి గ్రక్కునన్

పద్మనేత్ర అధరాన్ని కొరికింది పంది కాదు.భర్త పెంపంది నే మోద్రేకంతో కొరికాడని పూరణ

ఇంకొక సమస్య: "ప్రవరుడు సంతసించె పొలుపార వరూధిని గూడి యెంతయున్"

మను చరిత్రలో ప్రవరుడు వరూధినిని కలియలేదు. గంధర్వు డొక ప్రవరుని రూపం దాల్చి ఆమెను కూడాడు. ఈ సమస్యను ఆ భావం వారు వరూధిని అంటే సైన్యం అనే అర్థం తీసుకొని ఒక యుద్ధ ఘట్టాని పూరించారు- చూడండి.

చం. వివిధ నృపాల సైన్యములు వేగ విజృంభణ చుట్టుముట్టగా
స విధము నందు ఘోరతర శాత్రవు లొంటరి జేయ ఖడ్గ పా
టవమున విక్రమ క్రమ విడంబన విస్ఫురణన్ మహీపతి
ప్రవరుడు సంతసించె పొలుపార వరూధిని గూడి యెంతయున్.

ఒక శృంగార మధురమైన సమస్యను వీక్షించండి!

"మద గజ యానకున్ రవిక మాత్రము చాలును చీర యేటికిన్"

పూరణ-

చం. మదనుని పుష్ప బాణముల మంజుల దేహము గాసి నొందగా
హృదయ విభుండు లేకునికి రేగగ కామవికార ముబ్బునన్
బదబద లయ్యే కంచుకము పాంథుడ! నీ విడజాలుదేని యా
మదగజ యానకున్ రవిక మాత్రము చాలును చీర యేటికిన్?

కామం చేత కంచుకము పిగిలింది. కనుక దాన్నిస్తే చాలని భావం.చెలియు చలియును నొక పోల్కి మెలగు గాదె- అనే అసమస్యను చమత్కారయుతంగా పూరించిన చెలువు చూడండి

తె.గీ. పైకి దూకును మెయి గగుర్పాటు జేయు
చెలగి అధర క్షతంబులు కలుగజేయు
నిశ విజృంభించు సీత్కృతుల్ నింపిమించు
చెలియు చలియును నొక పోల్కి మెలగు గాదె.

చలిలో చెలిలో సమానంగా ఉండే అధరక్షత, పులకాంకుర సీత్కారాదులను చతురంగా కూర్చి లలిత పూరణ నిచ్చారు పాండురంగారావు. అల్లుళ్లను గూర్చి - విమర్శనాత్మకమైన - సీస పద్యం అందంగా రచించారు-దాన్ని చూడండి!

సీ. వార కాంతల యిండ్ల వాసంబు జేయుచు మగువ కేడ్పెడు వాడు మడ్డి వెధవ
ఇద్దరు నొక చోట నేకాంత మాడంగ వద్ద జేరెడు వాడు వట్టి వెధవ
త్రోవ బోయెడు స్త్రీలతో మొగం బికిలించి ముచ్చ టాడెడు వాడు ముష్టి వెధవ
చదువు చెప్పిన జీతమదను లోనీయక మిటకరించెడువాడు మేటి వెధవ

గీ. బడికి వెడలక అటు నిటు పరువు లెత్తి పాఠములను విననివాడు బండ వెధవ
ఇట్టి వెధవల గడ ద్రోచి యెసక మెసక కావు మీ వేడ్క విబుధుల కమలనాథ!

హాస్యభరితంగా, చాతుర్యధుర్యంగా ఇటువంటి పద్యాల నెన్నో రచించి ఆంధ్ర భారతికి సేవ చేస్తున్నారు డా. మారుటూరి పాండురంగారావుగారు.

## రంభ-రాముడు!

గౌన కళాప్రపూర్ణ, సంగీత సాహిత్య కళానిధి శ్రీ నల్లాన్ చక్రవర్తుల కృష్ణమాచార్యులు-విజయవాడ ఆకాశవాణి కేంద్రంలో చాలా కాలం పనిచేసి ప్రసిద్ధి గాంచినవారు. సంగీత రంగంలో వీరికి గల ప్రఖ్యాతి, సాహిత్య ప్రభావాన్ని కొంత మరుగు పడజేసింది. అష్టావధానాలు చేసి, భువన విజయాది సారస్వత సభలలో పాల్గొని పద్య నిర్మాణంలో, సమస్యా పూరణలో గొప్ప నైపుణ్యం చూపించారు. ఆచార్యులవారు. హరిహరనాథ సభలో శివ కేశవోభయార్థకమైన పద్యం ఎంత చతురంగా చెప్పారో చూడండి!

ఉ. శ్రీ శశిఖండ మౌళి! యొనరించెద నీకు బహు ప్రణామముల్
కేశవ సత్కబంధ శయ కీలిత రమ్య కురంగ నాథ యా
వేశము లెల్ల దీర్పుమరవింద విలోచన బాణ జిత్వరా
మాశమలమ్ము లెంచకుము మాధవ శ్రీగిరి శృంగ సంస్థితా !

శివ పక్షార్థము: శ్రీ శశిఖండ మౌళి=చంద్రఖండం శిరస్సున గలవాడా! కేశ వసత్ కబంధ = కేశాల్లో నీరు గలవాడా! శయకీలిత రమ్యకురంగ=చేతిలో అందమైన లేడి గలవాడా! అరవింద

విలోచనబాణ=పద్మాక్షుడైన విష్ణువును బాణంగా గలవాడా! జిత్వరా!= గెలిచే స్వభావం గలవాడా! మాశమలమ్ము లెంచకు=మా పాపాలను ఎంచకు...నాభయ ఆవేశము లెల్ల దీర్పుము...శ్రీగిరి శృంగ సంస్థితా = శ్రీ శైల శిఖరమున నున్నవాడా!

విష్ణు పక్షార్థము:శ్రీశ= లక్ష్మీనాయకా! శిఖండ మౌళి = నెమలి పింఛం తలమీద గలవాడా! కేశవ = విష్ణూ!సత్కబంధశయ = చక్కని నీటిలో (సముద్రంలో) శయనించే వాడా! కీలిత రమ్యకురంగ నాభ= కస్తూరి ధరించివాడా! అరవింద విలోచన=పద్మాక్షా!బాణజిత్వరా = బాణాసురుని జయించినవాడా! శ్రీగిరి శృంగ సంస్థితా = తిరుమలలో వెలసినవాడా!

ఇటువంటి రమణీయమైన, పాండితీ స్ఫోకరకమైన పద్యాలు రచించిన ఆచార్యుల వారు పూరించిన ఒక సమస్య చూడండి- వారవధూ సంగమమ్ము పాప హరమ్మో

పూరణ: కం. సారెకు నవనీత పయ
శ్శౌరుని వాక్చయము రాక్షసుల గురు నయమున్
సౌరభ మూత్రము పారా
రవధూ సంగమమ్ము పాప హరవా!

కృష్ణ భాషణాలు. శుక్రనీతి, గోమూత్రం, అప్సరోవధూ సంగం పాప హరమని కవివర్యుల భావన

విశాఖ జిల్లా కొయ్యూరులోని అష్టావధానంలో పూరించిన సమ స్యరంభను గాంచి వెంటబడె రాముడు మోహలతా నిబద్ధుడై.

పూరణ-

ఉ. కుంభిని నెవ్వడైన సతి కోరిక దీర్పదలంచు దానిచే
సంభవమౌ విపత్తు కనజాలడు జానకి తాను గోరె సం
రంభముతోడ హేమ మయరాంకవ మూర్తిని వంచన క్రియా
రంభను గాంచి వెంటబడె రాముడు మోహలతా నిబద్ధుడై.

మోసపు చేష్టలు మొదలుపెట్టిన బంగరు లేడి వెంట రాముడు పడ్డాడని భావం.
భట్టిప్రోలు భువన విజయంలో పూరించిన సమస్య
"లంజతనమ్ముచే యశము లాభము కల్గును ధారుణీ స్థలిన్"
పూరణ

ఉం. మంజుల వాగ్విలాసములు మానిత శీలము శాస్త్ర రాశిలో
నం జతురత్వమున్ త్రికరణమ్ముల శుద్ధి, క్రియాచణత్వమున్
రంజన తోడి త్యాగ మనురాగము మున్నుగ గల్గు సద్గుణా
లం జతనమ్ము యశము లాభము గల్గును ధారుణీ స్థలిన్.

లంజతనమ్ము-అనే దాన్ని విభజించి పై పాదం నుండి కల్గుసద్గుణాలన్-జతనమ్ము అని తీసుకురావటంవల్ల చక్కని శ్లీలమైన అర్థం సమకూడింది.

బ్రహ్మ సభ-సాహితీ రూపకంలో చేసిన కొప్పరపు కవుల ప్రశంస ఎటువంటి సుందర పద్య రూపం దాల్చిందో పరికించండి!

మ. సురవర్త్మంబున నుండి శాంభవ జటాజూట స్థలిన్ జేరగా
వరుగుల్ వెట్టిన గంగ నీదు కవితా ప్రాగల్భ్యమున్ జూచి యః
స్వర మందాకిని యయ్యె నాశు కవితా ప్రాకామ్యద్ధారేయ! కొ

ప్పరపున్ వంశ సమంచి తాభ్యుదయ! సుబ్బారాయ! సం విస్మయా

కొప్పరపు కవుల ఆశు కవితా మహా ప్రవాహానికి ముగ్ధుడై పలికిన పద్యం హృదయం నుండి పుట్టిన ఒక సత్య వాక్కు.

విచిత్రమైన కంద పద్యంలో రాయల ఆశీస్సు చూడండి!

కం. ఖగ కగ నగ రగ నగ
భ గణప గా గమగ భగగ భస్తిగ జగదం
డగముల గముల గతిగనకు
దుగ దుగ బాహువుల వాడు తోడుగు నీకున్

ఖగ= ఆకస సంచారం చేసే, కగ = నీటిలోని, నగరగ = పట్టణాలలోని నగపగ = పర్వతాల్లో ఉన్న భగణపగ=చంద్రునిలో ఉన్న ఆగమగ వేదాలలో ఉన్న భగగభస్తిగ సూర్యతేజంలో ఉన్న జగదండగము బ్రహ్మాండాలలో ఉన్న వాని, గముల = సమూహాల గతి గనకు. దుగదుగ బాహువుల వాడు = 2+2= నాలుగు బాహువుల వాడగు చతుర్భుజుడైన విష్ణువు నీకు తో డగుగాక!

చిత్ర శబ్ద భరితాలూ, చిత్రార్థ సమన్వితాలూ అయిన పద్యాల నెన్నో నల్లాన్ చక్రవర్తుల వారు రచించారు. వీటి నన్నిటినీ కలిపి సంకలనంగా వేస్తే ఎంతో బాగుంటుంది. ఆచార్యుల వారి సారస్వత ప్రజ్ఞ శాశ్వతంగా నిలుస్తుంది.

## కృష్ణవాణి

అవధాని శేఖర బిరుదాంకితులు శ్రీ తాటిచెర్ల కృష్ణశర్మగారు రాయలసీమ వయోజ్ఞాన వృద్ధులైన అవధానులలో నొకరు. సంగీత, సాహిత్యాలలో అత్యంత నిపుణులైన వీరు అవధానాలలో పూరించిన కొన్ని సమస్యలు చాలా కష్టమైనవి. సామాన్యులకు సాధ్యం కానివి. అనంతపురంలో చేసిన అవధానంలోని రెండు సమస్యలలోని అర్థ క్లిష్టత, ప్రాస క్లిష్టత చూడండి.

సమస్య -

అర్ఘ్యము లిచ్చె, రాత్రి సమయమ్ముల నొక్కడు భానుమాలికిన్

పూరణ-

ఉ. ధైర్య్య దివాక రోష్ణకర తైజసవర్ధిత మీ జగంబు కా
నర్ఘ్యము విప్రదత్తము త దర్క పరాక్రమ పోషకం బగున్
అర్ఘ్య విధానమాగమ వచోన్విత మౌటను బ్రాహ్మణుండు తా
అర్ఘ్యము లిచ్చెరా! త్రి సమయమ్ముల నొక్కడు భానుమాలికిన్.

అర్ఘ్యము లిచ్చె -రాత్రి సమయమ్ముల అనేదాన్ని రాత్రివేళ కాదు అర్ఘ్యము లిచ్చెరా-త్రి సమయమ్ముల అని మార్చి - ఉదయ, మధ్యాహ్న, సాయంకాల సంధ్యావందన భావనను వర్ణించారు.

ఇంతకంటె కష్టమైన మరొక సమస్య చూడండి.

సమస్య: తార్క్ష్యుని బట్టి మ్రింగె నిజదర్ప మెలర్పగ సర్ప మద్దిరా!

దీనికి సహజంగా ప్రాసలు లేవు. తాటిచెర్ల వారు తమ పాండిత్య బలంతో వృక్ష, దిదృక్ష జిఘృక్ష శబ్దాల నుండి ప్రాసకు కావలసిన రీతిలో సాధించి ఇలా పూరించారు.

ఉ. వాక్యమె నీడపట్టుగ నివాసము చేసెడి పిట్ట జంట దై
దాక్ష్యముతోడ మేతకయి తత్పరతన్ కడు దూర మేగి జై
ఘాక్ష్యమునన్ నిమంగునకు క్రన్నన మేతను దేగ గూటిలో
తార్క్ష్యుని బట్టి మ్రింగె నిజదర్ప మెలర్పగ సర్ప మద్దిరా!

గరుడ పక్షుల జంట మేతకోసం దూరం పోయినప్పుడు, మహాసర్పం గూటిలోని పిల్ల గరుడపక్షిని మింగేసిందని భావం.

నంద్యాల అవధానంలో ఇచ్చిన సమస్య- "దేహము లేని పట్ల పడతీ ! మది మోహము పిచ్చలించెడిన్. - దేహము కాదు సందేహము అని ముందు పాదం చివర-సం-కలిపి చెప్పిన పద్యం పరికించండి-

ఉ. దోహద మిచ్చినావు మరుతూపులు డెందము వ్రయ్యలించె నా
దాహము తీర్తువంచు తుదిదాక నినున్ బ్రతిమాలినాడ వి
ద్రోహపు చింత మాని యనురూపసి నన్ గయ్యి కొమ్ము నీకు సం
దేహము లేని పట్ల పడతీ ! మది మోహము పిచ్చలించెడిన్.

పాకు, బేకు, హాకు, సాకు - అనే కన్నడ పదాలను తెలుగు భాషా పద్యంలో ఇమిడ్చి, దత్తపది చెప్పమంటే పలికిన అందమైన కందం గమనించండి!

కం. పాకుని హరి జంపుట సబ
బే-కుటిల కుయుక్తి నన్న విజయము కొర కా
హా! కుత్సితములు తగవే?
సాకులు లేకున్న జయము సాధ్యంబగునే?

ఇంద్రుడు పాకాసురుని చంపిన ఘట్టంలో దుష్టవధకు కుయుక్తులు పన్నినా తప్పు లేదనే భావంతో పూరించారు.

గుత్తి అవధానంలో ఇచ్చిన సమస్య-"బంగరు లింగకాయ గల భామిని వైష్ణవ కాంతయే గదా!" లింగ ధారిణి శైవురాలు అవుతుంది గాని, వైష్ణవాంగన కాదు. బంగరు లింగ అనేది సంబోధన చేసి, ఒక కాయను పట్టుకొని వస్తున్న కాంతను గురించి చెప్పిన పద్యంలోని చమత్కార నైపుణి ఇది-

ఉం. రంగులు పొంగువారు నొక రైక ఘటించి గులాబి రంగు చీ
రెం గడు తీవిగట్టి యొక రీతిగ వాల్జడవైచి క్షాయ చే
తం గొనివచ్చు కాంత గని తమ్ముని జూచి యొకండు పల్కె నో
బంగరు లింగ! కాయ గల భామిని వైష్ణవ కాంతయే గదా!

మరొక అవధానంలో చిలువ, కలువ, నలువ, పలువ శబ్దాలను పౌరాణికార్థంలో కూర్చి దత్తపది పద్యం నిర్మించమన్నప్పుడు కృష్ణ శర్మగారు చెప్పినది చూడండి-

గీ. చిలువ పాన్పున పవళించి చెలువు మిగుల
కలువ కన్నులు మూసిన కమల మగడు
నలువ గన్నయ్య భూ రోదనమును వినుచు
పలువ రక్కసులను జంప ప్రతిన బూనె.

1943లో పత్తికొండలో చేసిన అవధానంలో ఈ కింది వేదమంత్రాన్ని పద్యంలో అనువదించమన్నారు.

మంత్రం: ఓం నమ స్సదసే నమ స్సదస స్పతయే నమ స్సఖేనాం
పురోగాణాం చక్షుషే నమో దివే నమః పృథివ్యై
అనువాదం-

చం. సభ కభివాదనంబు విలస న్మతి తత్పతి కంజలింపు మ
చ్ఛుభములగోరు మిత్రుల విశుద్ధ మనస్కతకున్ నమస్సు పై
సభమును క్రింద భూమియు సనాతన యుగ్మము సాక్షియౌచు మా
కభయము నిచ్చు పొంటె నతు లందగ జేసెద కేలు మోడ్చుచున్.

వయస్సు పైనబడి ధార, ధారణ తగ్గుతున్న పరిస్థితిలో అవధానం చేయవలసి వచ్చినప్పుడు చేసిన ప్రార్థన పఠించండి!

గీ. కవిత చెప్పుచు నవధాన కార్యసరణి
గాన మొనరించుటది బహుకాల మయ్యె
ధారణయు తగ్గె మరియును ధార తగ్గె
నెటుల మెప్పింతునమ్మ! కామేశ్వరమ్మ!

అవధానం విజయవంతంగానే జరిగింది. తాటిచెర్ల కృష్ణశర్మగారి వంటి వ్యక్తులు చేసిన సాహిత్య సేవ రాయలసీమలో కావ్య రత్నాలను ప్రకాశింపజేసింది. ఆంధ్ర సరస్వతి కంఠమణిమాల కలంకారాలు తీర్చింది.

## ఏనుగు చంకబెట్టి ..

విజయవాడ వాస్తవ్యులు శ్రీ కావూరి పూర్ణ చంద్రరావు గారు తెలుగునాటి అవధానులలో మాన్యులు. వయో జ్ఞాన వృద్ధులైన వీరు ఎన్నో సాహితీ గోష్ఠులలో పాల్గొని, పరిశోధనాత్మక ప్రసంగాలు చేసి లబ్ధ ప్రతిష్ఠులైనారు. వివిధ ప్రదేశాలలో వారు చేసిన అవధానాలలో చెప్పిన పద్యాలు చూద్దాం:

విజయవాడలో చేసిన అష్టావధానంలో ఇచ్చిన సమస్య - "ఏనుగు చంక బెట్టుకొని యేగెను పండితు డెంత వింతయో!"

పూరణ-

ఉ. తా నొక పండితుండు లలితా మణి మంటప మందు పండుగన్
ధీ నిధులన్ సభన్ గెలిచి తేజ మెలర్పగ పెద్ద లందు క
ళ్యాణ విశేష మత్త గజరాజము బొమ్మబ హూకరింప నా
యేనుగు చంక బెట్టుకొని యేగెను పండితు డెంత వింతయో !

పండిత సభలో గెలిచిన ఒక విద్వాంసునికి మంచి ఏనుగు బొమ్మ ఇచ్చారట! కళ్యాణ శబ్దానికి శుభకరమైన అర్థం మాత్రమే కాక, బంగారమన్న అర్థం కూడా ఉండటం వల్ల ఎక్కువ అందం చేకూరింది.

అదే విధంగా-దత్త పది -బహ్వా, గహ్వా, ప్రహ్వా, జిహ్వా పదాలతో కందపద్యంలో అమ్మవారిని స్తుతిస్తూ చెప్పమన్నప్పుడు పలికిన పద్యాన్ని పరికించండి.

కం. బహ్వాజ్ఞ మహిమ నెదిరిచి
గహ్వ గతిం గూర్చి జగతి గాచిన దుర్గన్
ప్రహ్వాం బగు నుడువుల నా
జిహ్వయు నుతియించు నెల్ల చిత్రము లలరన్.

చాలా అజ్ఞుడైన మహిషాసురుని గూల్చిన దుర్గను వినయ వాక్కులతో నా నాలుక స్తుతిస్తుంది- అనే భావాన్ని తెచ్చి తమ పాండితిని ప్రదర్శించా రీ పద్యంలో కావూరి వారు.

విజయవాడ రేడియో కేంద్రంలో ఆహూతుల ఎదుట చేసిన అష్టావధానంలో ఇచ్చిన సమస్య -

"పతిని పరిత్యజించి ఒక భామ పతివ్రత యయ్యె నిమ్ముగన్.

పూరణ- దమయంతి నలుని తన భర్తగా భావించి ఇంద్రుని వదలిన ఘట్టాన్ని తీసుకొని చెప్పిన చక్కని పద్య మిదిగో!

చం. మతి విభవంబు లుట్టిపడ మాకు సమస్య నొసంగినారు భా
రత ధరియిత్రిలోన నలరాజు మతిందలపోసి యెవ్వ రే
గతి వచియించినన్ వినక క్రమ గుణాఢ్య తనంత పూర్వదిక్
పతిని పరిత్యజించి యొక భామ పతివ్రత యయ్యె నిమ్ముగన్.

గుంటూరు అవధానంలో హరిహరి, గిరిగిరి, సరిసరి, సిరిసిరి అనే దత్తపదిని పూరించే సమయంలో కావించిన శబ్ద చమత్కారం ప్రశంసనీయం,

చం. హరిహరి! రాళ్ళ వర్షమున కంతము లేదె యటంచు వార లే
గిరి-గిరి క్రిందకున్ తనదు కేలున వింతల వెన్నో చేసెనో?
సరిసరి! చిన్ని కృష్ణు బహు శక్తుల వెన్నియొ పెద్దవారు వ్రా
సిరి - సిరి దాని భర్తకును చేయగరాని విశేష మున్నదే!

విజయవాడ లలితామణి కళ్యాణ మంటపాన్ని సీసంలో వర్ణించమని పృచ్ఛకు డొకడు కోరినప్పుడు వచ్చిన ఉదాత్త సుందరమైన పద్యాన్ని చూడండి!

• సీ. నిగమార్థ సంపన్న నిష్ఠా పరత్వంబు వేద ఘోషాతి పవిత్రితంబు
సాహిత్య గోష్ఠిల సచ్చాటుభాషణ సంభార సాహితీ స్థానకంబు
గార్హస్థ్య జీవిత క్రమ వికాసారంభ కళ్యాణ వల్లీ సుకల్పకంబు
బహు శాస్త్ర పండిత ప్రకరంబునకు నిత్య మోదాను సంధానమూల శక్తి
గీ. తనరు నష్టావధాన ప్రదర్శనమున ప్రస్తుతము మాకు తోషంబు ప్రస్తరించు
విజయవాడ పురంబున వెలసి యున్న మహిత లలితామణీ ఖ్యాత మండపంబు.

పిక్చరు, స్ట్రక్చరు, ప్రాక్చరు, లెక్చరు-దత్తపదిని వేరొక అవధానంలో పూరించిన మేలైన తీరు గమనించండి! ఆంగ్ల పదాలను తెలుగు పద్యంలో ఇమడ్చటం కష్టమైనా సుందరమైన ఉత్పలమాల సృష్టితమైంది-

ఉ. పిక్చరు జూచి యొక్కడు నవీనుడు పెల్లుగ నుబ్బి సంఘపున్
స్ట్రక్చరు మారె నంచు నిక సర్వజనాళి మత ప్రసక్తితో
ప్రాక్చరు లొట తప్పని, ప్రపంచము పెద్ద కుటుంబ మంచు తా
లెక్చరు లీయగా విని భళాయని మెచ్చిరి సజ్జనాళియున్.

సినిమా చూసి ఒక ఆధునికుడు సంఘ స్వరూపం మారిందని, మత ప్రసక్తివల్ల ముక్కలు కాగూడదని, వసుధైక కుటుంబముగా ఉండాలని ఉపన్యాసాలిస్తే సజ్జనులు మెచ్చారట!ఆకిరిపల్లి అవధానంలో అక్కడి శోభనాచల స్వామిని వర్ణిస్తూ పాపరహితమైన ఆచరణ మార్గాన్ని అనుగ్రహించవలసిందిగా చేసిన ప్రార్థన చూడండి-

ఉ. ఏమి యొనర్చినన్ దురితమే యగు లోకములోన దేవ ! నీ
వేమొ విశేషముల్ భువిని సృష్టి యొనర్చితి వవ్వి కోరినన్
కామము కా దగున్ గనుక క్రమ విధంబున శోభనాచల
స్వామి! అనుగ్రహింపు మవి పాపము కాని తెరంగు దోపగన్.

ఇటువంటి ధారాళమైన శైలి, ఉన్నతమైన పాండిత్యం శ్రీ కావూరి పూర్ణచంద్రరావుగారి అవధానాలకు, రచనలకు వన్నె పెట్టాయి.

## రాతికి కోతి !

ఈనాటి అవధానులలో మెదక్ జిల్లా దుబ్బాక మండలంలోని పోతారెడ్డి పేట వాస్తవ్యులు శ్రీ గుమ్మన్నగారి లక్ష్మీ నరసింహశర్మ పేరెన్నిక గన్నవారు. వారి రచన ప్రౌఢ సాహితీ పరిపాక సుందరమై అలరారుతూ ప్రాజ్ఞులకు, రసజ్ఞులకు హర్షోత్కర్ష కలిగిస్తున్నది. వివిధ సందర్భాలలో వారి సమస్యా పూరణాది కవితా విశేషాలు కొన్ని పొందుపరుస్తున్నాను.

బిక్కనూర్ అవధానంలో కవీశ కపీశులను ఒకే పద్యంలో వర్ణించమని కోరినప్పుడు వాల్మీకిని, హనుమంతుని ఉత్పలమాలలో కూర్చిన కూర్పు చూండి !

ఉ॥ సుందర బంధుర స్ఫురిత శుద్ధ వచస్సు వసుంధరాకృతిన్
జెందిన రామ గాథను రచించెనె వండల పుట్టపుట్టువున్
వందల మారులున్ గొలుతు పావని పావన భావనార్థినై
ముందు స్తుతింతు నా కవసమున్ విరచింతు తరింతు నెంతయున్!

వేంకటరావుపేటలోని అవధానంలో పూరించిన సమస్య
"రాతికి కోతి పుట్టినది రమ్యముగా ద్విజు లెల్ల కొల్వగన్"!
పూరణ:

ఉ॥ శ్రీ తనరారు శిల్పకళచే నలరారు ధరాతలాన సం
ప్రీతిగ దేవళంబు లుపమించగ తద్గత విగ్రహంబులున్
ఖ్యాతిని గన్న శిల్ప నిగమాగమ వేది ఉలిన్ గదల్పగా
రాతికి కోతి పుట్టినది రమ్యముగా ద్విజు లెల్ల కొల్వగన్!

శిల్పి ఉలితో చెక్కగా ఆగమ శాస్త్రములో చెప్పిన కొలతల ప్రకారము తీర్చబడి ఒక శిల నుంచి హనుమంతుని విగ్రహం వచ్చిందని భావం

అలానే మరొక సమస్య- "సీతను పెండ్లాడి శివుడు శిశువున్ గనియెన్!"
పూరణ -

కం॥ చైతన్యానంద సుధా
స్రోతస్విని జాలువారు చొప్పున సుమన :
ప్రీతిగ హిమవ త్సుత నత
సీ తను పెండ్లాడి శివుడు శిశువున్ గనియెన్!

శివుడు పెండ్లాడినది సీతను గాదు హిమవత్సుత -పార్వతిని - అతసీ తనున్-అతసీ పుష్పం వంటి మృదువుఐన శరీరం గల దానిని అని శాబ్దిక చమత్కార సుందరముగా చేసిన చక్కని పూరణ ఇది.

సూర్యాపేట అవధానంలో పూరించిన సమస్య ఇదిగో! "ఖరము నెక్కి నతడు ఖ్యాతి నొందె !"

పూరణ:

అ.వె. ఒక మహా స్సముత్సకోన్నతి సందంగ
భారతీయ తత్వ భారతార్థి
ఒకడు నొక్క మను మహోన్నత హిమ వచ్చి
ఖరము నెక్కి నతడు ఖ్యాతి నొందె!

ఖరము - గాడిద నెక్కిన వాడు గాదు ఖ్యాతి నొందినది. మహోన్నతమైన హిమవత్ శిఖరము నెక్కినవాడు అని పూరించి తన ప్రజ్ఞను చూపించారు శ్రీ నరసింహ శర్మ.

దేవర కొండ అవధానంలో ఇచ్చిన దత్తపది- "టమాట, వంగ, బీర, చిక్కుడు - భారతవరము"

చం॥ మనమున నెన్నుకోబడుట మాటకు సత్యము భూమి భాగ మి
మ్మని కుడువంగ గ్రామముల నైదయినన్ సరియే యటంచు దె
ల్పిన అల ధర్మరాజు నుడి బీర మెరుంగమి నా సుయోధనా
వనివతి చిక్కు డుల్పుకొన భారత గాథను పాటులంబడెన్!

పడుట - మాట, కుడువంగ, బీర మెరుంగమి, చిక్కు-డుల్పు అను విధములుగా దత్తపదాలు ఇతరార్థాలలో వచ్చి భారత భావాన్ని తెచ్చాయి.,

వికారాబాద్ అవధానంలో ఇచ్చిన దత్తపది- జరదా, సరదా, దురదా, వరదా-వార్షిక వర్ణన

పూర: -

ము॥ జర-దార్ఢ్య స్థితి డుల్పు లేనివగు నిచ్చల్ లోన గల్గించు వాక్
సర దానందము గంద జేయు దురహంకారంపుటాసక్తి నీ
దు రదాంతర్దళన క్రియన్ నిలువు నెందున్ దాని నమ్ముంజు మీ
వరదా! నీ వరదాన మిచ్చి యుడిపింపన్ రమ్ముతద్బాధలన్!

జరదా - జర ముసలితనము దార్ఢ్య స్థితిని డుల్పును అని పద విభాగము చెందినది. అటులే సరదా సరత్ + అనందము అయినది. దురదా-నీదురదాంతర్దళన క్రియగా మారినది (రదము=పన్ను). ఈ విధముగా పద విభాగములో నుంచి రసాస్పద లక్షణము ప్రభవించింది.

సంగారెడ్డి అవధానంలో భక్త కవులు ముగ్గురి పేర్లు వచ్చే విధంగా పద్యం చెప్పమన్నప్పుడు -పోతరాజు, త్యాగరాజు, గోపరాజు-పేర్లను కూర్చి చెప్పిన అందమైన ఉత్పలాన్ని అందుకోండి!

ఉ॥ రాజులు గారి రాజు లవురా! కవిరాజులు - పోతరాజు- నా
యోజనె త్యాగరాజు నటు లొప్పిన వాడల గోపరాజునున్
నైజ కళా ప్రపత్తుల సమస్య విధంబుల నింప నాంధ్ర భూ
తేజ మజేయమై సుకృతి దీథితు లెల్లల నెల్ల వెల్వడెన్!

అవధానం మయసభతో పోల్చి చెప్పమన్నప్పుడు మరొక చోట చెప్పిన మత్తేభ విక్రీడిత క్రీడను చూడండి!

మ॥ సుహృదుల్ పెక్కురు స ద్యచోమణి గణ శ్లోకైక సంపత్తులన్
బహుమానింపగ రాజు లట్టు లిట గన్పట్టంగ నున్నారు ధీ
మహితుల్ సభ్యులే సరస ధర్మ ప్రీతినే నొట దు
ర్యహ దుర్యోధన మూర్త వృచ్ఛక మయ ప్రాచుర్య మీ గోష్ఠియా!

వృచ్ఛకులను దుర్యోధనునితోను, తనను ధర్మరాజుతోను, ప్రేక్షకులను రాజులతోను పోల్చి ఈ

పద్యం మయసభా సామ్యాన్ని నిరూపించింది.

ప్రతిభా వ్యుత్పత్తులు పుష్కలంగా ఉన్న శ్రీ లక్ష్మీనరసింహశర్మగారు భవిష్యత్తులో భారతికి మరిన్ని అలంకారాలు కూర్చగలరని ఆశిద్దాము.

## పందేతెమ్ముతినంగ ...

అవధాన రంగంలో ఆధునిక కాలంలో ప్రసిద్ధి చెందిన సమర్థులైన అవధానులలో ఆచార్య శ్రీ జేతవోలు రామబ్రహ్మం పేర్కొనదగిన వారు. పద్య కవితకు ప్రశస్తిని నిలుపుతున్న కొద్దిమందిలో వీ రొకరు.

ఒకసారి ప్రకాశం జిల్లా మార్కాపురంలో 'భువన విజయం' జరుగుతున్నది . తిమ్మరుసుగా నే నిస్తున్న సమస్యలను అష్టదిగ్గజ కవులు పూరిస్తున్నారు. అప్పుడు సభలో నుంచి ఒక ప్రేక్షకుడు లేచి "మీరు సమస్య లిస్తున్నారు. వారు పూరిస్తున్నారు. అలా కాదు. నే నిస్తాను. ఎవరైనా పూరిస్తారా?" అని సవాలు విసిరాడు.

సాహిత్య సభలలో ఇటువంటి ఘట్టాలు ఎప్పుడో గాని రావు. అప్పుడు నేను చమత్కారంగా "సమస్యలు పూరించిన కవులకు రాయలవారు ఘన సన్మానం చేస్తున్నారు. మీరు కూడా అందుకు సిద్ధమేనా?" అన్నాను.

సభలో లేచి నిల్చున్న తర్వాత అతడు వెనుదీయదలచుకోలేదు. సహజంగా రసజ్ఞుడు కూడా. కనుకనే నిచ్చిన సమస్య పూరించిన వారికి నూటపదహారు రూపాయలిస్తానన్నాడు. అప్పుడు వెంటనే ముగ్గురు నలుగురు ఆ ప్రేక్షకు డిచ్చిన సమస్య పూరించారు. అందులో రామబ్రహ్మంగారు ప్రథములు.

ఆ సమస్య - పూరణ చూడండి. "చెప్పిననున్ రమింప విది చెప్పకయున్ రమియింప వక్కటా!"

వరూధిని ప్రవరునితో సంభాషించిన సందర్భం తీసుకొని చేసిన దీ పూరణ-

ఉ॥ ఇప్పటి కీ మహావనిని నేను వరూధిని నొంటి నుంటి రప్పై
జిప్పిలు యౌవ నామృతము చేరల గ్రోలగ నిచ్చు చుంటి నో
యప్ప! యిదేమి చిత్రమువురా! వలపోపక సిగ్గు వీడినే
చెప్పిననున్ రమింప విది చెప్పకయున్ రమియింప వక్కటా!

ఇక వివిధావధానాలలో పూరించిన కొన్ని సమస్యలను చూడండి!

సమస్య: "కుండలు కొండ నెత్తె కనుగొన్న సురల్ వెరగంది చూడగన్"

కుండలు కొండ నెత్తిన వన్న అసందర్భాన్ని తొలగించి రావణుడు సర్పరాట్కుండలుడైన శివుని కొండ నెత్తాడని సందర్భం చూపించి, చేసిన పూరణ పాండితీ ప్రతిభలకు చక్కని నిదర్శనం.

ఉ॥ చండతర ప్రభావమున చండ మయూఖుని గెల్చువాడు దో
ర్దండ కళాభిగుప్త నిజరాక్షస వీరుడు రావణాఖ్యుడా
ఖండల వైరి ఘోరతర గాఢ తపంబును జేసి సర్పరాట్
కుండలు కొండనెత్తె కనుగొన్న సురల్ వెరగంది చూడగన్!

మరొక సమస్య: 'సారా తెమ్మెనె రాఘవుండు హనుమన్ సంరంభ మేపారగన్!"

సారా అనే పదాన్ని దోస్సారా! బాహుశక్తి గలవాడా అని సంబోధనగా మార్చి సంజీవి పర్వతాన్ని

తెమ్మని లక్ష్మణుని మూర్ఛవేళ రాముడు హనుమంతుని కోరినట్లుగా భావాన్ని కూర్చి చెప్పిన చాతుర్యధుర్యమైన పూరణ గమనించండి!

శా॥ ఆ రక్షఃపతి పుత్రు డేసిన విష వ్యాసక్త బాణౌఘముల్
శ్రీ రామానుజుదాకి యాత డదె మూర్ఛిల్లెన్ సుషేణుండు హ
స్తారూఢిన్ గమనించి పల్కిన గతిన్ సంజీవి నూటాడి దో
స్సారా! తెమ్మనె రాఘవుండు హనుమన్ సంరంభ మేపారగన్!

వేరొక సమస్య - "సూర్యుం జూచిన తోడనే కలువ సంశోభించె నందంబుగన్!"

సూర్యుని చూస్తే కలువ ముడుచుకుంటుంది కాని వికసించి శోభిల్లదు. అయితే అస్తమిస్తున్న సూర్యుణ్ణి చూచి శోభిల్లుతున్నదని కవి చమత్కారం. వీక్షించండి!

శా॥ భార్యా భర్తల అంతరంగ కథలన్ భావింప నెవ్వారు
డీర్యల్ తెల్పుదు. సంజ వేళకు వరుండేతేరుబో భామినీ
చర్యల్ చారు తరంబులై తగు నిరీక్షాపేక్ష నస్త్రాద్రిపై
సూర్యుం జూచిన తోడనే కలువ సంశోభించె నందంబుగన్!

కేవల సంధ్యా చిత్రాన్ని మాత్రమే కాక, అందులో ఒక మధుర శృంగార సూత్రాన్ని కూడా గ్రథితం చేసి రామబ్రహ్మం గారు రసరమణీయతను రంజిల్ల జేశారు.

ఇంకొక సమస్య: "పందేతెమ్ము తినంగ నంచు పలికెన్ బాపండు పేరానతో"

పందిని గాదు లడ్డూల గంపందేతెమ్ము అని పదవిభాగం జేసి ఏ విధంగా హాస్య లాస్యాన్ని సృష్టించారో కవి నైపుణ్యాన్ని పరికించండి!

శా॥ అందాల్ చిందెడు కార్తికంబున శమీఖ్యాతాగ సచ్ఛాయలో
బృందాల్ గట్టిన మత్తు లెల్లరును భక్షింపన్ పదార్థంబులన్
బృందంబందున స్పర్ధ హెచ్చి యిటు రానీ రాని 'లడ్డూల గం
పం దే తెమ్ము తినంగ నంచు పలికెన్ బాపండు పేరాసతో!

సినిమా నటి స్మిత పేరుతో ఇచ్చిన సమస్యకు చేసిన పూరణలో ఆమె స్మిత కాదు చంద్రికా స్మితయైన శారదా దేవికి వందన మాచరించ మని తెలిపిన రీతి చూడండి-

మ॥ అతులం బైన యశంబు నందుకొను నూహల్ బూని కావ్యాళి ని
ర్మితి జేయన్ దొరకొందు వేని రసముల్ రీతుల్ ధ్వనుల్ గూర్ప నెం
చితివేనిన్ వినుమోయి నా పలుకు -వాక్ఛ్రీమాతకున్ చంద్రికా
స్మితకున్ వందన మాచరింపుము కవీ! సిద్ధించు నీ కోరికల్ !

"అరే ఆ, తూరే తూ, పీరే పీ, జారేజా" దత్తపది భారతార్థంలో చెప్పమన్నప్పుడు ఆ తురుష్కపదాలను తెలుగులోకి మార్చి పూరించిన ప్రజ్ఞా ప్రాభవాలను చూడండి!

శా॥ ఆ రే యా మృగరాడ్బలున్ గెడపు నూహన్ వాయుజుం డొక్కటే
తూరే తూరి గుభేలు మం చదిమెనత్యుగ్రాకృతిన్ వాని పెం
పీ రేపీ నిశి నెల్లవారలును నెంతే మెచ్చి కీర్తింత్రు మ
జ్జారే ! జాతికి జీవగర్ర లివి వ్యాస ప్రోక్త సందర్భముల్!

ఆ రేయి + ఆ మృగ, పెంపు + ఈ రేపు + ఈ నిశి మొదలైన పద విభాగ పద్ధతిలో నేర్పుతో చేసిన కూర్పిది.

ఈ విధమైన అవధాన నైపుణిలోనే కాక భవ్య కావ్య రచన ద్వారా, విమర్శన గ్రంథ నిర్మాణం

ద్వారా బేతవోలు వారు సమున్నతమైన స్థానాన్ని అందుకుంటున్నారు. ఆంధ్ర సరస్వతికి వీరి సేవలు మరింతగా ఉపయోగించగలవని ప్రాజ్ఞుల ఆశ.

## కమనీయ శిల్పం

ప్రత్నానంద దీక్షా నామధేయులైన శ్రీ కొండూరి వీరరాఘవాచార్యులుగారు కళాప్రపూర్ణాది బిరుదాంచితులు. సాహిత్య, శిల్ప, యోగ శాస్త్రాలలో వారికి గల ప్రసిద్ధి లోక విదితం. సారస్వత రంగంలో ఉదాత్త స్థానాన్ని ఆక్రమించి భువన విజయ ప్రక్రియలో ఎన్నోచోట్ల వారు పాల్గొని పద్య కవితకు యథాశక్తి సేవ చేశారు. 'వంపా విరూపాక్ష బహు జటాజూటికారగ్వధ ప్రసవ సౌరభ్యములకు..' అనే శ్రీనాథుని సీస పద్యాన్ని అనుకరిస్తూ వారు రాయలను ఆశీర్వదిస్తూ చెప్పిన రమణీయ పద్యం చూడండి!

సీ. శ్రీ విరుపాక్షేశ శీర్షో పరిస్యస్త సురభిళా రగ్వధ సూనరాజి
సాళువ గణపతి స్వామి ఫాలాంకిత భసిత త్రిపుండాచ్ఛ భవ్యరోచి
ప్రహ్లాద రక్షణ ప్రవణోగ్ర నరసింహ గళనవమాలికా గంధలహరి
శాంతి ప్రదాన హజార రామస్వామి కారుణ్య పూర్ణ దృక్కాంతి రేఖ
గీ. ఆయురారోగ్య భోగ భాగ్యముల తోడ వేంకటేశ్వర పాదారవింద హృదయు
సాహితీ సమరాంగణ సార్వభౌము కృష్ణరాయ క్షితీంద్రు రక్షించుగాక!

ఆ యా సభల్లో వారు పూరించిన సమస్యలు కొన్ని వారి పాండిత్యానికీ, ప్రతిభా పాటవాలకూ నిదర్శనంగా ప్రకాశిస్తున్నాయి.

"మార్తాండుం డపరాద్రి గ్రుంకె నదిగో మధ్యాహ్న కాలంబునన్" అనే సమస్యను పూర్వం మోచర్ల వెంకన్న పూరించారు. దాన్ని ఒక సభలో కొండూరివారు పూరించిన చతుర పద్ధతి గమనించండి!

శా. ధూర్తత్వంబున బొంకి-యే నెటు గురు ద్రోహంబు గావింతునం
చార్తిం బొందిన ధర్మసూనుడె అసత్యం బాడగా పుత్ర దు
ర్వార్తన్ త్యక్త నిజాస్త్రుడైన తల ద్రుంపన్ శాత్రవుల్ ద్రోణుడన్
మార్తాండుం డపరాద్రి గ్రుంకె నదిగో! మధ్యాహ్న కాలంబునన్

భారత యుద్ధంలో ద్రోణవధా ఘట్టాన్ని తీసుకొని చేసిన పూరణ ఎంతో సుందరంగా ఉంది.

"భార్యలు ముప్వు రా పరమ పావనుడౌ రఘురామ మూర్తికిన్"అనే సమస్యను పూరిస్తూ రావణ సంహారం చేసి సీతా లక్ష్మణాదులతో కలిసి పుష్పకం మీద అయోధ్యకు చేరుకొన్న శ్రీరామునికి ముగ్గురు సోదరుల భార్యలు హారతు లిచ్చారంటూ చెప్పిన పద్యం చూడండి!

ఉ. శౌర్య మెలర్ప రావణుని జంపి అయోధ్యకు పుష్పకమ్ముపై
భార్యను తమ్మునిన్ గలిసి భానుకులాగ్రసరుండు రా, మనో
హార్య విశిష్ట గీతముల హారతు లిచ్చిరా సోదరావళీ
భార్యలు ముప్వు రా పరమపావనుడౌ రఘురామ మూర్తికిన్.

మరో సమస్య -

దారుణ కృష్ణ సర్పము సుధల్ వెలిగ్రక్కుచునుండె గంటిరే?

కృష్ణ సర్పము-నల్లత్రాచు అమృతమును వెలిగ్రక్కుతున్నదట! దీన్ని ఆచార్యులవారు రెండు రకాలుగా భావ బంధురంగా పూరించారు. ఒక పూరణలో శిల్పి ఒకడు బంగారంతో నాగాకృతి గల పాత్ర

చేసి అందులో అమృతం పోసి ఇచ్చాడని చెప్పారు. ఆ పద్యం చూడండి!

ఉ. సారమతి ప్రభావమున సర్ప వరాకృతి హేమ పాత్రమున్
దా రచియించి అందు అమృతంబును నిండగ జేసి త్రావగా
భూరమణా! యొసంగె గద! పూజ్యుడు వెంకణ శిల్పి చంద్రు డా
దారుణ కృష్ణ సర్పము సుధల్ వెలి గ్రక్కుచునెండె గంటిరే!

మరొక పూరణలో ఉత్కళ ప్రభువు యుద్ధంలో ఓడి తప్పక తన చెల్లిలిని రాయల కిచ్చి పెళ్ళి చేశాడని అయితే ఆమె పగబట్టిన త్రాచులాగా పైకి మాత్రం సరసోక్తు లాడుతూ అమృతం కక్కుతున్నట్లుగా ఉందని ఆలంకారిక రమణీయంగా పద్య రచన చేసి, సుందర దృశ్యాన్ని కంటి ముందుంచారు ఆ పూరణ వీక్షించండి!

ఉ. క్రూరుని ఉత్కళాధిపుని ఘోర రణంబున గెల్చె రాయ లా
భూ రమణుండు చెల్లెలిని భూపతి కిచ్చెను సంధి సేయగా
శ్రీ రమణీ మనోజ్ఞయగు చేడియతో సరసోక్తులాడు నా
దారుణ కృష్ణ సర్పము సుధల్ వెలిగ్రక్కుచునుండె గంటిరే!

"కారాగారమునన్ ధ్వనించె నవురా గంధర్వ సంగీతముల్" అనే సమస్య కూడా ప్రసిద్ధి కెక్కిందే. దీన్ని చాలామంది కృష్ణ జన్మఘట్టాన్ని తీసుకొని పూరించారు. కొండూరి వారూ అటువంటి పూరణ ఒకటి చేశారు. అయితే స్వాతంత్ర్య సమర ఘట్టాన్ని తీసుకొని, సంగీత శాలను భావించి చేసిన మరో రెండు పూరణలు వారి ప్రత్యేకతను తెలియజేస్తున్నవి - చూడండి!

శా. సారోదార మనోజ్ఞ గాన కవితన్ స్వాతంత్ర్య సంపాదన
ప్రారబ్ధోద్యమ మందు నొక్కరిత కారాబద్ధ గావింప త
న్నారీరత్నము ప్రొద్దు పోకకయి నానా రాగముల్ పాడగా
కారాగారమునన్ ధ్వనించు నవురా! గంధర్వ సంగీతముల్.

శా. సార ప్రజ్ఞులు శిల్పి సత్తములు శాస్త్ర ప్రౌఢి సంగీత కా
గారం బొండు సృజించినార లచటం గావించు నశ్రాంత గా
నారంభంబుల జేసి కృష్ణ నరపాలా! తత్కళా సుందరా
కారాగారమునన్ ధ్వనించు నవురా! గంధర్వ సంగీతముల్

ఈవిధంగా కమనీయ శిల్ప కల్పనాత్మకమైన పద్యా లెన్నో రచించి వీర రాఘవాచార్యులుగారు సరస్వతీ పరివస్య గావించారు.

## కలలో గర్భము

తిరుపతి వాస్తవ్యులు, సుప్రసిద్ధ పండితులు శ్రీ గౌరిపెద్ది రామసుబ్బశర్మ గారు వివిధ శాస్త్ర కోవిదులు. చిన్నతనంలో సరదాగా ఒకటి రెండవధానాలు చేసినా, దాని మీద పెద్ద ఆసక్తి కలగలేదు. తరువాత నలభయ్యేళ్ళ ప్రాయంలో ఒకసారి ప్రొద్దుటూరులో సి.వి. సుబ్బన్న శతావధాని బలవంతం మీద అష్టావధానం చేశారు. అప్పుడు చెప్పిన పద్యాలు చూడండి !

ఉ॥ ఏ నవధానిగా నలువ వేడులు నిండిన యిప్పు సభ్యస
న్మానము లందుకొన్న అవధాన కళా చతురుండు భారతీ
ధ్యాస వికస్వరుండు గడియారము వారి అనుంగు శిష్యుడున్
సూనృతవాది యా కడప సుబ్బన సూర్పు సఖుండు నాకు అ

న్యూన పదాంబు రాశి నను నూరక నీ వవధాని వంచు నే
పూనిక నుగ్గడించెనో సుబోధము కా దవిస్పష్ట వృత్తి కా
లూనితి నీ పురంబునబు ధోత్తములార ! భవ ద్రసజ్ఞ తా
ధీనత తోడు గాగ పరమేశ్వరుడోముత నీ వధానమున్
ఉ॥ చేసితి నే పధానమని చిన్నిరికంబున నొండు రెండు వి
ద్యాసముపాత్తదర్ప సముదగ్ర సతీర్థుల గోష్ఠి నాకు వి
శ్వాసము లేదు వానిపయి పాండితిపై గల దాశ ఏ తదా
భ్యాసమునన్ సుమా రిరువదైదు సమంబుల దీ యుదంతమున్

ఆలస్యంగా మొదలుపెట్టినా ఎంతో సమర్థతతో పాండితీ ప్రకర్షతో, ధారణాశక్తితో శర్మ గారి అవధానాలు సహృదయరంజకంగా ఉండేవి. ప్రొద్దుటూరు తర్వాత తిరుపతి, నెల్లూరు. ఒంటిమిట్ట. చిత్తూరు. వరంగల్లు మొదలైన ఎన్నో చోట్ల అష్టావధానాలు చేసి వారు ప్రశస్తి గాంచారు. వరంగల్ అవధానంలో పూరించిన ఒక సమస్య చూడండి.

సమస్య: భీష్మునితో గూడి రంభ భీముని గనియెన్

పూరణలో గ్రీష్మవేళ ఒకడు పగటి కలకంటూ ఈ దృశ్యాన్ని చూశాడని చమత్కారంగా చెప్పాడు.

కం॥ గ్రీష్మంబున భారత మ
త్యూష్మం బెగదొట్ట చదివి ఉ త్స్వప్నించెన్
భీష్ముని గూరిచి యొక డిటు
"భీష్మునితో గూడి రంభ భీముని గనియెన్!"

చిత్తూరు జిల్లా సంతవేలూరు అవధానంలో ఇచ్చిన సమస్య గమనించండి.

"కలలో గర్భము నిల్చె కోమలికి లోకంబింక నిందింపదే!"

దీని పూరణ చూడండి.

మ॥ అలఘుస్వాంతుడు కామ శాస్త్ర ధిషణాఖ్యాతుండు ప్రాయంబునన్
లలితాంగీమణి నూత్న యౌవన సముల్లాస స్ఫుర ద్రూపతన్
వలపుల్ మానస మందు నిండగను నిర్వక్రంబు లౌ రాకపో
కలలో గర్భము నిల్చె కోమలికి లోకం బింక నిందింపదే!

కలలో కాదు, ప్రియుని రాకపోకలలో గర్భమైంది బహుశా పెళ్ళి, కాలేదు. కనుక లోక నింద కాస్పదమైంది. శబ్దాల కూర్పులో, మలుపులో, అందమైన పూరణ వచ్చింది.

చిత్తూరు అవధానంలో ఇచ్చిన సమస్య పరికించండి.

"కన్నెకు మీసముల్ మొలిచె కాంతుని కన్గొను సంభ్రమంబునన్"

పూరణ-

ఉ॥ ఎన్నడు వచ్చునో విభు డదేమని న న్గని పల్కరించునో
అన్న కుతూహలంబున మనోబ్జము విచ్చగ కజ్జలంబు గై
కొన్నది కన్నులందిడ నగో! విభు డన్నను చేయి జారగా
కన్నెకు మీసముల్ మొలిచె కాంతుని కన్గొను సంభ్రమంబునన్!"

భర్తకై ఎదురు చూసే విరహాతుర అతడు వస్తున్నా డన్న తొందరలో అలంకరించుకొంటున్నది. కాటుక తీసుకొని కండ్లకు పూసుకుంటున్నది. ఇంతలో పక్కన ఉన్న చెలి 'అదుగో! విభుడు వస్తున్నా' డన్నది. ఆ తొందరలో చేయి జారి కాటుక మూతి మీద పడింది. అది మీసాలు మొలిచిన భ్రాంతిని కలిగిస్తున్నది.

నెల్లూరు అవధానంలో పార్వతీ పరమేశ్వర సమాగమాన్ని సీసంలో వర్ణించమంటే వచ్చిన పద్యం ఎంత పొంకంగా, బింకంగా ఉందో పరిశీలించండి-

సీ॥ బంధూక కుసుమ ప్రభాహారి కౌశేయ వీచికా బంధంబు వెలుగు లుమియ
శింజాన మంజీర మంజుల ధ్వని పాద విన్యాస తాలంబు విధము దోప
శివు జూడ నడ సాగు చిన్నారి చూపులే దారి జూపెడి ప్రతీహారి గా
గిరిరాజ సుత వచ్చె తరలి పొండను లీల మొలనూలిడాల్ బరాబరులు సేయ
తే॥ మేని కలపంబు వాసన మిడిసి పడగ సుమకరండము వల చేత సొగసు కూర్ప
మరుని యూపిరి త గ్గని మసలుకొనగ అభవు కొలువంగవచ్చు మా యమ్మ దలతు.

ఆలోచించి రచించే ఇటువంటి ప్రబంధశైలీ మనోహరమైన పద్యాలను అవధానాంలో చెప్పగల దక్షులు గౌరిపెద్ది వారు.

జనమంచి వేంకట సుబ్రహ్మణ్యశర్మ గారు. గడియారం వేంకట శేష శాస్త్రిగారు. పుట్టపర్తి నారాయణచార్యులవారు, రాళ్ళపల్లి అనంతకృష్ణ శర్మగారు, పింగళి లక్ష్మీకాంతం గారు మొదలైన విద్వాంసు లెందరో రామసుబ్బశర్మ గారి అవధాన దక్షతను, పాండితీ ప్రభావాన్ని ప్రశంసించారు. ఇటువంటి విబుధేంద్రుల వలననే అవధానానికి గౌరవం నిలబడిందంటే అతిశయోక్తి కాదు.

## నల్లిపురాణం

చిన్న చిన్న వస్తువుల మీద సీసాలు, స్రగ్ధరలు వంటి పెద్ద పద్యాలడిగి అవధానులను ఇరకాటంలో పెట్టటం కొందిరికి సరదా. తిరుపతి వేంకట కవులవంటి సమర్థులు అటువంటి వాటిని అలవోకగా చెప్పేవారు. రామకృష్ణ కవులు. వేలూరివారు, ఇలా ఎందరో అటువంటి ప్రజ్ఞ ప్రదర్శించారు. కొప్పరపు కవులలో విశేషమేమంటే ఆ రోజుల్లో సాహిత్య వివాదాల ఉద్ధతిని బట్టీ ఇటువంటి వాటిని వారెక్కువగా ఎదుర్కోవలసి వచ్చింది. ఆ సమయాలలో వారు చూపిన ప్రజ్ఞను కాళ్ళకూరి నారాయణరావు మొదలగు విద్వాంసులెంతగానో ప్రశంసించారు. మరో విశేషం చెప్పిన పద్యాలు ఎంతో రసవంతంగా ఉండటం. వేటూరి ప్రభాకర శాస్త్రిగారు మదరాసులో వీరి అవధానాశు కవితా ప్రదర్శనలు చూచి ఇలా అన్నారు.

ఉ॥ నాల్క తుదన్ నిరంతరము నాట్యము సల్పుట కీ సహోదరుల్
పల్కు వెలంది నెట్లు తొలుసుబామున కొల్చిరో తేట తేనియల్
చిల్కెడు నట్లు విందొనగు చెప్పిన పద్యము లెల్ల వహ్వారే
పల్కిన పల్కు లన్నియును పద్యము లయ్యెడు నేమి చెప్పుదున్!

పలికిన పలుకులు పద్యాలుగా మారిపోతున్న అద్భుత దృశ్యం ఎటువంటి వానికైనా పారవశ్యం కలిగిస్తుంది. తప్పదు మరి!

గుంటూరు శతావధానంలో కలాన్ని గురించి సీసపద్యం చెప్పమంటే వచ్చిన పద్య మిది:

సీ. కరము ద్విజిహ్వాల గరిమ గాంచుట జేసి అత్యుగ్ర ఫణిరాజ మనగవచ్చు
నెమ్మి సువర్ణాన నిర్మించుటను జేసి యల శమంతక రత్న మనగవచ్చు
నీ లోదకంబుచే నెగడు చుండుట జేసి అలయమునానది యనగవచ్చు
మంచి చెడ్డల నొక్క మాడ్కి నుండుట జేసి ఆత్మార్థ విజ్ఞానియనగవచ్చు

గీ॥ కాగితము లను నదులపై గ్రాలుచుంట కల మనగవచ్చుగాన నీ కలము మహిమ
మిట్టిదని వర్ణన మొనర్చ నెవరి తరము రమ్య కారుణ్య గుణసాంద్ర! రామచంద్ర!

రెండు నాలుక లుంటవి గనుక పామనవచ్చు. బంగారంతో చేస్తారు గనుక శమంతక రత్నమనవచ్చు. నల్లసిరా ఉంటుంది కనుక యమునా నది అనవచ్చు. మంచి, చెడు ఒకరీతిగా రాస్తుంది కనుక ఆత్మజ్ఞాని అనవచ్చు. తెల్లని కాగితమనే నదిమీద కదులుతుంటుంది కనుక ఓడ అనవచ్చు. కలం మహిమ ఇంతటిదని వర్ణించటం ఎవరితరం అంటారు సోదర కవులు. కవి కల్పన ఎంత అద్భుతంగా ఉంటుందో, ఎంత విచిత్రంగా ఉంటుందో చెప్పటానికి ఇదొక ఉదాహరణ.

ఒక ప్రాశ్నికుడు తల వెంట్రుకమీద స్రగ్ధర చెప్పమన్నాడు. అప్పుడు వచ్చిన పద్య మిదిగో!

స్రగ్ధర-

అంభోజాతాక్షి వేణీన్ హరువు గనిన రోమాతి సౌభాగ్యమెంతే
సంభావింతున్ పయోముక్సముదయరుచులున్ స్ఫారరోలంబ కాంతుల్
శుంభద్ధ్వాంత ప్రభల్ హెచ్చుగ గొని విధి మెచ్చుగా గూర్చి యాపై
జంభ ద్విడ్రత్నరోచుల్ చమిరి యొనరుపన్ చక్కనౌ తీవయోనాన్.

మబ్బు వలె, తుమ్మెద వలె, చీకటి వలె, ఇంద్ర నీలంవలె నల్లగా ఉన్న తల వెండ్రుక అందం అంత పెద్ద పద్యానికెక్కింది.

బాపట్ల శతావధానంలో నల్లిమీద లయగ్రాహి కోరా డొక పండితుడు-ఆ పద్యం చూడండి!

లయగ్రాహి

మల్లెలును మొల్లలును జల్లినను శయ్యపయి నల్లియొక డుండ సుఖ మెల్లయును పాడం
చెల్లరు వచింతు రటు లెల్లిదము సేయ దగ దల్ల కుసు మాంబకుని భల్ల మది యందున్
వల్లభుడు కాంత ముద మల్లుకొన సెజ్జగన పె ల్లెగసి నిద్ర తను వెల్ల మరపింపన్
ఝల్లు మన గుట్టి రతి నుల్లములు దన్ని భళి వల్లెయని వారి నుతు లల్లపుడె గంటన్.

మల్లెలు, మొల్లలు మొదలైన పూలు జల్లిన పానుపుపైన ఒక నల్లి ఉంటే చాలు సుఖం పాడుచేస్తుందని అందరూ అంటారు. అలా కాదు. అది మన్మథుని బల్లెం వంటిది. ఎందుకంటే ప్రేయసీ ప్రియులు క్రీడించి నిద్రపోతున్న సమయంలో నల్లి కుడితే మెలకువ వస్తుంది. అప్పుడు మళ్ళీ రతిలోకి దిగుతారు. అందువల్ల నల్లి వల్ల మేలే జరుగుతుంది అని చమత్కారం.

కవుల ఊహలలో ఇటువంటి వింతలు, విశేషాలు ఎన్నో కనిపిస్తుంటాయి. అందులోనూ సోదర కవులు అసామాన్య ప్రతిభా సంపన్నులు కావటం వల్ల సులభంగా ఎంతటి ప్రశ్నకైనా చెప్పేవారు. ఏదో పూర్తి చేయటం గాక అవతలి వాని మనస్సుకు నచ్చేలా చెప్పటం వారి ప్రత్యేకత.

## గోరుమీద సీసం

అవధానాలు, ఆశు కవిత ప్రదర్శించే వేళలలోనూ, ఇతర సందర్భాలలోనూ చాలా చిన్న చిన్న వస్తువులమీద పెద్ద పెద్ద పద్యాలు చెప్పవలసి వస్తుంది ఆ సందర్భాలలో కవుల ఊహలు, భావనలు వింత వింతగా మనకు దర్శన మిస్తుంటాయి. 19వ శతాబ్దం మొదట ఉన్న గొట్టిముక్కల నరసింహరాజు తాను పెంచిన గోరు ప్రమాదంవల్ల పోతే దానిమీద ఒక సీస పద్యం చెప్పాడు చూడండి:

సీ. కుంభి కుంభస్తనీ కుచగుళుచ్ఛములపై చంద్రవంకలు తీర్చు జాడమాని
ఘన ఘనాఘన వేణికా కచంబులమీద చిక్కు లన్నియు బాపు చెలువు వదలి
హారభాసుర కుచాహరి కుచాకీర్ణహార పంక్తులు దిద్దు దారి వదలి
బహువిధ రతిఖిన్న భామా ముఖ స్వేదబిందువుల్ చిటిలించు పొందు లుడిగి

గీ. కామినీ స్వర్ణ రంభా శిఖాసువర్ణ మార్దవా వాసపృష్ఠ సంభావ్య మాన
నవ్య కండూతి వాపెడు నయము వదలి పోయెగో గోరు మా చేతి పొందు మాని.

కుంభస్తనుల కుచాల మీద క్షతాలు చేసి చంద్రవంకలు తీరుస్తూ, అక్కడి హారాలు సరిచేస్తూ జుట్టు చిక్కు తీస్తూ, రతిలో అలసిన ప్రియురాలి ముఖం మీది చెమట బిందువులు తొలగిస్తూ, బంగారు వంటి అరటి బోదెల వంటి తొడలను, పిరుదులను నిమురుతూ ఉండే నా గోరు పోయింది గదా! అని అతడి బాధ.

తిరుపతి వేంకట కవుల అవధానాలలో ఇటువంటి వాటి మీద ఎన్నో చమత్కార పద్యాలు కనిపిస్తాయి. బందరు అవధానంలో చీపురు పుడకమీద అడిగితే ఒక చిన్న పద్యం చెప్పారు.

కం. తిరునా మంబిడు వేళను
వర వైష్ణవ మణుల కెల్ల పర సాధనమౌ
నరయంగ నహహ! యీ చీ
పురుపుల్ల బుధాళి కర్ణపుట రంధ్రగమౌ.

ఇది పరావాలేదు. నరసరావుపేట అవధానంలో దోమ కాలుమీద మహా స్రగ్ధర అడిగారు పరికించండి

మహాస్రగ్ధర
ఎలమిన్ నా రీతి గానం బెవరు సలుపలేరే నే గానంబు రాశిన్
చెలువున్ గావించుచుందున్ చెలువల లలితశ్రీల సొంపారు సెజ్జన్
లలి నిట్లానంద లీలాలస తరగతి వైలాస్యమున్ జేసెదోసీ!
ఖల! నీ కాలెంత? నీకుం గల గరువపు బింకంబు దానెంత దోమా!

దీంట్లో కొంత అడిగిన వానికి తగిలి వచ్చే విధంగా అన్యాపదేశం కూడా ఉందేమో అనిపిస్తుంది.

వేమవరం అవధానంలో ఈ అన్యాపదేశం చాలా స్పష్టంగా గోచరిస్తుంది. అక్కడ ఒక పండితుడు చీకు ముల్లుమీద సీస పద్యం అడిగాడు. అదే సమయంలో వెంకటశాస్త్రిగారు వేదికమీదినుంచి క్రిందికి దిగి లఘుశంకకు పోయి కుంటుతూ వచ్చారు. అదేమంటే ముల్లు గుచ్చుకొన్న దన్నారు. అప్పుడు ప్రశ్న అడిగిన ప్రతిపక్షికి తగిలివచ్చే విధంగా వచ్చిన పద్యం ఎంత సొగసుగా వచ్చిందో గమనించండి!

సీ. నిన్ను గాల్చిన గాని నీ బుద్ధి మానవేచీ! యేమనందునే చీకుముల్ల!
దొంగ రీతిని దూరి దొరక కుందవు గదే చీ! యేమ నందునే చీకుముల్ల!
పొర లోపలం జేరి పోటు గూర్చెదు గదే చీ! యేమ నందునే చీకుముల్ల!
పద మాశ్రయించియు బాధ పెట్టెదు గదే చీ! యేమనందునే చీకుముల్ల!
తే.గీ. నిన్ను మర్యాదగా జూచు నేని యెట్టి దట్టు డేనియు నీదు కోతలకులోగు
చెప్పు దెబ్బకు తప్ప నీ చెడ్డ గుణము చీకదు సుమీ! యిసీ! యిసీ!చీకుముల్ల!

కవులకు తిక్కరేగితే ఇటువంటి పద్యాలే వస్తుంటాయి. అందులోనూ తిరుపతి వేంకటకవుల వంటి సమర్థులు, ప్రజ్ఞా సంపన్నులు ప్రతిపక్షులైన పండితులను తట్టుకోవటానికి ఇటువంటి పద్ధతి ఎన్నుకోవటంలో ఆశ్చర్యం లేదు.

ఒకసారి వచ్చిమిరపకాయ మీద సీసం చెప్పమంటే ఎంతో ఆహ్లాదకరంగా చెప్పారు జంట కవులు. చూడండి!

సీ. ఎద్దాని సంబంధ మెలమి గల్గిన మాత్ర కూర లెల్లను మంచి గుణము గనునొ
కొత్తిమిరిని నూరుకొని తిన్న నెయ్యది కంచె డన్నము తిన గలుగజేయు
ఎద్దాని శిఖాల మెరుగక చేబట్టి కనులు నల్పగ మంట గలుగజేయు
ఎద్ది తా గ్రమముగా నెదిగి పండిన మీద జోటి కెమ్మోవితో సాటి యగునొ
గీ. నూరి దేనిని పుల్లనై మీరు మెంతి పెరుగులో గూర్ప స్వర్గము నెరుగజేయు
నరుల కెల్లను నా పచ్చిమిరపకాయ మహిత భక్తిని నేను నమస్కరింతు.

చిన్న వస్తువును తీసుకొన్నా కవిదక్షుడైతే ఎటువంటి పద్యాలు వస్తాయో ఇవి చాటి చెపుతున్నాయి.

## ఒకే సమస్యకు...

తెలుగు సమస్యలలో చిత్రాతిచిత్రమైన వెన్నో ఉన్న సంగతి తజ్ఞులకు సువిదతమే. కొన్ని సమస్యలను ఒకరి కిద్దరు పూర్తి చేసినప్పుడు, అందులో ఏది ఎక్కువ బాగున్నదని పోల్చి చూడడం కూడా జరుగుతూ ఉంటుంది. అయితే ఇందులో ఒక చిక్కున్నది. మొదట పూర్తి చేసిన వాడు ఉన్నంతలో అందమైన పద్ధతి నెన్నుకొని చేస్తాడు. తరువాతివాడు మరొక విధానాన్ని ఎన్నుకొని తీరాలి. మూడోవాడు ఈ రెంటి కంటే భిన్నమైన రీతిని గ్రహించాలి. అప్పుడే అవి రాణిస్తాయి. ఉదాహరణకు కఠిన ప్రాసతో ఉన్న ఒక సమస్యను చూడండి!

"సంధ్యావందన మాచరింప వలదా చౌశీతి బంధమ్ములన్"

సంధ్యావందనాన్ని చౌశీతి బంధాలతో చేయవద్దా అని ప్రశ్న. మొదటి భాగం ఆచారంలో భాగమైన ఒక పవిత్ర వేదచోదిత కర్మ. రెండవది శృంగార క్రీడా భంగిమల సంఖ్య. ఈ రెంటికీ సంబంధం లేదు. ప్రాచీన కవి ఒకరు చేసిన పూరణను వేటూరి ప్రభాకర శాస్త్రిగారు 'చాటుపద్య మణి మంజరి'లో ఉదాహరించారు. ఆ పద్య మిది-

శా॥ కంధ్యుద్భూతునిచే మనోభవునిచే గాసిల్లగా కంచుక
గ్రంధ్యంతంబు తెమల్చి కౌగిటను జేర్చన్ నేర్పు లేదాయె నా
సంధ్యానాదుల యందె నిల్చెదవయో స్వామీ! యిదేమైన నీ
సంధ్యావందనమా? చరింప వలదా చౌశీతి బంధమ్ములన్

ఒక భర్త నిరంతరమూ ధ్యానంతో కాలం గడుపుతూ శృంగార దృష్టి లేకపోతే, అతన్ని ప్రోత్సహిస్తున్న సందర్భం తీసుకొని సంధ్యావందనము + ఆచరింపవలదా అని కాక సంధ్యావందనమా-చరింపవలదా అని విభాగం చేసి చౌశీతి బంధాల్లో చరించవద్దా? ఇదేమైనా ధ్యానమా; సంధ్యావందనమా-నేర్పుగా కౌగిట చేర్చి పురోగమించాలి అని చెప్పిన తీరు చక్కగా పద్యంలో ఇమిడింది.

తిరుపతి వేంకట కవులకు నెల్లూరు అష్టావధానంలో ఈ సమస్యనే ఇస్తే వారు పూరించిన తీరు పరికించండి!

శా॥ వింధ్యాద్రి ప్రభ నొప్పు బల్ కుచములన్ వేపట్టి పెంపొందు కా
మాంధ్యం బార్పగలేక వెర్రి వలె నేలా మంచి యీ రాతిరిన్
వంధ్యం జేసెదు? కాముకేళి యనగా పాండిత్యమా లేక నీ
సంధ్యావందనమా? చరింపవలదా? చౌశీతి బంధమ్ములన్.

పై పూరణలోని భావమే! అయితే ఇంకొంచెం అందంగా, చమత్కారయుతంగా వచ్చింది.

ఇదే సమస్యను ఆధునికులలో ఒక కవికి ఆశుకవితా ప్రదర్శనలో ఇస్తే అతడు పూరించిన తీరు గమనించండి!

శా॥ వింధ్యాంభోనిది మధ్య తారలను నీవే గొప్పలే-కాని - సం
బంధ్యుల్లాసము పోయె జీవితములో బంధమ్ములే లే వికన్
సంధ్యుత్సాహము రాదు నీ కొరకు ఖర్చయ్యెన్ ధన మ్మెల్ల నో
సంధ్యా! వందన మాచరింప వలదే చౌశీతి బంధమ్ములన్.

దీని భావం-ఒకడు సంధ్య అనే గొప్ప సినిమా తార వెంటబడి ఉన్న డబ్బంతా ఖర్చు పెట్టుకున్నాడు. అప్పటికి జ్ఞానోదయమైంది. అతడంటున్నాడు-వింధ్య పర్వతానికి, సముద్రానికి మధ్య-అంటే దక్షిణ భారతం మొత్తం మీద సినిమా తారలలో నీవే ఇప్పటికి గొప్ప! సందేహం లేదు. అయితే నీతో సంబంధం ఉంచుకోవాలనే ఉల్లాసం పోయింది. అసలు బంధాలే పోయి నాకు వైరాగ్యం పుట్టింది. మన మధ్య ఇక సంధి కుదరదు. నీ కోసం నా ధనమంతా వ్యయమైపోయింది. ఇక నా వల్ల కాదు. ఓ సంధ్యా! వందనం. ఇక చౌశీతి బంధాలు ఆచరింపవద్దు. అంటే శృంగారం రద్దు- అని.

ఇది ఒక కొత్త పద్ధతిలో చేసిన పూరణ చాతుర్యధుర్యమై నవ సౌందర్య విలసితమై అలరారుతున్నది.

ఇలానే "రతి చిత్రము తెలియరాదు రవి కైన నృపా!" అనే సమస్యకు కొన్ని పూరణలు చూడండి!

కం॥ గతి లేని వాని నే స
మ్మతి మాలిన మూర్ఖు నెట్టి మానిసి నైనన్
అతి సరసు జేయగల భా
రతి చిత్రము తెలియరాదు రవికైన నృపా!

ఎటువంటి మూర్ఖుణ్నైనా రసికుని జేయ గల భారతి చిత్రం రవికైనా తెలియదని భావం.

కం॥ పతిపై నలిగిన స్త్రీతో
అతులితముగ నాట్య మాడి అలసిన స్త్రీతో
అతి నూత్న రజస్వలతో
రతి చిత్రము తెలియరాదు రవికైన నృపా!

ప్రణయ కలహం తీర్చిన తర్వాత, నర్తించి అలసిన తర్వాత, కొత్తగా వ్యక్తురాలైన కన్యతో -రతి ఎంతో ఆనందహేతువు అని భావం.

కం॥ క్షితిలోని కవుల కెల్లన్
సతతంబై వెలయు నాంధ్ర సంస్కృతములలో
నతుకన్ మేలయిన ప్లుత వి
రతి చిత్రము తెలియరాదు రవికైన నృపా!

యతి విశేషాన్ని తెలిపే భావం ఇందులో ఉంది. ఎక్కువ పూరణాలు చేసేప్పుడు కవులు ఎక్కువగా పాండితిని, సమర్థతను చూపించవలసి ఉంటుందనటానికి ఇవి కొన్ని ఉదాహరణలు.

## రామ శృంగారం

**తు**రగా వంశీయులలో రామ కవి సుప్రసిద్ధుడు. ఆ అన్వయంలోనే వెంకమరాజు ఇరవైయవ శతాబ్దం మొదట ఉండేవాడు. ఇతడు తిట్టు కవిత్వంలో మంచి మొనగాడుగా పేరు చెందాడు. ఒకప్పుడు తాళ్ళూరనే ఊరిలో ఒక సంపన్న గృహస్థు ఇంట్లో పెళ్ళి జరుగుతున్నది. ఈ కవిగారు ఆ

ఇంటికి వెళ్ళి తానొచ్చానని కబురు పెట్టాడట. ఆ యజమాని పెళ్ళి పనుల హడావుడిలో విసుగుగా ఉండి, "ఇప్పుడు నా కీ కవుల ఏడువు కూడానా?"- అని చిరాకు పడ్డాడట. ఆ విషయం తెలిసి వెంకమరాజు "నా ఏడుపు దేముంది-పెళ్ళి అంతా ఏడుపుల మయంగానే ఉందిలే" అని ఒక సీస పద్యం చెప్పాడట!

సీ. పెండ్లి పేరంటాండ్రు పెను రంకులకు నేడ్వ బాజా భజంత్రీలు పప్పు కేడ్వ
రాజ బంధువు లంత రంకు ముండల కేడ్వ బజారు వెలదులు పసువు కేడ్వ
వచ్చి పోయెడు వారు వక్క లాకుల కేడ్వ గుగ్గిళ్ళకై పెళ్ళి గుర్ర మేడ్వ
పల్లకి బోయీలు భత్యాలకై యేడ్వబలు పురోహితుడు నేబులకు నేడ్వ
హారతి రూకల కాడు బిడ్డలు నేడ్వ కుర్రవాం డ్రందరు కూటి కేడ్వ
అల్లు డనాథయం చత్త మామలు నేడ్వ కట్నంబుకై గ్రామ కరణ మేడ్వ
పెద్ద మగండని పెండ్లి కూతురు నేడ్వపిల్ల చిన్న దటంచు పెనిమి టేడ్వ!
గీ. చాల్పుగా నిన్ని యేడ్పుల సాగె పెండ్లి ...

ఇటువంటిదే చందుపట్ల గ్రామ వాస్తవ్యుడు శ్రీ రాఘవాచార్యులు చెప్పింది చూడండి!

సీ. సంభావ నేదంచు సకల బ్రాహ్మణు లేడ్వతాంబూల మే దంచు తరుణు లేడ్వ
బాజా భజంత్రీలు బత్తెంబునకు నేడ్వ పప్పు కూటికి పెండ్లి బాప డేడ్వ
రెండవ పెండ్లంచు పెండ్లి కూతురు నేడ్వ పోరి చిన్నని పెండ్లి పోర డేడ్వ
వచ్చిన చుట్టాలు ఫలహారముల కేడ్వ ముత్తైదు లందరు బొట్టు కేడ్వ
చావు పెండ్లని డప్పు చాటువారలు నేడ్వ బ్రతుకు పీన్గును మోయ రజకు లేడ్వ
గీ.. చేసె నీ పెండ్లి...
ఔర! దినవారముల కేము నరిగినా మ
టంచు దూషింప మొదలిడి రఖిల జనులు
చావు పెండ్లొక్క సమయమయ్యె జరుగు నపుడు.

తురగా వంశీయుడైన రామ కవిని గురించి ఎంత చెప్పినా చాలదు. శృంగార శూరుడుగా, వాచశ్శుద్ది గలవాడుగా ఈతని పేరు ఎంతో వాసికెక్కింది. ఈతని పద్యాలు రామ బాణంలాగా అమోఘమైన పని అంటారు.

లేటవరపు పోతరాజనే సంపన్నుని చూడటానికి రామకవి వెళ్ళాడట! కవిగారి కేమైనా ఇచ్చి సన్మానం చేయవలసి వస్తుందని తప్పించుకోటం కోసం ఇంట్లో లేదని అబద్ధం చెప్పించాడట! రామకవికి కోపం వచ్చి ఈ పద్యం చెప్పాడట!

కం. కూటికి కాకులు వెడలెను
ఏటావల మూక జేరి యేడువ దొడగెన్
కాటికి కట్టెలు జేరెను
లేటవరపు పోతరాజు లేడా? లేడా?

ఈ పద్యం చెప్పగానే ఇంట్లోని అతగాడు విరుచుకుపడిపోయాడట. అప్పుడతని భార్య కవిగారి కాళ్ళమీద పడి భర్తని బతికించమని ప్రార్థించిందట! అప్పుడు దయ కలిగి మళ్ళీ ఈ పద్యం చెప్పాడట!

కం. మేటి రఘురాము తమ్ముడు
పాటిగ సంజీవి చేత బ్రతికిన కరణిన్
కాటికి బో నీ కేటికి
లేటవరపు పోతరాజు! లెమ్మా! రమ్మా!

కింద పడిపోయినవాడు వెంటనే లేచి కవికి పాదాక్రాంతుడై క్షమాపణ వేడి ఎంతో ఘనంగా సత్కరించాడట!

## అదృష్టం అంటే...

తెలుగు కవులలో భాస్కర శబ్ద వాచ్యులు బహువచనంలోనే కనిపిస్తారు. కవిబ్రహ్మ తిక్కన తన తాతగారిని గురించి రాసుకుంటూ-

"సార కవితాభిరాము గుంటూరు విభుని
మంత్రి భాస్కరు మత్పితామహుని దలచి" అన్నారు.

దశకుమార చరిత్ర రచించిన కేతన ఈ భాస్కర మంత్రిని

"శాపానుగ్రహ శక్తియుక్తుడమలాచారుండు సాహిత్య విద్యా పారీణుడు"

అని వర్ణించాడు.

ఇక రామాయణ కర్తలలో ముఖ్యుడు భాస్కరుడు హుళక్కి భాస్కరుడు. ఇతని పేరనే అది భాస్కర రామాయణ మన్న పేరు గాంచింది. తన కృతిపతి సాహిణిమారుని గురించి ఇతడు చెప్పిన చాటు వొకటి కనిపిస్తున్నది.

కం॥ అప్పులిడు నతడు ఘనుడా?
అప్పుడొసగి మరల పొందు నాతడు రాజా?
చెప్పగవలె సాహిణి మా
రప్పను దానమున ఘనుడు రాజు నటంచున్

17వ శతాబ్ద ప్రారంభంలో శ్రీపతి భాస్కర కవి నీతి బోధకమైన చిత్త శతకం రచించాడు. ఇతని పద్యాలలో చిత్తశుద్ధి, సద్విచారం గోచరిస్తున్నాయి. రెండు పద్యాలు మచ్చుకు గమనించండి!

శా. వేదంబుల్ మనుజుల్ రచించి రతి ప్రావీణ్యంబుతో శాస్త్రముల్
తాదృక్పద్ధతి ఉద్భవిల్లె తపముల్ దానంబులున్ ధర్మముల్
మోదం బబ్బును చేయుడంచు నరులన్ బోధింతు రవ్విప్రులే-
కాదా జంబుక యుక్తులొల్లకు వివేకానందమా! చిత్తమా!

ఉ. బీదల కన్న వస్త్రముల పేర్మి నొసంగుము తుచ్ఛ సౌఖ్య సం
పాదనకై అబద్ధముల పల్కకు వాదము లాడబోకు మ
ర్యాద నతిక్రమింపకు పరస్పర మైత్రి మెలంగు మిట్టివే
వేదములం చెరుగుము వివేక ధనం బిది నమ్ము చిత్తమా!

భాస్కర శతక కవి యెవరో నిర్దిష్టంగా తెలియటంలేదు గాని, కొందరు మారన వెంకన అంటున్నారు. అంతకంటే భాస్కర శతక కవి అని తృప్తి పడటమే మంచిదని అనిపిస్తుంది. ఇందులోని పద్యాలు అత్యంత సుందరాలు. ప్రతి పద్యంలోనూ ఒక ఉపమానం, ఒక ఉపమేయం ఉండి, రెండు భాగాలుగా నిండైన చక్కని ధోరణితో ఉంటుంది. ఒకటి రెండు పరికించండి.

ఉ. అంగన నమ్మరాదు తన యంకెకు రాని మహా బలాఢ్యువే
భంగుల మాయ లొడ్డి చెరుపందలపెట్టు వివేకియైన సా
రంగధరున్ పదంబులు కరంబులు కోయగ జేసె తొల్లి చి
త్రాంగి అనేకముల్ నుడువరాని కుయుక్తులు బన్ని భాస్కరా!

సత్సంగంవల్ల సద్గుణాలు, దుస్సంగంవల్ల దుర్గుణాలు అంటుతాయని లోకం పోకడ గమనిస్తే తెలుస్తుంది. తీయని నదులు సముద్రంలో కలిసి ఉప్పు నీరుగా మారిపోవటం లేదా, చూడండి-అంటాడు శతక కర్త.

ఉ. క్రూర మనస్కులౌ పతుల గొల్చి వసించిన మంచి వారికిన్
వారి గుణంబె పట్టి చెడు వర్తన వాటిలు మాధురీజలో
దారలు గౌతమీ ముఖ మహానదు లంబుధి కూడినంతనే
క్షారము చెందవే మొదటి కట్టడ లన్నియు తప్పి భాస్కరా!

లోకంలో కొంతమంది కష్టపడకపోయినా గొప్ప ఫలితాలు దక్కటం చూస్తుంటాము. అటువంటివి చూసి అదృష్టమని సరిపెట్టుకొంటాము. భాస్కర శతక కవి అంటాడు గదా-దేవ దానవులు సముద్రాన్ని మధించటానికి ఎంతో కష్టపడ్డారు. వాళ్ళలా ఉండగా మధ్యలో వచ్చిన విష్ణుమూర్తికి లక్ష్మి, కౌస్తుభం దక్కాయి. అదే అదృష్టమంటే-ఈ భాషం చెప్పే పద్యం చూడండి!

ఉ. ఊరక వచ్చు పాటుపడకుండిననైన ఫలం బదృష్ట మే
పారగ గల్గు వానికి ప్రయాసము నందిన దేవదానవుల్
వా రటు లుండగా నడుమ వచ్చిన శౌరికి గల్గె గాదె శృం
గారపు ప్రోవు లక్ష్మియును కౌస్తుభరత్నము రెండు భాస్కరా!

సంస్కృతంలో ఇటువంటి భావం గల శ్లోకం ఒకటి ప్రసిద్ధమైనది-

శ్లో. భాగ్యం ఫలతి సర్వత్ర నవిద్యా నచ పౌరుషం
సముద్ర మథనాల్లేభే హరిర్లక్ష్మీం హరో విషం.

అంతటా భాగ్యమే ఫలించేది. విద్య కాదు. పౌరుషమూ కాదు. సముద్ర మథనంలో పుట్టిన లక్ష్మి విష్ణుమూర్తికి దక్కింది. విషం హరునికి దక్కింది. ఇంతకంటే దృష్టాంతమేం కావాలి అదృష్టానికి!

భాస్కర శతకంలోని ఉదాహరణ నచ్చని ఒక కవి అదృష్టానికి వేరే ఉదాహరణ ఇస్తూ పద్యం రాశాడు. సముద్ర మథనంలో విష్ణువు పడ్డ కష్టమూ సామాన్యమైనది కాదు. కూర్మమై మందర గిరి మోయలేదా! ఊరికే దక్కిందా. ఫలితం? కంసాలి సుబ్బకవి అదే మకుటంతో ఈ పద్యం రచించాడు. చూడండి!

ఉ. ఊరక వచ్చు పాటు పడకుండిన నైన ఫలం బదృష్టమే
పారగ గల్గు వానికి ప్రయాసము నంద పనేమి? కానలో
కోరని ఋశ్యశృంగుని తగుల్గొని కాంత లయోధ్య చేర్చ నీ
రేరుహగంధి శాంత నియరే యొసలారగ నాడు భాస్కరా!

అదృష్టమంటే ఋశ్యశృంగునిది. కోరకుండానే కాంతలు తీసుకెళ్ళారు. తరువాత శాంత నిచ్చి పెండ్లి చేశారు. ఇటువంటి పద్యాలు సుబ్బకవి మరి కొన్ని కూడా రాశాడట! సూక్తి సుందరాలు, సుమనోహరాలు అయిన రచన లివన్నీ!

## తల్లికి ముక్కు గోసి...

పద్య రచనా నిపుణులైన కవులలో కొందరు సమస్యా పూరణలు,చమత్కార రచనలు మొదలగు వానిలో ఆసక్తి కలిగి ఉంటారు. అలాంటి వారిలో కోడూరి సాంబశివరావుగారొకరు. సరస వినోదినిలోనూ, విడిగానూ వారెన్నో దత్తపదులు,సమస్యలు పూరించి, వర్ణనలు రచించి, తమ సామర్థ్యాన్ని చాటుకొన్నారు. అందులో కొన్నింటిని ఉదాహరిస్తున్నాను.

సమస్య: **లక్ష్మివారమ్ము సోమవారమ్ము వచ్చె.**

**గణ చతుర్థినాడు ఫణి చతుర్థి**- వంటి సమస్య ఇది.

దీనికి కవి పూరణ చూడండి.

గీ. చనిన యెనుబది రెండు వత్సరమునందు
మకర సంక్రమణము మాఘ మాసమందు
నేత్ర పర్వమ్మునగు శివరాత్రి వరుస
లక్ష్మివారమ్ము సోమవారమ్ము వచ్చె

సంక్రాంతి,శివరాత్రి వరుసగా ఈ వారాల్లో వచ్చాయని క్రమాలంకార సుందరంగా సమస్యను పూరించటం జరిగింది.

రాధను పెండ్లి యాడె రఘురాముడు సర్వగుణాభిరాముడై అనే సమస్యను పురాణాలలోని పాత్రలుగా గాక, అధునాతన కాలంలోని ఒక వివాహంగా చిత్రించి పూరించిన తీరు గమనించండి-

ఉ. మాధవరావు గైకొనిన మాధవ సోదరి నాకు వీరికిన్
మాధవు డిచ్చె పుత్రుని కుమారునికిన్ రఘురామ నామ మా
మాధవరా వొసంగె తన మాత యభీష్ట మెరింగి మత్సుతన్
రాధను పెండ్లి యాడె రఘురాముడు సర్వ గుణాభిరాముడై.

మరొక సమస్య: **దివ్వె వెలుగుచుండిన గదిన్ నలువైపుల నిండె చీకటుల్-**

1977 లో వచ్చిన ఉప్పెన వల్ల కలిగిన ప్రమాదాన్ని తీసుకొని వెలుగులతో ఉన్న ఇండ్లు ఉన్నట్లుండి రుద్రభూమిగా మారటాన్ని వర్ణిస్తూ పూరించిన తీరు పరికించండి.

ఉ: అవ్విధి సాగరంబు ప్రళయంబుగ డెబ్బదియేడు నందు ము
య్యవ్వల బాలబాలికల నయ్యల నమ్మల మ్రింగె నిర్దయన్
చివ్వున మారె నాడు దివిసీమ భయంకర రుద్రభూమిగా
దివ్వె వెలుంగుచుండిన గదిన్ నలువైపుల నిండె జీకటుల్

వేరొక సమస్య: **తల్లికి ముక్కు గోసి చినతల్లికి కమ్మ లొసంగ నేర్తురే?**

మాతృభాష తెలుగును వదలి ఇంగ్లీషు మీడియం తమ పిల్లలు చదవాలని ఈనాడు తల్లిదండ్రులు కోరుతున్నారు. అది ఈ ఉపమానానికి తగినట్లున్నదనే భావంతో చేసిన పూరణ యిది-

**ఉ: పల్లెల పట్టణాల చిరుపాపల బాబుల తెల్లవారగన్**
**తల్లులె ఆంగ్ల మాధ్యమము తప్పదు వారి కటంచు నాంధ్రయం**
**దెల్లెడ ఖళ్ళు కంపెద రదేలనొ కమ్మని తెల్గు గిట్టకన్**
**తల్లికి ముక్కు గోసి పినతల్లికి కమ్మ లొసంగ నేర్తురే?**

కదనము, రదనము, వదనము, సదనము- వర్తమాన సాంఘిక సమస్యలను తీసుకొని దత్తపదిగా పద్యం చెప్పమన్నప్పుడు, అధునాతన కాలంలో యుద్ధం వస్తే వచ్చే పరిస్థితులను దృష్టిలో ఉంచుకొని చెప్పినది-

చం: రదనము లూడి నేలబడు రక్తము పారు ధరాతలమ్ముపై
సదనము లెన్నొ కూలు నరజాతి నశించు ధన వ్యయ మ్మగున్
కదనము కల్గెనేని ఏవి కన్గొన భారతజాతి శక్తి స
ద్వదనము లందు నిల్పుత దివంబును రాత్రియు మిత్రభావమున్

రక్తి, శక్తి, భక్తి, ముక్తి - దత్తపది- దేవీ పరంగా పూరించిన వైఖరి ఉత్పలమాలలో పరికించండి

ఉః రక్తికి పట్టు గొమ్మయును రక్తపు టేరుల నీదె నష్టమన్
శక్తిగ గూల్చె యుద్ధమున శాత్రవు నామహిషాసురాఖ్యునిన్
భక్తి నొనర్ప పూజ లెట పర్వదినంబుల మావవాళికిన్
ముక్తి నొసంగు నామె పరిపూర్ణ కృపామృత దృష్టి జూచుచున్

"కరములు నైదు పుత్రునకు కన్నులు మూడును వాని తండ్రికిన్" అనే సమస్యను పూరించిన చాతుర్యం పరికించండి!

చంః కరములు నాల్గు తుండమును గల్గి వినాయకు డయ్యే పుత్రుడా
గిరిజకు నెన్న నామె పతికిన్ నుదుటన్ గనుగల్గు స్వామికిన్
గరమన చేయి, తుండమగు గావున తుండము చేర్చి లెక్కకున్
గరములు నైదు పుత్రునకు కన్నులు మూడును వాని తండ్రికిన్

కరమంటే చేయి,తుండం అనే అర్థా లున్నాయి. వినాయకునికి నాలుగు చేతులు, ఒక తుండం కలిపి అయిదు కరాలు. శివునికి కన్నులు మూడుః ఆయన పుత్రునికి కరాలైదు. ఈ రకంగా పూరణ పాండిత్య చమత్కార స్ఫోరకంగా భాసిస్తున్నది.

పగలు మిగులనున్న ఫలము హెచ్చు-

అనే సమస్యను పూర్తి చేసిన తీరు వీక్షించండి-

ఆ.వెః ఆంధ్ర దేశ మౌర! అన్నపూర్ణకు నుద్ది
జీవనదులు పారు సీమ యద్ది
వాని గలుపవచ్చు వరుసగా నా మ హా
పగలు మిగుల నున్న ఫలము హెచ్చు

తెలుగు సీమ- అన్నపూర్ణ- జీవనదులు పారే సీమ. వాటిని కలిపితే ఎంతో గొప్ప అధిక ఫలం కలుగుతుందని భావం. ఇక్కడ పగలు - ముందు పాదంలో మహా అనే పదంతో కలిసి మహాపగలు - మహాఆపగలు - పెద్ద నదులు అనే అర్థం వచ్చింది.

శిల్పకల్పను లైన పద్య కవులలో ఇటువంటి పూరణల చేత కోడూరి సాంబశివరావుగారు సముచిత స్థానాన్ని పొందారు.

## శరభ తీవ్రత...

శివుడు ధరించిన రూపాలలో శరభాకృతి చాలా విశిష్టమైనది. శైవ వాఙ్మయంలో దాని కెంతో ప్రాధాన్యం ఉంది. హిరణ్యకశిపు వధానంతరం నరసింహుని ఉగ్రత తగ్గించటం ఎవరివల్లా కాలేదట! ప్రహ్లాదుని స్తుతితో ఆయన శాంతించాడని భాగవతం చెపుతున్నది.

అయితే శైవ పురాణాల తీరు మరొక రకంగా ఉంది. మునులు, దేవతలు నరసింహుని తీవ్రత తగ్గించమని శివుని ప్రార్థించారట. అప్పు డా స్వామి శరభావతారాన్ని ధరించి నరసింహుని ముందు ప్రత్యక్షమయ్యేసరికి నరసింహుడు భయభ్రాంతుడైపోయినాడట! శరభం ఎనిమిది కాళ్ళు గల భయంకర జంతువు. సింహాన్ని చంపగలది. అది కాలవశాన ప్రకృతిలో తొలగిపోయింది.

ఇది వైష్ణవులకు కష్టం కలిగించింది. అందుకే కాబోలు వైష్ణవ వాఙ్మయంలో మరొక గాథ కనిపిస్తుంది. నరసింహుని భయపెట్టటానికి శివుడు శరభావతారం ధరిస్తే, శరభాన్ని ఉపసంహరింపజేయటానికి విష్ణువు గండభేరుండావతారం ధరించాడట. గండభేరుండం ఒక మహాపక్షి.

అది శరభాన్ని గ్రద్ద ఎలుకపిల్లను పట్టుకుపోయినట్లు ఎగరేసుకుపోతుందట. అదీ కాలగర్భంలో కలిసిపోయింది.

కంకంటి పాపరాజు ఉత్తర రామాయణంలో రాముడు చూసిన ఒక అడవిని వర్ణిస్తూ ఓజోగుణ యుక్తమై దీర్ఘ సమాసయుతమైన ఒక సీసం రాశాడు. అందులోని ఎత్తుగీతి ఇది-

గీః పిండితాజాండ గండభేరుండ నినద
సంశ్రవణ మాత్ర విత్రస్త శరభ సరభ
సాగమన దర్పనోద్భ్రాంత హరివరేణ్య
మవు మహారణ్య మొకటి రాఘవుడు గనియె

ఇందులో పై మూడు జంతువుల ఉనికి - గండభేరుండ నాదం విని శరభం, శరభాన్ని చూసి సింహం భయపడిన ఘట్టం చక్కగా వర్ణితమైంది.

ఆ శరభానికి పక్షి లక్షణం కలసిన శరభ సాళ్వం మంత్ర శాస్త్రంలో గొప్ప ఉగ్రదేవతామూర్తి - ఆ మూర్తి వర్ణన చూడండి-

స్రగ్ధరః

చండార్కౌ ఉగ్రదృష్టి కురిశవర నఖశ్చం చలాత్యుగ్ర జిహ్వో
కాళీ దుర్గాచ పక్షౌ హృదయ జఠరలి గోభైరవో బాడబాగ్నిం:
ఊరుసౌ వ్యాధి మృత్యూ సరభసఖగతి శ్చండ వాతాది వేగః
సంహర్తా సర్వశత్రూన్ సజయతి శరభ స్సాళువః పక్షిరాజః

సమస్త శత్రువులనూ సంహరించే ఈ శరభ సాళువం సగం శరీరం జంతువు.సగం పక్షి. సూర్యచంద్రులు కన్నులు, వజ్రమే గోళ్ళు, మెరుపు నాలుక, కాళి, దుర్గ- రెక్కలు. హృదయం భైరవుడు. జఠరం బడబాగ్ని వ్యాధి, మృత్యువు తొడలు. చండవాయువే ఆకాశ గమనం. అటువంటి క్రూరమైన, ఘోరమైన మూర్తి అది.

శైవులలో కొందరు తమ పిల్లలకు భక్తితో ఆ పేర్లు పెట్టుకొంటారు. శరభ నాములైన రాజులు,కవులు తెలుగువారిలో ఉన్నారు. తెలుగు సాహిత్యాన్ని పోషించిన శరభోజీ, శరభ కవి, శరభాంకుడు మనకు గోచరిస్తున్నారు. వారిలో శరభాంకుడు ప్రతాపరుద్రుని మంత్రులలో ఒకడు. ఇతడు కవి కూడా. వేటూరి వారు ఇతని పద్యాలు కొన్ని సేకరించారు. శరభాంక లింగమా అనే మకుటంతో ఇతడు చక్కని పద్యాలు రచించాడు. అందులో ఒకటి రెండు చూడండి.

ఉః చాపముగా అహార్యమును,చక్రిని బాణము గాగ, నారిగా
పాప దురం బొనర్చి తలపం త్రిపురంబుల గాల్చవే మహో
ద్దీపిత తీవ్ర కోపమున దేవతలెల్ల నుతింప నాటివిల్
పాపపు ఢిల్లిమీద తెగ బాపగదే! శరభాంక లింగమా!

మొదట 'చ', ఆరింట 'హ' కూర్చి ఢిల్లీ సుల్తాన్ సేనలమీద,వినాశ సంకల్పంతోచెప్పినదట ఈ పద్యం.

కేవల యజ్ఞ యాగాలవల్ల వివిధ కర్మలవల్ల తరించలేరని చెపుతూ కామి మిమ్ము చూడలేడని శివునితో ఇలా అంటాడు.

చం: పొరి పొరి మేక మాంసములు బొక్కుచు నిక్కుచు సోమయాజియై
సురపురి కేగి రంభకడ జొక్కుచు సోలుచు కామ యాజియై
ధరణికి డిగ్గి యిండ్ల కడతండుల మెత్తుచు కర్మయాజియై
సొరి తిరుగాడు కామి మిము చూడడయా! శరభాంక లింగమా!

శరభకవి పేరుతో మాగాపు వంశీయుడు వత్సరాయ జగపతి కాలంలో ఉండేవాడు. ఇతడు గొప్ప ఆశుకవి. ఇత డా రాజుమీద చాలా పద్యాలు చెప్పాడట! అందులో ఒకటిః

మః ఇతడా రంగ దభంగ నంగర చమూసతిచ్ఛటా పావకో
ద్యత కీలాశలభాయమాన రిపు రాడ్దారాశ్రు హేధారా నవీ
న తరంగిణ్యబలా సమాగమ సుఖానందత్పయోధిస్తుతా
యత శౌర్యోజ్వల కీర్తి వత్సవయరాయ క్ష్మావరుం డీతడా?

మొత్తంమీద శరభ తీవ్రత ఈ కవుల భావనలో,రచనలో కనిపిస్తూ ఉండటం సహజమేనేమో!

## క్లిష్టప్రాసలు

అవధానాలు చేసే వేళ, ఆశువుగా పద్యాలు చెప్పేవేళ కొంతమందికి కఠిన ప్రాసలతో పద్యాలు కోరటం ఇష్టం. కందుకూరి రుద్రకవికి ఇచ్చిన ఈ సమస్య ప్రసిద్ధమైనది.- " దంష్ట్రల మీద శంకరుడు తాండవ మాడెను రాముకైవడిన్".

ఇందులో ప్రాస మాత్రమే కాక క్రమాలంకారం వేసుకొంటే తప్ప పూర్తి కాని పద్ధతిలో అడిగారు. తన అద్భుత పాండిత్యం చేత రుద్ర కవి నూతన పదాలను సృష్టించి సమస్య పూరించి పండిత ప్రశంసలకు పాత్రుడైనాడు.

ఆపూరణ ఇది -

ఉః రింష్ట్రహి యేమిటన్ గరచు? ఋక్షము లెక్కడ నుండు? అంధకున్
సంష్ట్రను జేసె నే విభు? డనంతర మం దత డేమి చేసెనో?
రుం ష్ట్రఖి లాత్ముడైన లవు రూప మదే గతి నుండు? చెప్పుమా?
దంష్ట్రల, మీద, శంకరుడు,తాండవ మాడెను, రాము కైవడిన్.

రింష్ట్రహి = కరిచే స్వభావం గల పాము, సంష్ట్రనుడు = నశించే ప్రాణాలు కలవాడు

రుంష్ట్రఖిలాత్ముడు = రోష స్వభావుడు, మూడు పాదాలలోని ప్రశ్నలకు నాలుగవ పాదంలో జవాబులున్నాయి., పాము దేంతో కరుస్తుంది? = దంష్ట్రలతో

చుక్క లెక్కడ ఉంటాయి? = మీద

అంధకుణ్ణి చంపిందెవరు? = శంకరుడు

తరువాత అత డేం చేశాడు? = తాండవ మాడాడు

లవుని రూపం ఎలా ఉంటుంది? = రామునిలా

ఇటువంటి సమస్యల పూరణకు పాండిత్యం, సమయస్ఫూర్తి ఎంతో ఉండాలి. వెంకటగిరి సంస్థానంలో ఆశుకవితా ప్రదర్శనచేస్తున్న మోచర్ల వెంకన్నకు కఠిన ప్రాసలతో రెండు సమస్యలిచ్చారు.

1. వక్రంబుల్ పది కన్నులైదు కరముల్ వర్ణింపగా వేయగున్
2. అస్ఖలిత బ్రహ్మచారి కార్గురు పుత్రుల్

పూరణలు చూడండి-

శాః ఈక్రా ప్రాసము కష్టమౌ ననుచు మీరెంతేసి వాదాడగా
వాక్రా సంబది సత్కవీశ్వరుల త్రోవల్ గామి నే చెప్పెదన్
దిక్రారాతికి పార్వతీశ్వరులకున్ తిగ్మ ప్రభారాశికిన్
వక్రంబుల్ పది....

మొదటి రెండు పాదాలు ప్రాసను గురించి విమర్శించటంతో పూర్తి అయ్యాయి. ఇది ఒక చమత్కారం. మూడవ పాదం- క్రమాలంకారం.

దిక్త్రారాతి అంటే దిక్పాలకులకు శత్రువు -రావణు డని భావించాలి. అతనికి పది నోళ్ళు- దశాస్యుడు గదా! పార్వతీశ్వరులకు కన్నులు 2+3=5, తిగ్మ ప్రభారాశి అంటే సూర్యుడు.అతనికి వేయి కరములు - సహస్రకిరణుడు గదా!

రెండవ పద్యం కూడా ఇదే పద్ధతిలో పూరించారు.మొదటి రెండు పాదాలూ ప్రాసను గురించిన ప్రస్తావన, అర్థ విమర్శ మూడవ పాదంలో గుహుని షణ్మాతృకలు కన్న వృత్తాంతం. దానితో పూరణ చమత్కార సుందరమై ప్రకాశించింది. చూడండి.

కం: ఈ స్థా ప్రాసము కష్ట
మ్మస్థలనత నీయ దగునె! అది సుకవులకున్
నస్థలిత లై గుహుంగని
రస్థలిత బ్రహ్మచారి కార్గురు పుత్రుల్ !

వేరొక కవి కిట్టిదే సమస్య జ్ర ప్రాసతో ఇచ్చినప్పుడు చేసిన పూరణ-

కం: వజ్రమురా నీ హృదయం
బీ జ్రా ప్రాసంబు మాకు నీయం దగునా?
వజ్రి సభ గరుడు డాడిన
వజ్రము పచ్చయ్యె పచ్చ వజ్రం బయ్యెన్

పచ్చని గరుత్మంతుడు మహేంద్రుని సభ పైన ఎగురగా వజ్రానికి పచ్చని కాంతి వచ్చి పచ్చగా భాసించింది. అతని ముక్కు తెల్లగా ఉంటుంది గనుక ఆ కాంతి చేత పచ్చ వజ్రంగా భాసించింది. మణులలో గరుడ పచ్చకు ఆ పేరు గరుడుని శరీర కాంతిని బట్టి వచ్చింది. ఆ భావం అనుసంధానించారు.

ఇలాంటిదే మరొక సమస్య-

**గుండ్రాతికి కాళ్ళు వచ్చి గునగున నడిచెన్**

పూరణ

కం: ఉండ్రా! ఓరి దురాత్మక!
ఈండ్రా ప్రాసంబు కవుల కియ్యం దగునా?
అండ్రాము పదము సోకిన
గుండ్రాతికి కాళ్ళు వచ్చి గుసగుస నడిచెన్

రాముని పదంసోకిన గుండ్రాయి - (అహల్యగా మారి) కాళ్ళు వచ్చి గునగున నడిచిందని పూరించారు.

**"కుట్మలముల్ హరించి జనకుండు లతాంగికి కూతు నిచ్చెడున్"**

అనే సమస్యను మిన్నికంటి గురునాథ శర్మగారు కంద పద్యంలోనికి మార్చుకొని పూరించటం ఒక ప్రత్యేక విశేషం. ఆధునిక శతావధాని ఒకరు ఫెట్మని, ఫట్మని, ఛాట్మని - అని ధ్వన్యనుకరణ పదాలతో దీన్ని అవధానంలో పూరించారు.

ఇటువంటి క్లిష్ట ప్రాసలు గల సమస్యలను పూరించటం కవుల పాండిత్యానికీ, శాబ్దిక ప్రజ్ఞకూ,సద్యః స్ఫూర్తికి తార్కాణాలై ప్రాశ్నికుల మన్నన లందుకొనేవి.

## భావ వైవిధ్యం

ప్రాచీన కాలంలోఒకే సమస్యను ఒక కవే ఎన్నో రకాలుగా పూరించటం, భిన్న కవులు తమ నేర్పును చూపించటానికి పూరించటం తరచుగా కనిపిస్తుంది. నగరు, తగరు,తొగరు, వగరు అనే మాటలను దత్తపదిగా రాధా మాధవ కవి కృష్ణరాయల ఆస్థానంలో రామాయణ, భారత, భాగవతార్థాలలో పూరించాడట.

రామాయణపర పూరణః

చంః నగరు పగాయె నింక విపినంబుల కేగుడు రాజ్య కాంక్షకున్
దగరు కుమారులార! యని తల్లి వగరలు మిగులంగ దోపగా
దొగరున రక్ష గట్టి మది దోపక గద్గద ఖిన్న కంఠియై
వగరుచు నున్న జూచి రఘువంశ వరేణ్యుడు తల్లి కిట్లనున్.

అరణ్యానికి వెళ్ళే సందర్భంలో కౌసల్యా-రాముల సంభాషణ గ్రహించి చెప్పిన పద్య మిది.

భారతపర పూరణః-

చంః తొగరుచి కన్నుదోయి కడు దోపగ కర్ణుడు భీమసేనుపై
దగరు ధరాధరంబు నను దాకిన భంగిని దాకి నొచ్చి తా
వగరుచుచున్ వెసన్ వరుగువారిన నచ్చటి రాజలోకముల్
నగరు సుయోధనాజ్ఞ మది నాటుట జేసి ధరాతలేశ్వరా!

కర్ణుడు భీముణ్ణి పొట్టేలు కొండను ఢీకొన్నట్లు ఢీకొని నొచ్చి పరుగెత్తి పారిపోగా సుయోధనాజ్ఞ మనస్సులో నాటుకొని ఉండటం వల్ల రాజులు నవ్వలేదట!

భాగవతవర పూరణః-

చంః వగరువు మాత్రమే వరుడు వశ్యుడు గాడు సఖీ సఖత్వ మె
న్న గరుడ వాహనుండు మము నాడటుడించుట యెల్ల నుద్ధవా!
తగరని కాక మోహపులతా తనులైన విడంగ జూతురే
తొగరుచి యోషధీశునకు దోపగ జేయునె వీడనాడగన్

గోపికలు ఉద్ధవునితో తమ విరహబాధను చెప్పే ఘట్టం తీసుకొని పూరించారు.

మరొక సమస్య ఇలాంటిదే మూడు రకాల పూరణాలు లభించాయి.

సమస్యః తోచు నడంగు వెండి యును దోచు నడంగు మెరుంగు చాడ్పునన్.

సీతకోసం మాయలేడి వెంట రాముడు పడినప్పుడు, అది రాముని కంటిముందు కనిపిస్తూ, మాయమవుతూ, మెరుపులాగా మెరుస్తూ మరుగవుతూ ఉన్న ఘట్టం తీసుకొని చేసిన పూరణ.

**ఉః చూచితి భూతలేంద్ర! యొక చోద్య మృగం బని సీత పల్కగా**
**లేచి శరాసనాంబకము లీలగ కైకొని వ్రేయబోవ మా**
రీచు డరణ్యవాటిని జరించెడు మాయలు రాము కంటికిన్
తోచు నడంగు... వెండియును తోచునడంగు మెరుంగుచాడ్పునన్

అర్జునుడు గెలిచిన రుద్రుని జటాజూటంలోని చంద్రుడు చూపించిన విలాసాన్ని కవి ఇలా వర్ణించి పూరించాడు- మరొక పూరణలో

ఉ: పాచిక లాడి సోలి పిదపన్ గురు రాజును గెల్చి మిక్కిలిన్
యాచక కోట్ల కిచ్చి బహు యాగములన్ నెరవేర్చినట్టి యా
కీచక వైరి సోదరుడు గెల్చిన రుద్రుజడన్ శశాంకుడున్
దోచు నడంగు వెండి యును దోచు నడంగు మెరుంగు చాడ్పునన్

రామ రావణ యుద్ధంలో ఓషధీ శైలాన్ని ధరించి హనుమంతుడు ఆకాశంలో వెళ్ళే దృశ్యాన్ని వర్ణిస్తూ మరో రామాయణపరమైన పూరణ చూడండి.

ఉ: కాచి ఫలించు నోషధులు కల్గు గిరిన్ ధరియించి బాహువుల్
వీచుచు నబ్ధి దాటి కపి వీర బలంబుల బ్రోవ గ్రక్కునన్
ఖేచర మార్గమందు జను కేసరి నందను డభ్రమం దిలన్
దోచు నడంగు...

అర్భ, దర్భ, నిర్భ, గర్భ అనే పదాలు తీసుకొని పాదాది వచ్చే విధంగా పద్యం చెప్పమంటే రామలింగ కవి అడిగిన వాని మీద ఉన్న చులకన భావంతో ఇలా చెప్పాడట!

కం: అర్భకులు లేక కూచన
దర్భల పాపన్న కిచ్చె తన పయాలిని ఆ
నిర్భాగ్యుడు తనచే మరి
గర్భము గాకున్న పోతు గాడ్దెల కొసగెన్

అప్పుడు రాయలవారు మందలిస్తే మళ్ళీ ఇలా చెప్పాడట!

కం: అర్భకులు లేక యాజియు
దర్భల శయనమున బండి తపసి వసిష్ఠున్
నిర్భయత వేడి సతులకు
గర్భం బగునట్టి క్రతువు గావించె నొగిన్

దశరథుడు యజ్ఞం చేసి సతులకు సంతానం కలగటానికి చేసిన ప్రయత్నం ఇందులో ఉంది.
భారతపరంగా చేసిన మరొక పూరణ-

కం: అర్భకులు కల్గుటకు సం
దర్భము గాకున్న మదిని తపియించు పతిన్
నిర్భరత వేడి యముచే
గర్భము ధరియించి కుంతి గాంచె కుమారున్

పాండురాజు సంతానం కోసం పరితపిస్తుంటే ఆయన అనుమతి తీసుకొని, కుంతి యము నారాధించి సంతానం పొందిన సందర్భం తీసుకొని పూరించారు.

ఇటీవలి ఆధునిక కవి ఒకరు చేసిన పూరణ కూడా పైవాటి లాగే అర్థవంతమై అలరారుతున్నది. పరికించండి.

కం: అర్భకుడు కాడు రణ సం
దర్భంబుల యందు సుప్రతాపుడు తేజో
నిర్భరుడుసూ! సుభద్రా
గర్భజు డసమాను డగ్ని కల్పుం డెందున్

అభిమన్యుడు పిల్లవాడుకాడు. యుద్ధంలో పెద్దలను మించిన వాడు . తీవ్ర పరాక్రముడనే భావం ఇందులోఉంది.

ఇటువంటి బహువిధ పూరణల చమత్కార విశేషాలు తెలుగు సాహిత్యంలో ఎన్నో కనపడతాయి.

## విన్నపము

కుమార ధూర్జటి బిరుదాంకితులు శ్రీ వావిలాల సోమయాజులుగారు సాహిత్య రంగంలో లబ్ధప్రతిష్ఠులైన విద్వాంసులు. ఒకప్పటి నవ్య సాహిత్య పరిషత్ ముఖ్య కార్యకర్తలలో ఒకరుగా సాహితీ సమితి కార్యదర్శిగా, ప్రతిభకు ఉపసంపాదకుడుగా యేభై సంవత్సరాలు నిత్య సాహిత్య వ్యాసంగంలో గడిపారు ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీలో పది సంవత్సరాలు సభ్యుడుగా ప్రాచీనాంధ్ర గ్రంథ ప్రచురణలకు ఎంతో దోహదం చేశారు. సంగీత నాట్య రీతులపైన రాసిన పరిశోధనా వ్యాసం, భారతిలో 1948 లో ముద్రితమై పేరు పొందింది. వాత్స్యాయన కామసూత్రాలపైన వారు రచించిన పరిశోధనా వ్యాసం 1950 సాతవాహన సంచికలో ప్రకటితమై ఎందరినో ఆకర్షించింది.

ఆంధ్రావనిలో సుప్రసిద్ధమైన భువన విజయ ప్రక్రియ ప్రారంభవేళలో కీ. శే. జమ్మలమడక మాధవరామ శర్మగారి నేతృత్వంలో ఎన్నో ప్రదర్శనలలో ధూర్జటి పాత్రధారిగా పాల్గొన్నారు. ఒక భువన విజయంలో

" స్తుత మతియైన ఆంధ్ర కవి ధూర్జటి పల్కుల కేల గల్గెనీ
అతులిత మాధురీ మహిమ"

అని ప్రశ్నించగానే తెనాలి రామకృష్ణుడు అందుకొని

" ...హా తెలిసెన్ భువనైక మోహనో
ద్ధత సుకుమార వార వనితా జనితా ఘన తాపహారి సం
**తత మధురాధరోదిత సుధా రసధారల గ్రోలుటం జుమీ!"**

అన్నారు.

ఆ అధిక్షేపణ, సమాధానం ప్రసిద్ధమైనవే. అయితే వెంటనే వావిలాలవారు అందుకొని ధూర్జటిగా ఈ విధంగా పద్య పూరణ చేశారు.

.. .. .. ..
ఔ! తెలియందగు లోక మోహనో
ద్ధత సుమసాయక ప్రబల తాపమహోజ్వల పూజ్య పార్వతీ
పతి పదమంజులాబ్జ మధుపాన మధుప్రతుడై చెలంగుటన్

నాకు కవిత్వ మాధుర్యం లభించింది. వేశ్యాధర పానం చేయటం వల్ల కాదు. శివ పదాంబుజ మధుపానం చేయటంవల్ల అని అంటే, సభ సమస్తమూ ప్రశంసా సుందరమై భాసించింది.

ఆ ధూర్జటి మీద ఉన్న మక్కువతో ఉత్తమ పురుషలో ధూర్జటిగారు రచించినట్లు రచించిన ఒక ఖండిక అత్యంత మనోహరమై సోమయాజులుగారి కవితా విన్యాసానికి అద్భుత నిదర్శనమై అలరారింది. అది భారతిలో, శాంతిలో ఇటీవలి వారి శివాలోకన కవితా సంపుటిలో ప్రచురితమైంది. అందులో వార వనితా లోలత్వాన్ని గురించి ఇలా అంటారు.

మః గణికా కాముకుడన్న యొక్క ప్రథ లోకంబెల్ల వ్యాపించె నిం
దణు మాత్రంబును లేదు సత్య మెట ఈశా! అల్లినా డెవ్వడో
ప్రణయాందోళన నిత్య జీవన కథాలిప్తుండు కల్పించె తీ
రని దుష్కీర్తిని - సంతసించెదను కల్గన్ భుక్తి అవ్వానికిన్

ఎవడో ఇటువంటి కథలు కల్పించాడు. పోనీలే, ఈ కల్పనవల్ల వాడికి భుక్తి దొరుకుతుంది. అని ఉపేక్షిస్తాడు.

నిరంతర యుద్ధాలలో, రాజకీయాలలో మునిగి తేలే రాయలకు ఆముక్తమాల్యద వంటి కావ్యం రచించే తీరి కేది. పెద్దన చేయి అందులో ఉండి ఉంటుంది. అందుకే వారిద్దరి మధ్య అంత స్నేహం అనే ఈ పద్యం చమత్కార భావ బంధురమైనది.

మః అలఘు ప్రౌఢిని క్రీడమై బహు రణోద్య ద్భూములన్ నిల్చు రా
ట్కుల గంధేభుడు కృష్ణరాయ ధరణీ గోపాలుడైరావతీ
గళ ఘంటారవ పాటవోజ్వలల సత్కావ్యంబు కల్పించెనే!
అల పెద్దన్నకు రాజుకున్ మధుర సఖ్యంబందు రద్దాననే.

ఆనాడు రాయల సత్కృపకలగాలంటే శఠగోప యతిచేత శంఖ చక్రముద్రలు వేయించుకోవాల్సిందే. వైష్ణవం స్వీకరించవలసిందే! అని పరోక్షంగా పెద్దన్నను ఆక్షేపిస్తూ ఇలా అంటాడు.

ఉః అంకిలి లేవ కైకొనిన ఆ శఠగోప యతీంద్ర దత్త చ
క్రాంకిత దేహమున్ మధుర కైటభవైరి పదాబ్జ సేవ ప్రే
మాంకిత నర్తకీగణరహః ప్రణయార్ద్ర హృదంతరంబులే
కంకురితంబుకాదు మనుజాధిప సత్కృప యెంతవానికిన్

పెద్దన్న రామలింగడు మొదలైనవారు సహజంగా శివభక్తులై ఉండి రాజాదరం కోసం వైష్ణవులై రాజ్యంలో, సమాజంలో గొప్పవారుగా చలామణి కావటాన్ని చూసి ధూర్జటి ఇలా అనుకొన్నాడట.

సీః అళిక నేత్రాగ్ని హసానంత రోచిస్సు కనలేక శిఖిపింఛ కాంతి వలచి
హరవాతాశన మారు తౌద్ధత్యమ్ము లడయింప కౌస్తుభహారు జేరి
సందీప్త శితికంఠు నప్తార్చి వర్చస్సు భయపెట్ట వైకుంఠువజ్జనిలిచి
నందీశ హుంకార నాద జర్జరి తోర్వి మనలేక వాంశిక స్వనము గ్రోలి

గీః పెద్ది రాజయ్యె నంతటి పెద్దవాడు ముక్కుతిమ్మన్న సంస్తుతి కెక్కినాడు
అబ్బినది రామలింగన్న కంత చౌరవ అయ్యె కవిపితామహుడు పెద్దన్న మొన్న.

సోమయాజులుగారి పేరు ఆంధ్ర సారస్వతంలో చిరస్థాయిగా ఉండటానికి ఈ 'విన్నపము' అన్న ఒక్క ఖండిక చాలు. వారింకా ఎన్నో గ్రంథాలు రచించారు. రచిస్తున్నారు. అవి అన్నీ తెలుగు సరస్వతికి కంఠ మాలికా మణులే.

## కాకులు వినిపించు...

ఇటీవల కొన్ని పత్రికలు,ముఖ్యంగా ఆకాశవాణి సమస్యాపూరణానికి కొంత స్థలాన్నీ సమయాన్నీ కేటాయించటం వల్ల ఉత్సాహవంతులైన కవులు చాలామంది ఆ అవకాశాన్ని వినియోగించుకొని పద్య సృష్టి చేశారు. అలా కొన్ని వందల పద్యాలు రాసినవారు కూడా ఉన్నారు. అటువంటి వారిలో సహజకవి చోట్నీరు శ్రీరామమూర్తి ఒకరు. గోదావరీ తీర ప్రాంతీయులైన ఈ తెలుగు పండితులు తమ సమస్యా మందారమాలలో ఎన్నో మనోహరమైన పద్యపుష్పాలు కూర్చారు. పరిపాక రమ్యమైన శ్రీరామమూర్తిగారి అనుభవాన్ని హార్దంగా అభినందిస్తూ వారి పద్యధార ప్రావాహికమైన దని మధునాపంతులవారు ప్రశంసించటం సత్యసుందరంగా ఉంది.

దేశభక్తి భరితమైన భావనతో వారు తీర్చిన తరళను చూడండి. పరాక్రమ క్షమా శాంతి గుణాలతో భారతీయులను గురించి వారి భావస్ఫూర్తి పరికించండి.

తరళ: క్షమకు పుట్టిన యిల్లు నాగను ఖ్యాతి గాంచిన భారత
క్షమకు కీడును కల్గజేసెడి కర్మశాత్రుల దోలుడీ!
క్షమను వీడక భారతేందిర గౌరవమ్మును నిల్పుడీ!
సమరశూరులు భారతీయులు శాంతవీరులు సోదరుల్.

"కరులన్ జూచిన శత్రుసింహములు వీకన్ దోక జాడించెడిన్" అనే సమస్యలో ఏనుగులనుచూసి సింహాలు తోక జాడిస్తున్నా యనే అసంబద్ధతను అత్యంత భీకరులన్ అని మార్చటం, చేర్చటం ద్వారా అర్థస్ఫూర్తి కలిగిస్తూ చేసిన పూరణను చూడండి.

మః వరణీ యాత్మబల ప్రతాప కలనా వైవిధ్య సన్నద్ధతన్
పరులన్ జెండి పరాక్రమించు విజయున్ పార్శ్వంబునం జూచియే
కురు సైన్యంబులు వారె భీతి హృదయ క్షోభ ప్రదాత్యంత భీ
కరులన్ జూచిన శత్రు సింహములు వీకన్ తోక జాడించెడిన్

**రామాయణమున్ పఠియించి భారతార్థము చేసెన్-** అనే సమస్యను పింగళి సూరన ద్వ్యర్థికావ్యమైన 'రాఘవ పాండవీయము' ను రచించిన సందర్భానికి అన్వయిస్తూ చాతుర్యంతో చేసిన పూరణ గమనించండి!

కం: గుణనిధి సూరన కవితా
చణుడై శ్లేషార్థ యుక్త సత్కృతి నార్యుల్
గణుతింప వ్రాసి రామా
యణమున్ పఠియించి భారతార్థము చేసెన్.

సూరన రామాయణం రాశాడట. చదువుతుంటే భారతార్థం వస్తున్నదట-అదీ చమత్కారం.

హృదయము చీల్ప రత్నములు హేమములున్ గనవచ్చు నంతటన్- అనేది మరొక సమస్య. గుండె చీలిస్తే రత్నాలు, బంగారం అంతటా కనిపిస్తాయి. ఎలా? పూరణ చూడండి.

చం: విదిత కృషీవలత్వమున బీళ్ళను దున్నియు పైడి పంటలున్
బొదలగ జేయు కర్షకులె భూషణమౌ ధర రత్నగర్భ నా
విదిత యశంబు గాంచి వసువృద్ధిని కూర్చును తద్వసుంధరా
హృదయము జీల్ప రత్నములు హేమములున్ గనవచ్చు నంతటన్

పుడమిపైన బీళ్ళు దున్ని బంగారపు పంటలు పండిస్తారు కృషీవలులు. రత్నగర్భ అయిన భూమిలో నుంచి పండిందంతా బంగారమే! రత్నరాసులే!

పాలే కారణమౌచు దుస్థితికి శాపాలట్లు పీడించెడిన్- అనే సమస్యలోని అర్థరాహిత్యాన్ని ఎలాచొట్కీరు వారు అర్థవంతంచేశారో చూడండి.

శా: వాలాయంబు కురుక్షితీశు డలుకన్ బాధించి కౌంతేయులన్
గూలెన్ దాను సబాంధవంబుగ రణ క్షోణిన్ దలంపంగ దు
శ్శీలత్వంబున రెచ్చు వారి యెదలన్ సిద్ధంబుగా నిల్చు కో
పాలే కారణమౌచు దుస్థితిశాపాలట్లు పీడించెడిన్.

పాలుకాదు కోపాలే శాపాలయ్యాయని శబ్దానుసంధాన చాతుర్యం.

కాకులు వినిపించు మధుర కంఠములెపుడున్- అనేది భావ వైరుధ్యంతో ఉన్న సమస్య- దానికి ఈ కవివరుని పూరణ చూడండి.

కం: కాకుల వలె నరవక వుం
స్కోకిలముల వలెను గూయకూరిమి కలుగున్
సోకవు చింతలుమరి చీ
కాకులు,వినిపించు మధుర కంఠములు లెపుడున్.

కాకుల వలె కలహించకుండా కోకిలల వలె మధురంగా మాట్లాడితే పోట్లాటలు రావు. సోకవు సుమా చీకాకులు. అని కాకులను చీకాకులుగా మార్చి అర్థ సౌందర్యాన్ని పూరణలో తెచ్చారు కవి.

'టాకి,హాకి,జాకి,బాకి' అనే మాటలను భారతార్థంలో ఇమిడ్చి పద్యం చెప్పమన్నప్పుడు రచించినది.

శా: కౌరవ్యుండకటా! కిరాతమతియై గారించి కౌంతేయులన్
పోరన్గూలెను హా! కి మస్తి యనుచున్ పూబోడు లేడ్వన్ కడున్
హా రాజా! కి కురించిపోతి వని తారాజుల్ జనుల్ నింపగన్
ఓ రబ్బా! కితవత్వమే క్షతికి తా నూహింప మూలంబగున్.

ఆపదాలకు ఆ అర్థాలు రాకుండా భిన్నపదాల కలయికతో చిత్రార్థ రమణీయంగా దత్తపదిని అందించారు శ్రీరామమూర్తిగారు.

ఇటువంటి రీతిలోఆధునికులలో చాలామంది బహువిధమైన సమస్యాపూరణలు,లలిత పద్య రచనలు చేశారు. పద్య విద్యకు జరుగుతున్న సేవలో ఇదొక చక్కని భాగం.

## కావ్య కంఠమాధుర్యం

వాసిష్ఠ గణపతిముని తన యౌవన ప్రారంభ దశలో నవద్వీపం వెళ్ళి అక్కడి పండితపరిషత్తు వారి సభలలో పాల్గొని ఆశు కవిత,సమస్యాపూరణ, వ్యాఖ్యాన నైపుణి అద్భుతంగా ప్రదర్శించి,'కావ్యకంఠ' బిరుదు పొంది తెలుగువారి విజయ పతాకను ఎగురవేసిన సంగతి పండితులకు తెలిసినదే. తరువాత ఆయన నాయన అయి, తపస్సిద్ధుడై జీవించి ఉండగానే కపాలభేదన జరిగి సర్వజన గేయుడై ఇంద్రాణీ సప్తశతి,ప్రచండచండీ త్రిశతి, ఉమాసహస్రం మొదలైన మహత్తర గ్రంథాలను రచించిన విషయం కూడా చాలామంది ఎరిగినదే. ఇటీవల వారి శతజయంతి యావద్భారతంలోనూ అనేక ప్రదేశాలలో జరిగిన తర్వాత మరికొంత ఆధునికులకు కూడా తెలియవచ్చింది.

అయితే వారిది ప్రధానంగా సంస్కృత రచన, 'స్తుతు'లు కావ్యాలు అన్నీ సంస్కృతమే. నవద్వీప పండిత పరిషత్తులో వారి కిచ్చిన సమస్యలు వారు చేసిన పూరణలు రెండు మాత్రం ఉదాహరిస్తున్నాను.

'వత్సర స్త్వైకదా గౌరీ పతి వక్త్రం నపశ్యతి'

సంవత్సరాది కొకసారి గౌరి భర్త ముఖం చూడదు. ఇది పతివ్రతాచార విరుద్ధం గదా! దాన్ని వారిలా పూరించారు.

శ్లో! భాద్రశుక్ల చతుర్థ్యాంతు చంద్రదర్శన శంకయా
వత్సర స్త్వైకదా...

వినాయక చవితి నాడు చంద్ర దర్శనం దోషం. మరి తన పతి శిరస్సున చంద్రుడుంటాడు గదా! రమణీయమైన రచన-కమనీయమైన ఊహ.

మరొక సమస్యస్తన వస్త్రం పరిత్యజ్య వధూః శ్వశురమిచ్ఛతి

కుచాల మీది గుడ్డ తీసివేసి కోడలు మామను కోరుతున్నది. దీన్ని పతివ్రతాపరంగా

పూరించాలని పృచ్ఛకుని నియమం.

పూరణ:

హిడింబా భీమదయితా నిదాఘే ఘర్మ పీడితా
స్తన వస్త్రం..

భీముని భార్య హిడింబ అటవిక. ఎండవేళ చెమట బాధతో ఆమె ఉపరి వస్త్రాన్ని తొలగించి మామగారైన వాయువును కోరినది. అంటే గాలి కోసం పై గుడ్డ తీసేసింది అని అర్థం.

ఇటువంటి సమస్యాపూరణలు, వర్ణనలు,చాటువులు ఎన్నో గీర్వాణభాషలో గణపతి ముని రచించినవి ఉన్నాయి. అయితే తెలుగులో వారి రచనలు పరిమితం. 'పూర్ణ' అనే నవలను ప్రారంభించి సగం మాత్రమే నాటి భారతిలో ప్రచురించి మిగతాది పూర్తిచేయనే లేదు. తర్వాత వారి కుమారులు దాన్నీ పూరించి 'సత్యప్రభ' అనేపేరుతో ప్రకటించారు. అందులో కొన్ని అందమైన ద్విపదలున్నాయి. రమణ మహర్షి చేసిన ఉపదేశసారాన్ని సంస్కృతంలోనూ, తెలుగులోనూ రచించారు గణపతి ముని. తెలుగు ద్విపదలను కొన్నిటిని చూస్తే ఎంతో సరళంగా తత్వబోధకంగా తీర్చారనిపిస్తుంది.

మనసు రూపును మాపు మహనీయ యోగి
తన రూప మందిన పని లేనివాడు

భావ భేదము కంటె పరుడు నేన నెడు
భావనా భేదమే పరమోత్తమ మగు

భావ బలంబుచే భావనాతీత
భావస్థితి మునులు పరభక్తియనిరి

నే నడంగిన చోట నేను నే ననుచు
తానుగా దోచును తాను పూర్ణంబు

తా నుపాధి వదలి తన్నెరుంగుటయె
తానుగా వెలుగీశ తత్వ దర్శనము

తానుగా నునికియే తన్నెరుంగుటర
తానురెండెక్కడ? తన్మయ నిష్ఠ

బంధ ముక్తులు లేని పరసుఖసిద్ధి
పొందును దైనిక పుణ్యాచరితుడు

అహము లేనిది స్వయమను భూత నిష్ఠ
మహదుగ్రతపమనె మహి రమణ ఋషి

వేదాంత తత్వ బోధకమైన ఈ ద్విపదలు గణపతి ముని తేటతెనుగు శైలిని, రమణ మహర్షి భావాలను తెలియబరుస్తున్నాయి.

ఇవి కాక అప్పడపు పాట, గొబ్బిపాట, రెండు పాటలూ వ్రాతప్రతులలో దొరికాయి. ఇవి రెండూ తత్వ ప్రబోధకాలే. వీటిలోకొన్ని చరణాలు చూడండి.

అప్పడపు పాట

**అప్పడ మొత్తి చూడు - అది తిని**
**నప్పుడె నీ యాశ వీడు**

**ఇప్పుడమి యందుననే మరి తిరుగక**
**సద్బోధానందుడౌనద్గురు నాథుడు**
**చెప్పక చెప్పెడు తత్వ మగు నమము**
**గొప్పది లేనట్టి యొక మాట చొప్పున**

గొబ్బిపాట
**తిరుచుళి నాథుని, జూచితి నే నిట**
**తిరిగి రాక నేనట నిలిచితిని**
**చిన్మయస్వ రూపు నేగంటిని ఇట**
**దీన రక్షకు కృప నే గొంటివి**

ఈ విధంగా లలితంగా,మనోహరంగా సరళసుందరంగా తత్వభావుకంగా గణపతి ముని తెనుగు రచనలు భాసిస్తున్నాయి.

## అన్నను భర్తగా......

విశాఖపట్టణ వాసులు వసంతరావు రామకృష్ణరావు గారు దశాధిక సాహితీ గ్రంథాలు రచించి ప్రకటించారు. ఉదయకిరణాలు, కవితా భారతి, పారిజాతము మొదలైన పద్య కావ్యాలు, అనేక విమర్శన గ్రంథాలు రచించారు. ఆకాశవాణిలో, ఇతర సందర్భాలలో వారు చెప్పిన పద్యాలు, పూరించిన సమస్యలు పేర్కొనదగినవి.

**"అన్నను భర్తగా గొనిన అన్నుల మిన్న అదృష్ట రాశియా"** అనే సమస్యను వీరు పూరించిన తీరు చూడండి.

**కన్నియ యోర్తు కూర్మి చెలికత్తె కనుంగొని పల్కె నిట్లు సం**
**పన్నుని పెండ్లి యాడ తలంప దగునే !చెలి! పెండ్లియాడు ప్రే**
**మ న్నిన్ను చూచునట్టి బుధమాన్యుడు నాదు సహోదరుండు మా**
**అన్నను భర్తగా గొనిన అన్నుల మిన్న అదృష్ట రాశియా!**

**"ఒక కన్య తన స్నేహితురాలితో కేవలం డబ్బు గలవాడినే పెళ్ళి చేసుకోవాలని అనుకోకు ధనం కన్న ప్రేమ ముఖ్యం మా అన్న ప్రేమతో నిన్ను చూసుకుంటాడు అతన్ని భర్తగా పొందిన ఏ కన్య అయినా అదృష్టవంతురాలు" అన్నది.**

" కరి సింహము మీద నెక్కి కదిసెను దనుజున్"

అనే సమస్యలో ఏనుగు సింహము మీద ఎక్కిందనే అసందర్భం ఉంది. దాన్ని ఎలా మార్చారో పరికించండి.

సరులను పీడించుచు పలు
దురితము లొనరించునట్టి ధూర్తుని జంపన్
కరుణామయ భక్తవశం
కరి సింహము మీద నెక్కి కదిసెను దనుజున్.

భక్త వశంకరి - పరమేశ్వరి సింహ వాహన అయి రాక్షసుని శిక్షించటానికి బయలుదేరింది. అనే అర్థం వచ్చి సమస్య అందంగా పూరణం పొందింది.

"గత కాలము మేలు వచ్చు కాలము కంటెన్"

అనేది భారత పద్యభాగం. దీన్ని సమస్యగా ఇస్తే రామకృష్ణరావుగారిలా పూరించారు.

**అతి వేగాకుల మగు జీ**
**వితమున పరిణామ మెపుడు వృద్ధిని చెందున్**
**క్షితిపై మనుజుల కెప్పుడు**
గత కాలము మేలు వచ్చు కాలము కంటెన్!

జీవితం అతి వేగం వల్ల కల్లోలిత మవుతున్నది. పరిణామం వృద్ధి చెందుతున్నది ఎప్పుడైనా జరిగిన రోజులే మంచి వనిపిస్తున్నది. వచ్చే రోజులు ఎలా ఉంటాయో ఏమో! - చక్కని వేదాంత భావన.

భారతంలో ఈ పద్యం ఉన్న తీరు గమనించండి!

మతి దలపగ సంసారం
బతి చంచల మెండమావు లట్టుల సంపత్
ప్రతతు లతి క్షణికంబులు
గత కాలము మేలు వచ్చు కాలము కంటెన్

చేమ, కంద, పంగ, చిక్కుడు - కూరల అర్థాలలో కాకుండా ఈ పదాల నుపయోగించి దేశ భక్తిపరంగా పూర్తి చేసిన పద్యంలోని చమత్కారం వీక్షించండి!

ద్రోహముచే మహీతలము దుందుడు కొప్ప నాక్రమించు ను
త్సాహము చూపు శాత్రవుల చంపుము ధైర్యము కందళింప నీ
బాహుబలం బెదిర్చి నిలువం గల వారలు లేరు శత్రువుల్
వ్యూహములందు చిక్కుడు జయోత్సుకతంగను వీర సోదరా!

ఒక 'చిక్కుడు' పదాన్ని మాత్రం చిక్కగా దొరికిపోగా అనే అర్థంలో వాడారు. మిగిలినవి పద విభజనతో ఇతరార్థాన్ని సంతరించుకొన్నాయి.

మరో దత్త పది - మూడు, ఆరు, ఏడు, పది - ఈ పదాలను నిర్ణీతార్థాలలో కాక భారతపరంగా పూరించటం చూడండి -

మూడును కీడు ధర్మ పథమున్ విడనాడిన వాని కెప్పుడున్
చూడగ నారు మూ డగుచు సోదర బాంధవ మిత్రకోటితో
నేడె సుయోధనుండు మరియున్ తన కేడుగడైన కర్ణుడున్
పోడిమి దప్పి కూలె రణభూమిని ద్రౌపదిని సంతసింపగన్.

"ఆంధ్రత్వ మాంధ్ర భాషా చ నాల్పస్య తపసఃఫలం" అన్న పండితోక్తిని నమ్మిన వసంతరాయ కవి తెలుగు వాడిని గురించి రాసిన పద్యం వారి జాత్యభిమానానికి నిదర్శనం.

**కలము ఖడ్గము పట్టగల నేర్పు రూపించి వెలుగొందు వాడు మా తెలుగు వాడు**
**నిర్మలం బగునట్టి ధర్మము పాటించి దీపించు వాడు మా తెలుగు వాడు**
**మాతృ దేశ విముక్తి మహిత యజ్ఞంబున విలసిల్లువాడు మా తెలుగువాడు**
**విహితమౌ సహనంపు సహజీవనంబును వెలయించువాడు మా తెలుగువాడు**
**ఆంధ్రుడే కద! భరత భాగ్యాధినేత ఆంధ్రుడే యగు విశ్వవిఖ్యాతమూర్తి**
**ఉజ్వ లాదర్శ రాష్ట్ర మహోత్సవమును జరుపుచున్నాము సమధికోత్సాహ గరిమ**

చక్కని శైలి, లలిత పద ప్రయోగ నైపుణి, సమయోచిత పదగుంఫనం, విశేషించి రాష్ట్ర భక్తి దైవ భక్తి శ్రీ వసంతరాయ కృష్ణరావు కవిత్వ వైఖరికి నవ్య నాద మాధురిని కూర్చాయి.

## ఉత్పల పరిమళం

ఆంధ్రప్రదేశంలోని సుప్రసిద్ధ కవులలో శ్రీ ఉత్పల సత్యనారాయణాచార్య పేర్కొనదగినవారు. కవిగా, పండితుడుగా, నవలా రచయితగా,కథానికాకర్తగా, సినిమా రచయితగా, వ్యాసకర్తగా, పురాణతత్వ వ్యాఖ్యాతగా బహుముఖీనమైన ప్రజ్ఞాప్రాభవాలు ప్రదర్శించిన వ్యక్తి- వారు. దివాకర్ల వెంకటావధాని గారి బృందం ప్రదర్శించిన భువన విజయాలలో అష్టదిగ్గజ కవులలో ఒకరై, యావద్భారత భూమిలోనూ సంచారం చేసి,పద్యవిద్యకు అద్భుతమైన సేవ చేసిన సాహితీ కృషీవలులు శ్రీ ఉత్పల. అనేక సందర్భాలలో సాహితీ రూపకాలలో వారు పూరించిన సమస్యలు, చెప్పిన వర్ణనలు కొన్ని పరికించండి.

గుంటూరులోని ఒక సభలో ఇచ్చిన సమస్య- "నస్యము వాడు వాని వదనంబున నిండె సుగంధ వీచికల్"

దీనికి ఉత్పలగారి పూరణ-

హాస్య మదేమొ కాక జననాంతర వాసనయేమొ! చంద్రబిం
బాస్య వయస్కులన్ వదలి యా దశమీ స్థితుజేరె వాని స్వా
రస్య మదేమి? హా తెలిసెరా! అతడెప్పుడు మంచి అత్తరున్
నస్యము వాడు వాని వదనంబున నిండె సుగంధ వీచికల్

మంచి అత్తరు వాసన గుబాళించే నస్యం ఉపయోగించటం వల్ల చంద్రముఖికి అతగాడు నచ్చాడట!

విజయవాడలో ఒక పృచ్ఛకుడు వేదాంతి దృష్టిలో, రసికుని దృష్టిలో, పసివాని దృష్టిలో కవి దృష్టిలో స్త్రీ రూప మెటువంటిదో వర్ణించమని కోరినప్పుడు, ఆచార్యులవారు చెప్పిన పద్యం ఎంత రసరనమణీయంగా ఉందో చూడండి.

ఒకనికి మట్టిబొమ్మవు మరొక్కని కీ వపరంజిబొమ్మ విం
కొకనికి అమ్మ వౌదు మధు రోహల నూయల లూగు నట్టి యా
సుకవికి నేమి యయ్యెదవు సుందరి! ఈ కవితా కళామయా
త్మిక జగతిన్ రసధ్వనుల దేల్చెడి ముద్దుల గుమ్మ వౌదువా?

వేదాంతి దృష్టిలో ఆమె మృత్పిండం, రసికునకో బంగారు బొమ్మ,పసివాని కోతల్లి, మరి నా కేమవుతావని చమత్కరించాడు కవి. మూడు దశాబ్దుల కింద ఇటువంటిదే ఒక చిన్న పద్యం పలికాడొక కవి.

నుతవట! సుకవికి ఒకనికి
సతివట! ఒక సత్కవీంద్ర చాంద్రీమణికిన్
చతుర కళాసామ్రాజ్ఞీ!
ఇతరుల కేమైన నాకునే మయ్యేదవే!

పై పద్యం కేవల కాంతను గురించి అయితే, ఈ పద్యం వాగ్దేవతను గురించి. ఒక్కొక్కరి దొక్కొక్క తీరు.

సికిందరాబాదు రైల్వే నిలయంలో గుమ్మనగారి లక్ష్మీనరసింహశర్మగారి అవధానంలో పృచ్ఛకుడుగా పద్య సంభాషణ వశాన చెప్పిన పద్య మిదిగో- ఉత్పల వారి రాసిక్యానికి లతితమైన ఉదాహరణ.

ఇచ్చట కర్మకారిణులు హెచ్చుగ నుండిరి గాని వారిలో
వచ్చినవారు కొందరె సభాస్థలికిన్ చలికాల మౌటనా!
ముచ్చు ముడింగి దుప్పటుల ముస్గిన వెచ్చదనమ్ము శర్మ ! యు
ష్మచ్చతురోక్తి గల్గిన హుషారుగ వేపరువెత్తి రారొకో!

చలికాలం కావటంవల్ల వల్లనోఏమో, కర్మకారిణులు ఎక్కువమంది ఇక్కడ ఉన్నా అవధాన సభలో కనపడటం లేదు. దుప్పటి కప్పుకొని, ముడుచుకొని పడుకుంటే పుట్టే వెచ్చదనం నీ చతురోక్తులలో ఉంటే పరుగెత్తుకొని రాకుండా ఉంటారా? కవి వాక్కులో వేడి, వాడి రెండూ ఉండాలని ఉత్పల ఇలా చతురంగా పలుకుతారు.

ఇంకొక సభలో ఇచ్చిన " **స్తనములు లేని పురుషుడు సంస్తవనీయుడు కాడు ధాత్రిలో** " అనే సమస్యను-

శ్లో: సంగీత మపి సాహిత్యం సరస్వత్యా స్తనద్వయం
ఏక మాపాత మధురం అన్యదాలోచ నామృతం అనే శ్లోక భావాన్ని మనస్సులో పెట్టుకొని ఇలా పూరించారు.

చం: తెనుగున పద్యమున్ జదువు తీరున నించుకయేని రాగ ముం
డిన నది లెస్స: కావ్యము పఠించిన యప్డు మనోజ్ఞభావనా
వినుతరసంబు తా ననుభవించుట లెస్స: తదీయ వాక్సతీ
స్తనములు లేని పురుషుడు సంస్తవనీయుడు గాడు ధాత్రిలో.

విజయవాడలో ఒక ప్రముఖుడు విదేశాలకు వెళుతున్నప్పుడు ఆశువుగా ఉత్పలవారు పలికిన పద్యంలో ఎంత శృంగార మధురిమ, చాతుర్యం చోటు చేసుకొన్నవో చూడండి!

**పుట్టిన చోట నిల్చి పొలుపొందుట కేవల మాడుదాని చ**
**న్కట్టుకు మాత్రమే తగును గాని మనీషులు, దూర దేశముల్**
**మెట్టినవారు ద్వీప పటలీవృత భూవలయంబు నెల్లనుం**
**జుట్టినవారు కావలె యశోవిభవంబులు పొందగా వలెన్.**

ఈ పద్య సౌందర్యమంతా ఉపమానంలో ఉంది. అంత చక్కని భావాన్ని ఎన్నుకోవటంలోనే కవి నేర్పు తెలుస్తుంది.

ఉపన్యాసకులు అనేక స్థలాలలో ఉపన్యాసాలు చెప్పేటప్పుడు ఒకచోట చెప్పిందే మరొకచోట చెప్పటం, ఒక విషయమే ధొర్లుతూ ఉండటం తరచుగా గమనిస్తుంటాము. దివాకర్ల వెంకటావధానిగారు

చెప్పే ఉపన్యాసాలలో అటువంటి పునఃపునరుక్తి ఎక్కువసార్లు రావటాన్ని ఒక సభలో ఉత్పలవారిలా చమత్కరించారు.

అత్యంతం బఖిలాంధ్ర దేశ సభలం ద గ్రాసనాసీనుడై
నిత్యోపన్యసితవ్య కావ్య పఠనా నిష్ణుండునై ఏక సం
థా త్యర్థంబున ఎక్సురే కనులతో నాలోకముంజేయుతత్
కృత్యావిష్కరణ ప్రసంగము జిరాక్సీ తీసి నట్లుండెడిన్.

హైదరాబాదులో శంకరమఠం సభలోఇచ్చిన ఒక సమస్యను చూడండి-

"గుట్టుగ జెప్పికొన్న పలుకుల్ బహిరంగములౌను వెంటనే"

దాని పూరణ ఇదిః

జుట్టున గంగయున్ మరియు సోముడు మేల్కొని యుందు రక్కునన్
కట్టడి పాపరేడు, అలికంబున నగ్ని శివుండు పార్వతీ
పట్టపుదేవితో సరస భాషణ కేనియు నోచుకోడటే!
గుట్టుగ చెప్పికొన్న పలుకుల్ బహిరంగములౌను వెంటనే.

శివుడు,పార్వతి ఏకాంతంగా రహస్యంగా మాట్లాడుకోవటానికి నోచుకోలేదట! ఎందుకంటే తలమీద గంగ,చంద్రుడు, మెడలోపాము, నొసట అగ్ని- ఇన్ని విడవనివి ఉంటే ఇక గుట్టెక్కడ?

ఇటువంటి చమత్కార సుందరమైన పద్యాలెన్నో రచించిన ఉత్పల వారు శాశ్వత సత్కావ్య నిర్మాత కూడా కావటం ఎంతో విశేషం. సంభావ్యం.

## ఆచార్యాయనమో!

శ్రీమాన్ కాశీ కృష్ణాచార్యులవారు మన రాష్ట్ర ప్రభుత్వ ఆస్థాన కవులలో ఒకరుగా మహా పండితులుగా ప్రసిద్ధి పొందారు. ఎన్నో అవధానాలు చేసిన ఆచార్యులవారు కవిత్వంలోనే గాక సంగీత వాద్య కళలలో కూడా నిపుణుడలు కావటం విశేషం. కవిత్వం ఎలా ఉండాలి అనే విషయంలో పెద్దనగారి మాలిక జగత్ప్రసిద్ధమైనది. దానికి దీటుగా రచించాలని వీరు చేసిన ప్రయత్న ఫలితమే ఈ క్రింది మాలిక. ఇది ఇటీవల లభించటం లేదు కనుక పూర్తిగా ఇస్తున్నాను.

పొలువుల నొల్కు లేముగుద మొల్క చనుంగవ బోలి కుల్కు బె
ళ్కులు గల మేలికైతము తెలుంగున బల్కెడు కల్కి చిల్క వ
ల్కులవలె వీను దోయికి దగుల్కొనగా వలె, చూలుగోల ము
ద్దుల నును జెక్కుటద్దముల తోరపు లొద్దుగ పూతరంగు ని
గ్గుల వసరెమ్మ నాల్గనుల కోవున దారసిలన్ వలెన్ మదిన్
దలచిన తుంట వింటి నరదారుని సేతల సోలియాడు ని
మ్ముల చెలికాని మోవి వలె ముచ్చట గావలె వంట నంటినన్
వలవుల నీను కవ్రవుటనంటుల బోదెల చాటు మాటునన్
దొలి పొలయల్క మోముపయి దోపగ చూపులవాడి తూపులన్
జిలికెడు కుల్కులాడి జిగి జిల్కు హొయల్ వెలజారు పైట లో
వల వల జిక్కు జక్కవ కవన్ బురుడించెడు దబ్బ గుబ్బ యు
బ్బుల వెలయింపగా వలయు బొమ్ము- తెలుంగున కైత లిమ్ముగన్
విలసద మర్త్య వాఙ్మయ కవిత్వము నాన్ భుజగేంద్ర భూషణో

జ్వల మణిరుగ్ఘటాపటల నంపిలురఁ ద్దివిషత్తరంగిణీ
చలదురు వీచికానికర శల్క ధణంధణ ధంధణార్భటీ
కలన నెనంగగావలెనొకానొక నయప్పుడు పద్మ నంభవ
ప్రళయ మహార్ణవోత్సవ దభంగుర భంగ మృదంగ నాద నం
కలిత కృతాంతరాట్చరణ ఘాత దళద్ద్రుహిణాండ నిస్సరత్
పెళ పెళ సాధ్వనధ్వనుల ఖింకము నొక్కయెడన్ ముహుర్ముహు
ర్గల దరవింద బృంద మకరంద నిరంకుశపాన మత్త తుం
దిలిత నరస్వతీ చరణ లాస్యచల న్నవశింజినీ ఝుళం
ఝుళల పనందు జూపవలె ఝుల్లున రాలెడుపూల తేనె వా
నల నలరారు మాధురి గనంబరుపన్ పలెకొన్ని వేళలన్

శృంగారసుందరమై, ప్రకృతి దృశ్య మనోహరమై,కాశీవారి వాణి మధుర మంజుల రీతులతో ఈ మాలికలో లాస్యమాడిందనడంలో ఎంత మాత్రం అతిశయోక్తి లేదు.

కృష్ణాచార్యుల వారుచతురవచోధురీణులు. అవధానాలలో ఉపన్యాసాలలో వారి వాణి వెలియించే చమత్కార ధోరణికి సదస్యులు మురిసిపోయేవారు. బందరు శతావధానంలో విద్యావిహీనలైన అత్తాకోడళ్ళ పోట్లాట గురించి అడిగినప్పుడు వచ్చిన పద్యంలోని హాస్య లాస్యం గమనించండి.

పాచి పెంటను ద్రోసి బాగుచేసిన నేల పాడు చేసి తి దేమి పాపమమ్మ!
నా పాడుకాదుపోః నీ పాడె యిది నీదు తాత సొమ్మా యే మి ధర్మ మమ్మ!
ఆ కొంప యేమి నీ అబ్బ కట్టించెనా నా సొమ్ము కాదటే నంగనాచి
నా కొంపయో లేక నీ కొంపయో రేపు కలుగు నీ పాట్లు కుక్కల కటంచు
ఒకట తప్పులె ఉండిన నుండకున్న గోకి పోరాడు అత్తయు కోడ లున్న
కాపురం బెట్లు కుదురుగా గలదు గాన నాడువాంద్రకు విద్దె అత్యవసరంబు.

అద్వైత, ద్వైత, విశిష్టాద్వైతాలను గురించి కందం చెప్పమంటే ఆ యా మతస్థుల అలవాట్లను, పద్ధతులను మనస్సులో పెట్టుకొని చెప్పింది.

ద్వైతము లుబ్ధ సుఖదమ
ద్వైతము తస్కర సుఖప్రదంబు విశిష్టా
ద్వైతము యాత్రిక సుఖదము
భూతలమున మొత్తమునకు మూడును మెరుగే!

స్త్రీల పునర్వివాహాన్ని గురించి చెప్పిన పద్యంలో వారి సనాతన భావా లీ విధంగా కనిపిస్తున్నాయి.

ధారుణి నీకలన్ విన యథావిధి కాగల యట్టి పెండ్లి కా
ధారము లేక మానవులు తగ్గిస మగ్గిస లాడుచుండగా
నూరులు వేలు లక్షలును నూతన శుల్కము హెచ్చి యింక నే
తీరున నెవ్వరే ననుమతింత్రు వితంతు సుతంతు ధారణన్.

వీటికేమి గాని,ఆచార్యులవారి కవిత్వ పాండిత్యాలు అసాధారణమైనవి. అవధానవేళ ఏపద్యపాదమో గుర్తుకు రాకపోతే ఇష్టదైవమైన హయగ్రీవుని ప్రార్థిస్తే స్ఫురణ కలిగేదట! బందరు శతావధానంలో చెప్పిన పద్య మొకటి ఈ భావనను తెలుపుతున్నది.

భావమునందు నిన్నెపుడు బాసి యెరుంగని వాడనయ్య! యో
పావన నామధేయ! నను బాలను ముంచిన నీట ముంచినన్
నీవ గదయ్య! దిక్కితరునిన్ మరి వేడగబోవ నో హయ
గ్రీవ! వధాన వార్థి నను రేవును జేర్చుము నీకు మ్రొక్కెదన్.

హయగ్రీవోపాసకులైన ఆచార్యుల వారు ప్రతి ప్రదర్శన ముందూ,ఉపన్యాసానికి ముందూ ఆశ్వధాటి వృత్తంలో చేసే స్తుతి ఎంతో ఆకర్షణీయంగా ఉండేది.

తన కెన్ని విద్యలు వచ్చునో సరదాగా చెపుతూ పిఠాపురం రాజావారి సన్నిధిలో చెప్పిన పద్య మాలికలోని కొంత భాగం చూడండి.

**ఏరికి నెట్టి విద్య రుచియించునొ వారల కట్టి విద్యలో**
**నే రన మొప్పజేసి ముద మీవలెనంచు దలంచి కొంత నే**
**నేరిచినాడ తర్కమును నేరిచినాడ నొకింత వ్యాకృతిన్**
**నేరిచినాడ సత్కవిత నేరిచినా డవధాన తంత్రమున్**
**నేరిచినాడ వాఙ్మఖము, నేరిచినాడ పురాణ వక్తృతన్**
**నేరిచినాడ గానకళ నేరిచినాడను వాద్య భేదముల్**
**నేరిచినాడ వైద్యమును నేరిచినాడ కథాశుధారలన్.**

ఇన్ని విద్యలలో నిపుణుడు, మహా పండితుడు గనుకనే చెళ్ళపిళ్ళ వారిలా స్నేహంతో పలికారు.

ఆచార్యాయ నమోనమ శ్శతవధానాంభోధి కుంభోద్భవా
యాచార్యాయ నమోనమోస్తు శత శస్త్రర్కాంబు జార్కాయ

నిజంగానే కాశీవారు అవధాన సముద్రాగస్త్యులు.

## భైరవ ప్రసాదం

శ్రీనాథుని సమకాలికుడు, క్రీడాభిరామకర్త వల్లభరాయడు సాహిత్య రంగంలో వివాదాస్పదుడైనవాడు. అతని రచనపైన శ్రీనాథుని ప్రభావమెంత- అనే విషయం పండిత లోకంలో చర్చనీయాంశమైనది. భైరవుని అనుగ్రహాన్ని పొంది సిద్ధ సారస్వత సంపద నందుకొన్నట్లు వీథి నాటకంలో మనకు కనిపిస్తున్నది.

మూడు గ్రామ గ్రాసములతోడ గూడంగ మోపూరు పాలించె ముల్కి నాట
అశ్వలాయన శాఖ యందు ఋగ్వేదంబు కరతలామలకంబుగా పఠించె
ప్రత్యక్ష మొనరించి భైరవ స్వామిచే సిద్ధ సారస్వతశ్రీ వరించె
కామకాయనన విశ్వామిత్ర గోత్రంబు వంశ గోత్రంబుగా వార్త కెక్కె.
ఎవ్వ డా త్రిపురాంతకాధీశ్వరునకు రాయ నవరత్న భండార రక్షకునకు
ప్రియ తనూజుండు చంద్రమాంబికకు సుతుడు మనుజ మాత్రుండె వల్లభామాత్యవరుడు?

వల్లభరాయ డారాధించిన మోపూరి భైరవుని గూర్చిన ఒక పద్యం పెదపాటి జగన్నాథకవి 'ప్రబంధ రత్నాకరంలో ఉదాహృతమైంది. వల్లభరాయని వీథి నాటకంలోని దని అతడు చెప్పాడు.

చంద్ర ఖండ ములతో సరివచ్చు ననవచ్చు విమలదంష్ట్రా ప్రరోహముల వాని
పవడంబు కొనలతో ప్రతివచ్చు ననవచ్చు కుటిల కోమల జటాచ్ఛటల వాని
ఇంద్ర నీలములతోనెనవచ్చు ననవచ్చు కమనీయతర దేహ కాంతి వాని
ఉడురాజ రుచులతో నొరవచ్చు ననవచ్చు చంచన్మ దాట్టహాసముల వాని

సిగ్గుమాలిన మొల వాని చిరుతవానిఎల్లకాలంబుములికి నాడేలువాని
అర్థి మోపూర నవతారమైన వాని భైరవుని గొల్వ వచ్చిరి భక్తవరులు.

భీషణ సుందర దంష్ట్రలతో, ఎర్రని జడలతో, వెన్నెల వంటి నవ్వుతో, నల్లని తనువుతో దిగంబరుడైన బాల భైరవు డక్కడి ఆరాధ్యమూర్తి. అతని నుపాసించి వల్లభరాయడు కవితా వల్లభుడైనాడు. చాటుకవిత చెప్పటంలో కూడా అతడు నిపుణుడనీ,అమృతం కోసం మథిస్తున్నప్పుడు సముద్రంలో ఎటువంటి కోలాహలం ఉదయించిందో దాన్ని భ్రమింపజేసే చాటు ధారాఫణితి అతని కున్నదనీ తెలుస్తున్నది.

నెల్లూరి తూము కాలువలో ఆనాడు కమ్మని వాసనలు గల కలువల పూచేవి. ఇతని వాక్కులు ఆ పరిమళ విలసితాలై ఉండేవట!

నెల్లూరి తూము కాలువ
హల్లకముల కమ్మతావి నపవలాపించున్
సల్లలి లీల తప్పయ
వల్లభరాయ ప్రధాన వాగ్డంబరముల్

ఈనాడు తెలుగు భూమి అంతటా ప్రసిద్ధమై కృష్ణరాయలు ఆముక్తమాల్యదలో వాడుకొన్న "దేశ భాషలందు తెలుగు లెస్స" అనే పద్యపాదం క్రీడాభిరామంలోనిదే.

జనని సంస్కృతంబు సకల భాషలకును
దేశ భాషలందు తెలుగు లెస్స
జగతి తల్లికంటె సౌభాగ్య సంపద
మెచ్చుటాడు బిడ్డ మేలు గాదె!

అన్ని భాషలకూ తల్లి సంస్కృతం. దేశ భాషలలో తెలుగు మేలైనది. తల్లి పెద్ద దవుతుంటే పిల్ల వయసులో ఉంటే తల్లి కంటె అందంగా ఉండటం సహజమే కదా!

కామ ప్రేరకమైన శృంగారం,ప్రకృతి పరిశీలన, ఆనాటి నగరాల్లోని అనేక విశేషాలు, పామరులను గురించిన ఎన్నో సంగతులు, వేశ్యా వాటికలు, కోళ్ళ పందేలు, బంతులాటలు, పొట్టేళ్ళ పోటీలు, జూదాలు, భోజనశాలలు - ఎన్నో ఎన్నో అంశాలు ఈ కావ్యంలో కనిపిస్తాయి.

వీటన్నిటితోపాటు రచయిత శివభక్తి కూడా వెంట వెంట వస్తూనే ఉంది. శివుని తలమీద ఒక ఉమ్మెత్త పువ్వు పెట్టినా సరే అనంతమైన సుఖైశ్వర్యాలు కలుగతాయని అంటాడు కవి.

కొడుకులు కూతులున్ గలిగి కూడును పాడియు త్రవ్వి తండమై
విడి ముడి లాతుగా గలిగి వెండియు పైడియు నిండ్ల లోపలన్
దడబడ దారు బంధువులు తామర తంపరలై సుఖించు వా
రుడుపతిమౌళి మౌళి నొక ఉమ్మెత పూవిడు వారు వేడుకన్.

శ్రీనాథుని చేయి ఎంత ఉన్నా వల్లభరాయని కవితాశక్తి తోసివేయదగినది కాదు. హాటక గర్భవధూటీ వీటీ కర్పూర శకల విస్ఫురమర సౌరభ్యాటోప కవితా పాటవం కలవాడతడు.

## తిట్టావు కానీ----!

ఎవడురా వాడు? కదిపి కవ్వించినాడు
మరచి నిదురించు వీర కేసరిని తట్టి
ఎవడురా వాడు? తల దూర్చ నెంచినాడు
అరిభయంకర మృత్యు గహ్వరములోన

అంటూ ఉద్రేకభరితుడై, ఆవేశ వివశుడై కవితా వీరాన్ని ప్రదర్శించినవాడు నెల్లుట్ల రామకృష్ణామాత్య, తిరుపతి వేంకట కవులు, వారి శిష్యులు, మిత్రులు కొప్పరపు కవుల మీదకు దూకి వారిని దౌర్జన్యంగా ఒంటరివాళ్ళను చేసి బాధించారని అతనికి అనిపించింది. కాని నిజానికది సత్యం కాదు. వారి బలం వారికి, వీరి బలం వీరికి ఉండేది. వివాదం వచ్చిన తర్వాత పరస్పరం ఎదురుపడనేలేదు. ఇవి ఆ రోజుల్లో శాఖా విభేదాలుగా తీవ్ర రూపం ధరించిన సంగతి అందరికి తెలిసిన అంశమే. వైదికులంతా తమ పెద్ద బలగంతో నియోగి కవుల మీదికి దాడి చేశారని, అన్యాయంగా ఇబ్బంది పెట్టారని అతను భావించి ఆ వర్గాన్నంతా ధూషిస్తూ భావార్ణవమనే పుస్తకం రాశాడు. దాన్ని కొప్పరపు సోదర కవులకు కృతి నిస్తూ ఇలా రాశాడు.

అలనాడుక్కివుడైన అక్బరున కట్లా మానసింహాది హీ
నుల చొప్పేర్పడ చెళ్ళపిళ్ళకిల మంత్రుల్ పెక్కురై కూడ పిం
గళి కాటూరులవోలె దాసులగుడున్ రాణాలనుం బోల్చిమ
త్కుల సౌశీల్యము నిల్పు కొప్రపు కవీంద్రుల్ మత్కృతి గ్రాహకుల్

అక్బరు దగ్గర మానసింహుడు మొదలైనవారిలాచెళ్ళ పిళ్ళవారి చెంత పింగళి, కాటూరు లు చేరితే వారిని లెక్కించక రాణాప్రతాప సింహునిలా పోరాడిన కొప్పరపు కవీంద్రులకు నా కృతిని సమర్పిస్తున్నాను- అంటూ ఇలా రెచ్చగొట్టాడు.

కనుడు మీరలు కొప్రంపు కవుల చితులు
రవులుచున్నవి భూమి గర్భమున నిపుడు
పట్టి కలముల కికనేని పదును బెట్టి
ఎదిరి రొమ్మును పగుల జీల్చెదరు గాక

ఆంధ్ర సాహిత్య సృష్టి అంతా మావల్లనే జరిగింది. మమ్మెదిరించేవాడెవడు? ఎదిరిస్తే జాగ్రత్త అని ఇలా సవాలు చేశాడు నెల్లుట్ల

తిక్కనామాత్యుండు తిక్క తిమ్మిరి బాపు నాచనసోముండు పీచమడుచు
శంభుదాసుడు కన్కశారదనే మ్రింగు పోతన్న తాతముత్తాత దెలుపు
శ్రీనాథుడెదురేగి చెంపలు వాయించు ముక్కు తిమ్మన లేచి ముక్కుబట్టు
గండ పెండేరంబు గర్జించి తొడగొట్టు పింగళి యాకొన్న సింగమగును
ఇట్టి వస్తాదు లింకెందరేని యుండ చాలునన్నృతోక్తులెట్లు పసందు గొలుపు
ఎవడురా? మాయమాత్యుల నీసడించి కలము నడిపెడు మొనగాడు తెలుగునేల

కవిత్వంలో మమ్మ మించినవారు లేరని ఆంధ్ర భారతి తమ ఇంటి ఆడుబిడ్డయని ఎంత ధీమాగా

అంటున్నాడో చూడండి!

ఇంక నీ కైతమా వాని నెదరియాడ
తమను పుట్టించు బ్రహ్మకు తరముగాదు
పందెమొడ్డి వచింతు భంబువగుల
ఆంధ్ర భారతి మా ఇంటి ఆడుబిడ్డ

"రెండు బాసలకు మేమె కవీంద్రుల"మని దుందుడు కొప్పగ మీసం పెంచామన్న తిరుపతి వెంకట కవులను విమర్శిస్తూ కనుపర్తి అబ్బయామాత్యుని పద్యాన్ని గ్రహించి చివరి భాగం సందర్భోచితంగా మార్చి చెప్పాడీ కవి.

చతుర కవిత్వతత్వ పటు సంపద యొక్కరి సొమ్ముగాదు భా
రతి దయాసౌధవార్ధి కవి రాజుల మానసముల్ ఘటంబులా
యతము కొలంది లబ్ధమగునంచని మా సచివుండె చెప్ప యే
మతమున వీరలింతటి హిమాకతు బూనిరొ చెప్పరే కవుల్?

కవిత్వం ఏ ఒక్కని సొంతమూ గాదు. సరస్వతి దయ అమృతపయోధి వంటిది. కవి మనస్సులు కుండల వంటివి. పాత్ర పరిమాణాన్ని బట్టి అమృతం వస్తుంది. అంతే అలా ఏ కవీ నేనే కవిని, ఇంకెవరూ కాదు అనటం వట్టి దురహంకారం. రెండు బానలకు మేమే కవీంద్రులమని జంట కవులనటం సాహసం తప్ప మరేమీ కాదని నెల్లుట్ల కవి భావన.

ఇక ఆ రోజుల్లో నన్నయను ఒక వర్గం నెత్తిన పెట్టుకొని మోస్తే మరొక వర్గం తిక్కనను భుజాన వేసుకొని తిరిగేది. నన్నయకు ముందు కవిత్వమే లేదనేవాళ్ళను తిరస్కరిస్తూ ఈ కవి ఇలా అన్నాడు.

నన్యకు ముందు ఆంధ్రవాఙ్మయము జూప
చాలదా యుద్ధమల్లుని శాసనంబు
దాని యందలి భాష ఆంధ్రంబు గాదె?
అందున కనుంగొనంగ పద్యములు లేవె?
ఈ కలియుగాన నీ భాష నింతకరయ
శాతకర్ణి నృపాలు నాస్థాని నుండి
మాయమాత్యుడు దేవళరాయ డొకడు
స్థాపనము జేసెబో! యీ విచార మేల?

నన్నయకు ముందరి యుద్ధమల్లుని బెజవాడ శాసనంలో తెలుగు పద్యాలున్నాయి. అసలు శాతకర్ణి మంత్రి దేవలరాయుడే తెలుగు భాషను స్థాపించాడని ఉద్ఘాటించాడీ కవి.

తన భావార్ణవ గ్రంథాన్ని చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారికి పంపించాడు రామకృష్ణామాత్యుడు. వారు సమాధానం రాయలేదు. కొన్నాళ్ళ తర్వాత బెజవాడ వెళ్ళినప్పుడు వారిని చూశాడు. అప్పుడు వెంకటశాస్త్రిగారు "అబ్బాయీ! నీ గ్రంథం సాంతం చదివాను. తిడితే తిట్టావు గాని కవితాధార మహాద్భుతంగా ఉంది" అని ప్రశంసించారట!

"కాలిపోయిన కొప్రంపు కవుల చితులు
మండుచున్నవిమన్మనో మంటపమున
కట్టెయయొకండు కూడను కానరాదు
అది యెరుంగుమురా! హృదయాగ్ని యండ్రు"

అంటూ ఆవేశపూరితుడై తీవ్ర స్థితిలో రాసిన ఈ కవికి కొప్పరపు సోదర కవులు సాక్షాత్కరించి ఈ విధంగా అన్నారట!

ఈయదేనాటి సంబంధమో యెరుంగ
మెంత జేసితి మాకోసమీ వమాత్య!
నిర్భరానందమందు మునింగినాము
తెలుపవేనీ ఋణంబెట్లు తీర్తుమేము?

ఇంత కవితావేశం గల ఈ కవి చిరకాలం జీవిస్తే ఎంత మంచి కావ్యాలు వచ్చేవో! ఏదైనా , రాసింది ఎటువంటి దూషణాత్మకమైనా, అందులో కవిత్వపు మెరుపుంది. అందుకే సహృదయతతో చెళ్ళపిళ్ళవారు ప్రశంసించారు.

## పలనాటి సీమ

తెలుగు కవులలో దేశ సంచారం చేసి అ సంచారాన్ని సాహిత్య యాత్రగా, కవితా జైత్ర యాత్రగా మలచుకొన్న వాడు శ్రీనాథుడు. ఎక్కడికి పోయినా, కంటి నాకట్టుకునే ఏ దృశ్యాన్ని చూసినా హృద్యమైన పద్యం చెప్పకుండా అతను విడిచి పెట్టలేదు. అందువల్ల తెలుగు సీమలోని చరాచర వస్తువులు, జీవ నిర్జీవ పదార్థాలు ఆ మహాకవి కవితా దర్శనం చేత దివ్య సౌందర్యాన్ని సంతరించుకొని శాశ్వతత్వాన్ని పొందాయి. ముఖ్యంగా పలనాటి సీమలో ఎన్నోసార్లు అతను తిరిగినట్లు కనిపిస్తుంది. ఎన్ని చాటువులు చెప్పాడో! అయితే ఎక్కువ భాగం అవహేళన చేస్తూ, తిరస్కార భావంతో, వ్యతిరేక భావంతో చెప్పినవే. అయితే కవిత్వానికి ఒక వస్తువుకు సంబంధించిన అనుకూలత, వ్యతిరేకత ప్రధానం కాదు. చెప్పినదాంట్లో కమనీయత, కవితా పదార్థం ఉన్నాయా, లేవా అనేదే ప్రధానం. తిట్టినా అందంగా తిడితే దానికి శాశ్వతత్వం వస్తుంది.

పల్నాడులోని చిల్లరదేవుళ్ళు, సజ్జ, జొన్న కూళ్ళు, పాములు, తేళ్ళు, వైభవం లేని ఊళ్ళు ఆయన కెంతమాత్రం నచ్చలేదు. అందుకే అంటాడు గదా!

చిన్న చిన్న రాళ్ళుచిల్లరదేవుళ్ళు
నాగులేటి నీళ్ళు నాపరాళ్ళు
సజ్జ జొన్న కూళ్ళు సర్పంబులును తేళ్ళు
పల్లనాటి సీమ పల్లెటూళ్ళు.

కాశీ వెళ్ళి గంగా స్నానం చేసి, విశ్వనాథుని దర్శించి వైభవ ప్రాభవాలతో తిరిగిన ఆ కవిరాజుకు పలనాటి వారి ప్రాప్తం ఇంతేలే అన్నట్లు, వారికి వీరులే దివ్యలింగాలు, చెన్నకేశవుడే విష్ణువు-కళ్ళిపోతురాజే కాలభైరవుడు, అంకమ్మ శక్తే అన్నపూర్ణ, గంగాధర మడుగే మణికర్ణికా మహాతీర్థం -అని ఇలా అంటాడు.

వీరులు దివ్యలింగములు విష్ణువు చెన్నుడు కళ్ళిపోతురా
జారయ కాలభైరవుడు-అంకమ శక్తియె అన్నపూర్ణగా
గేరెడు గంగధార మడుగే మణికర్ణికగా జెలంగు మా
కారెమపూడి పట్టణము కాశి గదా! పలనాటి సీమకున్

కారెమపూడే పలనాటికి కాశి అని అంటాడు. నిజానికి దీంట్లో మెచ్చుకుంటున్నట్లూ ఉంది, మేళం చేస్తున్నట్టూ ఉంది. అలా చెప్పే సామర్థ్యమూ అతనికి పుష్కలంగా ఉంది.

రసికుడు పలనాటికి పోడు. పోతే ఏముందక్కడ? సాక్షాత్తు రంభైనా నాట్యాలు చేస్తుందా? ఉద్యానవనాల్లో విహరిస్తుందా? ఏకులు వడుకుతూ కూచోవలసిందే. రాజైనా సరే పొలం దున్నుకోవలసిందే-అని ఈ పద్యం అన్నాడు-

రసికుడు పోవడు పల్నా
డెసగంగా రంభయైన నేకులెవడుక్కున్
వసుధేశుడైన దున్నును
కుసుమాస్త్రుండైన జొన్నకూడే కుడుచున్.,

సస్యశ్యామలమైన గోదావరీ ప్రాంతానికి, ఎండి బీటలు వారిన నేలలతో ఉండే పలనాటి సీమకూ పోలిక లేదు. ఆ గోదావరీ మండల రాసిక్యాన్ని ఈ విధంగా వర్ణిస్తాడతను-

ధరియింప నేర్చిరి దర్భ బెట్టెడి వ్రేళ్ళ లీలమాణిక్యాంగుళీయకములు
సవరింప నేర్చిరి జన్నిదంబుల మ్రోల తారహారములు ముత్యాల సరులు
కల్పింప నేర్చిరి గంగ మట్టియమీద కస్తూరి కాపుండ్రకములు నొసల
చేర్పంగ నేర్చిరి శిఖల నెన్నడుమల కమ్మని క్రొత్త చెంగల్వ విరులు
ధామముల వెండిపైడియు తడబడంగ బ్రాహ్మణోత్తములగ్రహారములయందు.

వేద వేదాంగవేత్తలై ఐహిక భోగాలకు దూరంగా ఉండే విప్రులే దర్భముడులకు బదులుగా మణులు పొదిగిన ఉంగరాలు, జంధ్యాలతో పాటు తారహారాలు, నొసటి విభూతిరేఖలతో పాటు కస్తూరి, శిఖల మధ్య కలువపూలు, అవీ ఎర్ర కలువలు-ఇళ్ళలో వెండి బంగారాలు-ఇటువంటి స్థితిలో అలరారుతుంటే, ఇక ఇతరుల పని చెప్పవలసిన దేముంది?

అటువంటి వాటిని ఎరిగిన కవిసార్వభౌమునికి మంచి అంగళ్ళు, వరి అన్నం, అందమైన యువతులు కనపడని పలనాడు ఎలా నచ్చుతుంది? అందుకే అడుగడుగునా, పద పదానా విమర్శించి ఎన్నో పద్యశిలలు కురిపించాడు. అయితే అవి శిల్పాలై నిలిచాయనుకోండి!

అంగడి యూరలేదు వరి యన్నము లేదు శుచిత్వమేమి లే
దంగనలింపు లేరు ప్రియమైన వనంబులు లేవు నీటికై
భంగపడంగ బాల్పడు కృపాపరు లెవ్వరు లేరు దాత లె
న్నంగను సున్నగాన పలనాటికి మాటికి పోవ నేటికిన్.

నీరు దొరకక బాధపడుతూ ఉన్న ప్రదేశాలు ఎంత తవ్వినా రాతిచట్టుదప్ప నీరు పడని బావులు, ఎండాకాలంలో జనం పడేపాట్లు చూస్తూ తన దైవమైన శివుణ్ణే ఇలా చమత్కారంగా అధిక్షేపించాడు-

సిరి గలవానికి చెల్లును
తరుణులు పదియారు వేల తగ పెండ్లాడన్
తిరిపెమున కిద్ద రాండ్రా?
పరమేశా! గంగ విడువు పార్వతి చాలున్.

సంపదగల ఏ కృష్ణుడో పదహారు వేలమందిని పెళ్ళి చేసుకొంటే చేసుకొన్నాడు గాని, బిచ్చగాడివి నీ కెందుకయ్యా ఇద్దరు భార్యలు? ఒక పార్వతి చాలులే గంగమ్మను విడిచిపెట్టు- అంటే బావిలో కాసిని నీళ్ళు పడేలా చేయమనో, వాన కురిపించమనో అభ్యర్థిస్తాడు.

భగవంతునితో చనువు ఉన్న భక్తులు ఇలా అడగడమూ, ఆ దేవుడు మాటలు పడి కూడా భక్తుల కోర్కెలు తీర్చడమూ సహజమే. కవుల ప్రార్థనలు కూడా ఇటువంటి చిత్ర పద్ధతులలోనే ఉంటాయి.

## సాక్షాద్రుద్రుడయా!

కందుకూరి రుద్రకవి కృష్ణదేవరాయల కాలం నాటివాడు. రాయల ఆస్థానంలో ఈశాన్య సింహాసనాన్ని అధిరోహించి, అష్టదిగ్గజ కవులలో ఒకడై ప్రకాశించాడట. మొదట రాయల కొలువులోకి ప్రవేశించినప్పుడు అక్కడి తాతాచార్యుల వారితో ఇతనికి వాదం జరిగిందట. ఆ సందర్భంగా ఆచార్యుల తృణీకారానికి జవాబు చెబుతూ రుద్రకవి ఈ పద్యం చెప్పాడట-

వర నిజ కర్మ ధూర్వహత బ్రాహ్మణులు మీర్ పరికింప నిల పరబ్రహ్మ నేను
ఇనుము చేతను నొనర్చిన శంఖచక్రాంక గురువులు మీర్ జగద్గురుండ నేను
దాన ప్రతిగ్రహాధీన బిరుదు మీది పేషిణీ హనుమంత బిరుదు నాది
ఋషి వంశ భూషణ శ్రేష్ఠులు మీరలు కనక కుండల పరిష్కారి నేను
అనుచు తెల్పితి మాయక ఘనకులంబు రాయలు వినంగ నంద రౌరా యనంగ
సత్కవులలోన తాతయాచార్య! యేన రూఢి కెక్కిన కందుకూర్ రుద్రకవిని.

ఈ తాతాచార్యులు రాయల కొలువులోని వాడా, వేరే వ్యక్తా అన్నది వివాదాస్పదం, ఏదైనా రాయల ఆస్థానంలోకి ప్రవేశం ఆ రోజుల్లో అంత సులభమూ కాదు, అక్కడి పండితులతో మాట్లాడి, వాదించి, నెగ్గుకు రావటమూ సామాన్యం కాదు. ఎంతో శక్తి నిరూపితమైతే తప్ప దిగ్గజాలలో ఒకడు కావటమూ జరగదు.

రుద్రకవి తాతాచార్యులతోనే కాక మరో చోట భద్రమంత్రి అనే అమాత్య కవితో కూడా పోరాడినట్టు తెలుస్తున్నది. ఆ మంత్రి రాజదర్శనం కానియ్యకపోతే రాజుగారి క్షురకుని సాయంతో దర్శనం పొంది భద్రమంత్రిని చూస్తూ ఇలా అన్నాడట-

ఎంగిలి ముచ్చు గులాములు
సంగతి గా కులము చెరుప జనుదెంచిరయా!
ఇంగిత మెరిగిన ఘను డీ
మంగలి కొండోజి మేలు మంత్రులకన్నన్.

దాంతో భద్రమంత్రి ఆగ్రహించి 'అమాయకుల దగ్గర వాగాడంబరం ప్రదర్శించి, డబ్బు సంపాదించటం కాదు. నా దగ్గర నీ శక్తి చెల్లదు పొమ్మని ఈ విధంగా అన్నాడు-

జగడ దప్పు, లణ్ణు, శషసర్చు, కపయ్య, ఝుభఝాటంచు వా
జు జబుబలెల్ల జూపి అగసాలెల బేలల బోయపాలె పుం
బబువుల దేల్చి చేతగల పైకము దోచుట గాదు రుద్ర! నీ
డబడబ భద్ర మంత్రి యెదుటం గొనసాగదు పోకు పోకుమీ!

దానికి జవాబుగా రుద్రకవి ఇలా విజృంభించాడు-

భద్రా! శ్వానము మొరిగిన
రుద్రాంకిత జంగమయ్య రూఢికి కొదవా?
చిద్రూపుడయిన సాక్షా
ద్రుద్రుడయా! కందుకూరు రుద్రుడు ధాత్రిన్.

కుక్క మొరిగితే జంగమయ్య గొప్పదనానికేమీ లోటు? కందుకూరు రుద్రుడు సాక్షాత్తు రుద్రుడు సుమా! జాగ్రత్త అని హుంకరించాడట.

ఈ పద్యాన్ని కొప్పోలు త్రిపురాంతకుడు చెప్పాడని వేటూరు వారు రాశారు. రుద్రకవి తరపున చిట్టప్ప అనే కవి ఇలా పలికాడట.

రుద్రకవి వాక్పటుత్వము
భద్ర ప్రదయుక్తి తనరు భాసుర లీలన్
రుద్రు స్వరూపు నెదురను
క్షుద్రు లెదుర్కొనగ గలరె కుంభిని లోనన్?

రాయల సభలో రుద్రకవి కవితా విజృంభణాన్ని చూచి తల ఊపి పెద్దనగారు 'తగురా! కవిరుద్ర!' ' అని ఎంతో మెచ్చుకొన్నాడట.

వ్యగ్ర కవిత్వతత్వ చతురాస్యులు కైయట భాష్య ఫక్కి కౌ
నుగ్ర శక్తి గల్గిల్ ఘనుక కవు లెందరు లేరు! నీ దుప్ర
త్య గ్రవచోధురీణ కవితల్ తగురా! కవిరుద్ర! రుద్ర ఢ
క్కాగ్ర సముజ్వల స్ఫురిత హల్లులకున్ స్వరపాళి కొజ్జలై.

వరకవి కొండయ్య అనే అతను ఎదిరిస్తే రుద్రకవి ఈ విధంగా ధిక్కరించాడట.

విదితంబుగ కవిరుద్రుని
సదమల వాగ్జనిత, శాస్త్ర సంహిత పదముల్
కుదిరిక తెలియక యూరక
వదరకురా వెర్రిముండ! వరకవి కొండా!

దనుజ మర్ధన! కందుకూరి జనార్దనా! అనే మకుటంతో శృంగార రసోల్లసితమైన జనార్ధ నాష్టకాన్ని బలవదరీదరీ కుహర భాస్వదరీయ దరీ దరీ హరీ,అనే మకుటంతో ఒక శతకాన్ని ఇతను రచించాడంటారు. కొన్ని పద్యాలు మాత్రం లభించాయి. ఇతన్ని మెచ్చుకుంటూ ఒక కవి చెప్పిన పద్యం ఇతని సారస్వత మహత్యాన్ని ఈవిధంగా అభివర్ణిస్తుంది.

హరియౌ స్కందపురీ జనార్దన పరంబందెన్ మహా సత్కవీ
శ్వరులే రాయల వారి సన్నిధిని హర్షంబందె పట్టంబు గ
ట్టిరి ఆందోళికలున్ జవోగ్ర తరఘోటీ లగ్రహారంబు లం
దురు చూడన్ బహుమానమందె కవిరుద్రాఖ్యుండు తా ముఖ్యుడై.

## అమోఘ వాక్కు

వేములవాడ భీమకవి శాపానుగ్రహ సమర్థులైన కవులలో అగ్రగణ్యుడు . ఇతను రాఘవ పాండవీయాది గ్రంథాలు రచించాడని వినుకలియే గాని కనుకలి లేదు. దీనికి కారణాలు ఎన్నో చెబుతారు. ఇతను పలికిన చాటువులెన్నో మనకు మిగిలాయి. ఇతను తనను గురించి చెప్పుకొనిన పద్యాలు ఆత్మవిశ్వాసానికి, శక్తికి తార్కాణాలు.

గడియ లోపలఁ దాడి కడగి ముత్తునియగాఁ దిట్టిన మేధావి భట్టు కంటె
రెండు గడెల బ్రహ్మదండి ముం డ్లన్నియు డుల్లఁదిట్టిన కవి మల్లు కంటె
మూడు గడెలకుఁ దా మొనసి యత్తని గండి పగులఁదిట్టిన కవి భాను కంటె
అఱజాము లోపలఁ జెఱువు నీ ళ్ళింకంగ దిట్టిన బడబాగ్ని భట్టు కంటె
ఉగ్రకోపి నేను నోపుదు శపియింపఁ గ్రమ్మఱింప శక్తి గలదు నాకు
పట్టిమానఁ జిగురు పుట్టింప గిట్టింప బిరుదు వేములాడ భీమకవిని.

రాజుల దగ్గరకు వెళ్ళినప్పుడు తనను గూర్చి చెప్పుకున్న మరో రెండు పద్యాలు చూడండి. ఇవి కూడా ఆయన వ్యక్తిత్వాన్ని ప్రదర్శించేవి.

శాపాను గ్రహ పటువును
రాపాడెడి కవుల బట్టు రంపం బనగా
భూపాల సభల పూజ్యుడ
నాపేరే భీము డంద్రు నరవర వినుమా.

ఘనుడన్ వేములవాడ వంశజుడ దాక్షారమ భీమేశ నం
దనుడన్ దివ్య విషామృత ప్రకటనానా కావ్యధుర్యుండ భీ
మన నా పేరు వినంగఁ జెప్పితిఁ దెలుంగాధీశ! కస్తూరి కా
ఘనసారాది సుగంధి వస్తువులు వేగం దెచ్చి లాలింపరా!

వీటిని బట్టి అతను ఆడింది ఆటగా, పాడింది పాటగా జరిగిన అద్భుత శక్తి సమన్వితుడనీ, ఉద్దండ కవి అనీ తెలుస్తున్నది. ఇతని ఇంటి పేరు 'లేములవాడ' అని కొన్నిచోట్ల ఉంది. ఇతను చెప్పిన చాటువులెన్నో చిత్ర కథా వస్తువులై పేరు కెక్కాయి.

ఒకసారి భీమకవి గుడిమెట్ట అనే గ్రామానికి వెళ్ళాడు. ఏం జరిగిందో కాని, అతని గుర్రాన్ని గ్రామాధికారి సాగి పోతరాజు తన సాహిణంలో కట్టేయించాడు. ఈ సంగతి తెలిసి భీమకవి తన సేవకుడైన మారన చేత గుర్రాన్ని విడిపించి పంపించమని కబురు చేశాడు. ఆ అధికారి తమ్ముడు లచ్చన్న కవిగారి గుర్రాన్ని ఇవ్వకపోవటం శ్రేయస్కరం కాదని అన్నకు బోధించాడు. అయినా ఆ అధికారి వినలేదు. అప్పుడు కోపగించిన భీమకవి చెప్పిన పద్యమిది.

హయమది సీత, పోత వసుధాధిపుడు దారయ రావణుండు ని
శ్చయముగ నేను రాఘవుడ, సహ్యజ వారిధి, మారు డంజనా
ప్రియ తనయుండు, లచ్చన విభీషణుడా గుడిమెట్ట లంక, నా
జయమును బోత రక్కసుని చావును నే డవవాడు చూడుడీ!

"గుర్రం సీత, దాన్ని బంధించిన పోతరాజు రావణుడు. నిశ్చయంగా నేను రాముణ్ణి. నే నున్న చోటకీ, వాడున్నచోటికీ మధ్య పారుతున్న సహ్యాజానదే సముద్రం. నా తరపున రాయబారిగా వెళ్ళిన మారన్న ఆంజనేయుడు. న్యాయాన్ని బోధించిన వాడి తమ్ముడు లచ్చన విభీషణుడు. ఆ గుడిమెట్ట లంక. ఈ రామ-రావణ యుద్ధంలో నా గెలుపును, పోత రాక్షసుని చావును నేటికి ఏడవ రోజు చూడండి" అని ప్రతిజ్ఞ చేశాడు భీమకవి. అలాగే పోతరాజు మరణించాడట.

కళింగ గంగు ఆస్థానానికి భీమకవి వెడితే ఈయన శక్తి తెలుసుకోలేక దర్శనమివ్వక ఇప్పుడు వీలుకాదు పొమ్మన్నాడట. భీమకవి కోపించి ఇలా శపించాడు.

వేములవాడ భీమకవి వేగమె చూచి కళింగ గంగు తా
సామము మాని కోపమున సందడి దీఱిన రమ్ము పొమ్మనెన్
మోమును జూడ రోస మిక ముప్పది రెండు దినంబు లావలన్
జామున కర్థమం దతని సంపద శత్రులపాలు గావుతన్.

శాప ఫలితంగా రాజు కళింగ గంగు ముప్పై రెండు రోజులు కాగానే శత్రు దండయాత్ర ఫలితంగా రాజ్య భ్రష్టుడై, తనను గెలిచిన రాయల భటులు వెంటాడుతుంటే తప్పించుకుని పారిపోతూ, ప్రచ్ఛన్న వేషంతో తిరుగుతున్నాడు. ఒక రోజు రాత్రి చీకటిలో భీమకవి ఇంటి ప్రాంతంలో పోతూ ఒక గోతిలో పడి-"అయ్యో ఒక కాలి దివిటీయైన లేకపోయేనే" అన్నాడు. దగ్గరలోనే ఉన్న భీమకవి ఆ మాట విని "ఈ బిచ్చగాడెవడురా! దివిటీలు కావాలనుకుంటున్నాడు. వీడు నిజంగా బిచ్చగాడు కానట్లుందే' అని "ఎవరయ్యా నువ్వు?" అన్నాడు రాజు-"నేను భీమకవిగారు చేసిన జోగిని" అన్నాడు. భీమకవి "నువ్వు రాజకళింగ గంగువా?" అని అడిగాడు. కళింగ గంగు వెంటనే ఆయనను గుర్తించి కాళ్ళమీద పడి రక్షించమని ప్రార్థించాడు. అనుగ్రహం కలిగిన భీమకవి నోట ఈ పద్యం వెలువడింది.

వేయి గజంబు లుండఁబది వేలు తురంగము లుండ నాజిలో
రాయల గెల్చి సజ్జ నగరంబునఁ బట్టము గట్టుకో వడిన్
రాయ కళింగ గంగ కవిరాజు భయంకరమూర్తి జూడ దా
బోయిన మీన మాసమునఁ బున్నమి వోయిన షష్టి నాటికిన్.

ఈ పద్య ప్రభావంవల్ల కళింగ గంగు పురుషకారం ఫలించి వైరిని గెల్చి మళ్ళీ రాజయ్యాడట. అయితే ఈ పద్యంలో, తాబోయిన, అనటంలో అప్రయత్నంగా తన మరణాన్ని తానే భీమకవి సూచించుకొన్నాడనీ, ఆ వాక్కు ఫలితంగా ఆయన మరణించాడనీ, ఆ తరువాతనే కళింగ గంగు రాజయ్యాడనీ జనశ్రుతి.

భీమన అమోఘ వాక్కుకు ఉదాహరణగా ఎన్నో చాటు పద్యాలు మనకు మిగిలాయి. ఆయన వాక్ప్రభావాన్ని వర్ణిస్తూ చెప్పుకున్న మరొక పద్యం పరికించండి.

రామునమోఘ బాణమును రాజ శిఖామణి కంటి మంటయున్
భీము గదా విజృంభణ ముపేంద్రుని చక్రము వజ్రి వజ్రమున్
దామరచూలి వ్రాతయును దారక విద్విష ఘోరశక్తియున్
వేములవాడ భీమకవి వీరుని తిట్టును రిత్తవోపునే!

రాముని బాణం, రుద్రుని కంటి మంట, భీముని గదా విజృంభణం, విష్ణు చక్రం, ఇంద్రుని వజ్రం, విధివ్రాత, కుమారస్వామి శక్తి అప్రతిహతాలు, అనివార్యాలు. వేములవాడ భీమకవి తిట్టుకూడా వాటి అంతటిదే అని తాత్పర్యం. మొత్తంమీద అవితథ వాక్కు కలిగిన ఉద్దండ కవిగా భీమకవి మాట ఆ రోజుల్లో చెల్లుబడి అయినట్లు కనిపిస్తుంది.

## శృంగార రామమ్!

**తు**రగా రామకవి చమత్కార చాటువులు శృంగార సుందరాలై, రసభరితాలై ప్రసిద్ధి కెక్కాయి. ఒక తురగా రామన్న వేమారెడ్డి నాటి అమాత్యుడు. అతను కీర్తి కన్నా అపకీర్తినే ఎక్కువ పొందినట్లు కనిపిస్తుంది. కవి పండితులను రాజుగారి దగ్గరకు పోనివ్వకుండా, దర్శనం చేయనివ్వకుండా, ఒకవేళ దర్శనమైనా సత్కారాలు సరిగా జరగనివ్వకుండా అడ్డుపడేవాడట! అతనిమీద ఈ క్రింది పద్యం దాన్ని తెలుపుతుంది.

కోమటి వేముని త్యాగము
భూమి ప్రసిద్ధంబు కల్ప భూజము చెంతన్
పాము న్న పగిది తురగా
రాముం డున్నాడు చేరరా దెవ్వరికిన్.

చందన తరువు దగ్గర పామున్న విధంగా వేమారెడ్డి దగ్గర తురగా రాముడు చేరాడు. ఎవరినీ దగ్గరకు రానివ్వడు అని ఎవరో కడుపు మండిన కవి చెప్పాడు దీన్ని.

ఇక రామకవి పెద్దాపుర ప్రభువైన వత్సవాయి తిమ్మ జగపతి మహారాజు కాలంనాటి వాడు. ఆ రాజు దగ్గర ఆయనకు వార్షిక ముండేది. ఒకసారి మళ్ళీ అవసరమని వెళ్ళాడో ఏం జరిగిందో గానీ, అవమాన మేదో అయింది. దాంతో కవిగారికి విపరీతమైన కోపం వచ్చింది. ఆ ఆగ్రహావేశంలో కోట దాటి బయటికి వచ్చాడు. కోట గోడమీద బొగ్గుతో ఈ రెండు కందపాదాలు రాసి వెళ్ళిపోయాడు.

పెద్దమ్మ నాట్య మాడును
దిద్దిమ్మని వత్సవాయి తిమ్మని యింటన్.

అంటే జ్యేష్ఠాదేవి అడుగు పెట్టి రాజు దరిద్రుడైపోతాడని అర్థం. ఎవరో వెళ్ళిరాజుగారికి చెప్పారు. రామకవి శాపానుగ్రహ సమర్థుడని ప్రసిద్ధి. రాజు గారికి భయం కలిగింది. వెంటనే బ్రతిమిలాడి కోటకు తెచ్చి ఘనసన్మానం చేశారు. అప్పుడు పద్యం పూర్తి చేసి అర్థాన్ని మార్చి పలికాడు రామకవి.

అద్దిర శ్రీభూనీళలు
ముద్దియ లా హరికి గలరు ముగురమ్మలలో
పెద్దమ్మ నాట్య మాడెను
దిద్దిమ్మని వత్సవాయి తిమ్మని యింటన్.

అంటే విష్ణుమూర్తికి లక్ష్మీదేవి, భూదేవి, నీలాదేవి-ముగ్గురు భార్యలు. వారిలో పెద్దమ్మ అంటే లక్ష్మీదేవి తిమ్మ మహీపతి ఇంట్లో నర్తనమాడింది. అంటే సిరిసంపదలు తాండవిస్తాయి-అని భావం.

కాని ఆ పద్యంలో మొదట కోపంతో చెప్పిన దాని ప్రభావం పూర్తిగా పోక ఆ తరం దాటగానే, తిమ్మ జగపతి మనుమని కాలం నాటికి ఆ రాజ్యం భ్రష్టమైపోయిందని చెప్పుకుంటారు. కవుల వాక్కులకు అంత ప్రభావం ఉన్న రోజులవి.

రామకవి మంచి శృంగారి. రసికుడు. వేశ్యాప్రియుడు. ఆ విషయాన్ని దాచుకోటానికి కూడా ఆయన ప్రయత్నం చేయలేదు. ఆ కాలంలో వాళ్ళు నిర్భీకులు. దొంగచాటుగా కాక, ఏది చేసినా ధైర్యంగా

చేసేవారు. చేసింది చెప్పేవారు. గేదగి గంగి అనే కాంత నల్లగా ఉండేది. కాని గొప్ప శృంగారచతుర. ఆమెను గూర్చి రామకవి ఇలా అన్నాడు.

చూడగ నల్పుగాని పరిశోభిత దివ్యకురంగనాభ మే
జాడను రాజ యోగ్యమగు జవ్వని నల్లని మేని కంచు తో
డాడగ రాదుగా! రతి రహస్య మెరింగిన చిత్ర సంభవ
క్రీడల తేలి చూడవలె గేదగి గంగి విచిత్ర వైఖరుల్.

నల్లగా ఉంటేనేం రతి రహస్య మెరిగిన కాంతయైతే? కస్తూరి నల్లగా లేదా? దాని సుగంధానికేమి లోటు? అయితే గంగిని నల్లగా చేయటం బ్రహ్మచేసిన పొరపాటు. ఇటువంటి తప్పులు ఒకటి రెండు చేశాడు విధాత. అందుకే ఆ దేవునికి లోకంలో పూజ్యత లేకుండాపోయింది అంటాడు రామకవి. ఆ రోజుల్లో స్త్రీ పాత్ర ధరించి అద్భుతంగా నటించే భాగోతుల బుచ్చిగాడనే నటునికి మన్మథ మందిరం ఏర్పాటుచేయకపోవటం, పెండెల నాగి అనే సౌందర్యవతికి మర్మజాతసంఘాతాలుంచటమూ నట!

భూతల మందు ధాతకు నపూజ్యత గల్గెను రెంట మూట-భా
గోతుల బుచ్చిగానికొక కొంచె మనంగ గృహంబు సేయమిన్
భీతకురంగ నేత్రయగు పెండెల నాగికి మర్మజాత సం
ఘాతము లుంచినందుకును, గంగిని నల్పొనరించి నందుకున్.

పంటలు సరిగా పండక, రాజుల దగ్గరికి యాచించటానికి పోవలసి వచ్చినపుడు బాధపడుతూ చెప్పిన పద్యం చూడండి!

పెండెల నాగి కొప్పువయి. పెద్ది కటిస్థలి-గంగి గుబ్బ చ
న్గొండలనుండు రామకవి కుంజరు హస్తము క్రిందు సేసె హా!
పండక బంటుమిల్లి- అది పండిననీ కసుమాల ధారుణీ
మండల నాథుబోలు నొక మానవమాత్రుని వేడబోవునే!

ఆయన చేయి పెండెల నాగి కొప్పుల మీద, పెద్ది నడుము మీద, గంగి స్తనాల మీద విహరించేది. అటువంటిది మరొకరి దగ్గర చావలసి వచ్చి కిందైంది. ఎంతటి కష్టం!

పోతనగారు భాగవతంలో బలిచక్రవర్తిని మూడడుగుల నేలయాచింప వచ్చిన విష్ణువు చేతిని వర్ణిస్తూ చెప్పిన ఈ కింది పద్యం రామకవిగారికి ప్రేరకమై ఉండవచ్చు.

ఆదిన్ శ్రీసతి కొప్పుపై తనువుపై నంసోత్తరీయంబుపై
పాదాబ్జంబులపై కపోలతటిపై పాలిండ్లపై నూత్నమ
ర్యాదం జెందు కరంబు క్రిందగుట మీదై నా కరంబుంట మేల్
గాదె ! రాజ్యము గీజ్యమున్ సతతమే కాయంబు నాపాయమే!

లక్ష్మీదేవి శరీరంమీద కొత్త మర్యాదలు చెందే హరి హస్తం నా దగ్గర కింద కావటం కంటే అదృష్ట మేముంది-అనుకున్నాడు బలి. బహుస్త్రీల తనువులపైన విహరించే నా చేయి ఇంకొకరి దగ్గర కింద కావలసి వచ్చిందిగదా అని బాధపడ్డాడు రామకవి. అయితే దాత లేమనుకొన్నారో! తిమ్మజగపతిలాగా తిట్లే తిన్నారో, లేక ఆ కవి అడగటమే అదృష్టంగా భావించారో?

## తప్పెవరిది?

కవి సమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారు అప్పుడప్పుడు సంభాషణ వశాన చెప్పినవి, సభల్లో చెప్పినవి కొన్ని చాటువులు కొందరు సేకరించారు. అవి చాలా చమత్కారం సుందరంగా భాసిస్తున్నాయి. ఆధునిక కాలంలో కాస్త క్లిష్టంగా పాండిత్య స్ఫోరకంగా రచించినా విమర్శిస్తున్నారనీ, పూర్వకాలంలో అలా ఉండేది గాదనీ, అంటూ ఈ పద్యం చెప్పారు.

తొలి నాళుల శబ్దార్థము
తెలియనిచో పాఠకునిది తెలియమి యీ నా
ళుల వ్రాసిన కవి దోషము
కలి ముదిరిన కొలది వింతగతులను వెలయున్.

వెనకటి రోజుల్లో ఏదన్నా ఒక పద్యానికో, పదానికో అర్థం తెలియకపోతే పాఠకుడు అపండితుని కింద లెక్క. తెలుసుకోటానికి ప్రయత్నం జరిగేది. ఈ రోజుల్లో అలా కాదు. తమ కర్థం కాకుండా రాయటం కవి దోషమని అధునాతనులంటున్నారు. కలి ముదిరిన కొద్దీ వింతలు పుడుతున్నాయి సుమా!

1948లో శశిదూతమనే కావ్యాన్ని విశ్వనాథవారు బందాకనక లింగేశ్వరరావుగారికి అంకితం చేశారు. కృతి తీసుకొన్న బందావారు కవిసమ్రాట్టుకు అయిదు సువర్ణ పుష్పాలు బహూకరించారు. ఆ పుష్పాలను తాను ఉంచుకోకుండా సత్యనారాయణగారు-ఆ సభలోనే ఆ సీనులై ఉన్న తమ గురువర్యులు చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారికి సమర్పిస్తూ, చంపకోత్పల ఛందస్సులో అయిదుసార్లు నమస్సులు సమర్పించారు. వాటిని చూడండి.

1. ప్రవిమలమైన చెళ్ళపిళ వంగసమన్ నునుపాలవెల్లి కా
లువకను చందమామ! కవిలోక మహాగురవే నమోనమః

పరిశుద్ధమైన చెళ్ళపిళ్ళ వంశమనే పాలసముద్రంలో పుట్టిన చందమామా! కవిలోక మహాగురూ! నమస్కారం.

2. తొలి తుదిరేక మెత్తనలు దూసిన సోగ తెనుంగులే పదా
లు వెలలు తేనెవాక! కవిలోక మహాగురవే నమోనమః

ఆద్యంత మృదుమధురాలైన తెనుగు పదాలు తొణికసలాడే మధు ప్రవాహమా! కవిలోకపు గొప్ప గురువా! నమస్కారం.

3. తొలి కవులెల్ల కష్టపడి తూచిన యెల్ల పదార్థముల్ కడున్
సులభము గాగ చూరగొను శుద్ధ మహామతయే నమోనమః

ఆదికవులు కష్టపడి తూచిన మహా పదార్థాలను ఏమాత్రమూ కష్టం లేకుండా ఎంతో సులభంగా దోచుకొన్న నిర్మల మహాబుద్ధికి నమస్కారం.

4. తలచిన యెల్ల శబ్దమును తానును మెత్తని రూపమూని మం
జులమయి సేవ చేసెడు విశుద్ధ మహావచసే నమోనమః

తలచిన ప్రతి శబ్దమూ మృదులాకృతి దాల్చి సేవచేసే నిర్మల మహావాక్కుగల వానికి నమస్కారం.

5. కోనలలోన మిన్నొలయు కొండలలోన హిమాంబుదాళిలో
కానలలో వినిర్భరముగా ప్రవహించెడు నాంధ్ర శారదా
నూనసురాపగన్ మృదుల నూతన సాధు సమప్రసార ధా
రానతరేఖ దీర్చిన ధురా ప్రతిభానిధయే నమోనమః

కొండల్లో , కోనల్లో, కానల్లో పారుతున్న ఆంధ్ర శారదా గంగను నూతన సాధు సమతలంలో ప్రవహింపజేసిన మహా ప్రతిభానిధికి నమస్కారం. క్షీణప్రబంధ యుగంలో క్షుద్ర కావ్య నిర్మాణాల గందరగోళాల మధ్య కొట్టుమిట్టాడుతున్న తెలుగు కవిత్వాన్ని కొత్త మలుపు తిప్పి నూతన యుగస్రష్టయైన మహాకవికి నమస్కారం.

ఈ అందమైన మెత్తని పద్య పుష్పాలను గురువుగారి పాదాలకు సమర్పించి ధన్యులైనారు విశ్వనాథ. వీటిలో సాధారణంకాని మణి ప్రవాళ పద్ధతి ఉండటం గమనించదగిన అంశం.

గురువుగారిని గూర్చి ఇతర సందర్భాలలో కూడా భక్తి భరితాలైన పద్యాలు రచించిన సందర్భాలున్నాయి. చూడండి!

పుడమిని లేరె సత్కవులు పుట్టిరి ముట్టిరి సత్కవిత్వం పుం
దొడిమలు చెళ్ళపిళ్ళ కవితో తులతూగెడివారె? వానలో
దడియని వారు మద్గురు వధానమృదూక్తి మరంద ధారలో
కడుగని వారు మా కెచట కానగ రారిల తెన్గు నాడునన్.

పృథివిలో ఎందరు సత్కవులు లేరు! అయితే వారంతా కవితా ఫలపు తొడిమలు ముట్టినవారే! వారు చెళ్ళపిళ్ళ కవితో తులతూగగలరా? వానలో తడియనివారు, మా గురువుగారి అవధానపు మెత్తని మాటల తేనెధారలో కడగని వారు (ఏమి?) మా కీ తెనుగునాడున కనబడరు.

అంతేకాదు. కాళీపాద మంజీర నాదా లాదేశించగా చెళ్ళపిళ్ళ వారు శబ్ద సముద్రాన్ని బంధించటానికి పూనుకొనేప్పటికి కాకవులు మీదు కిందైనారట. కవులు లేత తూండ్లవలె నీరసించిపోయారట. పరికించండి-

మీదై క్రిందయినారు కాకవులు సామీచీన్య పథ్యాగ తుం
డై దూరీకృత శత్రువై మరియు తానై కైత కొగ్గన్ కవుల్
లేదూండ్లంబలె నీరసింపడిరి కాళీపాద మంజీర నా
దాదేశంబున మద్గురూత్తముడు శబ్దాంభోధి బంధించుచోన్.

వేంకటశాస్త్రిగారి శిష్య వాత్సల్యం, మెత్తని స్వభావం, శత్రువులను ప్రతారించగల తీవ్రప్రతిభ, మహిత కీర్తి చూసి ఎక్కడో చదువుకొన్నవారు కూడా కొద్ది రోజులు వారి దగ్గర శుశ్రూష చేసి వారి శిష్యుల మనిపించుకోటానికి మోజు పడేవారు. ఆ విషయాన్ని విశ్వనాథవారు రామాయణ కల్పవృక్షంలో ఇలా చెప్పారు.

తన యెదయెల్ల మెత్తన కృత ప్రతి పద్యము నంతకంటె మె
త్తన తన శిష్యులన్న నెడదంగల ప్రేముడి చెప్పలేని మె
త్తన యయి శత్రు పర్వత శతారము సత్కని చెళ్ళపిళ్ళ వేం
కన గురువంచు చెప్పుకొనగా నది గొప్ప తెనుంగు నాడునన్.

## తొలినియోగులు!

కొప్పరపు సోదర కవులు వేంకట సుబ్బరాయ కవి, వెంకట రమణ కవి సాహిత్య రంగంలో జైత్రయాత్ర కొనసాగించి అద్భుత వైభవంతో ప్రకాశించారు. వారిద్దరి కుమారులు సీతారామ ప్రసాదరావు, మల్లికార్జునరావు కూడా జంట కవులై కొంతకాలం అవధానాశుకవితా ప్రదర్శనలు నిర్వహించి సెభాషనిపించుకొన్నారు. తండ్రుల కాలంనాడు విరోధాలున్నా తరువాత ఆ విరోధాలు పోయాయి. కుమార సోదర కవుల అష్టావధానానికి 1943 సంక్రాంతినాడు విజయవాడ త్రిలింగ విద్యాపీఠంలో-శ్రీ చెళ్ళపిళ్ల వెంకటశాస్త్రిగారు అధ్యక్షత వహించి నడిపించారు. ఆశీర్వచన పూర్వకంగా వారు చెప్పిన మొదటి పద్యమిది.

అప్పరమేశ్వరీ కరుణ అండగ నుండె సదస్యు లన్ననో
ఒప్పులకుప్పలై తనరు నుత్తము లష్టవధాన కృత్యమున్
తప్పక చేయ మీ కమరె దక్షత సంశయమంద నేటికిన్
కొప్పరపుం గవీశ్వరుల కూరిమి నందనులారా! లెం డికన్.

జగన్మాత దయ ఉంది. సభ్యులు మంచివారు. మీ కా అవధానం బాగా చేయగల నేర్పుంది. ఇంక సందేహం దేనికి? కుమార కవులారా, లెండి-అని చెళ్ళపిళ్ళ వారన్న తరువాత ఇద్దరు కవులూ అష్టావధానం క్లిష్ట కష్టాలను దాటి సులువుగా సుమహితధారణామోదంగా, సూక్తి సురభిళంగా చేసి సదస్యులకు ఆశ్చర్యానందాలు కలిగించారు. అప్పుడు వేంకటశాస్త్రిగారు ఎంతో సంతోషించి మళ్ళీ రెండు పద్యాలు చెప్పారు.

కొప్పరమన్న గోపురము గోపురమన్నను వాఙ్మ వాస మీ
ఒప్పులకుప్ప లిద్దరు నయోన్నతులందు జనించినారు వి
ద్యాప్పుతులైన సత్కవుల ఆదృతి గాంచి యశంబుచే దిశల్
గప్పుచు వృద్ధి నందెదరుగాత చిరాయువు తోడు నీడగన్.
అంబా ! శాంభవి! యీ కుమార కవు లత్యంతాశుధారన్ కవి
త్వంబున్ ధాటిగ జెప్పి నేటి కవి విద్వద్గోష్ఠి అష్టావధా
నంబున్ దిగ్విజయంబుగా సలిపి మాన్యత్ప్రపాలోక పా
త్రంబుల్‌గా జరిగించినార లవుగాతన్ వీరికిన్ శ్రేయముల్.

కొప్పరమంటే గోపురం. గో-పురం అంటే హక్కులకు నివాసం. ఈ ఇద్దరు సద్గుణరాసులు అక్కడ పుట్టారు. విద్యావారిధుల ఆదరాశీస్సులతో కీర్తి దిక్కుల నిండా వ్యాపించగా చిరాయువుతో వర్ధిల్లెదరు గాక!

అమ్మా. కామేశ్వరీ, ఈ కుమార సోదర కవులు మంచి ధాటిగా ఆశుకవిత్వం చెప్పి పండితులు మెచ్చుకొనే విధంగా అష్టావధానం విజయవంతంగా చేశారు. నీ దయకు పాత్రులైన వీ రిద్దరికీ శుభాలు కలుగుగాక!

అదే సభలో పృచ్ఛకులలో ఒకరుగా ఉన్న శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు పొంగిపోయి, ఈ విధంగా ప్రశంసా పద్యాలు చెప్పారు.

తొలి నియోగులు సిసలైన తెలుగు కవులు
తెలియ పలనాడు చక్కని తెలుగు గడ్డ
ఆశుకవనంబు మీ యింటి ఆడుబిడ్డ
నేను దీవన లిత్తు నెన్నేని మీకు.
ఎంతకాలంబు నుండియో యేగుదెంచు
పండితుల పుత్రుకుల కపప్రధ యొకండు
కాని యీ బాల సోదర కవులు దాని
తొలజేసిరి మిగుల సంతోషమయ్యె.
నిలువక యేకధాటి ధరణింబడు గంగను మౌళి యందునన్
నిలుపగ జాలె శంకరుడు నీరధి భంగపుటంప కోలలన్
చెలియ కట్ట ఆగె కవిశేఖరులారా! భవద్వచస్సుధా
సలలిత వాహినీ గమన చాలన మాపగ సృష్టి లేదుగా!

వీటిల్లో మొదటి పద్యం కొంత వివాదాస్పదమైంది. తొలి నియోగులు సిసలైన తెలుగు కవులు అంటే ఆ వాక్యం వరకూ అందంగానే ఉంది కాని, తరువాతివారు కాదా అనే విమర్శ వచ్చింది. దానికి విశ్వనాథవారు రెండు రకాల అర్థాలు చెప్పారట. ఒకటి తొలి నియోగులు అన్న మాట తొలినుంచి అని పంచమీ విభక్త్యర్థం చెప్పాలని, రెండవది-ఆంధ్ర సాహిత్యంలో ఆద్యులైన నన్నయాదులు వైదిక హృదయులై సంస్కృతమంటే ఎక్కువ ప్రీతి చూపేవారు. వారి కవిత్వంలో గీర్వాణం ముదిరి ఉంటుంది. మరి నియోగులైన తిక్కనాదు లా విధంగా కాక సిసలైన జాను తెనుగుకు ఎక్కువ ప్రాధాన్యం ఇచ్చారు. వైదిక నియోగుల కవిత్వాలలో ఆ వార కనిపిస్తూనే ఉంది. ఉన్న మాటకు ఉలుక్కోకపోతే యదార్థమిది. బహువన పాదపాబ్దికుల పర్వతపూర్ణ సరస్సరస్వతీ సహిత-వైఖరి తిక్కన వైఖరి కాదు. ఆ తెనుగు మీరిన వచోమార్గం నియోగులది. అది కొప్పవరపు వారి పంథా. అందుకే వారు తిరుపతి వెంకట కవులను -

ఆంధ్రమున నిన్ని యిన్ని పద్యంబులన్న
ఇంత కాలంబులో నన్న నిందరన్న
నిట్టి వర్ణోత్కరం బన్న నేమి వెరవు
తెనుగు మీసంబు నిలుపంగ దివురుడయ్యె!

అని నిలదీయగలిగారు. ఈ కుమార సోదర కవులలో కూడా ఆ తెలుగు ధాటి కనిపిస్తున్నది- అని-

పండిత పుత్రులు శుంఠలని నానుడి. ఆ చెడ్డ పేరు రాకుండా ఈ జంట కవులు తండ్రుల గౌరవాన్ని కీర్తినీ నిలబెట్టారు. చాలా సంతోషమైంది. నేలమీదికి దూకే గంగను తన శిరసున ఆపాడు శివుడు, పొంగి వచ్చే సముద్రాన్ని చెల్లెలి కట్ట ఆపుతున్నది. కానీ మీ కవితా వాహినీ గమనాన్ని ఆపగల సృష్టి లేదు. ఆశుకవనం నిజంగా మీ ఇంటి ఆడుబిడ్డ.

విశ్వనాథ వారు ఇంతగా మెచ్చుకోవటం సామాన్యమైన విషయం కాదు. కుమార సోదర కవుల వీర విజృంభణం అంత అనుపమానంగా ఉండేది. అయితే విధియోగం సరిగా లేక వారిలో ఒకరైన

మల్లికార్జునరావు కొద్ది కాలానికే మరణించాడు. తరువాత సుమారు నలభై సంవత్సరాలు సీతారామప్రసాద కవి ఒక్కడే-అవధానాశుకవితా సభలు చేస్తూ తండ్రుల గౌరవాన్ని నిలబెట్టాడు. 1989వ సంవత్సరంలో గుంటూరు, హైదరాబాదు, విజయవాడ మొదలైన ప్రదేశాల్లో శ్రీనాథపీఠం వారు జరిపిన కొప్పవరపు సోదరకవుల శతజయంతి సభల్లో ఇతను చూపిన ఆశుకవితా విన్యాసం అత్యద్భుతమై వెనుకటి రోజులను గుర్తుకు తెచ్చింది. సీతారామ ప్రసాద కవి కూడా ఆ సభల తరువాత కీర్తిశేషులై ఆశుకవితా రంగాన్ని విచార జలధిలో ముంచారు.

## మాది మాకు ఇస్తే ...?!

ఉత్తర హరివంశ కర్త నాచన సోమనాథుని కవితా పాటవం అసామాన్యమైనది. అయితే ఆయన చాటువు లంతగా ప్రసిద్ధి చెందలేదు. పండిత రావూరి ఆదినారాయణ శాస్త్రిగారు తెలిపినట్లుగా డా. జి. లలిత చక్కని పద్యం ప్రకటించారు. విద్వత్ప్రభువైన అనవేమారెడ్డిని సంవత్సరానికొకసారి సోమన దర్శించి ఒక పద్యం చెప్పి సన్మానం అందుకొనే వాడట! నిత్యాశ్రితులైన కవుల కిది కన్నెర్రగా ఉండి రాజు కతనిమీద లేనిపోని కొండేలు చెప్పారు. విని విని ఒకసారి రాజు సోమనకు కబురు చేశారు. అప్పటికి ఎనిమిది నెలలైంది. సోముడు రాజదర్శనం చేసి రాజాజ్ఞ ప్రకారం వచ్చి తన కవితా ప్రాభవాన్ని ప్రదర్శిస్తూ ఒక కందంలో కొంత భాగం చెప్పి మిగతా భాగాన్ని అక్కడి కవులను పూరించమని, నాలుగు నెలల తరువాత తాను వచ్చి విజయదశమినాడు మిగతా భాగాన్ని పూరిస్తాననీ చెప్పి వెళ్ళిపోయాడు.

కొంచెపు జగముల లోపల
సంచితముగ నీదు కీర్తి అనవేమ నృపా!
మించెను ...

అనవేముడు తమ గొప్పలు చెప్పుకొన్న కవులను పద్యం పూర్తి చేయమని అడిగితే వారు చేయలేకపోయారట! చేయలేకపోయినారనటం కంటె ఆ చేసినవి రాజుకు నచ్చి ఉండవు. విజయదశమినాడు వచ్చి పూరించిన సోమన పూరణంత అందంగా ఉండి ఉండవు. సోమన పూరణ ఇది-

కొంచెపు జగముల లోపల
అంచితముగ నీదు కీర్తి అనవేను నృపా!
మించెను కరి ముకురంబున
పంచాక్షరి శివుడు హరిం(బ్రపంచము వోలెన్.

చాటు పద్య మణిమంజరిలో "పంచాక్షరిలోన శివుడు బలసిన భంగిన్" అని అజ్ఞాత కర్తృకంగా ఉంది. అద్దంలో ఏనుగు ఉన్నట్లుగా, పంచాక్షర మంత్రంలో శివుడున్నట్లుగా, విష్ణువులో ప్రపంచం ఉన్నట్లుగా ఈ కొంచెపు లోకాలలో నీ కీర్తి మించింది అని చక్కని ఉపమానాలతో, అనవేముని యశస్సు గొప్ప తననాన్ని అభివర్ణించాడు సోమన్న.

సోమన్నదో లేక మరెవ్వరిదో గాని, అనవేమ భూపాలుని గురించి ప్రసిద్ధమైన అనుష్టుప్ శ్లోక మొకటి రమణీయ కథా ప్రచురమైంది.

అనవేమ మహీపాల!
స్వస్త్యస్తు తన బాహవే
ఆహవే రిపుదోర్దండ
చంద్రమండల రాహవే.

అనవేమ భూపాలా! యుద్ధంలో శత్రువుల భుజదండమనే చంద్రమండలానికి రాహువు వంటిదైన నీ బాహువునకు స్వస్తి-అని శ్లోకార్థం. అయితే అర్థ సౌందర్యాన్ని బట్టి గాక శబ్ద విశిష్టతను బట్టి దీని కొక గొప్పతనం ఏర్పడింది.

ఈ శ్లోకం- వినగానే రాజు సంతోషించి కవికి వేయి నూట పదహారు బంగారు నాణేలు పళ్ళెంలో ఉంచి బహూకరించాడట! ఆ పళ్లెం చూసి అసంతృప్తిని కొంచెం వ్యక్తం చేశాడు కవి. అది గ్రహించిన రాజు మరొక వేయి నాణేలు తెప్పించి పళ్ళెంలో పోయించి తీసుకోమన్నాడు.

కవి నవ్వుతూ "మహారాజా! నేను మీకు నాలుగు వే లిచ్చాను. మీ రంతకు తక్కువ ఇస్తే బాగుంటుందా?" అన్నాడు.

రాజు ఆశ్చర్యపడి "అదేమి" టన్నాడు.

"పాదానికొక 'వే' చొప్పున నాలుగు పాదాలలో నాలుగు 'వే'లు ఇచ్చాను గదా" అన్నాడు కవి. అప్పుడు రాజతని చమత్కారానికి సంతోషించి నాలుగువేల నాణేలు తీసుకోమన్నాడు. కవి "మళ్ళీ మాది మా కివ్వడమేనా?" అని ప్రశ్నార్థకంగా పలికాడు. అతని చాతుర్యానికి ముగ్ధడవుతున్న ప్రభువు అయిదు వేల నాణేలు ఇప్పించాడు. అదీ అందకోక "మేము ఆరు వేల వారం రాజా, మా గౌరవాన్ని మీరు నిలబెట్టవద్దా?" అన్నాడు కవి. ఆరు వేల నాణేలు తెప్పించి "మళ్ళీ మాది మాకే ఇస్తున్నారా అంటాడేమో" అని, ఇంకో వెయ్యి తెప్పించి తీసుకోమన్నాడు మహారాజు.

"మహాప్రభూ! ఏడు రోదన సంఖ్య గదండీ" అని నసిగాడు కవి. అనవేమారెడ్డి అతని క్షణ క్షణ చాతుర్యానికి సంతోషించి ఎనిమిది వేల బంగారు నాణేలు బహూకరించాడట. ఆ విద్వాంసుడూ ఆనందంగా స్వీకరించాడట. ఆనాటి కవుల కవితా విన్యాసాలు, కవితా ప్రియులైన రాజుల దాతృత్వ విలాసాలు ఆవిధంగా ఉండేవి.

పొత్తపి వెంకటరమణ కవి తన లక్షణ శిరోమణిలో సోమన చాటు వొకటి ఉదాహరించాడు.

కవితా కన్యక కెందును
కవి జనకుడు బట్టుదాది గణుతింపంగా
నవరస రసికుడె పెనిమిటి
యవివేకియె తోడబుట్టు వనవేమ నృపా!

కవితా బాలకు కవి తండ్రి. ఎత్తుకొని పదిచోట్ల తిప్పి ప్రకాశితం చేసే భట్టు దాది వంటివాడు. అనుభవించే సహృదయుడు, శృంగారాది నవరసానుభవ యోగ్యుడు భర్త. అవివేకి తోడబుట్టువు వంటివాడు.

కవిత్వంలో ఉండే గుణాన్ని దాన్ని.రచించిన రచయిత కంటే అనుభవించే రసికుడే ఎక్కువగా తెలుసుకోగలడనటానికి పై పద్యం వంటిదే మరొక ప్రసిద్ధ చాటువు ఉంది.

కవితా కన్యక గుణములు
కవి కన్న రసజ్ఞుడెరుగు కవి యే మెరుగున్?
భువిలో కన్యక గుణములు
ధవు డెరుగును గాక కన్న తండ్రే మెరుగున్ ?

కవిత్వం రుచి కవి కంటే రసికుడి కెక్కువ తెలుస్తుంది. లోకంలో కన్యక సౌందర్యం, రుచి ఆమెను కన్న తండ్రి కేమి తెలుస్తుంది? ఆమెను అనుభవించే భర్తకు తెలుస్తుంది గాని. సోముడు చేసిన దైవస్తుతి చాటు వొకదాన్ని వేటూరి వారు సేకరించారు.

ఆపాద శిరోలంకా
రాపాదిత చారుతాభి రామాత్మీయా
రూపాలోకనతుష్టా
రూపార కుమారికా ముకురమణీ రాజా!

సర్వాంగాలంకార సుందరుడు, జలనిధి పుత్రికా హృదయ వల్లభుడు-అయిన శ్రీ విష్ణువును స్తుతించే ఈ చిన్ని పద్యంలో నాచన సోమనాథుని శిల్పవైచిత్రి కొంత గోచరిస్తూనే ఉంది.

## వేణీవిలాసమ్ !

తెనాలి రామకృష్ణుని గురించి చమత్కార కథలెన్నో వినిపిస్తుంటవి. అందులో కొన్ని అశ్లీలాలు కూడా. కవితారమ్యాలైన కొన్ని గాథలు లలిత శృంగార సుందరమై భాసిస్తున్నాయి. అవి నిజానికెవరివైనా తెనాలి కవివనుకోవటం కవితా సత్యమై ఇంపు కూరుస్తున్నది.

రాయలవారికి ఒక వేశ్య అంటే వల్లమాలిన మమకారమట! ఆమె మనోవాక్కాయ కర్మలా తన కంకితమైన పరమ పతివ్రత అని ఆయన నమ్మకం. ఆ నమ్మకం తప్పనీ, ఆ ప్రభువు కన్నులు తెరిపించాలనీ అంతఃపురకాంతలకూ, మంత్రులకూ పట్టుదల. తెనాలి కవికే ఈ పని అప్పగించారు. అతనూ అంగీకరించి ఆ వేశ్య అనుపానులన్నీ పరిశోధించాడు. హిమాలయం నుంచి దిగివచ్చిన జడధారివేషం కట్టాడు. వేశ్యమాతకు ఈ యోగి మహానుభావుడనీ, సువర్ణయోగ సిద్ధుడనీ విశ్వాసం కలిగే విధంగా తగినవారిచేత కబురందేలా చూశాడు.

ఇంకేముంది? వేశ్యమాత పాదాక్రాంతురాలైంది. తమ ఇంటికి రావలసిందిగా, సేవలందుకోవలసిందిగా ప్రార్థించింది. ఎంతో బలవంతంమీద ఒప్పుకొన్నట్లు నటించి వారి ఇంటికి చేరి రేవిడీ వేశాడు. ఎంతవారలైనా కాంతదాసులే అని వేశ్యమాత విశ్వాసం. జడధారిని వశం చేసుకొని బంగారం చేసే విద్య నేర్చుకోవటం కోసం యౌవనవతియైన కూతురిని వినియోగించింది.

రాయలవారు వచ్చే వేళల్లో మాత్రం అంతా జాగ్రత్తగా ఉండేవారు. జడధారి తన గది దాటి బయటకు వచ్చేవాడు కాదు. వేశ్య రాయలవారిని సేవిస్తూ ఆయనకు భోగసుఖాలిస్తూ ఉండేది. ఆయన లేనప్పుడు యోగికి సేవ చేసేది. ఏమైనా సరే స్వర్ణయోగం సాధించాలని వేశ్య మాత కూతురుకు గట్టిగా చెప్పింది. దాంతో ఆ వారంగన సేవ చేస్తున్నట్లు నటిస్తూ పైట జార్చి, అవయవ ప్రదర్శన చేసి జడధారిని రెచ్చగొట్టడానికి ప్రయత్నించింది. జడధారికి కావలసిందే అది. తాను కామోద్రేకం చెందుతున్నట్లు నటిస్తూ ఆమెను కౌగిలించుకొన్నాడు. ఆ గడ్డం, జడలు, ఒంటిమీద బూడిద ఆమెకు దుర్భరమై చప్పున

వెనుకకు తిరిగింది-భారతంలో వ్యాసుని చూసి వికారపడిన అంబికలా.

కవిల గడ్డంబును కవిల జడలును కవిల కన్నులును
దవినా యన్నువ వల్లనైన వికృతపు తనువును జూచి
ఉవిద కన్నుంగవ మొగిచి భయముననుండె

అన్న స్థితిలో పడింది వేశ్య. తప్పకపోతే శరీరాన్ని అప్పగించి కళ్ళు మూసుకొందామని నిర్ణయించుకొంది. అయితే వెనుకకు తిరిగిన ఆ సుకుమార వార వనితను చూసి నవ్వుతూ తెనాలి రామయ్య ఆశువుగా ఈ పద్యం చెప్పాడు.

వరబింబాధరమున్ పయోధరములున్ వక్రాలకంబుల్ మనో
హరలోలాక్షులు చూప కవ్వలిమొగంబైనంత నేనూయెనే
గురు భాస్వజ్జఘనంబు క్రొమ్ముడియు మాకుంజాలవే గంగకి
ద్దరి మేలిద్దరి కీడునుం గలదె యుద్యద్రాజ బింబాననా!

దొండపండువంటి పెదవి,ఉన్నత స్తనాలు, ఉంగరాలు తిరిగిన ముంగురులు, మనసును దోచుకునే కన్నులు చూపించక అటువైపు మొహం తిప్పుకుంటే మాత్రమేమిటి? నీ పెద్ద జఘనభాగం, క్రొమ్ముడి మాకు చాలవా? మునగదలచుకొన్నవాడికి గంగకు ఆవైపైతే మేలు, ఈ వైపైతే కీడు అని ఉంటుందా? ఎటువైపైనా-ముందైనా,వెనకైనా ఒకటే-అని దాని భావం.

పద్యమూ, గొంతు వినగానే తెనాలి కవిని పోల్చుకొని గాభరాపడింది వేశ్య. గబగబా ఇంట్లోకి వెళ్ళిపోయింది. ఇతగాడూ దొంగగడ్డం, జడలూ అక్కడ పడేసి ఇంటికి చేరుకున్నాడు.

మరునాడు రాయల కొలువులో "గంగకద్దరి మేలిద్దరి కీడునుం గలదె యుద్యద్రాజ బింబాననా' ' అని సమస్య ఇచ్చాడు. ఎవరెవరో ఎలానో పూరించి ఉంటారు. రాయలవారు ఇతన్ని కూడా పూరించమన్నాడు. రామకృష్ణుడు పూరించాడు. విని మెచ్చుకొని "అసలు ఈ సమస్య ఎక్కడిది? ఈ పూరణమేమిటి"? అని అడిగాడు.

"ప్రభూ! ఇది స్వర్ణయోగ చింతామణిలో యోగి భోగినీ సంవాద సందర్భంలోనిది" అని మనవి చేసి కథను వివరించాడు. దానిమీదట రాయలవారా వేశ్యమీది మోజు వదులుకొన్నారని కథ.

ఏదైనా స్త్రీ వెనుక భాగానికి గల ప్రాధాన్యాన్ని ఇంత అందంగా చెప్పిన వారు లేరు. ఒకసారి తిరుపతి వేంకట కవుల చేత అవధానం చేయించిన గద్వాల రాజావారు 'స్త్రీలకు రతి క్రీడకుపకరించే భాగాలన్నీ ముందుభాగంలో ఉండి ఒక్క జడ మాత్రం వెనుకవైపు ఉండటంలోని విశేషమేమి'టని అడిగారు. దానికి జంటకవులిచ్చిన పద్యోత్తరం చూడండి.

పురుషాయితమొనర్చు పూబోడి కటిమీద నాట్యమ్ము నలుపు పుణ్యమ్ము కొరకొ
ఘననితంబస్థలంబను పెన్నిధానంబు బహు భద్రముగను కాపాడుకొరకొ
తానాశ్రయించు కాంతకు వెన్కభాగమ్ము ననుగూడ సౌందర్యమునుపు కొరకొ
పదిమంది దృష్టులు పడిన కంటకమంచు నూహించి కనపడకుండు కొరకొ
వేణి కాంతల వెన్నంటి వ్రేలుచుండె లేక యుండిన నిధువనలీల కుపచ
రించునంగమ్ము లెదుటనే నంచునించ దానికట్లుండ నే యుపద్రవము వచ్చె?

స్త్రీలు పురుషాయితం చేసేప్పుడు నడుము మీద నాట్యం చేయటానికో, పిరుదులనే నిధిని

కాపాడటానికి నాగుబాము వలె ఉండటానికో, తానాశ్రయించిన స్త్రీ వెనుకవైపు కూడా సౌందర్యాన్ని ఉంచటానికో, ఎదురుగా ఉంటే దృష్టిదోషం తగులుతుందనో, వేణి వెనుకవైపున్నది అని చతురోక్తిమయమైన పద్యాన్ని అని అంతటితో ఆగక ఇంకా ఇలా ప్రవచించారు.

ఎదుటన్ వర్తిలునట్టి అంగముల కెంతేనిన్ నఖాదిక్షతా
పద పల్మారును గల్గు సంగతిని తా ప్రత్యక్షమున్ జూచి నె
మ్మదిలో భీతిలి చాటు చోటనుచు సంభావించి వెన్నంటుచున్
పొదలన్ బోలును వేణి లేకునికి దాముందుండ కట్టుండునే?

ఎదురుగా ఉన్న అవయవాలన్నింటికి దెబ్బలే, నఖక్షతాలు, దంతక్షతాలు మొదలైనవి. వాటిని చూస్తూ భయపడి ముందుంటే ఇటువంటి పోటుల కోర్చుకావాలె అని వెనుక జేరి ఉంటుంది వేణి. ఎందుకంటే ఏంగాని కవుల కల్పనలో, ఊహలలో ఊయలలూగింది జడ.

## నీడయువీడె !

చీనా దేశ సారస్వతంలో గేయ కవిత్వము, ఖండ కావ్యాలు ప్రాచీన కాలంనుండి విశిష్టాలు. చీనా కవితలోని విరహవేదనలు, విషాదచ్ఛాయలు విశ్వజనీనాలు - అంటూ కొన్ని చీనా చాటువులకు అనువాదాలను డా. నండూరి రామకృష్ణమాచార్య రచింపగా 'భారతి' వాటిని ప్రకటించింది.

క్రీ.శ.1100 ప్రాంతంలో జీవించిన హిసియాంగ్ అనే కవి చెప్పిన ఒక చాటువుకు అనువాద మిది-

కూడి గవాక్షకాంతులను కూర్చొనినారము రాత్రి నేను నా
నీడయు దీప మార్పితిని నిద్రకు వేళ యతిక్రమింప నా
నీడయు నన్ను వీడె గది నింపుచు చీకటి గ్రమ్మునంత ఏ
తోడును నీడ గాని దరితోచునె ధన్యతమోనిమగ్నకున్

ఒంటరితనంతో జీవితమే చీకటిగా బాధపడుతున్న ఒక ఏకాంత కాంత మనోవేదనను,ఈ పద్యంలో తాత్త్విక చింతనాంచితంగా అనూదితం చేశారు నండూరివారు. వెలుగుంటే వస్తువులకు నీడ ఉంటుంది. వెలుగు లేకపోతే అంతా చీకటే. బ్రతుకులో ఒంటరి అయి ఒక కిటికీ దగ్గర కూర్చుని. ఆలోచిస్తున్నది ఒక వనిత. నిద్రావేళ దాటిపోయింది. మనస్సుకు శాంతి ఉంటేగా నిద్ర రావటానికి? చివరకు దీప మార్పింది. ఇంతసేపూ తోడుగా తన నీడన్నా ఉంది. ఇప్పుడదీ లేదు. అంతా చీకటే. చీకటిలో మునిగిన జీవికి ఒక తోడూ నీడా ఎవరుంటారు? సున్నితమైన బాధాభరితమైన జీవవేదన కిది అద్భుతమైన ఉదాహరణ.

విశ్వనాథ సత్యనారాయణ మరణించిన తన భార్యకు గ్రంథాన్ని కృతినిస్తూ రచించిన ఈ పద్యంలో కూడా వెలుగు నీడల వేదనలు ధ్వనిస్తాయి.

నీ వొక పెద్ద వెల్గువయి నీ వెలుగారిన నాదు జీవిత
వ్యావృతి నీ కవిత్వమను నట్టి విచిత్రపు నీడ పారెనో
దేవి! అరుంధతీ ప్రముఖ దివ్యమహః పరిశీలమూర్తి! ఆ
నీ వెలుగు విచిత్రమయి నేటికి నీడలు పారజొచ్చెడిన్.

విశ్వనాథ వారికి వారి సతీమణి జీవితంలో పెద్ద వెలుగు. ఆ వెలుగు ఆరిపోయింది.అట్టి జీవితావరణంలో కవిత్వ మనే విచిత్రపు నీడ పారింది. వెలుగు ఆరిన తరువాత చీకటి ఉంటుంది గాని, నీడ ఎలా ఉంటుంది?- ఉన్నదని వారి భావన. భౌతికమైన వెలుగు ఆరింది కాని,ఆమె అరుంధతీ ప్రముఖ దివ్యమహః పరిశీలమూర్తి కావటం చేత ఆ పాతివ్రత్య దివ్యజ్యోతి వెలుగుల నీడ లిప్పటికి ప్రసరిస్తున్నాయి. ఆస్మృతులు అంత బలవత్తరమైనవి. ఆయన బ్రతుకుపైన ఆమె ముద్ర అంత ప్రగాఢమైనది. అంతరిక్షంలో శాశ్వతమైన అరుంధతీ నక్షత్రమూర్తిని ఉపమానంగా స్వీకరించడంలోనే ఆమె శాశ్వత దీప్తిని వ్యక్తీకరించారు సత్యనారాయణగారు.

ఛాయా పురుషోపాసకు
లౌయోగుల దర్శనమ్ము లద్భుతములు సూ
క్ష్మాయత విచిత్ర వర్ణ
శ్రీయుత దేహములు కర్మ చిత్రీకృతముల్ అని యోగ రహస్యాలను వివరిస్తాడొక కవి.

నీడను ఉపాసించటం ఒక విచిత్ర విద్య. ఒక ప్రత్యేకమైన సాధన మార్గంలో కృషి చేస్తున్న వారు తమ నీడ తమంత పొడుగున్నప్పుడు, ఆకాశంవైపు చూస్తే అంతరిక్షంలో ఒక మానవాకృతి దర్శన మిస్తుంది నీడలా, ఆ ఛాయాపురుషుని వైపు చూస్తూ ఉంటే కొన్నాళ్ళకు ఆ ఆకారం అతనితో మాట్లాడుతుంది. అనేక రహస్యాలు తెలియజేస్తుంది. తానే అతను. అతనే తాను. తన రూపమే అది. శ్రీ రామకృష్ణ పరమహంస జీవితచరిత్రలో ఇటువంటి విశేషమే ఒకటి గోచరిస్తుంది. ధ్యానం చేసేటప్పుడు కొన్నిసార్లు ఆయనకు తన శరీరంలో నుంచి తన వంటివాడే ఒకడు ఎదురుగా వచ్చి కూర్చుండేవాడట. ఏవేవో విషయాలు చెప్పేవాడట. అది ఒకానొక తపస్సిద్ధి సమాలబ్ధ దివ్యానుభవ విశేషం.

పై పద్యంలో మరి కొన్ని విశేషాలు కూడా ఉన్నాయి. ప్రతి మనిషికీ ఒక సూక్ష్మ శరీరం ఉంటుంది. 'ఏస్ట్రల్ బాడీ' అంటారు. ఆంగ్లంలో డాక్టర్ లోబ్సాంగ్ రాంపా దీన్ని గురించి చాలా విశేషాలు తన గ్రంథాల్లో ప్రచురించాడు. ఆవిధంగా సూక్ష్మ శరీరాలను చూడగల అంతర్దృష్టి సాధించిన వారు తమవే గాక, ఇతరులవి కూడా ఎన్నో విశేషాలు తెలుసుకోగలరు.

ఆ శరీరాలు రకరకాల రంగులు కలిగి ఉంటాయి. ఆ వర్ణాలను బట్టి గుణాలను తెలుసుకోవచ్చు. సాత్వికుల సూక్ష్మ శరీరాలు తెల్లగా, రాజసుల శరీరాలు ఎర్రగా, తామసుల శరీరాలు నల్లగా ఉంటాయి. అలాగే మిగతా వర్ణాలకు కూడా వివిధ గుణ సమ్మేళనం ఉంటుంది. "చాతుర్వర్ణ్యం మయాసృష్టం" అనే భగవద్గీతలోని వర్ణం ఈ సూక్ష్మ శరీరానిదే అని కొందరి వ్యాఖ్య. ఈ సూక్ష్మ శరీరాన్ని చూసిన యోగి ఆ శరీరం తాలూకు వ్యక్తి గుణగణాలను ప్రత్యక్షంగా తెలుసుకోగలడు. అంతేగాక ఆయా జీవుల కర్మానుభవాలు, ముందు సూక్ష్మ శరీరంమీద వ్యక్తమై తరువాత స్థూలంమీదికి వస్తాయి. అంటే ఉదాహరణకు ఒక కాలో/చెయ్యో విరిగే యోగమున్నవాడికి, ముందు సూక్ష్మదేహం మీద ఆ అవయవం విరిగి కనిపిస్తుంది. తరువాత భౌతికంగా ఏదో నిమిత్తాన్ని ఆశ్రయించి ఆ విరగటం జరుగుతుంది. మంచి గాని,చెడుగానీ ముందు ఆ శరీరంమీదకు వచ్చి గాని, స్థూలంమీదికి రాదు.

గీతలో కృష్ణుడు యుద్ధ ప్రారంభానికి ముందు కౌరవ సైన్యాన్ని చూపిస్తూ అర్జునునితో "మయైవేతే నిహతాః పూర్వమేవ"- అన్నాడు. బ్రతికి ఉన్న భీష్మ ద్రోణాదులను చూపి వీరంతా నాచేత ఇదివరకే మృతులయ్యారు అన్నాడు. దీని యోగశాస్త్ర పరమైన అర్థమేమిటంటే "కాలపురుషుడినైన

నేను వారి సూక్ష్మశరీరాలను ఖండించాను. పది రోజులైతే భీష్ముడు నీవు బాణాలు వేసినా వేయకపోయినా పడిపోతాడు, ఆ తరువాత అయిదు రోజులకు ద్రోణుడు- ఇక వరుసగా ఇతరులు- మరణించక తప్పదు. కనుక నిమిత్తమాత్రుడవై శత్రు సంహారం చెయ్యి" అని కృష్ణుడు బోధించాడన్న మాట.

అరవిందయోగి, శ్రీమాత, గణపతి ముని మొదలైన యోగుల సూక్ష్మశరీరాలు చేసిన శాక్తేయ విలాసాలు అత్యద్భుతాలు. పైకంద పద్యంలో ఇటువంటి విశేషార్థాలెన్నో భాసిస్తాయి. కవులు యోగులు కూడా అయినప్పుడు, ఏతాదృశ బహుళార్థ రహస్యాలు గల పద్యాలు ఉదయిస్తూ ఉంటాయి.

## సుమసౌరభం

హంపా విరూపాక్షస్వామి జడలలో అలంకరించిన ఆరగ్వధ ప్రసవాల- అంటే రేలపూల సౌరభ్యాలు, వేదాద్రి నరసింహస్వామి విశాల వక్షఃస్థలంమీద అలరే కలువపూవుల మాల గంధలహరి తనను ఉత్తేజితుణ్ణి చేశాయని కవిసార్వభౌముడైన శ్రీనాథుడు చెప్పిన పూలవల్ల, సుగంధాలవల్ల ప్రేరణ పొందని కవులు బహుశా లేరేమో. పర్షియన్ కవులందరూ గులాబీ పూలలో సౌందర్యాస్వాదన చేసినవారే. ప్రాచీన సంస్కృత కవులంతా పద్మానికి ఇచ్చిన ప్రాధాన్యం మరే పుష్పానికీ ఇవ్వలేదు.

"అరవింద వికాస మందహాసామ్,
స్ఫుర దిందీవర లోచనాభిరామామ్!
అరవింద సమాన సుందరాస్యామ్,
అరవిందాసన సుందరీమ్ ఉపాసే!!"

సరస్వతి చిరునవ్వులు వికసించిన తామరపూవులా ప్రకాశిస్తున్నాయి. ఆమె కనులు వికసించిన కలువల్లా ప్రకాశిస్తున్నాయి. ఆమె ముఖం తామరలా ఉంటుంది. ఆమె అరవిందాసనుడైన బ్రహ్మదేవుని ఇల్లాలు. పద్మం జ్ఞానానికే కాక ఐశ్వర్యానికి కూడా సంకేతం. అందుకే లక్ష్మీదేవి పద్మాలయ, పద్మ నివాసిని,పద్మ, శ్రీ మహావిష్ణువు కూడా శంఖ చక్ర గదలతో పాటు పద్మాన్నీ ధరిస్తాడు. జ్ఞానాన్ని, విద్యను ప్రసాదించ దలచినప్పుడు ఆ పద్మ స్పర్శను నారాయణుడు కలిగిస్తూంటాడు.

మన్మధుని బాణాలు అయిదు పుష్పాలే
"అరవిందమ్ అశోకమ్ చ చూతమ్ నవమల్లికా!
నీలోత్పలమ్ చ పంచైతే పంచబాణస్య సాయకా!!"

తెలుగు కవిత్వంలో సంస్కృతానుకరణంవల్ల పద్మాలను, కలువలను వర్ణించినా మల్లెలు, జాజులు,సంపెంగలపైన సహజంగా మనకు మక్కువ ఎక్కువ. కవి సమయంగా తీసుకోవటమే కానీ, తామరలు,కలువలు నిజానికి నిర్గంధ కుసుమాలు హంసతూలికాతల్పాలు ఊహలోనివే కానీ,మల్లెల పాన్పులు మన మెరిగినవి. పారిజాతం కూడా మనకు పరిచితమైనదే. తనమీద ఒక కావ్యమే రచింపచేసుకున్న ఘనత దానిది. రతిక్రీడా సమయంలో ఉజ్జ్వల దీపాంకురమై, రతి శ్రమ తనూ సంజాత ధారాళ ఘర్మలవాలు తొలగింపగా, సురటి అయి రంజిల్లే పారిజాతం మన దొడ్డిలో పూచే పారిజాతమేనా అన్న అనుమానం కలుగకపోదు. అలాగే, నానా సూనవితాన వాసనలను ఆనందించే తుమ్మెద నన్ను ఎందుకు ఒల్లదు అని తపస్సు చేసి స్త్రీ నాసిక అయి,తననమీద నిత్యమూ ప్రేక్షణమాలికా

మధుకరీ పుంజాలను ధరించిన సంపెంగ, భట్టుమూర్తి చమత్కార కల్పనకు పతాక అయి నిలిచింది.

సౌగంధిక పుష్పాలను తెచ్చి ద్రౌపదిని సంతోషపెట్టడం కోసం భీముడు చేసిన రణకల్లోలం సంస్కృతాంధ్ర భారతాలలో చక్కగా వర్ణితమైంది. అందమైన పూవులకోసం,పూబోడులకోసం కవిత్వాలు,కల్లోలాలు జరగటం సహజమే.

ఆంధ్ర సాహిత్యంలో మల్లీ చంపకాల కున్న స్థానం తమిళ,కర్ణాటక సారస్వతాలలో శిరీష పుష్పానికి ఉంది. ఆ విరిసిన దిరిసెన పూవుల గురించి వాటి మెత్తదనాన్ని గురించి గూర్చి మనుచరిత్రలో మాత్రం మనకు కనిపిస్తుంది.

"కృతి యొనర్పుము మాకు శిరీష కుసుమ
పేశల సుధాయమోక్తుల పెద్దనార్య!"

శిరీష కుసుమంలా మెత్తనైన మాటలతో కూడిన కావ్యం తనకు ఇమ్మని రాయలవారు పెద్దనను అడిగారు.ఆ ప్రాంతంలో బహుశా అవి ఎక్కువగా పూచేవీ, కనిపించేవీనేమో!

తమిళ వేదమైన "తిరుక్కురళ్" లో శిరీష పుష్పాలను గురించిన ప్రశంస చాలాచోట్ల కనిపిస్తున్నది. ఆచార్య చల్లా రాధాకృష్ణశర్మగారు వాటికి చక్కని ద్విపదలు అనువాదం చేశారు. సౌందర్య ప్రశంసను చేసే ఒక అధ్యాయంలోని ఈ పద్యం చూడండి.

"మనుము మృదు శిరీషమా! మేము వలచు
తనుమధ్య మృదులమై తనరు నీకంటె".

ఎంతో మెత్తని దిరిసెన పువ్వా! నీవు వర్ధిల్లు. మేము వలచిన ప్రేయసి నీకంటె మెత్తనిది.

"తురిమెను కాడల దిరిసెనలు కటి
బరువును చూచి తప్పెట మ్రోగదింక".

ఆమె తన సౌకుమార్యాన్ని లెక్కచెయ్యకుండా కాడలతోటి శిరీష కుసుమాలను తన కొప్పులో ధరించింది. వాటి బరువుతో ఆమె నడుము బాధపడుతోంది. అందువల్ల తప్పెట్లు విజయగర్వంతో మోగవు.

అలాగే,మరొక ద్విపద- "పడతి పాదములకు పల్లేరు లై నె
గడుగాదె అంస రెక్కలు శిరీషములు"

హంసతూలికలు, శిరీషాలు కూడా యువతి పాదాలకు పల్లేరు కాయల్లా ఉన్నాయి. ఆమె పాదాల సౌకుమార్యాన్ని వర్ణించటానికి చేసిన చక్కని ఊహ ఇది. తన ప్రియురాలి పాదాలు అత్యంత సుకుమారాలని,అవి తమ ప్రాంగణంలో అడుగు పెట్టడంకోసం ప్రియులు ఎదురుచూస్తూంటారని ఎందరో రాశారు.

మహాకవి గాలిబ్‌కు దాశరథి అనువాదం-

"ఏల కాళ్ళు నొచ్చె ఇంతికి రాతిరి
ఎవని స్వప్నసీమ కేగి వచ్చె"

ఎవరో తన కలలో ఆ సౌందర్యరాశిని చూస్తే అతని కలలోకి వెళ్ళి వచ్చినందుకు ఆమె కాళ్ళు నొప్పి చేశాయట! ఎంత అపురూపమైన కల్పన!

శివశంకర శాస్త్రిగారు తన ప్రియురాలి పాద పద్మాల మహత్వాన్ని వర్ణిస్తూ " అననాబ్జ కరాబ్జ

పాదాబ్జములకు "నాకు తేడా లేదంటారు.

సంస్కృతంలోని అబ్జ శబ్దానికి తామరస శబ్దం పర్యాయ పదం దానికి తెనుగులో తామర వికృతి. తెలుగులో తామరకు ఒక చర్మవ్యాధి అనే అర్థంకూడా ఉంది.

ఒక కవి చమత్కారంగా " విష్ణుమూర్తికి బొడ్డులో తామర ఉన్నది. లక్ష్మీదేవికి చేతిలో తామర ఉన్నది. బ్రహ్మదేవునికి ఆసనం తామర కానీ, మా తెలిసిన వారి కోడలికి ఒళ్లంతా తామరే " అన్నాడుట!

## కవిత ఎలా ఉండాలి?

వెనుకటి రోజుల్లో రాజులలో చాలా మంది భోగప్రియులై వేశ్యాలంపటులై ఉండి కవి పండితులను సరిగా ఆదరించేవారు కారు. రాజ దర్శనం కాక, అయినా సరియైన మర్యాద, సన్మానం జరగక, అవసరం వల్ల ఆశ్రయించటం తప్పక, విద్వాంసులు బాధపడుతూండే వాళ్ళ ఈ బాధను అనుభవించిన ఒక విబుధుడు ఈ శ్లోకాన్ని చెప్పాడు.

"న నటా, నవిటా, న గాయకాః
న చ సభ్యేతర వాద చుంచవః!
నృప మీక్షితు మత్ర కే వయమ్
స్తన భారానమితా న యోషితః!!"

మేము నటులం కాము, విటులం కాము, గాయకులం కాము, అసభ్య వచనాలతో మెప్పింపజూచేవారమూ కాము, కుచాల బరువుచేత వంగిన యువతులమూ కాము,రాజును చూడటానికి మేము ఎవరం? రాజ దర్శనం మాకెందుకు అవుతుంది - అని ఆ పండితుడు బాధపడ్డారు.

ఈ విధంగానే ఎక్కడో అనాదరం పాలైనప్పుడు శ్రీనాథుని వంటివాడు కూడా కవిత్వం చెప్పినా, పాడ నేర్చినా వృథా కష్టం. అందమైన ఆటవెలదిగా పుడితే ఎవరుపడితే వారు ధన మిస్తారు కదా అని నిరాశతో దైవాన్ని ఇలా దూషించాడు.

"కవితల్ సెప్పిన, పాడ నేర్చిన వృథా కష్టంబె, ఈ భోగపుం
జవరాండ్రే కద భాగ్యశాలినులు? పుం స్త్వం బేల పో పోచకా?
సవరంగా సొగసిచ్చి, మేల్ యువతి వేషం బిచ్చి పుట్టింతువేన్
ఎవరున్ మెచ్చి ధనంబు లిచ్చెదరు గాదే? పాపవుం దైవమా!"

రాజు దర్శనం కాక కష్టాలు పడినతిరుపతి వేంకట కవులు ఈ విధంగా తమ బాధ వెళ్ళబోసుకున్నారు.

" కఠినమ్ములగు ఱాళ్ళు కఱపి రామ భజనాలయమ్ములే పడక కాయె
తాకిన మాత్రాన దనువు కఱ్ఱగ చేయ చాలిన చలినీటి స్నానమాయె
ఉడికియు ఉడకని కడువేడి మెతుకులే ఆకొన్న కడుపున కడ్డమయె
ప్రభు విచ్చె వే మాట పదియాఱులను నట్టి స్వన్నమ్ములే ధనార్జనము లాయె"

ఇలా కష్టాలు పడ్డ తరువాత రాజ దర్శనమైతే, అప్పుడు మళ్ళీ ఆ రాజును మెప్పించాలంటే మళ్ళీ స్త్రీలనూ,వాళ్ళ సౌందర్యాన్నీ ఆశ్రయించక తప్పదు. రసాన్ని బట్టి, అవసరాన్ని బట్టి మెత్తగా కఠినంగా, మధ్య రకంగా,రకరకాలుగా కవిత్వం మేము చెబుతామంటూ,దానికి కాంతా సంబంధాన్ని కల్పిస్తూ జంట కవులు చెప్పిన పద్యం చూడండి.

సీ. " ముద్దు ముద్దుగ చెప్పఁబూనితిమా, వన్నె లాడి తీయని మోని లంచ మిచ్చు
కఠినమ్ముగా చెప్పఁగడిగితిమా, ప్రౌఢ కాంత పక్షోజముల్ కాన్క లొసగు
తీక్ష్ణరీతిని చెప్ప తెరకొంటిమా, వాలు గంటి లేజూపు సుంక మ్మొసంగు
మిశ్రరీతిని చెప్ప మేకొంటిమా, బోటి బిగువు కౌగిలి పన్ను బెట్టి తీరు
ఆశుధారా కవిత్వమ్ము నందుకొంటి మేని అభిసారికయు దండ మిచ్చి తీఱు
ఆంధ్ర గీర్వాణ భాషల యందుమాకు దళిత పండితలోప ! గద్వాల భూప !"

ముద్దు ముద్దుగా చెప్పాలనుకుంటే బింబోష్ఠి తీయని పెదవిని లంచంగా ఇస్తుంది. అంటే అధరామృతంలాగా తియ్యగా ఉండే కవిత్వాన్ని చెబుతాము అని అర్థం. కఠినంగా చెబితే ప్రౌఢ స్తనాలను కానుకగా ఇస్తుంది. అంటే ఆ కాఠిన్యం స్తనకుంభ కఠినమన్న మాట. శ్రీనాథుడు కూడా లలిత కఠిన వక్షోజాలు అని అంటాడు. అంటే కవిత్వంలో కాఠిన్యం కూడా అంతకు మించరాదు అని అర్థం. అలానే , తక్షరీతిని చెప్పా లనుకుంటే వాల్జూపులు సుంకాలుగా వస్తాయి. కలగలుపుగా చెప్పాలనుకుంటే కాంత బిగువైన కౌగిలి సమర్పించుకుంటుంది. ఇక ఆశుధారగా కవిత్వం చెప్ప పూనుకుంటే అభిసారిక కూడా దండ మిచ్చి తీరుతుంది.

"శృంగార ఏవ మధురః వర ప్రహ్లదనో రసః"

అన్న అలంకారికోక్తికి అనుగుణంగా కవులు తమ కవిత్వానికి శృంగారాన్నీ శృంగారవతులనూ ఆలంబనంగా చేసుకొని రససిద్ధి సాధిస్తూంటారు. ఈ జంట కవులే విజయనగరం వెళ్ళినప్పుడు కూడా ఇదే పంథాను అనుసరించి భూకాంతులను కవిత్వం నచ్చాలంటే, కాంతా సమ్మితంగా ఉండక తప్పదని తమ కవితను వధూటిని చేసి, ఆ చెలువ లీలావిలాసాలను కవిత్వాన్ని అన్వయించి, రసిక జనరంజకంగా చెప్పిన తీరు నాటికీ, నేటికీ కూడా ఆనందజనకంగానే ఉంది.

"పురుషాయిత మొనర్చు పూబోణి ముద్దు చే ష్టల రంగు లొక్కొక్క సమయమందు
ప్రణయ కోపాకుల ప్రౌఢ కాంతామనః పాటనం బొక్కొక్క పట్టునందు
ఈషద్బలాత్కార మృదితాధరోష్ఠీ దృ శాలీల లొక్కొక్క వేళయందు
అనునీత ఖండితా హావభావాది సాం కర్యమ్ము నొక్కొక్క కాలమందు
తవిలి వర్తించు మా కవితా వధూటి రస మెఱింగిన మీవంటి రసికవరుల
కే తగును గాక అన్యుల కెట్లు తగును? శ్రీ మదానంద గజపతి క్షితితలేంద్ర!"

వివిధ భావాలను ప్రదర్శించే నాయికల హావభావ లీలావిలాసాలు ఏ విధంగా ముగ్ధంగా, మోహనంగా, ప్రౌఢంగా, చాతుర్యవంతంగా, ఛలోక్తి చమత్కార మంజులంగా, ప్రణయ కలహోల్లాసంగా ఉంటాయో,కవిత్వం కూడా ఆ విధంగానే - బహువిధ భావబంధురంగా, కామినీ స్పర్శానంద స్పందకంగా ప్రకాశిస్తుందని కవిరాజుల భావన.

## అందరూ అందరే!

ప్రతి సాహిత్యంలోనూ కొన్ని అజ్ఞాత కర్తృకాలైన మంచి పద్యాలు కనిపిస్తుంటాయి. ఎవరిని గురించి, దేన్ని గురించి రాశారో లేక చెప్పారో తెలుస్తుంటుంది గానీ, ఎవరు రచయితో కొన్ని సార్లు తెలియదు. వాటిని చదివి ఆనందించి, ఆ రచయితకు మనసా నమస్కరించటం తప్ప మనం చేయగలిగిందేమీ ఉండదు.

మహాదాత అయిన రాయని భాస్కరుని గురించి ఎందరో ప్రశంసిస్తూ పద్యాలు చెప్పారు. ఆ పేరు గలవారుచాలామంది ఉన్నారు గాని, బహుజన స్తుతిపాత్రుడై మహాదాతగా పేరొందిన భాస్కర మంత్రిని స్తుతిస్తూ చెప్పిన వాటిని కొన్నింటిని ఉదాహరిస్తున్నాను.

**రంగత్కృపాదృష్టి గంగాభవానికి** మణికంకణంబు లే మంత్రి యొసగె
భిక్షార్థమీయగా నక్షయం బగునట్లు మార్తాండు డర్ధ మే మంత్రి కొసగె
తగ వేడినంతలో జగతిపై నర్థికి మానంబు ప్రాణ మే మంత్రి యొసగె
మీసంబు తాకట్టువేసి పదార్థంబు మహిమబౌనర్థి కే మంత్రి యొసగె
అతడు నందవరీక వరాన్వయుండు దుర్ఘటుండు వశిష్ఠ గోత్రోద్భవుండు
శత్రు మథనుండు వినుకొండ శాసనుండు **భవ్యభరతుండు రాయని భాస్కరుండు**

ఒకసారి భాస్కరుడు నదిలో స్నానం చేస్తున్నాడు. చేతి బంగారు కంకణం జారి నీటిలో పడిపోయింది. పక్కన ఉన్నవారు " అయ్యో! అయ్యో" అన్నారు. భాస్కరుడు నవ్వుతూ " గంగాదేవి మోజుపడి నా చేతి కంకణం తీసుకొన్నది. ఒక కంకణం శోభించదు గదా! రెండుచేతులకూ రెండు కంకణాలుండాలి. కనుక రెండో కంకణం ఇస్తాను" అని రెండవ కంకణం తీసి నదిలోకి వేశాడు. కొందరు " అమ్మవారు నిజంగా కోరిందా?" అని సందేహించారట. వారి సందేహం తీర్చడం కోసం అతను గంగను ప్రార్థిస్తే సువర్ణ కంకణాంచితమైన హస్తాలు రెండు నీటిలోనుంచి పైకి లేచాయట! దీన్ని బట్టి భాస్కరుడు వట్టి దాత మాత్రమే కాక దేవతానుగ్రహపాత్రుడైన సిద్ధుడనీ, యోగి అనీ అనిపిస్తుంది. ఇంద్రజాల ప్రదర్శనలు చేసి పొట్ట పోసుకొనే విప్రవినోదులు తమ ప్రదర్శనకు ముందు రాయని భాస్కరుని స్మరించి నమస్కరించటం ఉంది. మహామంత్రవేత్తగా ఆయనను వారు భక్తితో భావిస్తారు.

ముప్పై రెండు మంది మంత్రుల పేర్లున్న సీసమాలికలో కొట్టరెడ్రమంత్రి మీసం తాకట్టుపెట్టి యాచకులకు ధనం తెచ్చి ఇచ్చినట్టున్నది. మరి భాస్కరుని గురించి కూడా పై సీసంలో అటువంటి లక్షణం కనిపిస్తుంది. యాచకులు కోసం తమ గౌరవ చిహ్నామైన మీసాలను ఎందరు దాతలు తాకట్టుపెట్టారో - ఈదేశంలో !

**బట్టు దీవించుచు బాసికమ్మును జూవ** వెలయ పెండిలి చేసి వేడ్క బంపె
చొప్పకట్టల మీద సోలి యుండగ జూచి పట్టెమంచము పాన్పు బట్టు కిచ్చె
వలెత్రాడు జూపిన జెలగి యెద్దు నొసంగె పలుపు జూపిన పాడి పశువు నిచ్చె
కళ్ళెమ్ము జూపిన ఘనత గుర్రము నిచ్చె చుట్ట జూపిన దాసిసుదతి నిచ్చె
స్నానమాడంగ కడియంబు జారకడమ కడియమును వేయగా శాంభవి కరము జూపె
వెలయ రాయల కుంగ్రమ్ము వేసి చూపె సర్వమాన్యుండు వినుకొండ శాసనుండు
**భవ్యభరతుండు రాయని భాస్కరుండు**

ఎందరికో పెళ్ళిళ్ళు చేయించాడు, పట్టెమంచాలు, పానుపులు, పాడి పశువులు, వ్యవసాయానికి ఎద్దులు, దాసీజనం - ఇది, అది అని చెప్పేదేమిటి? సమస్త దానాలూ చేశాడు. అర్హుల తారతమ్యం తెలిసి ఎవరి యోగ్యత ఎలాంటిదే ఎరిగి ఇచ్చేవాడు. కవిత్వాన్ని విని ఆనందించి సత్కరించేవాడు. శాస్త్రవేత్తలైన విద్వాంసులను గుర్తించి గౌరవించేవాడు. కష్టాల్లో ఆదుకొనేవాడు. అవసరానికి ఆశ్రయ మిచ్చేవాడు.

అందుకే కవులిలా కీర్తించారు -

దాతతో నర్థుల తారతమ్యము తెల్పి యిప్పింప నేర్చు తా నీయనేర్చు
నవరసాలంకార నయ కవిత్వ ప్రౌఢి తెలియ నేర్చును మూఢు తెలుప నేర్చు
భట్ట సంఘట్టఘరట్ట వాగ్ధట్టుడై చదువగా విన నేర్చు చదువ నేర్చు
మానుషాధిపులైన మానవాధీశుల మెప్పింప నేర్చు దా మెచ్చ నేర్చు
దాత కవిభట్టు మంత్రియు తానె యగుచు మంతు కెక్కెను ధారుణీ మండలమున
సరసహృదయుండు వినుకొండ శాసనుండు భానుతేజుండు రాయని భాస్కరుండు.

ఇంతా చేస్తే ఆయన చిన్న మంత్రి మాత్రమే. ఆ రోజుల్లో అతనికంటే సంపన్నులు, రాజులు ఎందరో ఉన్నారు. ఉన్నా 'మహాదాత' కీర్తి అతనికి దక్కింది. అతని దానగుణం అటువంటిది. చిన్నతనం నుంచే అతనిలో ఆ గుణం ఉండి,అది కాలక్రమాన వికసించిం దనటానికి నిదర్శనమైన దీ కందం-

చేకొని రాయని బాచడు
ాకాలు గుణించు పిన్న కాలమునాడే
లాకేత్వ మియ్యనేరడు
దాకును కొమ్మియ్య డిట్టి దాతలు కలరే!

అక్షరాలు చదువుకొనే చిన్న వయసులోనే 'లేదు' అనే మాట అనేవాడు కాదు, రాసేవాడు కాదుట. నెరదాత అయిన అతని ఉనికివల్ల వినుకొండకు సాటిలేని పేరు వచ్చింది.

ఏ కొండయు వినుకొండకు
రాకోరదు సాటి పోటి గానేరదుగా
చేకొని రాయని భాస్కరు
డేకోన్నత వృద్ధి మీర నేలుట చేతన్.

రాయని భాస్కరుడు మాత్రమే కాక అతని ఇంట్లో అందరూ దాతలేనట. ఈ విషయాన్నే ఒక కవి ఈ విధంగా వర్ణించాడు.

సన్నుత లీల బాడ నల సంతతి కర్ణుడు దాతగాక వా
రన్నలదమ్ములందు నొకరైన వదాన్యులుగారు కీర్తి సం
పన్నుని రాయన ప్రభుని భాస్కరు సంతతి నెంచిచూడ వా
రన్నలు దమ్ము లింట గల యందరు దాతలు భూతలంబునన్.

## పట్టింపను గాజ ?

బ్రతుకుతెరువుకు మానవు డెన్నో ప్రయత్నాలు చేస్తాడు. వీలైన మార్గమల్లా ఎన్నుకుంటాడు. కవిత్వం రాయనేర్చిన వాడు వేరే త్రోవ లేనప్పుడు దాని ద్వారా జీవిద్దామని పూనుకొంటాడు. ధనవంతులమీద పద్యాలు చెప్పి నాలుగు రూపాయలు సంపాదించి ఆలుబిడ్డలను పోషించటానికి ప్రయత్నిస్తాడు. ఎక్కడో పోతన వంటి మహానుభావుడు"నిను ఆకటికిన్ గొనిపోయి అల్ల కర్ణాటకిరాట

కీచకుల కమ్మ త్రిశుద్ధిగ నమ్ము భారతీ" అని అంటాడు గాని అందరూ అలా అనలేరు.

ఆ సాధనలో ఇచ్చిన వాణ్ణి ఇంద్రుడు, చంద్రుడు అనటం,ఇవ్వని వాణ్ణి తిట్టటమూ జరుగుతూ ఉంటాయి. సంపన్నుడైన లుబ్ధుడు ఒక్కోసారి తెగబడి ఏ కవి అయినా తిడితే భయపడో, సిగ్గుపడో కొంత విదిల్చేవాడు. వాళ్ళను దృష్టిలో పెట్టుకొని ఒక కవి భగవంతునకు ఈ విధంగా విన్నవించుకొన్నాడు.

లాలింప చెరకు బెల్లంబు తా నిచ్చునా? చెండాడి పిప్పిగా జేయకున్న
అడిగినప్పుడు ధాన్య మన్నంబు పెట్టునా? దండి రోకట దంచి వండకున్న
మ్రొక్కి వేడిన భూజములు పండ్ల నొసగునా? మొనసి దండాహతి మోదకున్న
పొగడిన బంగారమును సొమ్ము లొసగునా? గొబ్బు గొబ్బున గాచి కొట్టకున్న
లండిపోతు శిఖండి గులాము లోభి తెగువ నొసగడు పేరున తిట్టకున్న
దండితనిశాట! భళిర! భూధవుని పేటబాలగోపాల! గుణజాల! ధర్మచేల!

గానుగలో వేసి పిప్పి జేయకపోతే చెరకు బెల్లాన్ని ఇవ్వదు. అడిగితే ధాన్యం అన్నం పెట్టదు. రోకటితో దంచి వండాలి. మొక్కితే చెట్లు పళ్ళు ఇవ్వవు. కర్రతో కొట్టాలి. స్తుతిస్తే బంగారం సొమ్ము లివ్వదు. కాల్చి సాగగొట్టాలి. అలాగే లుబ్ధుడు తిడితే గాని డబ్బు లివ్వడు. ఈ సూత్రం అన్ని చోట్లా పని జేయకపోవచ్చు గాని కొన్ని చోట్ల పని చేసినట్లే కనిపిస్తుంది.

భట్టుమూర్తి తన కిస్తానన్న అగ్రహారం ఇవ్వకపోతే పట్టిస రాజు కొడుకును తిడతానని బెదిరించి పెద్ద మాలిక చెప్పాడు.

లొట్ట! యిదేటి మాట? పెనులోభులతో మొగమోట మేల? తా
కుట్టకయున్న వృశ్చికము కుమ్మరి పుర్వని అందురే గదా!
పట్టిస రాజు పట్టి సరిపల్లె సరాసరి యీయకున్న నే
తిట్టక మాన...

కుట్టకపోతే తేలును కూడా కుమ్మరిపురుగంటారట! అందువల్ల అవసరమైనప్పుడు తిట్టాల్సిందే నంటాడు మూర్తి కవి. ఎంత వేడినా, ఏమన్నా ఇవ్వనివారిని చూసి ఒక కవి ఇలా అంటాడు.

ఇల లోభి నెంత వేడిన
వలవని వెతలంతె కాని వా డిచ్చెడినే?
జలమును వెస గిల కొట్టిన
కలుగునె నవనీతమాశగాక...

నీళ్ళు చిలికితేవెన్న వస్తుందా? వట్టి ఆశగాక - లోభిని వేడితే ఇస్తాడా? పెద్దగా లేకపోయినా ఉన్నంతలో ఇచ్చేవాళ్ళున్నారు. ఉండీ ఇవ్వని వాళ్ళున్నారు. అటువంటి వాళ్ళను గూర్చి హీనోపమ వాడుతా డొక కవి.

కలుగక యిచ్చెడు మనుజులు
తలవెండ్రుక లంతమంది తర్కింపంగా
కలిగియు నీయని యధములు
మొల వెండ్రుక లంతమంది మోహనరంగా!

చాలామంది ఇస్తున్నప్పుడు ఒక లోభి ఇవ్వకపోయినా పరవాలేదు. గోష్ఠంలో పెక్కు ఆవులు

పాలిస్తున్నప్పుడు ఒక బక్క ఆవు ఇవ్వకపోతే ఏమిలే అంటాడిలా ఒక రచయిత-

పెక్కావు లిచ్చుచో నొక
బక్కా వీకుండెనేని పాడికి కరవా
పెక్కు దొర లిచ్చుచో నొక
కుక్కల కొడు కీయకున్న కూటికి కొరవా?

ఇవ్వనివాడిని శునకపుత్రుడని గర్హిస్తాడు మరి! అతని బాధ అటువంటిది.

ఒక డంటాడు - దాన మనేది జన్మతః చేతిలో పుట్టే గుణం. దాన్ని బలవంతాన చేతికి - అటూ ఇటూ నులిమి ఎక్కించటాని కేమన్నా గాజువంటిదా?

పుట్టుక తోడుత కరమున
పుట్టవలెన్ - దానగుణము -పుట్టకపోతే
యిట్టట్టు నులిమి బలిమిని
బట్టింపను గాజ? తాళ్ళపలి కొండ్రాజా!

ఇంకో విషయ మేమిటంటే, పదిమందికిచ్చి పదకొండోవాడి కివ్వకపోతే వా డూరుకోడు. తిట్టిపోస్తాడు. రోజూ బిచ్చం పెట్టే అమ్మ పెట్టకపోతే - పెట్టనమ్మ ఎలాగూ పెట్టదు. పెట్టే అమ్మ కేమొచ్చిందిరా పెద్దరోగం అంటాడు బిచ్చగాడుకూడా.

పది వేలమంది కిచ్చియు
తుది నొక్కని కీయకున్న దొరకవు కీర్తుల్
పది వేల నోము నోచిన
వదలదె యొక రంకు వంక వన్నియసుంకా!

పదివేల నోములు నోస్తే వచ్చిన పేరు, ఒక రంకుతనపు అపకీర్తి వస్తే నిలువదు. అలాగే దాత అన్నవాడు పేరుండాలంటే ఇస్తూనే ఉండాలి.

ఈ విధంగా రకరకాల అనుభవాలతో రకరకాల అభిప్రాయాలను కవితాసుందరంగా వ్యక్తీకరించారు కవివరులు.

## పొగాకు పొగరు

పొగాకు మన దేశంలోని అడుగుపెట్టిన దగ్గరినుంచి చుట్ట, నస్యం రూపాల్లో మొదట, బీడీ, సిగరెట్‌గా తరువాత ప్రజలను ఆకర్షించింది. అందులోనూ నస్యానికి సభాపూజ్యత రావటంవల్ల దానిమీద చాలామంది పద్యాలు రాశారు. వేటూరివారు,దీపాలవారు దీనికి సంబంధించిన చాటువులను సేకరించి ప్రకటించారు. నస్యం తయారుచేసే పద్ధతిని సూచిస్తూ ఒక కవి ఇలా అన్నాడు.

మట్ట పొగాకులో నడుమ మందము గల్గినచోట తీసి తా
పట్టుగ పక్వశుద్ధిగను బాగుగ కాచి ఒకింత సున్నమున్
బట్టన వ్రేల నొత్తి తన బల్మికొలందిగ నల్చి నస్యమున్
బట్టవు డబ్బిలో నునిచి ప్రాజ్ఞుల కిచ్చిన భాగ్య మబ్బదే?

అలాగే, ఒక కవి నస్యాన్ని తన సాహిత్య చాతుర్యాన్ని వినియోగించి శబ్దార్థ సుందరంగా, భావ

మనోహరంగా ఈ విధంగా వర్ణించాడు.

నస్యము శీత మత్తగజ నాశన హేతు విచార ధీర పం
చాస్యము సుప్తి రోగ నిబిడాంధతను : వటలార్క బింబ సా
దృశ్యము వేద శాస్త్ర పటు దివ్య సుపండిత వాగ్విచిత్ర సా
రస్యము రాజవశ్య మహిరాణ్మణికైన నుతింప శక్యమే?
నస్యమా యిది? మరున్నారీ శిరోమణీ కుచ కుట్మలము మీది కుంకుమంబు
నాసికా చూర్ణమా? నలిన రుద్వనితాధ రార్పిత తాంబూలి కాసవంబు
పొడుముగా? వెడ విల్తు పొలతి నెమ్మోముపై కొమరొందు కనటు కుంకుమపు దావి
ముక్కుపొడే యిది? ... ... ...
.... ..... ..... జ్వాలరసంబు
సకల జనమానసోజ్జ్వల చరమ మార్గ
తత్వ మస్యాది వాక్య ప్రధాన గూఢ
హేతుకంబై చెలంగుచు నింపు నింపు
నస్యము గణింప శక్యమే నలువకైన!

శైత్యాన్ని,నిద్రను పోగొట్టేది అనీ. వాగ్విలాసాన్ని ఇచ్చేది అనీ, అప్సర స్త్రీల వక్షోజాలమీద కుంకుమ వంటిదనీ, సరస్వతీ తాంబూలం వంటిదనీ, ఒక పట్టు పడితే, ఒక పీల్పు పీలిస్తే బ్రహ్మానుభవం కలుగుతుందనీ రకరకాలుగా వర్ణించారు కవులు.

కృష్టిపాటి వేంకట సుబ్బకవి అనే గొప్ప వాక్సిద్ధుడు నస్య ప్రియుడైతే - ఆయనకూ, ఓబళాచార్యుడను అనే పండితునికీ జరిగిన సంభాషణ తెలుగు సంస్కృత పద్యాలుగా వెలసింది.

నస్యము లేదుగా! పవననందన దివ్య కటాక్ష వీక్షణా
వశ్య వరప్రభావ విభవానుభ వాద్భుత భూమి భృద్ధనః
కైశ్య ఘుమం ఘుమం ఘుమిత గాంగఝరీ విలుఠత్తరంగ సా
దృశ్య కవిత్వ తత్వ ముఖరీకృత వేంకట సుబ్బ సూరికిన్.

కోకో! నస్య మవశ్య మీశ్వర జటా కోటీ రటద్యోధునీ
ప్రాకారోర్మి సకాశ పేశల సుశబ్ద ప్రక్రియోపక్రమా
నేక గ్రంథ నిబంధ నార్జిత సమున్నిద్ర ప్రతాప ప్రధా
స్తోక శ్రీకర కృష్టిపాటికుల సింధు స్వచ్ఛ చంద్రోదయా!

తెలుగు విశ్వగుణాదర్శకర్త బుక్కపట్టణం తిరుమల తాతాచార్యుడు బూతు పద్యాలకు ప్రసిద్ధి. తాను నస్యం అడిగితే ఈయని ఒక శాస్త్రిగారిని ఇతనిలా దూషించాడు!

శాస్త్రుర్లట ఈ నీచుడు
పాస్త్రుత్తుల మగడు వీని పరువేమోకా
కాస్తింత నస్య మడిగిన
నాస్తే యని పలుక వీని నాలుక పీకా!

ఈ నస్యానికి మూలమైన పొగాకు పుట్టుక గురించి చమత్కారంగా ఒక కవి - గరుత్మంతుడు అమృతం తెస్తూంటే పాత్రలో నుంచి పొంగి నేలమీద పడిన చుక్కే చుట్ట అయిందని రాశాడు.

**ఖగపతి అమృతము తేగా**
**భుగ భుగమని పొంగి పొరలి భూస్థలి పడి తా**
**పొగ చెట్టయి జన్మించెను**
**పొగ త్రాగనివాడు దున్నపోతై పుట్టున్.**

పొగ తాగటమంటే, చుట్ట తాగడం లాంటి దన్నమాట.

మరొక కొంటె కవి పొగ తాగటంవల్లనే భీముడు గెలిచాడనీ,పొగ తాగకపోవటంవల్లనే దుర్యోధనుడు ఓడిపోయాడనీ రాశాడు.

**పొగ త్రాగ నేర్చు భీముడు**
**పగఅన్ పొగరడచె నాజి బాహాశక్తిన్**
**పొగ త్రావని దుర్యోధను**
**డిగిలించెను రణములోన నిహిహీ అనుచున్.**

రామ రావణ యుద్ధం నాటికి పొగ చెట్టే ఉంటే, లక్ష్మణుని మూర్ఛ తేర్చటానికి హనుమంతుడు సంజీవిని కోసం ఎందుకు పరుగెడతాడని అంటూ డింకో రచయిత.

**రావణ యుద్ధంబందున**
**బావనుడగు లక్ష్మణుండు పడి మూర్ఛిలినన్**
**ఆవల బొగ చెట్టుండిన**
**బావని సంజీవి కేల పరుగెత్తు? నృపా!**

ఈ పద్ధతిలో వెతికితే మరెందరో దీనిమీద పద్యాలు చెప్పినవారు, పాటలు అల్లినవారు దొరుకుతారు.

## లెక్కల పద్యాలు!

చిత్ర కవితా ప్రక్రియలో నిపుణులైన వారు తెలుగు కవిత్వంలో చాలా వింతలు సృష్టించారు. అందులో కవిత్వంతో పెద్ద సంబంధం లేకుండా పద్యాల ద్వారా చేసిన చిన్న గారడీలు కొన్ని. బొబ్బిలికి చెందిన విస్సాప్రగడ కామరాజు అనే చతురుడు ఒక సీస పద్యాన్ని రచించాడు.

**అరిభయంకర చక్ర కరిరక్ష సాగర చాయ శ్రీ కర్పూర సాటి యుగళ**
**నాళీక సన్నిభ నయన యండజవాహ వాణీశ జనక వైభవ బిడౌజ**
**రాజీవ మందిరా రమణ బుధరక్ష వరజటిస్తుత శౌరి వాసుదేవ**
**భూరికృపాకర బొబ్బిలి పురపాల పాపభుజంగమ పరమగరుడ**
**దోష శైలేశ శశిరక్ష ద్రుహిణ హేళి**

**కీ.(key) వాక్యం:**

అ న్న య తో టి వి స్వా ప్ర గ డ కా మ రా జు
1 2 3 4 5 6 7 8 9 10 11 12 13 14
భా షిం చు హే ళి దా క్షి ణ్యా శా లి
15 16 17 18 19 20 21 22 23 24

ఈ పద్యాన్ని శ్రీ దీపాల పిచ్చయ్యశాస్త్రిగారు సేకరించి చాటు పద్య రత్నాకరంలో ముద్రించారు. దీంట్లో విశేష మేమిటంటే తెలుగు భాషలోని ఏ అక్షరాన్ని కోరుకొన్నా దీని ద్వారా కనుక్కోవచ్చు.అయితే దీనికి కొన్ని నియమాలు ఏర్పరచాడు రచయిత.

1. అచ్చులలో 'అ' కారం మాత్రమే తలచుకోవాలి. 2. హల్లులో ఙ ఞ కోరరాదు.

3. న-ణ,ల-ళ,ర-ఱ,వీటికి తేడాలేదు. 4. గుణింతంతో పనిలేదు.

ఏతావాతా ఏమిటంటే 'కీ' వాక్యంలోని అక్షరాలను మాత్రమే కోరుకోవాలన్నమాట.

పై నిబంధనలకు లోబడి ఎవరైనా కోరుకొంటామంటే అప్పుడు సీస పాదాలు నాలుగు,గీత పాదం ఒకటి చదివి వినిపించి వారు కోరుకొన్న అక్షరం ఏయే పాదాలలో ఉందో చెప్పమనాలి. చెప్పిన తరువాత ఆ పాదాలకు ఎదురుగా వేసిన అంకెలను కూడి, కీ వాక్యంలో ఆ అంకె ఏ అక్షరమవుతుందో చూసి చెప్పవచ్చు. కీ వాక్యం మనసులోనే సరిచూచుకోవాలి.

ఉదాహరణకు ఒకడు ' శ' కోరుకొన్నాడనుకోండి. పద్యం వినగానే 1,2,3,5 పాదాల్లో ఆ అక్షరం ఉందని చెబుతాడు. వాటి తాలూకు అంకెలు 1,2,4,16 కలిపితే 23 వస్తుంది. అది 'శ' అనే అక్షరం. ఈవిధంగానే ఏ అక్షరాన్ని అయినా కనుక్కోవచ్చు.

ఇటువంటి పద్యాన్నే శ్రీ రావూరి దొరసామిశర్మ తేటగీతిలో రచించగా దాన్ని ప్రొఫెసర్ జి.లలిత ఉదాహరించారు.

**1. రార మిరఘుర చిరము మురారి కరము 2. సామి మివులొంద తతఘు విసారి వితము 4. తనర దొరసామి రచితము తమి తరమున 8. ఘనసుకవి చిత్రము ఘనమ్ము కవిత ఘనము.**

దీని మూల సూత్రం "రావూరి దొరసామి సుకవి ఘన చిత్రము", దీనిలోని నియమాలు! 1. ల,ద లు తలచుకోరాదు.

2. పద్యంలోని అక్షరాలనే తలచుకోవాలి. అంటే పద్యం వినిపించి "ల,ద"లు తప్ప మిగిలిన అక్షరం ఏదైనా కోరుకోమని చెప్పాలి.

ఆలోచనాపరులైన పండితులు ఇటువంటి పద్యాలను రచించవచ్చు.

## వాగస్త్ర ప్రయోగం

శాపానుగ్రహ సిద్ధులై కవులు కొంతమంది తమకు ఆశ్రయ మిచ్చిన రాజుల మీదికో, తానాశ్రయించిన దేవుని గుడిమీదకో శత్రువులు దండయాత్ర చేసినప్పుడు, తమ కవితా ప్రాభవం చేత వాగస్త్రాన్ని ప్రయోగించి,వైరి వినాశం చేసినవాళ్లు అక్కడక్కడ కనిపిస్తారు.

మహమ్మదీయులు దండయాత్రలు చేస్తూ, రాజ్యాలను గెలుస్తూ, దేవాలయాలను ధ్వంసం చేస్తూ సాగిపోతున్న క్రూర యాత్రలో ఒకసారి సింహాచల క్షేత్రం మీదికి వారి దృష్టి మళ్ళింది. సింహాద్రి అప్పన్న భక్తుడు గోగులపాటి కూర్మనాథ కవి ఈ దృశ్యాన్ని చూస్తూ ఆదుర్దాపడ్డాడు. ఆవేశం

చెందాడు.అప్రయత్నంగా అతని నోట కవితావేశం విజృంభించింది. "వైరి హరరంహ! సింహాద్రి నారసింహ!" అనేమకుటంతో సీసాలు దొర్లుకుంటూ వచ్చాయి. ఆ భావతీవ్రతలో స్వామిని అతను బ్రతిమిలాడాడు, ఆక్షేపించాడు,ఎద్దేవ చేశాడు.అతని ఉపాలంభనం కూడా ఎంతో అద్భుతంగా ఉంటుంది.

పాశ్చాత్యుల నమాజుపై బుద్ధి పుట్టెనో మౌనుల జపముపై మనము రోసి?
యవనుల కందూరియం దిచ్చ చెందెనో విప్ర యజ్ఞములపై విసుగు బుట్టి?
ఖానజాతి సలాముపై నింపు పుట్టెనో దేవతా ప్రణతిపై భావ మెడలి?
తురకల యీదునందు ముదంబు గల్గెనో భక్తి నిత్యోత్సవ పరతమాని?
వాండ్రు దుర్మార్గులయ్యెయో వ్రతము చెడ్డ సుఖము దక్కదు వడి ఢిల్లి చొరగద్రోలు
పారసీకాధిపుల పటాపంచలుగను వైరి హరరంహ! సింహాద్రి నారసింహ!

"ఆభీర గృహముల ఆర కాగిన పాల మీగడల్ పడి దిగమ్రింగగలవు. కాని యవనులపై పడి పోరలేవు. కబళమున నోరు తెరతువు,కళ్ళెమన్న మోము త్రిప్పు హయగ్రీవమూర్తి వహహ!" అని ఆక్షేపించాడు. పాలియ్య వచ్చిన భామిని ప్రాణాలు అపహరించినట్లు కాదయ్యా! చేతనైతే ఈ తురకలను నాశనం చేయమని వేడుకొంటాడు. 'మేము నిన్ను అగ్రహారాలను ఇవ్వమని అడగటం లేదు. కరిహయాదుల మేము కాంక్షింపలేదు. జనులను దోచుకోకుండా చూడమనే మా ప్రార్థన అని అంటాడు. ఈ విధంగా 67 పద్యాలు చెప్పేసరికి గండుతుమ్మెదలు కొండలోనుంచి బయలుదేరి కొన్ని లక్షలు, కోట్లు విజృంభించి, ప్రళయకాలంలో కారుమేఘాలు కమ్ముకున్నట్లుగా తురకల దండుపైకి మూగి, కండలు ఊడేటట్లు గా కరచి,నెత్తురు పీల్చి వారిని విశాఖపట్టణం దాకా "బ్రతుకుజీవుడా" అని పారిపోయేలా చేశాయి. ఆ దృశ్యాన్ని కూర్మనాథుడే ఇలా వర్ణించాడు.

కారుణ్య దృష్టిచే కని మమ్ము రక్షింప నీరజేక్షణ! నీవు నేడు పంప
పారసీకుల దండుపై కొండలోనుండి గండుతుమ్మెదలు నుద్దండ లీల
కల్పాంతమున మిన్ను గప్పి భీకరమైన కారుమేఘంబులు గవిసినట్లు
తాకి బోదున రక్తధారలు దొరగగా కరచి నెత్తురు పీల్చి కండలెల్ల
నూడిపడ నుక్కు మూతులవాడి మెరసి చించి చెండాడి వధియించె చిత్రముగను
నొక్కొకని చుట్టుముట్టి బల్మిక్కుటముగ వైరి హరరంహ! సింహాద్రి నారసింహ!

ఇంకా ఆ తరువాత చెప్పిన మిగతా పద్యాలన్నీ నరసింహ స్తుతి రూపమే.

ముక్తి పెరుమాళ్ళయ్య అనే కవి ఆంజనేయ భక్తుడు. హైదరాబాదు నిజాము ఒక పెద్ద గుర్రపు దండును నిజాం ఆలీ అనే హూణుని నాయకత్వం కింద దేవరకొండ సంస్థానాన్ని దోచుకోవటానికి వచ్చినప్పుడు రాజావారి అభ్యర్థనమేరకు ఇతను ఆంజనేయస్వామిని అర్చించి, ఒక శతకం చెప్పాడట. ఏనుగులు, గుర్రాలతో లక్షలకొద్దీ సైన్యంతో వచ్చిన తురకల దండును శిక్షించమని హనుమంతుడిని ఇలా ప్రార్థించాడు!

ఇత్తరిని నిజామల్లీ
హత్తీలు గురాలు పటుతరాహవ బలముల్
మొత్తమ్మై వచ్చెను వి
చ్ఛిత్తుపడన్ శత్రుహంత ! శ్రీ హనుమంతా!

లక్షల తరబడి ఆవలి
పక్షంబున గుర్రములును బలములు వచ్చెన్
ఈ క్షణమున నీవే చని
శిక్షింపుము శత్రుహంత! శ్రీ హనుమంతా!

ఆంజనేయుడు చిన్నతనంలో ఆకాశంలో ఉదయించిన సూర్యుని చూసి పండు అనుకొని మింగబోయాడు. ఆ విధంగానే శత్రు సేనాపతిని మింగమని ఇలా అంటాడు.

భానుని మ్రింగిన పగిదిని
సేనాధిపు నాక్రమించి చీకాకుపడం
గా నొనరిచి రానీయకు
ఎనల నో శత్రుహంత! శ్రీ హనుమంతా!

పెరుమాళ్ళయ్య ఈ శతకం చెబుతూ ఉండగానే,తురకల దండుమీద పిడుగులుపడి సైన్యం చెల్లాచెదరై వెనుదిరిగిపోయింది. ప్రమాదం తప్పిన తరువాత సంతోషంతో భక్తకవి చెప్పిన పద్య మిదిగో.

వాసి మహారాజ శ్రీ
దేశాయీగారి కార్య తేజం బెపుడున్
భాసిల్ల శత్రు లణగగ
చేసితివే శత్రుహంత ! శ్రీ హనుమంతా!

భక్తులు, తపస్వులు అయిన కవులు వాక్కును ఆశ్రయించి భావం సత్యసంధాయకమై ప్రవర్తిస్తుంది - అనటానికి ఇటువంటి వారి జీవిత ఘట్టాలు ఉదాహరణగా కవిపిస్తాయి.

## తిట్టు కవి

పద్దెనిమిదవ శతాబ్దపు తెనుగు కవులలో కూచిమంచి వారికి ఉన్నతమైన స్థానముంది. అందులో తిమ్మకవి పిఠాపురం వారి ఆస్థానంలో ఉండేవారు. ఆయన రాసిక్యాన్ని గూర్చి, శృంగార శూరత్వాన్ని గూర్చి ఎన్నో కథలున్నాయి. "భర్గా! పార్వతీ వల్లభా!" అనే మకుటంతో ఆయన రచించిన పద్యాలు ఆనాటి సమాజ పరిస్థితికి దర్పణంగా భాసిస్తున్నాయి. విద్వాంసులైన విబుధులను అల్పులు ఏ రకంగా హీనంగా చూసేవారో ఈ కింది పద్యాన్ని బట్టి గ్రహించవచ్చు.

**పోపో బాపడ! దోసె డూద లిడినన్ పోలేక పేరాసలన్
వాపో జాగితి వేమి నీ సదువు తిర్నామంబులో సుద్దులో
భూపాళంబులొ నింక సత్తెలొ బలా బొల్యావు పోట్లాటలో
కాపాటింప నటండ్రు బాలిశులు భర్గా ! పార్వతీ వల్లభా!**

గృహస్థు తన రోజువారీ బ్రతుకులో భార్యతో, కొడుకుతో,చుట్టాలతో, ఊరి ప్రభువుతోఇంకా ఇంక ఎందరితోనో నెగ్గుకొని రావల్సి ఉంటుంది. ఆ కష్టాన్ని ఈ విధంగా తిమ్మకవి వర్ణించాడు.

మడతల్ పల్కు నృపాలుతో,పలుమరున్ మారాడు పెండ్లాముతో
చెడు జాడన్ పచరించు ఆత్మజునితో, చేట్పాటు గోర్లెంకతో,
పొడవం జూడగవచ్చు కార్మొదవుతో, పోరాడు చుట్టంబుతో
కడతేరన్ తరమా గృహస్థునకు భర్గా ! పార్వతీవల్లభా!

ఈ విధంగానే "బుధనుత విలాస ! పీఠికాపుర నివాస! కుముద హితకోటి సంకాశ! కుక్కుటేశ!' ' అనే మకుటంతో పిఠాపురంలోని కుక్కుటేశ్వరస్వామిని సంబోధిస్తూ చెప్పిన పద్యాల్లో కూడా ఇటువంటి సాంఘిక వ్యవస్థా పరిశీలన కనిపిస్తుంది.

తన సమకాలికుడు, మిత్రుడు అయిన ఏనుగు లక్ష్మణ కవిని గురించి సూక్తి సుందరంగా చెప్పిన ప్రశంసాచాటువు మెచ్చదగింది.

భారతీ వద నాంబుజ భ్రాజమాన
కలిత కర్పూర తాంబూల కళల గూడ
బంధురంబులు నీ మంజు భాషణములు
లలిత గుణధుర్య! ఏనుగు లక్ష్మణార్య !

ఈ పద్ధతిలోనే ఏనుగు లక్ష్మణ కవి కూడా తిమ్మకవి మీద చెప్పిన చాటువు గమనించదగింది.

హాటక గర్భ వధూ లీ
లాటన చలితాంఘ్రి నూపు రారావ శ్రీ
పాటచ్చరములు తేనియ
తేటలు మా కూచిమంచి తిమ్మయ మాటల్.

నిజంగానే తిమ్మయ మాటలు తేనియ తేటలు,సరస్వతీ పాద కటక ఘలంఘల నాదాలు.

తిమ్మకవి తమ్ముడు జగ్గకవి కూడా గొప్పకవి. ఇతను కూడా ఎన్నో చాటు పద్యాలు చెప్పాడని "నిరాఘాట నటత్ చాటు కవిత్వాంకు డరయ జగ్గన ధరణిన్" అని తన "సింహాశైల మాహాత్మ్యము' ' లో తిమ్మకవి రాశాడు. ఈ జగ్గకవి చింతలపాటి నీలాద్రిరాజు ఉంపుడుగత్తె చంద్రరేఖ అనే కాంతను నాయికగాచేసి 'చంద్రరేఖావిలాసము' అనే శృంగార కావ్యాన్ని రచించాడట.కృతి తీసుకుంటానన్న రాజు ఇతరుల చెప్పుడు మాటలు విని కావ్యాన్ని అంకితం తీసుకోకుండా తిరస్కరించి పంపేశాడు. ఎంతో ఆశ పెట్టుకున్న జగ్గకవి ఆ సంఘటనతో కోపగించి,ఆగ్రహావేశంతో ఆ రాజును, ఆ వేశ్యను నాయకునిగా,నాయికగా నియమించి వారి శృంగారాన్ని అసభ్య,అశ్లీల పదాలతో వర్ణిస్తూ 'చంద్రరేఖా విలాపము' అనే బూతు కావ్యం రాశాడట. బూతులు రాసినా కవితాశక్తి గొప్పది కాబట్టి, అధమ కావ్యమైనా ఇప్పటికీ నిలిచింది అందులోని మొదటి పద్యం చూడండి.

శ్రీకంఠుడు భుజంగ భూషణుడు భస్మీభూత పంచాస్త్రుడ
స్తోకాటోప బల ప్రతాప పుర రక్షాదక్ష సంశిక్షణుం
డాకాశోజ్జ్వల కేశపాశుడు త్రిశూలాంకుండు రుద్రుండు తా
వీకన్ చింతలపాటి నీల నృపతిన్ వీక్షించు నేత్రత్రయిన్.

సామాన్యంగా కృత్యాది పద్యం శ్రీకారంతో మొదలై, శుభకరమైన దైవ వర్ణనతో కృతి భర్తను ఆశీర్వదిస్తూ ఉంటుంది. ఈ పద్యంలో అలా కాక శివుని రుద్రరూపాన్ని వర్ణిస్తూ విషం కంఠాన

కలవాడు,పాములను ఆభరణాలుగా ధరించినవాడు, మన్మథుని బూడిద చేసినవాడు, ఆకాశమంతటా మండే జుట్టు కలవాడు,త్రిశూలధారి అయిన రుద్రుడు చింతలపాటి నీలాద్రి రాజును మూడు కన్నులతో చూచును గాక -అని అశుభంకరమైన,క్రూరమైన వర్ణనతో ఆ రాజును శపించటం జరిగింది.

అలాగే, "విద్యుదాభ విస్ఫార జటాధరుండు,అంభోరుహ గర్భమస్తక విభూషిత హస్త సరోజుడు' ' అయిన మహాభైరవుడు ఈ రాజునకు అశుభాలిచ్చును గాక । అని అంటాడు.

హిరణ్యకశిపుని దారుణంగా చీల్చిన తన ఖరనఖములతొ నరసింహుడు నీలాద్రి రాజు పక్షాన్ని చీల్చుగాక । అని అంటూ రాశాడు. ఇంతగా ఆ రాజును దూషించినా,ఆయన భార్యను మాత్రం గౌరవదృష్టితో చూసి,మెచ్చుకుంటూ ఈ చిన్న పద్యం రచించాడు.

ఖలు డీ నీల నృపాలుం
డిలలో ఇన్నాళ్ళు బ్రతుకునే? నరసాంబా
గళ కలిత కనకమయమం
గళ సూత్రోత్కృష్ట మహిమ గాక లతాంగీ!

ఏదైనా మొత్తం మీద తిట్టుకవిగా జగ్గకవి తెలుగు సాహిత్యంలో మిగిలిపోయాడు. కూచిమంచి కవుల కవితా ప్రతిభ ఈ విధంగా వినియోగంకావడం విచారకరం.

## పతాకబంధం

'తాలాంకనందినీ పరిణయ' కర్త ఆసూరి మరింగంటి నరసింహాచార్యులు గొప్ప పండితుడు. ప్రౌఢ ప్రబంధశైలిలో రచన చేసిన ఈ కవి గొప్ప విద్వాంసుడై కూడా జీవితపు అంత్యదశలో మిక్కిలి బాధలను అనుభవించాడు. అతను చెప్పిన బహుపాది అయిన చాటువు ఒకటి చదువదగింది.

పెద్దల్లుండొక నల్లత్రాచు,ప్రియమౌ పెండ్లాము నా పాలికే
జిద్దౌ ఖోరయె, కన్నత ల్లెపుడు నాపైటే నిరీక్షించు, వై
హద్దౌ కాపుర,మగ్ర శిష్య జన మర్థాందుల్ దయాహీను లై
ప్రొద్దుం తుచ్ఛుల గూడియున్న నుతు డప్పున్నప్పు చింతంపడ
న్మద్దోషంబుల నెన్నుచున్ వదినె నా మాటంటె రౌద్రాకృతిన్
హద్దౌ హద్ది బెనంగు, నన్న సుతుడే యుక్తం బెరుంగండునే
నెద్దిందోచక ప్రొద్దుపోక పొరుగిల్లే సొచ్చినన్ రంకులే
సిద్ధంబై పెనురద్ది భాసిలెను ఛీ ! ఛీ! ఇట్టి పాపంబిలన్
గద్దా ! శ్రీ కనకంటివా ! ననుస శీఘ్రంబె మృతుం జేయవే!

ఇంకోసారి శిష్య సంచారానికి వెళ్ళి తిరిగి వస్తూ ఉంటే సంపాదన అంతా దొంగలు దోచుకున్నారట. ఆ చోరులను శపిస్తూ ఒక పెద్ద సీస పద్యం చెప్పాడు కవి. అలాగె తాలాంకనందినీ పరిణయము రాసిన తాటాకులను వారి పాడి బర్రె కొంత నమిలితే, దానికి కోపం వచ్చి గేదెను తిడుతూ పద్యం చెప్పారట. ఇప్పటికీ మరింగంటి వారికి బర్రెలు అచ్చుకావట.

ఇక ప్రబంధ రచనలో ఇతర ప్రబంధకర్తలలాగే అష్టాదశ వర్ణనలు సమయోచితంగా చేయటమే కాక, సోష్ఠ్యములు, నిరోష్ఠ్యములు, త్ర్యక్షరకందాలు మొదలైన చిత్ర కవితా రీతుల నెన్నింటినో

ప్రదర్శించారు. అందులో బంధ కవితా రీతులను ఎన్నో చూడవచ్చు. పతాక బంధం, ఖడ్గబంధం, నాగబంధం,సుమగుళుచ్ఛ బంధం రమణీయంగా ఉంటాయి. చిత్రాన్ని చూసి పద్యాన్ని చదువుకుంటూ పోతే అందలి రచనా చమత్కృతి బోధపడుతుంది. పతాకబంధాన్ని ఒకదాన్ని చూడండి. ఇటువంటివి ఆనాటి పండితుల పాండితీ ప్రదర్శనకు నికషోపలాలు.(పతాక బంధం చిత్రం 238 చూడండి!)

# వేగధాటి

ఇరవయ్యో శతాబ్దం ప్రథమార్థంలో అవధానాశుకవితా సామర్థ్యాన్ని అద్భుతంగా ప్రదర్శించి బహు గ్రంథకర్తలైన విద్వత్కవి శేఖరులు శ్రీ గాడేపల్లి వీర రాఘవ శాస్త్రి.

శా॥ పేరా రాఘవశాస్త్రి గాడెపలియన్ పేరింటి పేరింక మా
యూరా రక్తనగాఖ్య పట్టణము మా యుద్యోగమా రాట్సు భా
స్కారుల్ చూడ శతావధానములు మెచ్చంజేయుటే.....

ఎర్రగొండపాలెం రక్తనగాఖ్య పట్టణమైంది. తెలుగు పదాలను సంస్కృతీకరించి రాసే ఆరోజుల్లోనే, జానపద భాషలో కూడా పద్యాలు రాసేవారు. పండితులు కొందరు కావాలని చమత్కారం కోసం ఆవిధంగా రాయటం కద్దు. శ్రీ మేడవరపు సుబ్బరాయ కవి రాఘవశాస్త్రి గారిని గ్రామ్యోక్తులతో ఇలా ప్రశంసించారు

రాగవ శాస్తులో రడుగొరా ! అదె సుడీ ! పెబంతమాసి చే
లాగన మంటకైతలో సెలాకు పరీచ్చట ! బుద్ధిమేదయే
మో! గడెకొక్క పొచ్చకము వున్నటె ఉండు రసిస్తడంట! అ
బ్బే ! గదవాలకాడ పెద పెద్ద పెసంగము సేత్త డంటరా!

అవధానాశు కవితా ప్రియులైన గద్వాల సంస్థానాధీశుడు సీతారామ భూపాలుడు వీరిచే ప్రదర్శనలు చేయించటమే కాక వీరి చాటు ప్రబంధాలను ముద్రించారట. గద్వాల మహారాణి శ్రీమతి ఆదిలక్ష్మీ దేవమ్మ గతించిన తన జ్యేష్ఠ పుత్రిక సత్య వరలక్ష్మీ దేవి స్మృతికిగాను శాస్త్రిగారిచేత రామాయణాన్ని రాయించారు. త్రిపురాంతక స్థల మాహాత్మ్యం,సత్య వరలక్ష్మీ ధ్రువ చరిత్ర మొదలైనవి ఇతర కృతులు. ఒక అవధానారంభంలో వీరు చెప్పిన ఈ కింది పద్యం వీరి పాండిత్యానికే గాక, వినయానికి కూడా నిదర్శనం.

ఏ స్థానంబున బార జూచినను ఇందెచ్చో నిరీక్షించినన్
ప్రస్థాన త్రయ శాంతికిన్ దగిన విద్వద్బ్రహ్మలే వేద భా
ష్య స్థార్థ ప్రతిపాదనా చతురులే సాహిత్య విద్భోజులే
యీ స్థానంబున మద్వధానమటవే యే ధైర్యమే శాంకరీ!

ఎటువంటి క్లిష్ట సమస్యనైనా అలవోకగా అడిగినంతనే పూరించేవారు శాస్త్రిగారు. ఈ ప్రజ్ఞను చూసి ఒక పండితు డీవిధంగా ప్రశంస చేశాడు.

అశ్రమ వృత్తి దుష్కరములైన సమస్యలు మీద మీద రా
విశ్రమమేమి ? ప్రాసలెట? భీష్టము లేవను శంకలేక శ
బ్ద శ్రవణంబు వెంటనే సుధారసధారల క్రుమ్మరించి ప
ద్య శ్రథనంబు చేతువు మహాకవి! యెంతటి వేగధాటియో.

వారు పూరించిన ఒకటి రెండు సమస్యలలోని చాతుర్యం గమనించండి.

సమస్యః ఖాద్ర్యా తాధిపుడు శేషుకౌగిట జొచ్చెన్

ఇందులో అర్థక్లేశం, ప్రాసక్లేశం ఉన్నాయి. గరుడుడు శేషుని కౌగిటిలోకి ప్రవేశించాడు - అని కుంజర యూథంబు దోమ కుత్తుక జొచ్చెన్ వంటి సమస్య ఇది.ఆ పద్ధతిలోనే దీన్ని గాడేపల్లి వారు పూరిస్తూ పరాక్రమ సంపన్నుడైన పాండు పౌత్రుడు అభిమన్యుడు శత్రువుల చేతుల్లో పడ్డాడు అనే భావాన్ని తీసుకొని ఇలా చెప్పాడు.

విద్ర్యుత నిష్ఠాపరుడై
రాద్ర్యాతముద్రుంచు పాండు రాజు మనుమడే
ద్విద్ర్యాతము చేబడెనటె!
ఖాద్ర్యా తాధిపుడు శేషు కౌగిట జొచ్చెన్

సమస్యః తండ్రీ ! రమ్మని ప్రాణనాథు బిలిచెన్ దన్వంగి మోహాంధయై.

మన్మథ బాధతో తపిస్తున్న కాంత - ప్రాణనాథుడు కోర్కె తీర్చటానికి రాకపోతే, తానే పూనుకొని పైన బడి ప్రాణనాథుని తీవ్రంగా పిలుస్తున్న పద్ధతిలో పూరణ జరిగింది.

ఉంద్రానట్టి మనోజ తాపమున ధైర్యోచ్ఛేదమై ప్రేమమున్
గుంద్రాయట్టు లొనర్చి ప్రక్కబడి కోర్కుల్ దీర్చ రానట్టి కో
దంద్రామాభుడు నాథుపై గవసి త్రాతా ! రార! బేతాళు పె
త్తంద్రీ! రమ్మని ప్రాణనాథు పిలిచెన్ తన్వంగి మోహాంధయై.

'గాడేపల్లి వారి కవితా విలాసము' అనే పేరుతో శ్రీ మద్దులపల్లి వేంకట సుబ్రహ్మణ్య శాస్త్రిగారు రచించిన గ్రంథంలో ఇటువంటి విశేషాలెన్నో ఉన్నాయి. తిరుపతి వేంకట కవులపైని అభిమానం,కొప్పరపు కవులపైని విరోధం, ఆ సందర్భాల్లో చెప్పిన పద్యాలు వారి ప్రతిభా ప్రాభవాలకూ, తీవ్ర స్వభావానికీ తార్కాణాలు.

శాస్త్రి గారెన్నో గ్రంథాలు రచించినా కొన్ని మాత్రమే అచ్చయ్యాయి. కొన్ని మిగిలిపోయాయి. గాడేపల్లివారే వాటిని గూర్చి ఇలా తమ ఆవేదన వ్యక్తం చేశారు.

మసిపాతకన్నను నసిదప్పిముద్రణ కుద్రేక ముడిగిన వొక్క కొన్ని
జీర్ణ పత్రములలో జీర్ణించి క్రిములచే దష్టంబులైన పొత్తములు కొన్ని
ఆశువు లందంద హ్రస్వమయ్యును జిక్కి యున్నవి వేనవేలొక్క కొన్ని
పత్రికాంగనలలో ప్రచురణకని యేగి చెరి సగమౌచు నిల్చినవి కొన్ని
హరిహరీ! వీర రాఘవ వర కవీంద్రు సరస రచనా నితంబినుల్ సభల ప్రభుల
నయన హస్తావ లగ్నలై నాట్యమాడు సమయమే నాటి కో యనుజా! యెరుంగ.

తమ పుస్తకాలు సభలలో, సహృదయుల చేతులలో, రసజ్ఞుల కనుల ముందు ఎప్పటికి నర్తిస్తాయో అని వారు చెందిన బాధ బాధగానే మిగిలిపోయింది. రచనలన్నీ అచ్చుకు నోచుకోనే లేదు.

## పొట్ట తిప్పలే !

కష్ట సుఖాలు కావడి కుండల వంటి వంటారు. కర్మానుగుణంగా వస్తూ పోతూ ఉంటాయి. అయితే కష్టాలు వరుసగా ఒక దాని పైన ఒకటి వస్తూ ఉంటే భరించడం కష్టం, దుర్భరం ఒక సారి ఇబ్బందులు పరంపరగా వస్తే కవి ఒకడిలా తన ప్రభువుతో విన్నవించుకొన్నాడు -

గురువుల రాక, దాసి మృతి, గుర్రపు దాడియు, వాన, వెల్లువల్
పొరుగున నప్పు బాధ, చెవి పోటును, దొమ్మరులాట, యింటిలో
వర సతి గర్భ వేదన, వివాహము, విత్తుట, అల్లు నల్కయున్
కరువు, దరిద్ర, మాబ్దికము, కల్గె నొకప్పుడు కృష్ణ భూవరా !

మరొక కవి అష్ట కష్టాలను గురించి ఈ విధంగా రాశాడు -

ఆరయ పరదేశ యాత్ర చేయుట యొండు తనకు తానే వండు కొనుట రెండు
కులసతి నెడబాసి తొలగి పోవుట మూడు వెలయంగ యాచక వృత్తి నాల్గు
తనసరి వారి పంచను చేరుకొనుటైదు గురుతెరుంగని రాజు కొలుచుటారు
చదువు నేరక యుండి సభకు పోవుట యేడు ఎన్న దారిద్ర్యంబు నెన్మిదవది.
అష్ట కష్టంబులనియెడు నవ్వి యివ్వి కాన నిటువంటి వెవ్వరికైన వలదు
చారుతర మూర్తి! దేవతా చక్రవర్తి రమ్యగుణధామ ! కావేటి రంగధామ !

విదేశ యాత్ర, స్వయంపాకం, కులసతీ వియోగం, అడుక్కునే వృత్తి, సరి వారిని ఆశ్రయించడం, గురుతెరుగని ప్రభువు కొలువు, చదువు లేక సభకు పోవడం, దారిద్ర్యం - నిజంగానే ఎవరికైనా దుస్సహమైనవి. వెనకటి రోజుల్లో గురువుల రాక ఇబ్బందిగా ఉండేది. మందీ మార్బలంతో, శిష్యులతో పటాటోపంగా వచ్చే వారు. వాళ్ళకు చేసి పెట్టలేక గృహస్థులు సతమతమయ్యే వారు. గుర్రపు దాడి కూడా భయంకరమైనది. బందిపోట్లూ, సైనికులూ వస్తే ఉన్నదంతా దోచుకుని అవమానించి - హింసించి పోయేవారు. వానలు, వరదలు, ఋణ బాధలు మొదలైనవి అందరూ ఎరిగినవే. ఇటువంటి కొన్ని బాధలకు లోనైన ఆధునిక కవి శ్రీ మాధవపెద్ది బుచ్చిసుందర రామశాస్త్రి చమత్కారంగా బ్రహ్మను సాటికులం వాడినని చిన్నమెత్తు అభిమానం కూడాలేదా అని నిలబెట్టిగట్టిగా అడిగాడు -

నిష్ఠ దరిద్రజీవనము నెత్తురు సైతము పీల్చునట్టి పా
పిష్ఠి ఋణాల బాధయును పిల్లికి బిచ్చము పెట్టనట్టి కం
కోష్ఠపు గ్రామ వాసమును, కొల్లగ నొష్ఠ లిఖించినావురా
జెష్ఠ ! కులాభిమాన మొక చిన్నము లేదటరా ప్రజాపతీ !

శాస్త్రి గారు పొట్టిగా, లావుగా ఉండేవారు. సంస్కృతనాటకాల్లో విదూషకుడిలా తన మీదనే హాస్యాన్ని ప్రయోగించుకొని - ఇతరులను నవ్వించే లక్షణం ఈయనలో ఉంది. ఈశ్వరుడితో మొరపెట్టుకుంటూ - ఒక లంబోదరుడు ఇదివరకే నీకు కొడుకున్నాడు. వాడు చాలక ఈ లంబోదరుని సృష్టించావా? పోనీ సృష్టిస్తే సృష్టించావు. తీగకు కాయలు బరువా ? అయితే వాడికి కుడుములిచ్చావు నాకు ఇడుములిచ్చావు. ఇదేమిన్యాయమయ్యా! అని ఈ పద్యం పలికాడు -

ఒక లంబోదరుడైన పుత్రకుడు మున్నున్నట్టిదే నీకు చా
లక కాబోలు సృష్టి చేసితివి యీ లంబోదరున్ గూడ తీ
గకు కాయల్ బరువౌన? కానీ కుడుముల్ కల్పించి అవ్వానికే
లొకొ ? యివ్వానికి నొక్కమైని యిడుమల్ మొల్పింతు మృత్యుంజయా !

తిరుపతి వేంకట కవులు వేంకటగిరిలో రాజదర్శనం కోసం పడిగాపులు కాస్తూ చెప్పిన పద్యంకూడా వారి దేశాటన కష్టాలను చూపిస్తుంది -

కఠినమ్ములగు రాళ్ళు కరపి కట్టిన రామ భజనాలయమ్ములే పడకకాయె
తాకిన మాత్రాన తనువు కర్రగ జేయ జాలిన చలినీటి స్నాన మాయె
ఉడికియునుడుకని వేడిమెతుకులే యా కొన్న కడుపున కడ్డ మాయె
ప్రభువిచ్చె వేనూట పదియారులనునట్టి 'స్వప్న' మ్ములే ధనార్జనములాయె...

బండల మీద పడుకోడం, చన్నీటి స్నానం, స్వయం పాకం, ఇలా కష్టాలు పడుతూ, కలలు కంటూ కవిత్వాన్ని సృష్టించారు వారు. ఎందుకయ్యా - ఈ బాధలన్నీ అంటే పొట్ట కోసమే అని తమ వేదన వెళ్లగక్కారు -

ఎట్టొ విద్యలనభ్యసించుకొని ఆ యా దూరదేశంబులన్
పట్టబంచును పల్లె యంచనక విద్వద్వేషమున్ బూని బల్
తిట్టుల్ దిట్టుచు తిట్టులన్ బడుచునిన్ ద్రిప్పన్ ఫలం బేమియో
పొట్టా! నీ దురదృష్ట మిట్లయినచో భూపాలకుల్ నింద్యులే !

కష్టాలలో నించి కన్నీళ్ళలో నించి పుట్టిన కవిత్వం కరుణకాకలి అయి హృదయాన్ని కదిలించేస్తుందనడానికి ఇటువంటివి ఉచితోదాహరణలు.

## కత్తితో పద్యం

కీ.శే. రాప్తాటి ఓబిరెడ్డిగారు అనంతపురం జిల్లా కల్లమడి గ్రామ వాస్తవ్యులు. వీరు హరికథలు, నాటకాలు, శతకాలు ఎన్నో రచించి పండితుల మన్ననలకు పాత్రులైనారు. వారి రాప్తాటి హరికథా సంపుటి ఇటీవలే అచ్చయింది. రెడ్డిగారు చిత్ర కవితా రచనలో అందెవేసిన చేయి .

బంధ కవిత్వ ధోరణికి చక్కని ఉదాహరణగా వారి పద్యాలెన్నో ఉపయోగిస్తాయి.

ఇదిగో గోమూత్రికాబంధం-

ఆ.వె. ధీర ! దేవముఖ్య ! దివ్యకీర్తి మురారి !
పంతమేల రార ! భవ్యగేహ!
నారదాపనాఖ్య! నవ్యమూర్తి ! సురాప్త
హండమేటిరాయ ! భక్తగేయ!

బృందావన బంధం.

ఆ.వె. శ్రీశ! వరద ! పంతమేల ! నీ తనయుండ
జగతిబ్రోవు మేలు సంఘటిల్ల
రార! యరుభాస ! రణధీర ! సదయాత్మ !
పండమేటి రాయ ! భక్తగేయ !

మరి రెండు బంధాలు - రథబంధము. ఖడ్గబంధం బొమ్మలు. ఈ కింద రథబంధ గీతం:

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| | | | | శ్రీ | | | | |
| | | | శి | వేం | ద్రా | | | |
| | | ర్చి | తా | క | మ | లే | | |
| | శ | వెం | క | టే | శ | స | ర్వే | |
| శ | వ | ర | మ | శు | భే | ద్ధ | చ | రి |
| త | ని | న్ను | గ | డు | భ | క్తి | ధ్యా | నిం |
| | తు | ని | య | తి | మీ | ర | కా | |
| | | వు | క | రు | ణా | త్మ | | |
| | | | ప్రే | మ | నన్ | | | |
| | | గ | మ | ల | నే | త్ర | | |

గీ. శ్రీ శివేంద్రార్చితా కమలేశ వెంక
టేశ సర్వేశ పరమ శుభేద్ధ చరిత
నిన్ను గడు భక్తి ధ్యానింతు నియతిమీర
కావు కరుణాత్మ ప్రేమ నన్ గమలనేత్ర.

ఖడ్గ బంధం:

వే క్తి దుకులేశ, యూశ యను రనా
శ్రీ దశ్రితభ భయభేద శ్రీనివాస వెంకటే శ
మో ప కా తసి లామదస న్నుమత్ర మిర్వ

ఆ. శ్రీ దవేదమోద శ్రిత భక్తభవ భయ
భేద శ్రీనివాస వెంకటేశ
శర్వమిత్ర మన్ను సదమలాసితకాయ
యదుకులేశ యూశ యనురనాశ.

రాప్తాటి హరి బంధాలలో పదాలు వివిధాకారాలు ధరించి బంధితమై. బంధురతను సంధానించుకొన్నాయి.

## చతురోక్తి విలాసం

హాస్యరచన ప్రధానమైన రచనలుమన సాహిత్యంలో తక్కువ.తెనాలి రామకృష్ణునికి హాస్యరచయితగా లోకంలో పేరు వచ్చింది గాని, అతని కావ్యాలలో ఆపాలు చాలా తక్కువ. చాటువులలో మాత్రం కొంత ఉంది. సంస్కృత నాటకాలలో కూడా కొంత మొరటు హాస్యమే. అశ్లీలం

ద్వారా హాస్యం పుట్టించడానికి కొందరు పూనుకొన్నారు.బూతాడక దొరకు నవ్వు పుట్టదు - అన్నాడు కవి చౌడప్ప.

పది నీతులు పది బూతులు
పది శృంగారములు కల్గు పద్యములు సభన్
జదివినవాడే యధికుడు
గదరప్పా ! కుందవరపు కవి చౌడప్పా !

పూర్వ సాహిత్యంలో కంటె ఆధునిక సాహిత్యంలో హాస్యరస ప్రధానమైన రచనలు పద్య గద్య కథా నవలా వాఙ్మయంలో తెలుగులో ఎక్కువగా వచ్చాయి.పద్యాలలో హాస్యాన్ని ఉత్పాదింప చేసినవారిలో జలసూత్రం రుక్మిణీనాథ శాస్త్రి, మాధవపెద్ది బుచ్చి సుందరరామశాస్త్రి మొదలైనవారు కనిపిస్తారు.

బుచ్చి సుందరరామ శాస్త్రి హాస్యపద్యాలు సభలలో బాగా రక్తి కట్టి పాదం పాదానికి చప్పట్లు కొట్టించేవి. గిరీశం మీదాయన చెప్పిన పద్యం చూడండి -

గొంగడి పురుగు కట్టింగు మీసల వాడు గంపశ్రాద్ధపు తలకట్టువాడు
ఎపుడు కాఫీదుకాణపు తేవిణీవాడు సిగరు పీలుపు బుగ బుగలవాడు
పైపటారమును లోపల లొటారమువాడు పట్టు దప్పిన చలో భాయిగాడు
తుదమొదల్ లేని గాడిద గత్తరలవాడు జలసాలతో పడి చచ్చువాడు
తడి యనెడి దున్నచో చేత తుడుము మొదలు
దేవతార్చన వర కొక్క తీరువాడు
వలను పడుకున్న శ్రీ శుకు వంటివాడు
త్రోవ దొరికిన వట్టి గంధోళిగాడు

గిరీశం రూపాన్ని మనస్తత్వాన్ని ఇంతకంటె చతురంగా చెప్పటం అసాధ్యం. ఫాషన్లు పెరిగిన కాలంలో యువతులకుతమ భర్తలు అత్యాధునికంగా ఉండాలని కోరిక -అలా ఉండకపోతే కండ్ల జూడరు సుమా అంటూ చమత్కారోక్తి చారుతరమైన పద్యం విసిరారు మాధవపెద్ది కవి.

కనులం జూడదుభార్యయేనియును నీ కాల స్థితింబట్టి జ
ర్మను తైలమ్ము జపాను సబ్బుమెరికా క్రాపున్ వియన్నా సులో
చనముల్ స్వీడను చేతి బెత్తమును స్విడ్జర్లెండు రిస్ట్వాచి ఫా
రెను డ్రెస్, ఫ్రెంచి కటింగు మీసలును పారిస్ ఫ్యాషనే లేనిచోన్

భావకవిగా ప్రసిద్ధుడైన శ్రీ దేవులపల్లి కృష్ణ శాస్త్రి వివిధ సందర్భాలలో చెప్పిన చాటువులలో హాస్యోక్తులు వెల్లివిరిసినవి కొన్ని

ధిషణాజిత బృహస్పతులు, తపఃకృశాంగులు అయిన వేద విదుల పరంపరలో ఆవిద్యతగ్గి బుఱ్ఱ బదులు బొఱ్ఱ పెరిగిందంటూ ఈ విధంగా రాశారు.

కత్తి వదలి రాజు కామిని చేపట్టె
గంటమొదిలి మంత్రి గరిటె పట్టె
వేసమునకు మిగిలె మీసాల దుబ్బులే
విశ్వదాభిరామ ! వినుర వేమ!

పంచదార కంటె పరస్త్రీ, రాజు కంటె రంకు మగడుమోజు. ఎప్పుడూ అయినదాని కంటె కానిదానిమీద ఇష్టం ఎక్కువ. లోకంలో పొరుగింటి పుల్లకూర రుచి అనే సామెత్ కూడాఇటువంటిదే. వీటిని మనసులో పెట్టుకొని దేవులపల్లి వారు చెప్పిన పద్యమిది.

పంచదార కంటె పరదార తీయన
రాజు కంటె మోజు రంకుమగడు
ఐనదానికంటె కానిది మేలయా
విశ్వదాభిరామ ! వినుర వేమ !

శ్రీ అబ్బూరి రామకృష్ణరావు, అరయన్ శంతను పుత్రుపై విదురుపై అక్రూరుపైకుబ్జపై... ఇత్యాది ప్రసిద్ధ పద్యానికి అనుకరణంగారాసిన ఈ కింది పద్యం హాస్యోల్లాసకరమైంది.

ఉపమాపై పెసరట్టుపై ఇడిలిపై హుమ్మంచు చూపించు నీ
జపసంబద్ధ పరాక్రమ క్రమ కటాక్షశ్రేణి మన్నించు శు
భ్రప జిల్లేబి, పకోడి, లడ్వగయిరాపై కొంత రానిమ్ము శ్రీ
చపలాపాంగ సితాంగనా హృదయపాశా ! పూజ్యవస్తు ప్రియా !

ఇటువంటి చతురోక్తులు ప్రాచీనార్వాచీనులలో కోకొల్లలుగా తీసి చూపవచ్చు.

## దాంభిక గర్వభంజనులు

ఆంధ్ర సాహిత్య రంగంలో తిరుపతి వేంకట కవుల ప్రవేశంతో కవులు జంటగా కలిసి కవిత్వం చెప్పడం, అవధానాలు చేయటం, పుస్తకాలు రాయటం ఒక మోజుగా తయారైంది. ఎన్నో జంటలు ఆ కాలంలో ప్రసిద్ధి కెక్కాయి.రామకృష్ణ కవులు, కొప్పరపు కవులు,శేషాద్రి రమణ కవులు, వేంకట పార్వతీశ్వర కవులు మొదలైన వారెందరో ఇద్దరిద్దరు కలిసి, కవితాసీమలో విహారం చేశారు. తిరుపతి వేంకట కవులకూ, కొప్పరపు సోదర కవులకూ సాహిత్య సంగ్రామం జరుగుతున్న రోజుల్లో అటూ ఇటూ వారి శిష్యులూ, వీరి శిష్యులూ, వారి అభిమానులూ, వీరి అభిమానులూ సభల్లో, పత్రికల్లో, తమ తమ పక్షాలను బలపరుస్తూ ప్రసంగాలు, వ్యాసాలు, పద్యాలు చేస్తూ, రాస్తూ ఉండేవారు.

ఆ విధంగా స్వపక్ష సమర్థనం,ప్రతిపక్ష నిరాసం చేసిన వారిలో గురువిశ్వనాథ కవు లనే జంట ఒకటి. శ్రీ మిన్నికంటి గురునాథశర్మ. పోతరాజు విశ్వనాథశర్మ - ఆ ఇద్దరి పేర్లు. వీరిలో మొదటి వారు సారస్వతానికి జీవితాన్ని అంకితం చేసి ఎన్నో గ్రంథాలు రచించి ఇటీవలే కీర్తిశేషులైనారు. రెండవ వారు సాహిత్య రంగంలోనుంచి రాజకీయ రంగంలోకి వెళ్ళి, గాంధీగారి సత్యాగ్రహ సమరయోధులలో ఒకరై, జీవితాన్ని చరితార్థం చేసుకొని వెళ్ళిపోయారు.

ఈ ఇద్దరూ చిన్నతనంలో కొప్పవరపు కవుల పక్షం వహించి - తిరుపతి వేంకట కవులకు హెచ్చరిక ' అనే శీర్షికతో రాసిన పద్యాలు వారి కవిత్వాన్నే గాక, ఆనాటి సాహిత్య విశేషాలను కూడా మనకు తెలియజేస్తాయి.

బాంధవులు రామకృష్ణులు పగరలగుట
భీమ విజయ లనందగి బిరుదు గనిన
సోదరులు ప్రాణశత్రులై చూడబడుట
నెరుగనయ్యో మీ కురుబలం బిట్టిదంచు

చుట్టాలైన వేంకట రామకృష్ణ కవులు పగవారైనారు. భీమార్జున సమానులైన కొప్పవరపు సోదర కవులు అత్యంత శత్రువులైనారు. కనుక మీ కురుబలం ఇలాంటిదని తెలుస్తున్నది. మీ ' కురుబల' మని, మీకు 'ఉరుబల' మని రెండర్థాలు. కొప్పవరపు వారిది పాండవ పక్షమని,తిరుపతి వారిది కౌరవ పక్షమని భావించి దానికి అనుగుణంగా శబ్ద ప్రయోగం చేయటం జరిగింది.

తిరుపతి వేంకట కవుల రచనల్లో కొన్ని శబ్దాలను, పద్యాలను దోషాలుగా ఆరోపించి ఈ విధంగా రాసినరాతల్లోనే తప్పులున్న మీరు, అవధానాల్లో ఎన్నో పొరపాట్లు చేసిన మీరు, మహాశు కవులైన కొప్పవరపు వారిని ఏ విధంగా గెలవగల రంటూ ఇలా హెచ్చరించారు.

ఆలోచించియు వ్రాసినట్టి దగు పద్యంబే రసాభాసమై
బాలాలాప సమానమై గణ యతి ప్రసాది సంత్యక్తమై
తాలుంబాతర బోలియుండ తమ రేదారిన్సుధాధారలన్
మేలంబాడు, మహాశు పద్య కవులన్ మీరంగ నాశింతురో?
కాళీ పదాపయోరుహార్చకుల వాక్కాంతా పుమాకారులన్
వ్యాలోలామృత వాగ్విలాసుల వధాన్య గ్రీవులన్ దుష్కవి
వ్యాళ వ్యూహ విహంగపుంగవుల కొప్రంపుంగ వీశార్కులన్
వాలింపన్ వశమేవిధాన కవితా ప్రభ్రష్టులౌ వారికిన్

ఆ కాలంలో తిరుపతి వేంకటేశ్వరులు ఎందరితోనే పోట్లాడారు. ఎన్నో సాహిత్య యుద్ధాలు చేశారు. వాటినే ప్రస్తావిస్తూ గురు విశ్వనాథు లీరకంగా అన్నారు.

శ్రీనివాసాచార్య సింహంబు గర్జింప ఇభ రూపమున పరువెత్తున్నాడు
కాశినాథ బుధేంద్ర కాలాహి బుస వెట్ట మండూక రూపాన నుండునాడు
రామకృష్ణ కవీట్తరక్షు లీక్షింపంగ మృగ భావమునలోగి మిడుకునాడు
శ్రీరామ రాట్కవి శ్యేనంబు పొడసూప శశకిశోరక వృత్తి జనిననాడు
నేరువని మాయలొకకొన్ని నేర్చి నేడు దశగళాకృతి బూని పాతాళ హోమ
మాచరించుచునుండి రయ్యదియు సోద ర కవిరాడ్రామ లక్ష్మణ నికటచరకు
భృచ్చరుల చేత జెడె గీరతేశులార !

ఆత్మకూరులో శ్రీనివాసాచార్యులు సింహమై గర్జిస్తే, మీరు ఏనుగులై పరుగెత్తారు. పేరి కాశీనాథశాస్త్రికాలసర్పమై బుస కొడితే మీరు కప్పలైనారు. వేంకట రామకృష్ణులనే సివంగులు చెలరేగితే మీరు లేళ్ళవలె మిడికినారు. బెల్లంకొండ రామారావనే గద్ద పొడసూపితే మీరు కుందేలు పిల్లలైపోయినారు. అప్పుడు నేర్చుకోని మాయాలిప్పుడు కొన్ని నేర్చుకొని రావణుని వలె పాతాళహోమం జేస్తున్నారా? అవి కూడా సోదర కవులనే రామలక్ష్మణులు చెడగొట్టారు. ఇక మీకు గతిలేదు.

ఇందులో ఒక్కొక్క పాదం ఒక్కొక్క పెద్ద కథ. రామకృష్ణ కవుల మీద తిరుపతి వారుగీరతం రాశారు. కొప్పరపు వారిపైన గుంటూరి సీమ రాశారు. అవన్నీ అబద్ధాలనీ మీ గుంటూరు సీమ గ్రంథమనే అడవిని కొప్పరపు కవులు ప్రయోగించే సర్వమంత్ర శ్రేష్ఠమైన నారాయణా స్త్రవు ( ఆ పేరుగల గ్రంథం) అగ్నిజ్వాలలు బూడిద చేస్తాయని ఇలా రాశారు రచయితలు.

శా.. అగ్రాహ్యానృత పద్యకంటకకు జేషూకీర్ణ గుంటూరు సీ
మగ్రంథాటవి తావకీనమున సన్మార్గంబునున్ సర్వ మం
త్ర గ్రీవాయితసత్య దైవతలసన్నారాయణాస్త్రాహ్వ
త్యుగ్ర జ్వాలలు భస్మసాత్కృతిని జేయున్ మానుడీ దంభముల్

దాంభిక గర్వభంజనులమని చెప్పుకొన్న గురువిశ్వనాథ కవుల యేతాదృశ రచనా ధోరణి, ప్రతిభాపాండిత్య పాటవాంచితమై అలరిందనటంలో ఎంత మాత్రం సందేహం లేదు.

## చిత్రమిది తండ్రీ!

**చి**లకమర్తి లక్ష్మీనరసింహంగారు సాహిత్యంలో అన్ని ప్రక్రియల్లో తమ సామర్థ్యం చూపించారు. నవలలు, నాటకాలు,పద్యాలు, గద్యాలు అన్నిరకాలూ రచించి పేరు పొందారు.సంఘ సంస్కరణాత్మకమైన రచనలు చేసి నాటి సామాజికోన్నతికి ఎంతో పాటు పడ్డారు. నాటి స్వాతంత్రోద్యమ కాలంలో లాల్, బాల్, పాల్ నాయక త్రయం, లాల్ అంటే లాలా లజపతిరాయ్, బాల్ అంటే బాలగంగాధర తిలక్, పాల్ అంటే బిపిన్ చంద్రపాల్ చిలకమర్తి వారు బిపిన్ చంద్రపాల్ ఆంధ్రభూమికి వచ్చి చేస్తున్నఆంగ్లోపన్యాసాలకు సభలలో తెలుగు అనువాదం చేసేవారు.1907లో రాజమండ్రిలో జరిగిన 'పాల్' సభలో చివర నరసింహంగారు ఈ పద్యం చెప్పినారు.

భరత ఖండంబు చక్కని పాడియావు
హిందువులులేగదూడలై యేడ్చుచుండ
తెల్లవారను గడుసరి గొల్లవారు
పితుకుచున్నారు మూతులు బిగియగట్టి

అన్వయ క్లేశం లేకుండా, క్లిష్టమైన పదాలు లేకుండా నాటి దేశ దుస్థితిని వర్ణిస్తున్న ఈ పద్యం ప్రేక్షకుల నెంతో ఆకట్టుకుంది. మిన్ను మార్మోగేలా కరతాళ ధ్వనులు చెలరేగాయి. సభ కాగానే ఎందరో దగ్గరికి వచ్చి ఆ పద్యాన్ని మళ్ళీ మళ్ళీ చదివించుకొని కంఠస్థం చేశారు. ఆ నాటి పత్రికలన్నీ ఈ పద్యాన్ని ప్రచురించాయి. ఊళ్ళోగోడల మీది కెక్కిందీ పద్యం. గోదావరి వంతెన పైన కులుకు లాడింది. హరికథల్లో ఈ పద్యం చదవకపోతే సంతృప్తిగా ఉండేది గాదు. అంతగా ప్రచారం పొందిందీ పద్యం!

అంధ్ర కేసరి టంగుటూరి ప్రకాశం పంతలు గారంటే చిలకమర్తి వారికి చాలా ఇష్టం. గౌరవం. ఆయన మీద ఎంత చక్కని సీసాన్ని చెక్కారో చూడండి.

ఈగ వ్రాలిన గాని వేస జారెడునట్లు నున్నంపు కురులను దువ్వినాడు
వర లలాటము నందు తిరుచూర్ణ రేఖను ముద్దు గారెడు ఫణిని దిద్దినాడు
అరుణ పల్లవమట్లు కరము రంజిల్లు చెం గావి వస్త్రంబును గట్టినాడు
చారలంగరఖాను చక్కగా ధరియించి పటెవాటు కండువ వైచినాడు
చెవుల సందున గిరజాలుచిందులాడ మొగము మీదను చిరునవ్వు మొలకలెత్త
టంగుటూరి ప్రకాశము రంగు మెరయ ధవళగిరి తీర్థమునకును తరలి వచ్చె

ఒకనాడు సాయంత్రం నాటక సమాజ సభ్యులు సరదాగా మాట్లాడుకుంటూన్నారు. నిర్వాహకులు హనుమంతరావుగారు అందరికీ పకోడీలు తెప్పించారు.అప్పుడు టంగుటూరి ప్రకాశం పంతులుగారు, చిలకమర్తి వారు కూడా అక్కడ ఉన్నారు.ప్రకాశంగారు నవ్వుతూ చిలకమర్తి వారితో ఆశువుగా పకోడీల మీద పద్యాలు చెప్పండి. పద్యానికి పకోడీ బహుమానం అన్నారట. అయ్యా అక్షర లక్ష లిచ్చే దశ పోయిపకోడీకి పద్యం చేప్పే దశ వచ్చిందా ! అయితే అడిగినవారు మీరు గనుక, సరదాగా అడిగారు గనుక చెవుతానని ఏడు కందాలు పొందికగా అందించారు.

అందులోని మూడు చూడండి!

వనితల పలుకుల యందున
అనిమిష లోకము నున్న దమృత మటంచున్
జను లనుటెగాని లేదట!
కనుగొన నీయందమృతము కలదు పకోడీ!
ఆ కమ్మదనము - ఆ రుచి
ఆ కరకర - ఆఘుమఘుమ - ఆ పొంకము లా
రాకలు పోకలు పడువులు
నీకే తగు - ఎందు లేవు - నిజముపకోడీ!
కోడిని దినుటకు సెలవున్
వేడిరిమును బ్రాహ్మణులును వేధ నతండున్
కోడి వల దా బదులుగ ప
కోడిన్ దినుమంచు జెప్పె కూర్మి పకోడీ !

ఆ రోజుల్లో గయోపాఖ్యానం నాటకం చూడని వారు ఉండేవాడు కాదు. లక్షప్రతులు అమ్ముడుపోయిన నాటక మది. అంతగా ప్రజాభిమానం చూరగొన్న రచన అది. అంతటి నాటక రచయిత కూడా ఇతరుల రచనలు బాగుంటేహృదయ పూర్వకంగా మెచ్చుకొనేవాడు. వడ్డాదిసుబ్బరాయ కవి వేణీసంహార నాటకాన్ని చిలకమర్తికి స్వయంగా వినిపించారు. ఆ రచనలోని ప్రజ్ఞా ప్రాభవాలకు,సుందర గంభీరధోరణికి పులకించిన నరసింహంగారు ఈపద్యం చెప్పారు.

వేణీ సంహారంబును
వాణీధవతుల్యుడైన వసురాయడు తా
నాణెముగా తెలిగించెను
ప్రాణంబుల్ లేచి వచ్చు పద్యము విన్నన్

చివరి పాదంలో ఉన్నది పద్యానికి ప్రాణం. చిన్నతనం నుంచికొంచెం కొంచెంగా పెరుగుతూ నేత్ర వ్యాధి ముదిరి చిలకమర్తి వారు పూర్తిగా అంధులైనారు.అయినా రచనా వ్యాసంగాన్ని మానకుండా కొనసాగించి,జ్ఞానైక చక్షులై పరమేశ్వరుని ఈ విధంగా ప్రార్థించారు.

అన్నా! నీదగు మూర్తి యెట్టిదియొ జాత్యంధుండు కాలాద్య వ
చ్ఛిన్నంబై జగదేక పూర్ణమగు నీ చిన్మాత్ర దివ్యాకృతిన్
కన్నారంగను పుండరీక దళసంకాశ స్ఫుర న్నేత్రుడున్
నిన్నుం జూడగలేడు చిత్ర మిది తండ్రీ ! సత్కృపాంభోనిధీ!

## రసయోగి

కొన్ని సంస్కృతపదాలు ఉన్నవిఉన్నట్లుగా తెలుగు భాషలో వాడుకలోనికి వచ్చి, అవి అచ్చపు తెలుగుమాట లన్నంతగా స్థానం సంపాదించుకొన్నవి. నమస్తే శ్రీరస్తు, శుభమస్తు, స్వస్తి మొదలైనవి అటువంటి కోవలోకి వస్తాయి. కొందరు కవులు వాటిని నిరాఘాటంగా పద్యాల్లో వాడి, వాటి సౌందర్యాన్ని తెలుగువారికి అందించారు. అందులో శ్రీనాథుడటువంటి ప్రయోగాలు చమత్కార

చతురంగా ప్రయోగించి రసజ్ఞుల హృదయాలను ఆకర్షించాడు అటువంటి ఈ కింది పద్యం పరికించండి.

శ్రీరస్తు ! భవదంఘ్రి చికురంబులకు మహా భూర్యబ్దములు సితాంభోజ నయన !
వరకాంతిరస్తు ! తావకముఖ నఖముల కాచంద్రతారకంబబ్జ వదన !
మహిమాస్తు ! నీ కటి మధ్యంబులకు మన్ను మిన్నుగ లన్నాళ్ళు మించుబోడి !
విజయోస్తు ! నీ గాన వీక్షల కానీల కంఠ హరిస్థాయిగా లతాంగి!
కుశలమస్తు భవచ్ఛాత కుంభ కుంభ జంభ భిత్కుంభి కుంభా భిజృంభమాణ
భూరి భవదీయ వక్షోజములకు మేరు
మందరము లుండు పర్యంత మిందు వదన !

ఈ పద్యంలో పాదాది కేశ పర్యంతం వివిధావయవాలను జంటలుగా తీసుకొని శుభవచనాలు పలికాడు కవిసార్వభౌముడు.

ముందు పాదాల నుంచి ముంగురుల దాకా ఒక్క సారి పరకాయించి చూశాడు. వాటికి 'దీర్ఘాయువగు గాక' అని ఆశీర్వదించాడు. ఎదురుగా వస్తున్నది కాంత,ముఖం కనిపించింది. నఖాలు కనిపించాయి. చంద్రుడు నక్షత్రాలు ఉన్నంతవరకు వాటికి కాంతి ఉండు గాక - అనేది రెండవ ఆశీస్సు. ఇక్కడ క్రమా లంకారం వదనాన్ని చంద్రబింబంతో, గోళ్ళను నక్షత్రాలతో పోల్చటం సంప్రదాయం. తరువాత పిరుదులు,నడుము - వరుసగా మన్ను మిన్ను ఉన్నంతకాలం వాటికి మహిమ ఉండును గాక ! అని ఇక్కడక్రమంగా తగిన ఉపమానాలే, వైశాల్యానికి మన్ను- భూమి, శూన్యత్వానికి సన్నదనానికి నడుము. ఇక గాన వీక్షలు - మాట - చూపు - నెమలిగొంతులాలేడి కన్నులలా విజయం పొందును గాక ! ఇంతటితో వేర్వేరు అవయవాలు వదిలి సార్థకమైన జంట వక్షోజాలను గ్రహించి బంగారు కుండల వలె, ఐరావత కుంభాల వలె అలరేవాటికి మేరు మందర పర్వతా లున్నంతకాలం కుశలం కలుగు గాక అని తృప్తి తీర ఆశీర్వదిస్తాడు.

ఈ విధంగానే ఇంకో పర్యాయం మరొక సుందరాంగిని చూసి ఈ ధోరణిలోనే వేరొక అందమైన సీసాన్ని పలికాడు. దాన్ని కూడా చూడండి.

చక్కని నీ ముఖ చంద్ర బింబమునకు కళ్యాణమస్తు బంగారు బొమ్మ !
నిద్దంపు నీ చెక్కుటద్దంపు రేకకు నైశ్వర్యమస్తు నెయ్యంపు దీవి!
మీటిన పగులు నీ మెరుగు పాలిండ్లకు సౌభాగ్యమస్తు భద్రే భయాన !
వలపులు గులుకు నీ వాలు గన్నులకు న త్యధిక భోగోస్తు పద్మాయతాక్షి!
మధురిమము లొల్కు నీ ముద్దు మాటలకును వైభవోన్నతిరస్తు లావణ్య సీమ!
వన్నె చిన్నెలు గల్గు నీ మన్ననలకు శాశ్వత స్థిరస్తు యోషాలలామ!

మొదటి పద్యంలో ప్రౌఢాంగనను వర్ణిస్తే ఈ పద్యంలో ముగ్ధను వర్ణించినట్లు కనిపిస్తుంది. ముద్దు ముద్దుగా తీయని చిలుక పలుకులు పలికే చిన్నారిని కళ్యాణమస్తు అని దీవించిన వైనం ఇక్కడ భాసిస్తుంది.

ఇక తళుకు బెళుకులతో, తొడల నిగ్గులతో, వగలతో, వయ్యారాలతో జిగీ, బిగీ కలిగిన నెరజాణ' మీద చెప్పిన పద్యం ఎంత పొంకంగా, బింకంగా ఉందో ఆస్వాదించండి-

సొగసు కీల్జడ దాన ! సోగ కన్నుల దాన ! వజ్రాలవంటి పల్వరుస దాన !
బంగారు జిగి దాన! పటువు గుబ్బలదాన ! నయమైన యొయ్యారి నడల దాన !
తోరంపు కటిదాన ! తొడల నిగ్గుల దాన! పిడికిట నడుగు నెన్నడుము దాన!
తళుకు చెక్కుల దాన ! బెళుకు ముక్కరదాన ! సింగాణి కనుబొమ చెలువు దాన !
మేలిమి పసిండి రవకడియాల దాన ! మించిపోనేల రత్నాల మించు దాన!
తిరిగి చూడవె! ముత్యాల సరుల దాన! చేరి మాటాడు చెంగావి చీర దాన !

వట్టి విభూతిని తెలుగు దేశంలో స్త్రీలు ధరిస్తే అది వైధవ్యానికి చిహ్నం. విభూతి, కుంకుమ ధరించటం దక్షిణ దేశంలో శైవ సువాసినుల ఆచారం. బహు బాల వితంతువును చూసి ఆమె సౌందర్యాన్ని పరికించి బాధపడిన కవిరాజీ పద్యాన్ని చెప్పినట్లు తోస్తుంది.

కుంకమ లేదో? మృగమద
పంకము లేదో? పటీర పాంసువు లేదో?
సంకుమ దము లేదో? అశు
భంకరమగు భస్మమేల? బాలా! నీకున్

కుంకుమ, కస్తూరి, చందనం-ఇవేవీ లేనట్లుగా పసిదానివి, వట్టి విభూతి - అశుభ చిహ్నంగా ధరించినా వేమిటి- అని పరామర్శించాడు శ్రీనాథుడు.

సౌందర్యవంతులైన స్త్రీలను చూసినప్పుడు పద్యం చెప్పకుండా ఉండని రసయోగి కవిసార్వభౌముడు. ఆ లక్షణం వల్ల ఎన్నో అద్భుతమైన చాటువులు మనకు దక్కాయి.

## అలాటి కష్టాలే!

ఆంధ్ర ప్రభుత్వాస్థాన కవి పదవి నలంకరించిన వారిలో శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారు ప్రత్యేకంగా ఎన్నదగిన వ్యక్తి. తెలుగు సాహిత్యాన్ని పరిశీలిస్తే కవిత్రయం వారు భారతం రచించిన తరువాత, పోతన భాగవతం రచించిన తరువాత- ఆ రెండింటి జోలికీ ఎవరూ పోలేదు. రామాయణాన్ని మాత్రం ఎందరో రాశారు.భాగవంతంలో పోతన రాయని విభాగాలను కొందరు రాశారు. కానీ శ్రీపాదవారు వాటి నన్నింటినీ అనువదించే సాహసం చేశారు-ప్రాచీన గద్య పద్యాత్మక చంపూ మార్గంలోద్విపదలో, వచనంలో, పాటలలో రచించిన వారున్నారు. వారి సంగతి వేరు. భారతాన్ని అనువదిస్తూ వీరు ప్రధానంగా మూలానుసారి పద్ధతి నెన్నుకొన్నారు. కవిత్రయంలా మార్పులు, చేర్పులు చేయలేదు. వారికంటే బాగా రాస్తానని కాదు. కేవలం చావలంపల్ల రాస్తున్నానని ఇలా అంటారు.

నన్నయ తిక్కనాది కవినాథుల కన్నను మిన్నగా తెలుం
గు న్నుడువంగలాడ నధికుండను నే నని కాదు గ్రంథమం
దున్నెరసుల్ కొరంతలును దోచునటంచని కాదు వెండియున్
బ్రన్నట భారతేష్టతను బట్టిన చాపలమంచు నెంచుడీ!

కానీ కేవలం చాపలం కాక అంతర్గతంగా తన కవితాశక్తిని ప్రదర్శించాలనీ, మూలంలో ఉన్నది యథాతథంగా తెలుగు వారికి అందించాలనీ ఆలోచన వారిలో కనిపిస్తుంది. భారత రచనావేళ

అందులో శోక ఘట్టాలు వచ్చినప్పుడు, అప్తులు మృతి చెందటం వంటి అశుభాలు తన ఇంట్లో జరిగి బాధ కలిగి; ఇంకా ఆరోగ్యంవల్ల ఇబ్బందులు కలిగి, భారతం పూర్తి చేయగలనా, లేదా అని అనుమానం వచ్చినప్పుడు ఈశ్వరు నీరకంగా ప్రార్థించారు.

ఆధి వ్యాధుల కాకరంబు తను వత్యల్పంబు కాలంబు నం
బోధించున్ జము డింతలో చపలతం బొంగారి నే భారతా
గాథాబ్ధి దరియింప బూనితిని నీ కారుణ్యమన్ తేప నా
కాధారంబుగ నిచ్చి ప్రోవగదె దేవా! నిన్ను సేవించెదన్.

శ్రీనాథునిలా జీవితంలో చాలా ఇబ్బందులను శాస్త్రిగారు ఎదుర్కోవలసి వచ్చింది. ముఖ్యంగా ఋణ బాధ. అది ఎక్కువైనప్పుడు శ్రీనాథుడు చివరి దశలో చెప్పిన ఈ పద్యం సుప్రసిద్ధమైనది.

కవిరాజు కంఠంబు కౌగలించెను గదా! పురవీథి నెదు రెండ బొగడదండ
సార్వభౌముని భుజాస్కంధ మెక్కెను గదా! నగరి వాకిట నుండు నల్లగుండు
వీరభద్రారెడ్డి విద్వాంసు ముంజేత వియ్యమందెను గదా! వెదురుగొడియ
ఆంధ్ర నైషధ కర్త అంఘ్రి యుగ్మంబున తగిలి యుండెను గదా! నిగళ యుగము
కృష్ణవేణమ్మ గొనిపోయె నింతఫలము బిలబిలాక్షులు తినిపోయె తిలలు పెసలు
బొడ్డుపల్లెను గొడ్డేరి మోసపోతి ఎట్లు చెల్లింతు టంకంబు లేదు నూర్లు?

ఇటువంటి ధోరణిలోనే శ్రీపాద వారు చెప్పిన సీసం-పరికించదగినది.

సీ. గౌతమీ మాహాత్మ్యకర్త కంఠము చుట్టు కొనియుండెనే గదా! ఋణము చిలువ
కవిమిత్రు మేనెల్ల చివికించెనే గదా! అప్పుల వారి వాక్యాయుధములు
శ్రౌతిమాన్య క్షేత్రసమితి కుదువబెట్ట బడెగదా ! వృషల సంభవుని యొద్ద
అష్టశతావధానాఢ్యున కిప్పుడు చేరియున్నది గదా! నీరసంబు
పేటలంకల పాట నీపాటు దెచ్చె మాల పురుపుల పాలయ్యె మరి పొగాకు
అప్పు ముప్పది వేల రూప్యంబు లింక నెట్లు దీర్చెడు శ్రీపాద కృష్ణమూర్తి

కవిరాజు, కవి సార్వభౌముడు మొదలైన బిరుదాలు పొందిన శాస్త్రిగారికి ఆ కవిరాజు కష్టాలు రావటం, అలానే పద్యం చెప్పటం శ్రీనాథునితో ఆయన తాదాత్మ్యభావనను తెలియజేస్తుంది.

శాస్త్రిగారు అష్టశతావధానా లెన్నో చేసి బహు సన్మానాలు పొందారు. మయూరభంజ్ సంస్థానంలో సంస్కృతంలో శతావధానం చేశారు. ఆ యాఅవధానాల్లో చమత్కార సుందరమైన పద్యా లెన్నో చెప్పారు. అందులో 'వడ్డాణ మలంకరించె వనిత కుచంబుల్' అనే కంద సమస్యాపూరణ చూడండి!

కం. షడ్డకులు పోరుచో భష్ట
రాడ్ధామ్మున నుడువనేగు రభసంబునన్
నడ్డాక దెగుడు మెడగొను
వడ్డాణ మలంకరించె వనిత కుచంబుల్

అదే విధంగా అవ్వ, తాతా, ఢంకానగారా, రారాపోరా, మేనాసవారీ-అనే నాలుగు మాటలను అర్జున తిరస్కృతమైన ఊర్వశి విరహ బాధాభావం వచ్చేలా చెప్పమంటే చెప్పిన పద్యం.

శా. ఆ పాకారి కుమారు డిట్లు విభవం బవ్వారిగా రాగ రా
రా పోరా యను సందడింబడు సుధర్మంజూచి నే నవ్వ తా
తా పాల్మాల వరింప కేగె నను వాడంకానగారా కహ
మీ పాలం బడితిన్ జెలున్ మనుప మేనా సవారించితిన్-

ప్రాచీన కవుల మీద, వారి సాహిత్యం మీద, సంప్రదాయం మీద వారికి విశ్వాసం, గౌరవం మెండు. ఝంఝామారుతంలా వీస్తున్న వ్యావహారిక భాషా వాదాన్ని ధైర్యంతో ఎదుర్కొన్నారు శాస్త్రిగారు. తను నమ్మిన దానికోసం ఎవరినైనా, ఎంతవారినైనా ఢీకొనే తత్వం వారిది. శ్రీనాథుడు సీస పద్యాలు పాడు చేశాడని విశ్వనాథవారూ, నన్నయకు అలంకార శాస్త్రం రాదని జమ్మలమడక మాధవ రామశర్మగారూ ఎక్కడో, ఎక్కడో ఉపన్యాసాలు చెపితే పత్రికాముఖంగా శ్రీపాదవారు చేసిన సవాలు, హుంకారాలు ఇప్పటికీ మరిచిపోరానివి.

## మోముదన్నుదున్

కవిత్వం చెప్పాలన్న ఉబలాటం ఉండి తగిన పాండిత్యం లేక రాయటానికీ, ఆశువుగా చెప్పటానికీ పూనుకొన్న వారిలో తప్పులు రావటం సహజం. చదువుకొన్న వారిలో కూడా ఎప్పుడైనా పొరపాటున తప్పు దొర్లవచ్చు. అందుకే అప్పకవి

'కలిదాన మయూరాది కవులకైన కలవు తప్పు లనంగ నన్యులకు లేవె? అని ఎంత వారికైనా ఎప్పుడో ఒకప్పుడు తప్పులు రాకపోవు అంటాడు. కేవలం తప్పులు వెతికి, ఉన్నదానిలోని మంచిని గ్రహించని వారిని జూసి కోపంతో తిట్టిన వారూ చాటుకవులలో కనిపిస్తారు. ఒక కవి ఈ విధంగా వట్టి దోషాన్వేషిని విమర్శించాడు.

నక్కలు బొక్కలు వెదకును
అక్కరతో ఊరబంది యగడిత వెదకున్
కుక్కలు చెప్పులు వెదకును
దక్కిడి నా లంజెకొడుకు తప్పే వెదకున్

తెలిసీ తెలియక దుశ్శంకులతో కువిమర్శలు చేసేవాణ్ణి కవి పిశాచమని ఓ కవి రకంగా నిందించారు.

శంకింపక సభలో దు
శ్శంకలు గావించి కేలు సరచుచు పొరెన్
గొంకక కేరెడు హీనుని
సంకింపక కవి పిశాచ మందురు ధరణిన్

కవి పిశాచ మనటంతో తృప్తి చెందని మరొకడు కుకవి పిశాచమని ఇంకాస్త తిట్టడం గమనించండి-

ప్రకటిత లక్షణ లక్ష్యము
లొకయింతయు తెలిసీ తెలియ కొగి దుశ్శంకల్
ప్రకటించు హీన మనుజుని
కుకవి పిశాచంబటండ్రు కోవిదులెల్లన్.

హీనుడై సభలో తప్పులు పట్టే నీచుని చెప్పుతో కొట్టి పండ్లు రాలగొడతానని మరో కవి ఇలా అన్నాడు:

సాగరధీర ! సత్కవిత చక్కగ నేర్చిన సద్బుధావళిన్
బాగని మెచ్చు సత్కవుల పాదరజంబు తలం ధరించెదన్
దా గడు హీనుడై సభల తప్పులు పట్టెడు దుష్కవీంద్రునిన్
ఛీ! గధ..గులామ!యని చెప్పునదంతముతాడ దన్నెదన్

గొప్ప కవీశ్వరుడు కవిత్వాన్ని వింటాడు, తోచినంతలో తప్పు ఒప్పు చెప్పి నిరసించకుండా దిద్దుతాడు. శుంఠ అయితే తప్పులెన్ని, పెడర్థాలు తీసి, తిప్పలు పెట్టి అవమానిస్తాడు. అటువంటి వారి తల తీయాలి-అంటాడు 'సదాశివ సద్గురు ప్రభూ' మకుటంతో శతకం రాసిన కవి-

గొప్ప కవీంద్రుడైన వినగోరు కవిత్వము తోచినంతలో
చెప్పును తప్పు నొప్పు నిరసింపక దిద్దును, శుంఠయయ్యెనా
తప్పులబట్టు యుక్తి పెడదారికి దీయు గరాసుదాని దా
ద్రిప్పట బెట్టు వాని తలదీయ సదాశివ సద్గురు ప్రభూ!

రాయలవారి ఆస్థానంలో తెనాలి రామకృష్ణునికీ, ప్రెగడరాజు నరసరాజుకూ కవితా యుద్ధం జరిగింది. దానిలో యుక్తితో రామకృష్ణుడు గెలిచాడు. తప్పుల వలె భాసించే పద్యం చెప్పి, పొరపాటున వాటిని ఒప్పులని నిరూపించి అతనికి శృంగభంగం చేశాడు తెనాలి కవి. అప్పుడు రామకృష్ణుడు చెప్పిన పద్యాలివి.

తెలియనివన్ని తప్పులని దిట్టతనాన సభాంతరంబునన్
పలుకగ రాకురోరి! పలుమారు పిశాచపు పాడెగట్ట! నీ
పలికిన నోట దుమ్ముపడ! భావ్యమెరుంగక పెద్దలైనవా
రల నిరసింతురా! ప్రెగడ రాణ్ణరసా! విరసా! తుసా! బుసా!
ఒకని కవిత్వ మందెనయు నొప్పులు తప్పులు నా కవిత్వ మం
దొకనికి తప్పు బట్టు పని యుండదు కాదని తప్పు పట్టినన్
మొకమటు క్రిందుగా దిగిచి మొక్కలు వోవని నుంపకత్తితో
సిక మొదలంట గోతు మరి చెప్పున గొట్టుదు మోము దన్నుదున్.

తెలిసీ తెలియని పాండిత్య గర్వంతో తన కవిత్వంలో తప్పులు పట్టేవాళ్ళను కత్తితో సిగగోస్తాను. చెప్పుతో గొడతాను, మొహం మీద తంతానంటాడు తెనాలి కవి . అతనంతవాడే రాగద్వేషాల ప్రకటన కూడా ఆ రోజుల్లో అంతతీవ్రంగానూ ఉండేది.

## భోజనభోగం

మానవుని భోగాలలో భోజన భోగమొకటి ఎన్నదగినది. జయదేవ మహాకవి నాకు జన్మజన్మకు కాళిదాస కవిత, మంచి వయస్సు, గేదె పెరుగు, పంచదార వేసిన పాలు, లేడి మాంసం, అబల అయిన కోమలాంగి కావాలని ఒక శ్లోకం చెప్పాడు.

శ్లో॥ కాళిదాస కవితా నవంవయ:
మాహిషందధి సశర్కరంపయ:
ఐణ మాంస మబలాచ కోమలా
సంభవంతుమమ జన్మ జన్మని

మాంసాహార ప్రియులైనవారు శాకాహారాన్ని లెక్కచేయరు. ప్రాచీన కవులలో ఎక్కువమంది ముఖ్యంగా తెలుగు కవులలో-శాకాహారులు కావటం వల్ల వాటి వర్ణన ఎక్కువగా గోచరిస్తుంది.

ఒక కవికి వంకాయంటే చాలా ఇష్టం. ఆ ఇష్టాన్ని ఇలా వ్యక్తం చేశాడు.

వంకాయ వంటి కూరయు
పంకజ ముఖి సీత వంటి భామామణియున్
శంకరుని వంటి దైవము
లంకాపతి వైరి వంటి రాజుం గలడే!

వంకాయ వంటి కూర, సీత వంటి స్త్రీ, శివుని వంటి దేవుడు, రాముని వంటి రాజు మరెవరూ లేరని అతని భావం.

తెలుగు కవులలో శ్రీనాథుని వలె భోజన పదార్థాలను వర్ణించిన కవి మరొకడు లేడు. శివునకు భిక్ష పెడుతూ ఒక అప్సరస

ద్రాక్షా పానక ఖండశర్కరలతో రంభా ఫలశ్రేణితో
గో క్షీరంబుల తోడ మండెగలతో క్రొన్నేతితో పప్పుతో
అక్షయ్యంబుగ తెచ్చి మాధుకర భిక్షాన్నంబు వడ్డించె...అన్నాడు.

భిక్షానికి కూడా ఇన్ని పదార్థాలా? అవును! అది బిచ్చం కాదు, భిక్ష గదా! భోజన విక్రయశాలలో కూడా రుచికరమైన పదార్థాలను చవకగా పెట్టేవారట. గోవింద మంచనశర్మ, టిట్టిభసెట్టి ఓరుగల్లు వెళితే అక్కడి అక్కలవాడలోని పద్ధతి ఇలా ఉండేదట.

కప్పుర భోగి వంటకము కమ్మని గోధుమపిండి వంటలున్
గుప్పెడు పంచదారయును కొత్తగ కాచిన అలనే పెస
ర్పప్పును కొమ్ము నల్లనటి పండ్లను నాలుగైదు నంజులున్
లప్పల తోడ క్రొంబెరుగు లక్ష్మణ వజ్జలయింట రూకకున్.

శ్రీనాథుని సంచారంలో నడగూడెమనే గ్రామంలో రుచికరమైన భోజనం దొరికింది. దాన్ని ఇలా మెచ్చుకున్నాడు.

నడి నూక లేని యన్నము
వడబోసిన నెయ్యి బుడమవరుగున్ బెరుగున్
గడిమాడ సేయబెట్టిన
నడగూడెపు నంబి పడుచు నడిగి తిననుమా!

నూకలేని అన్నం, మంచి నెయ్యి, బుడమ దోసకాయ పరుగు, పెరుగు ఒక్కడికి-మాడ (అప్పటి నాణెం) చేసేలా పెట్టిన గేస్తురాలు నడగూడెపు నంబి పడుచును స్మరిస్తాడు కవిసార్వభౌముడు.

షడ్రసోపేతమైన విందుభోజనాన్ని గట్టి సీసంలో ఈ విధంగా వర్ణించాడు కవిరాజు.

మరిచి ధూళీపాళీ పరిచితంబులు మాణి బంధాశ్మల వణపాటిం ధమములు
బహళ సిద్ధార్థ జంబాల సారంబులు పటురామ ఠామోద భావితములు
తింత్రిణీకర సోపదేహ ధూర్ధురములు జంబీర నీరాభి చుంచితములు
హైయంగవీన ధారాభిషిక్తంబులు లలిత కుస్తుంబ రూల్లంఘితములు
తే. శాకపాక రసావళీ సౌష్ఠవములు భక్ష్య భోజ్య లేహ్యంబులు పానకములు ..

మరిచి అంటే మిరియం. అశ్మలవణమంటే రాతి ఉప్పు. సిద్ధార్థాలంటే తెల్ల ఆవాలు. రామఠమంటే ఇంగువ. తింత్రిణీకరసమంటే చారు. జంబీరమంటే నిమ్మ. హైయంగవీనమంటే కొత్త అవు నెయ్యి. కుస్తుంబరు అంటే కొతిమిరి. వీటితో చేసిన వివిధ పదార్థాలను పై పద్యంలో కాశీఖండ కావ్యంలో వర్ణించడం జరిగింది. నైషధాది కావ్యాలలో ఇటువంటి రమణీయమైన వర్ణనలెన్నో శ్రీనాథుని భక్షజన ప్రీతికి దర్శనంగా కనిపిస్తాయి. కేవలం భోజన పదార్థాలనే కాదు, వడ్డించటంలో-పెండ్లి భోజనాలలోని స రసోక్తుల నెన్నింటినో అతను అద్భుతంగా వర్ణించాడు.

ఒక ఉన్నతస్తని అన్నం వడ్డిస్తుంటే భక్షజనం చేస్తున్న యువకుడొకడు చేతిని తామర మొగ్గలా చూపాడట! అంత అన్నమే అడిగాడో, ఆమె పాలిండ్లనే అడిగాడో అంటాడు కవిరాజు.

గీ॥ పద్మ కోశాభినయ హస్త పల్లవంబు
చూపె నావేళ రమణికి సొబగు డొక్క
డంత యోగిర మడిగెనో యంతలేసి
మెరుగు పాలిండ్ల నడిగెనో మెలతనతడు.

భోజన సరసోక్తుల సౌందర్యం ఈ విధంగా చమత్కార కమనీయంగా ఉంటుంది.

## భోజన కష్టాలు

ఇష్టమృష్టాన్న భోజనాలకు, షడ్రసోపేతమైన వివిధ పదార్థాల రుచులకు అలవాటు పడిన శ్రీనాథ కవి అనేక కారణాల వల్ల ఇతర ప్రాంతాలకు, దేశ సంచారానికి వెళ్ళినప్పుడు రకరకాల ఇబ్బందులకు లోను గావలసి వచ్చింది. ఆయా సందర్భాలలో చెప్పిన పద్యాలు నాటి పరిస్థితులను కవితా సుందరంగా తెలియజేస్తున్నాయి.

విజయనగర ప్రభువు ప్రౌఢరాయల ఆస్థానానికి దిగ్విజయార్థమై వెళ్ళి, రాజదర్శనం దొరకక బాధలు పడుతూ చెప్పిన పద్యంలో ఆహార సంబంధమైన, వస్త్ర సంబంధమైన అసౌకర్యం వర్ణితమైంది.

కుళ్ళాయుంచితి కోక జుట్టితి మహా కూర్పాసమున్ దొడ్గితిన్
వెల్లుల్లిందిలపిష్టమున్ మెసవితిన్ విశ్వస్థ వడ్డింపగా
చల్లా యంబలి ద్రావితిన్ రుచులు దోసంబంచు పోనాడితిన్
తల్లీ ! కన్నడ రాజ్యలక్ష్మి! దయలేదా! నేను శ్రీనాథుడన్.

అలవాటు లేని కుళ్ళాయి, కోక, మహాకూర్పాసం- పొడవాటి అంగీధరించవలసి వచ్చింది. వెల్లుల్లి, తెలకపిండి, చల్లా అంబలి ఆహారం కింద తీసుకోవలసి వచ్చింది అని వాపోయినాడు కవిరాజు.

ముఖ్యంగా పలనాడు వెళ్ళినప్పుడు అక్కడి జొన్నన్నం తినలేక చాలా పద్యాలు చెప్పాడు.

సుకుమారమైన వరి అన్నం తినే వారికి అది కష్టమే మరి!

జొన్న కలి జొన్న అంబలి
జొన్నన్నము జొన్న పిసరు జొన్నలె తప్పన్
సన్నన్నము సున్న సుమీ!
పన్నుగ పలనాటి సీమ ప్రజలకు నెల్లన్.

అని తనుకున్న వ్యతిరేకతను తీవ్రంగా వ్యక్తం చేశాడు.

ఒక ఊళ్ళో జొన్నన్నం, అందులో చింత చిగురు, బచ్చలి కూర కలిపిన వేడి వేడి కూర నేశారు. దాన్ని తినలేక ఇలా అన్నాడు.

ఫుల్ల సరోజ నేత్ర! అల పూతన చన్నుల చేదు త్రావి నా
నల్ల దవాగ్ని మ్రింగితినటంచును నిక్కెద వేల ? తింత్రిణీ
పల్లవ యుక్తమౌ ఉడుకు బచ్చలి శాకము జొన్న కూటితో
మెల్లన నొక్క ముద్ద దిగమ్రింగుము నీ పస కాన నయ్యెడున్.

ఓ పద్మాక్షా! శ్రీ కృష్ణా! పూతన స్తనాల విషాన్ని తాగాననీ, కార్చిచ్చు మింగాననీ ఎందుకయ్యా నిక్కుతావు? చింత చిగురుతో ఉడుకుడుకు బచ్చలి కూర జొన్నన్నంతో ఒక ముద్ద మింగు-గొంతు దిగుతుందేమో చూస్తాను. నీ పస తెలుస్తుంది అని చమత్కారంగా పలికాడు. కృష్ణుని వలెనే శివుని కూడా ఇలా ఆటవెలదిలో ఆట పట్టిస్తాడు.

పూర్వమందు విషము పుచ్చుకొన్నా నని
గర్వపడెద వేల కాలకంఠ!
కొండవీటి సీమ పండు జొన్నలకూడు
తిన్న నీదు బయసి తేటపడును.

ఎప్పుడో పూర్వకాలంలో కాలకూట విషం-హాలాహలం పుచ్చుకొన్నానని గర్వపడతా వెందుకయ్యా! ఇప్పుడు కొండవీటి సీమ జొన్నన్నం తిని చూడు, నీ శక్తేమిటో బయటపడుతుంది-అని నిలదీసి అడుగుతాడు.

మరొకచోట పేదవారి ఇంట్లో అన్నం తింటూ మనసులో ఇలా అనుకొన్నాడు.

మూతిని ముట్టగా వెరతు ముద్దకు ముద్దకు కూటి లోపలన్
పాతిక పాలు సైకతము పచ్చడి కొంచెమ యాది యంత్యమున్
జూత మటన్న లేదు మరి సున్నము కన్నను మెత్తనన్న మీ
రాతిరి బోలె భోజన మరాతి! కినైనను వద్దు దైవమా

విస్తరిలో అన్నం సున్నం కన్నా మెత్తగా ఉంది. అందులో నాలుగోవంతు ఇసుక. పచ్చడి చాలా కొద్దిగా వేశారు. ఆది, అంత్యమూ లేవు. అంటే నెయ్యి మజ్జిగ లేవు. ఈ రాత్రి నేను చేయవలసి వచ్చిన భోజనం శత్రువుకు కూడ వద్దు దేవుడా! అని వేదన చెందాడు కవిరాజు.

వేరొక సందర్భంలో ఈ విధంగానే విస్తరి ముందు కూచోగానే భయంపుట్టి తనలో తనకు తానే ఇలా ధైర్యం చెప్పుకున్నాడు.

కఠినంపు జొన్నల కటుకు కుడ్మల చూసి వక్రమా! భయపడవద్దు సుమ్ము
నానా రుచుల్ గోరు నాలుకా! నీ వేమి సందేహపడవద్దు చప్పరించు
ఎన్నడు కడి చేయ నెరుగ నెట్లో యని కుడి హస్తమా! నీవు జడియబోకు
కమ్మని వాసనల్ గ్రక్కున త్రేన్పెడు గర్భమా! కుటకుట కాక యుండు ..

అరవ భోజనంలో ముందే మిరియపు చారు పోశారట! దానికితోడు ఆవ, అవిశాకు, వేపాకులతో చేసిన పదార్థాలు వాంతి కలిగిస్తూ ఆరు నెలల దాక నోటి చవి చచ్చేలా చేస్తున్నవట! ఆ బాధను ఇలా వర్ణించాడు శ్రీనాథుడు.

తొలుతనే వడ్డింత్రు దొడ్డ మిర్యపు చారు చెవులలో పొగ వెళ్ళి చిమ్మిరేగ
పలు తెరంగుల తోడ పచ్చళ్లు చవిగొన్న బ్రహ్మరంధ్రము దాక బారునావ
అవిసాకు వేచిన నార్నెల్లు నసి లేదు పరిమళ మెంచిన పండ్లు సొగచు
వేపాకు నెండించి వేసిన పొళ్ళను కంచాన గాంచిన కక్కు వచ్చు.
అరవవా రింటి విం దెల్ల నా గడంబు.

విస్సన మంత్రి పక్కన హేమ పాత్రలో ఇష్టమైన బహువిధ భోజనాలారగించిన వానికి ఇవి దుర్భరమైనవే మరి!

## 'రా' కొట్టుట!

సమాజంలో మనిషికీ, మనిషికీ మధ్య ఉండే పిలుపులలో వారి వారి అనుబంధాలను బట్టి రకరకాలుంటాయి. తమకంటే పెద్దవారిని ' అయ్యా' అని ' ఏమండీ' అని, ఇంకా గౌరవించవలసిన వాళ్ళైతే 'అయ్యగారూ' అని- వాళ్ళ వాళ్ళ తరతమ భేదాలను బట్టి పిలుస్తుంటారు. కొన్నాళ్ళు ఒక పదం గౌరవవాచకంగా ఉండి. జన వ్యవహారంలో నలిగి కొంత గౌరవాన్ని కోల్పోయినప్పుడు దానికి మరిన్ని మర్యాదావాచక ప్రత్యయాలు మొదలైనవి చేరుతుంటాయి. అయ్య-అయ్యగారు-అయ్యవారు-అయ్యవార్లు- అయ్యవార్లంగారు-ఇటువంటి పరిణామాన్ని సూచించేవే. 'రా' కొట్టి పిలవటం చనువును సూచిస్తుంది. అంతేకాదు, రాగద్వేషాలు రెంటినీ తెలుపుతుంది. తనకంటే హీనుని, శత్రువుని 'రా' అనటం లోకంలో ఉంది. పిల్లలను, స్నేహితులను 'రా' అని అంటూనే ఉంటారు.

వింతలలో వింత ఏమిటంటే రాజులను, చక్రవర్తులను, దేవతలను కవులు తమ పద్యాలలో రా అని పిలవటం. దేవుళ్ళను పిలిస్తే అది ఆ భక్తుడికీ, దేవుడికీ మధ్య ఉండే వ్యవహారం. దానివల్ల రచయితకు ప్రత్యక్షంగా ఇబ్బందేమీ లేదు. ఆ దేవుడు తలదీయడు. నిలదీయడు. రాజ్యాన్నేలే రాజులు ఊరుకొంటారా? అయితే శాపానుగ్రహ సమర్థులైన వారు లోకప్రసిద్ధి చెందినవాళ్ళు ఆ విధంగా అంటుంటే భయంవల్ల గాని, భక్తివల్ల గాని కొన్ని సందర్భాలలో ఊరుకోటమే గాక, సన్మానాలు చేసినట్లు దాఖలాలు కనిపిస్తున్నవి.

ఉద్దండుడు, భీమేశ్వర వరప్రసాది అయిన వేములవాడ భీమకవి తెలుగు రాయని దగ్గరకు వెళ్ళినప్పుడు చెప్పిన పద్యం ఇందుకో ఉదాహరణ.

మ. ఘనుడన్ వేములవాడ వంశజుడ దాక్షారమ భీమేశ సం
దనుడన్ దివ్య విషామృత ప్రకటనానా కావ్యధుర్యుండ భీ
మన నా పేరు వినంగజెప్పితి తెలుంగా ధీశ! కస్తూరి కా
ఘనసారాది సుగంధ వస్తువులు వేగం దెచ్చి లాలింపరా!

అతను కవిత్వం ద్వారా విషాన్నీ, అమృతాన్నీ ప్రకటించి చూపగల సిద్ధుడు కనుక చెల్లుబాటైంది. ఇది తరువాత కవులకు కొంత ఆచారంగా కూడా మారిందనవచ్చు.

శ్రీనాథుడు మరొక తెలుగు రాయలని తన కాలంలో చూసినప్పుడు ఇటువంటి పద్యాన్నే చెప్పాడు.

అక్షయ్యంబగు సొంపరాయని తెలుంగాధీశ ! కస్తూరికా
భిక్షాదానము సేయరా! సుకవిరాడ్ బృందారక స్వామికిన్
దక్షారామ చళుక్య భీమ వర గంధర్వాప్సరో భామినీ
వక్షోజద్వయ కుంభికుంభములపై వాసించు తద్వాసనల్.

యాచించటంలో కూడా ఎంత ధీమా! ఎంత ఆత్మవిశ్వాసం! తాను కవి మహేంద్రుడట. తెలుగు రాయడు కస్తూరి ఇస్తే దక్షారామంలోని అప్సరసల ఉన్నత స్తనాలమీద పూసి తాననుభవిస్తాడట. అడిగేది భిక్షాదానం, ఇవ్వరా మహారాజా! అంటాడు. ఎంత చిత్రమో చూడండి.

అడిదము సూరకవి విజయనగర ప్రభువు విజయరామరాజు మీద ఇలానే ఒక 'రా' వచ్చే పద్యం చెప్పాడు. రాజుగారేమీ అనలేదు గాని, రాజ బంధువు సీతారామరాజుకు కోపం వచ్చి ఆక్షేపించాడు. అప్పుడు సూరకవి ఆవిధంగా చెప్పటంలోని ఔచిత్యాన్ని, అందాన్ని ఇలా సమర్థించుకున్నాడట-

చిన్నప్పుడు రతికేళిక
నున్నప్పుడు కవితలోన యుద్ధములోనన్
వన్నె సుమీ రాకొట్టుట
చెన్నుగనో పూసపాటి సీతారామా!

చిన్నప్పుడు 'రా' అనటం సహజమే. రతిక్రీడలో స్త్రీ పురుషులు పరస్పరం 'రా' అనుకోవటం భోగాతిశయాన్ని సూచిస్తుంది. కవిత్వంలోనూ, యుద్ధంలోనూ అనవచ్చు. అనవచ్చు మాత్రమే కాదు. అంటే వన్నె సుమా- అంటాడు సూరనకవి. అందుకే అతని చాతుర్యాన్ని చూసి-

అంతా సుకవులు గారా?
అంతింతో పద్య చయము నల్లగలేరా!
దంతివి నీతో సమమా?
కాంతా సుమబాణ! సూరకవి నెరజాణా!

అన్నారు. రా కొట్టటాన్ని గురించి మరొక చాటువు కూడా ఉంది.

కవులు పొగడువేళ కాంతులు రతివేళ
సుతులు ముద్దువేళ శూరవరులు
రణము సేయువేళ రా కొట్టి పిలుతురు
పాడి యదియు మిగుల భజనకెక్కు

ఇదే అర్థంలో-ఏకవచనం ప్రయోగించటాన్ని గురించి సంస్కృతంలో ఒక శ్లోకముంది.

శ్లో. బాల్యే సుతానాం సురతేంగనానాం
స్తుతే కవీనాం సమరే భటానాం
త్వంకార యుక్తాహి గిర : ప్రశస్తాః
కస్తే ప్రభో ! మోహతరస్మరత్వం.

తెలుగు పద్యాలు దీని అనుసరణలే.

## కవితా సమర్థనం

కవులను, కవిత్వాలను అన్ని దేశాలలో, అన్ని జాతులలో గౌరవించేవారూ ఆరాధించేవారూ ఉన్నా-చులకనగా జూచేవారూ లేకపోలేదు. గ్రీకు తాత్వికుడైన ప్లేటో కవులు, కళాకారులు గౌరవార్హులు కారనీ, ఉన్నత పదవులకు తగరనీ విమర్శించాడు. లోకంలో రాజులను, ధనవంతులను ఆశ్రయిస్తూ ఎవరిమీద పడితే వారి మీద, దేనిమీద పడితే దానిమీద డబ్బుల కోసమో, అల్ప కార్యాల కోసమే శ్లోకాలు, పద్యాలు చెపుతూ పలుచన అయిన వారు ఎక్కువ కావటం వల్ల-అటువంటివారి వల్ల కవులకు, కవిత్వానికి కొంత అపకీర్తి వచ్చిన మాట వాస్తవమే. అయితే మన దేశంలో ఆద్యులైన కవులు వాల్మీకి, వ్యాసాదులు మహర్షులు కావటం వల్ల కవి శబ్దానికి గౌరవం నిలిచింది. తరువాతి కాలంలో ఎక్కడైనా తిరస్కారం జరిగేట్లుంటే వేములవాడ భీమకవి వంటివారు ధిక్కరించి దూషించటమూ జరిగింది.

ఇక్కడ ఒక ముఖ్యమైన అంశం ఏమిటంటే అల్పసారులైన కవులను, హీనమైన కవిత్వాన్ని నిరసించటం వేరు. అసలు కవిత్వమన్నదే పనికిరానిదని నిరసించటం వేరు. వట్టి ఊహా లోకాల్లో విహరిస్తూ అతిశయోక్తులు, అబద్ధాలు రాస్తూంటారనీ, అందువల్ల కవులు తిరస్కార యోగ్యులే కాని పురస్కార యోగ్యులు కారనీ కొందరి విమర్శ.

అటువంటి వాటిని విని, చూసి బాధపడిన వారు కవి, కవితా ద్వేషులను తీవ్రంగా మందలించటమూ కద్దు.

ఒక కవి ఈ విధంగా కవిత గిట్టని వారిని పశువులన్న తీరు చూడండి!

సరస కవిత రుచి యెరుగని
పురుషుల పశువులని నిక్కముగ నెరుగుడు వా
రురువడి తృణంబు మేయమి
పరికింపగ ధరణి పసులు భాగ్యము చెందున్.

అటువంటివారు గడ్డి తినకపోవటం పశువుల అదృష్టం సుమా అని చమత్కరిస్తాడు.

కవి బ్రహ్మ కంటె ఎక్కువనీ, ఎందుకంటే బ్రహ్మ షడ్రసాలనే-తీపి, పులుపు మొదలైన వాటిని సృష్టిస్తే, కవి నవ రసాలనూ అనుభవింప జేస్తాడని మరొక కవి చతురోక్తి ఇలా పలికాడు.

భువి షడ్రసములు నాలుక
చవిగొనగా జేసె బ్రహ్మ; సత్కృతి వలనన్
చెవి నవరసములు చవిగొన
కవి చేసెను; బ్రహ్మ కంటె కవి యధికు డగున్

ఒక పండితుడు పండితులనే గౌరవించాలి. సత్కరించాలి కాని, కవుల కా అర్హత ఎక్కడ ఉన్నదని ఆక్షేపిస్తూ ఇలా అన్నాడు.

చం॥ అవగత శబ్ద శాస్త్రచయులైన మహాత్ములు పండితోత్తముల్
భువన తలంబు నం దధిక పూజ్యులు వార లటుండ కూటికై
నవ నవ కల్పనా విధిచణత్వము తోవ నబద్ధ మాడు నీ
కవుల దాన పాత్రులయి గౌరవమందుటె చూడె చిత్రముల్

ఈ ఆక్షేపణకు సమాధానం చెవుతూ ఒక కవి ఈ ప్రకారం పలికిన తీరు అతని బాధను వ్యక్తం చేస్తుంది.

చం॥ కవి కమలాసనుండు త్రిజగత్పతియైన పినాకపాణియున్
కవియె తలంపగా కవులుగారె పరాశర బాదరాయణుల్
కవి కృత పుస్తక గ్రహణ గర్వితు లల్పులె పూజలందగా
కవుల! టఃదాన పాత్రులట కారట! యిట్టివి పో విచిత్రముల్!

దేవతలు, ఋషులు కవులే, కవులు రాసిన గ్రంథాలే కదా ఈ పండితులు చదివేది! గురుకుల క్లేశం పొంది శాస్త్రాలు చదివి ఎంత పండితుడైనా తేనెల సోనలు కురిసే కవిత్వంతో కవి ఆనందింపజేసినట్లుగా చేయగలడా అని ఇలా అంటాడు-

చం॥ గురుకుల వాస ఖేదమునకున్ గడు డస్సి అపార శాస్త్ర సా
గరముల నీదియున్ వలతిగా డలరింపగ పండితుండు తా
వరకవు లుద్యదిందు కరవీర సమాగమపుల్లహల్లకో
త్కర విగళన్మరంద పదకాండముచే నలరించుచాడ్పునన్.

ప్రాచీనమైన ఈ చాటువులే కాక అధునాతనులలో కూడా ఇటువంటి భావాలను వ్యక్తీకరించిన వారెందరో ఉన్నారు. ఇటీవల కవులను ఉరికంబం ఎక్కించాలని ఎవరో అంటే బాధపడి శ్రీ శిష్టా లక్ష్మీపతి శాస్త్రి అనే రచయిత ఇలా రాశారు.

కవి యనుభూతి మిన్న తన కావ్యము నందు వెలార్పు భావముల్
స్వవిషయ చోదితంబులు విషాద సుఖంబులు వారి నంట జా
లవు సమతా స్వభావమె అలంకృతిగాగ ప్రజాహితైషియై
కవి రచియించు నాతడురి కంబము కర్హుడు గాడు భారతీ!
కవితకు ధ్యేయమేమి? అధి కాంక్షితమైన ప్రయోజనంబు లె
య్యవి? ప్రజకై సమాజమునకై కవి సేసెడు సేత లేవి? యం
చవగణనం నర్తురు భ వాశ్రిత దివ్య రస ప్రపంచ పుం
జవుల గ్రహింప నొల్లని విచారణలు రదేశీమొ భారతీ!

మరొక ఆధునిక కవి కవి మహత్వాన్ని ఈ రకంగా కీర్తిస్తాడు.

కవి యనగా నెవండు? తను కాంచిన సత్య మనోజ్ఞ దర్శనం
బివతలి వారికిన్ రస సమీహిత వైఖరి పల్కి మాన సో
త్సవ మధురానుభావము నొసంగు మహా ఋషి-ద్రష్ట-స్రష్ట - ఆ
యవితథ వాగ్విశిష్టుని స్వయంభువు నెందు ప్రశంస చేసెదన్.

అతి మనుషమైన బ్రహ్మానంద సహూదరమైన రసానందాన్ని లోకానికందించే శక్తి కవి సృష్టి కొక్కదానికే ఉంది. ఎవరెన్ని అన్నా ఈ సత్యాన్ని అంగీకరించక తప్పదు.

## అంటని మ్రానిపండు ..

**19** వశతాబ్దంలో ఆశుకవిగా ప్రసిద్ధి చెంది ఎన్నో రాజాస్థానాలలో సన్మానాలందుకొన్న అల్లమరాజు సుబ్రహ్మణ్య కవి పేర్కొనదగినవాడు. "ఏమేటి మాడ్గుల కృష్ణభూపాలుని సభయందు కవులచే శ్లాఘనందె" అని ఆంధ్ర చంపూ భారతంలో ఉన్న వాక్యాన్ని బట్టి ఆనాడు రసిక రాజన్యుల మన్ననలను పొందాడని గ్రహించవచ్చు. ఒక సభలో ఆయన కీ సమస్య ఇచ్చారు.

"కుట్ర యొనర్చె లేమ తన గుబ్బలయుబ్బు సహింప లేమిచేన్" దాని పూరణ ఇది యని అంటారు-

ఉ. వట్రువ హారరత్నములు వన్నెనెగల్ పులిమీద వచ్చునా
పుట్ర యటన్న రీతి జిగి పొల్పగు చూచుక లీల జూచుచున్
దొట్రిల వేల కేల గొని గోరుల నొక్కుము నాథయంచు దా
గుట్ర యొనర్చె లేమ...

ఒక రాజకుమారిక నీయన వర్ణించిన తీరు చూడండి !

అంటని మ్రానిపండు కరియంటని కాముశరంబు తేటిము
క్కంటని పువ్వుహింస ముఖమంటని తూడు పయోధినిప్పు నీ
రంటని రత్నమన్యభృత మంటని కెందలిరాకు రాహుతా
నంటని చంద్రబింబమన నాన్నపకన్య వెలింగె నెత్తరిన్.

అనాఘ్రాతంపుష్పం కిసలయ మలూనంకరరుహా: అనావిద్ధం రత్నం-అన్న కాళిదాసు రచన కిది అనుకరణమై భాసిస్తున్నది. ఎవరూ తాకని చెట్టు పండువలె, ఏనుగు చేత నలగని అరవిందాదులవలె, తుమ్మెద అనుభవించని పువ్వు వలె, హంస ముట్టుకోని తామరతూడు వలె, సముద్రంలోని బడబాగ్నిగాని, నీరు గాని తాకని రత్నంవలె, కోకిల ముట్టని ఎర్రని చిగురువలె, రాహువు తాకని చంద్రబింబంవలె ఆ రాజకుమారి ప్రకాశిస్తున్నదట. మనోహరములైన ఉపమానాలను ఉత్పలంలో కూర్చి కవి రమణీయకతను మాలగా నల్లాడు.

ప్రసిద్ధ శతవధాని మాడభూషి వెంకటాచార్యుల వారు పిఠాపురం సంస్థానానికి వచ్చినప్పుడు, రాజావారు కొలువుదీరి ఉన్నవేళ ఆ సభలో సుబ్రహ్మణ్య కవి కూడా ఉన్నాడు. వేంకటాచార్యుల వారిని ప్రశ్నించటానికి పండితులు పూనుకొన్నారు. అడిగిన వాటికి అడిగినట్లుగా ఆచార్యులవారు వేగంగా పద్యాలు చెపుతున్నారు. 'ఇఁక' అన్న పదంతో మొదలుపెట్టి ప్రభుకీర్తిని కందంలో చెప్పమని అల్లమరాజు వారు అడిగారు. మాడభూషి వారు వెంటనే ఈ పద్యం చెప్పారు-

కం. ఇఁక నెవ్వరి కీర్తులు నీ
ప్రకట గుణుండైన రామరాయక్ష్మాభృత్
సుకృతి జనపోషకుని కీ
ర్తికి సరిగావుసుమ్ము పృథ్వీస్థలిలోన్

వెంటనే సుబ్రహ్మణ్య కవి లేచి ఈ పద్యం దోషయుతమని ఇఁక శబ్దంలో అర్ధబిందువు ఉన్నప్పుడు అది ప్రాస స్థానంలో ఉంటే మిగతా పదాలలోకూడా ఆ విధంగానే ఉండాలని మాడభూషి వారు ఆ నియమం గమనించలేదని, పాటించలేదని విమర్శించారు. సబిందు నిర్బందు భేదం ప్రాసలో పాటించవలసిన అవసరం లేదని, అయినా ఆ నియమం ముందు చెప్పలేదని ఆచార్యుల వారు వాదించారు. పండితులిద్దరినీ శాంతింపజేసిన మీదట సదస్యుల కోరికపైన సార్ధబిందు ప్రాసతో సుబ్రహ్మణ్య కవి పద్యం చెప్పారు.

ఇఁక విను నీయశమునకు ( ద
లఁకి శశికృశు డయ్యును మరల ( బెరుగ వేర్వే
లల్లఁకియు ( గొనెనొకొ తొలిమలకె
లఁకులను శ్రీరామరాయ ! లలితశ్రేయా!

పీఠికాపుర ప్రభువైన రావు వేంకట మహీపతి గంగాధర రామరాయ రాజన్యునిపైన సభ్యులు కోరిన నియమాలతో చెప్పిన ఆశువు-

శ్రీధర ! శౌరీ ! వైకుం
ఠా!ధర శ్రీ రావు వేంకట మహీధర గం
గాధర రామారాయ
క్ష్మాధరునిం బ్రోవు మెపుడు కరుణాదృష్టిన్

కాట్రావులపల్లి ఉప్పునీటి నూతులను గురించి ఈయన చెప్పిన పద్యం ఆ నీరు ఎంత చేదో వర్ణిస్తూంది.

దేవాసురు లబ్ధి దరువ
నా విర్భూతమయి హాలహలమపుడు మహా
దేవునకున్ భీతిలి కా
ట్రావులపలినూతులందు డాగెనుజుండీ!

దేవతలూ, రాక్షసులూ సముద్ర మథనం చేసినప్పుడు హాలాహలం పుట్టి శంకరుడు తనను మింగుతాడేమో అని భయపడి, కాట్రావులపల్లి నూతుల్లో దాక్కున్నదట! నీరు ఎంత చేదో చెప్పటానికి చేసిన చతురోక్తి ఇది.

సుబ్రహ్మణ్య కవి బహు గ్రంథకర్త కూడా. అయితే ప్రబంధాలకు పరపతి తగ్గిన కాలంలో వచ్చిన ఇతని రచనలకు అంత కీర్తి రాలేదు. ప్రచారమూ కలగలేదు.

## రవి కాననిచో ..

ముప్పై అయిదు సంవత్సరాల చరిత్ర కలిగిన సాహితీ రూపక ప్రక్రియ అనన్యసామాన్యమైన గౌరవ ప్రచారాలను పొందింది. సమస్యాపూరణకు ఇందులో అత్యంత ప్రధాన స్థానం ఉంది. అయితే ఇది నాటకీయ ప్రదర్శన కావటంవల్ల ఎక్కువ భాగం ముందు అనుకొన్నవే అయి ఉంటాయి. అయితే అప్పుడప్పుడు సభలోని వారు అప్పటికప్పుడు సమస్య లిచ్చి పూరించమనటం, కొన్ని చోట్ల వాటిని పూరించి మెప్పించటం జరుగుతాయి. ఆ కవి పాత్రధారికి ఆశు కవితా సామర్థ్యంమున్నప్పుడే ఇది

సాధ్యం. భువన విజయం మొదలైన రూపకాలలో అందరూ కవులు, పండితులు కావచ్చు గాని ఆశు కవులు కారు. అప్పుడున్న వారిలో ఆశు నైపుణ్యం కలవారు పూరించటం జరుగుతుంది.

ఆకివీడులో ఒకసారి భువనవిజయం జరుగుతున్నది. అప్పటి రాష్ట్రమంత్రులలో ఒకరు మూర్తిరాజుగారు సభలో ఉన్నారు. వేదికమీదికి ఆయన ఒక సమస్య పంపి "దీనికి పరిష్కారం లేదా?' ' అని ప్రశ్నించారు. ఆ సమస్య ఇది:

'లంగా ఎత్తి కురంగ నేత్ర కనియెన్ లాంగూల శృంగారమున్"

తిమ్మరుసు పాత్రధారి జమ్మలమడక మాధవరామశర్మగారు చమత్కారంగా "రాయలవారు పద్యం చెపితే ఊరక పంపరు. తగిన సత్కారం చేస్తారు. మరి నూట పదహార్లు ఇస్తే అష్టదిగ్గజాలలో ఒకరు పూరిస్తారు" అన్నారు. మూర్తిరాజుగారు "ఇస్తాను" అన్నారు వెంటనే. అప్పుడు తిమ్మన పాత్రధారి కరుణశ్రీ జంధ్యాల పాపయ్యశాస్త్రిగారు ఆ సమస్యను ఇలా పూరించారు.

రామాయణం-తార వాలితో అంటున్న సందర్భం:

సింగం బాతడు హస్తి నీవు, వలదా శ్రీరాముతో పోరగా
భంగంబందెదవంచు మొత్తుకొన నా పల్కుల్ చెవింబెట్టకీ
భంగిం గూలితి వంచు తార రఘు రాడ్బాణంబుచే వాలి కూ
లంగా ఎత్తి కురంగ నేత్ర కనియెన్ లాంగూల శృంగారమున్.

అన్న మాట ప్రకారం మూర్తిరాజు వేదికమీదకు వచ్చి కరుణశ్రీని సత్కరించారు.

పాపయ్యశాస్త్రిగారు ఇటువంటి ఎన్నో సభలల్లో పాల్గొన్నారు. ఆ రూక సభలలో వారు పూరించిన సమస్యలు చాతుర్యధుర్యాలై, చమత్కార చారువులై సభ్యులకు ప్రగాఢమైన హర్షాన్ని కలిగించేవి. వాటిల్లో కొన్ని:

విశాఖపట్టణం ఆంధ్ర విశ్వవిద్యాలయంలో జరిగిన భువనవిజయంలో సమిష్టి సమస్య-

"నీవును నీవునున్ మరియు నీవును నీవు నీవునున్"

పూరణ - బాలకుమారస్వామి-పార్వతి సంభాషణ.

"నీవుగజాన్యు చంక దిగనీయవు నన్నన లెత్తుకోవు నీ
కావెనకయ్యు ముద్దు కొడు కయ్యెనులే" యని యేడ్చు షణ్ముఖున్
దేవి భవాని కౌగిట గదించి ముఖంబులు ముద్దు గొంచనెన్
నీవును .... ....

ఏ.సీ. కాలేజీ శత వార్షికోత్సవాల సందర్భంలో జరిగిన భువనవిజయంలో పూరించిన సమస్య - "రవి కాననిచో కవి కాంచునే కదా!"

ఈ సమస్య రాయలవారి ఆస్థానంలో భట్టుమూర్తి పూరించాడట!

ఆ రవి వీరభద్రు చరణాహతిడుల్లిన బోసి నోటికిన్
నేరడు రామలింగ కవి నేరిచెబో! మన ముక్కుతిమ్మన
క్రూరపదాహతిన్ దెగిన కొక్కెర పంటికి దుప్పి కొమ్ము ప
ల్గారచియించె నౌర! రవి కాననిచో కవి గాంచునే గదా!

ముక్కుతిమ్మన కాలు దగిలి ఊడిన పంటి స్థానంలో దుప్పి కొమ్ము పల్లుగా ధరించిన

రామలింగని రహస్యాన్ని బయలుపరిచాడు మూర్తికవి.

కరుణశ్రీ పూరణలో మరో చమత్కారం చోటు చేసుకొన్నది.

పట్టణ మేగె నొక్క కవి పండుగకున్ కవి భార్య స్నానమై
కట్టెను పట్టుచీర - రవికన్ ధరియించుచునుండ తల్పులన్
నెట్టె కవీంద్రు డా రవికనే కవి కన్నుల గప్పె కాంత ఔ
నట్టుల మోమునందు రవికా ననిచో కవి కాంచునే గదా!

పద్యం సులభంగానే ఉంది కనుక అర్థం రాయటంలేదు. రవిక + అననిచో అనటంలో ఉంది ఇక్కడి చమత్కారం.

భీమవరంలో బ్రహ్మ సభ జరుగుతున్నది. అందులో ఇచ్చిన సమస్య: "ఊర్వశి ! రమ్ము నీ కిదె బహూకృతి కొమ్ము! కపాలకుండలా!" రావణాసురుడు శివ పూజ చేస్తూ తన తలలనే అర్పిస్తూ పరమేశ్వరునితో అంటున్న వైనం.

శర్వ ! గిరీశ ! సాంబశివ ! శంకర ! రుద్ర ! భవా ! హరా! దయా
ధూర్వహ! ధూర్జటీ ! తలలు తొమ్మిది కోసితి పూజ చేసితిన్
శర్వ ! యి దొక్కటే మిగిలె స్వాములకున్ దయ రాదటంచు ని
ట్టూర్వ, శిరమ్ము నీ కిదె బహూకృతి గొమ్ము కపాలకుండలా !

"ఊర్వశి! రమ్ము'-అనేదాన్ని 'నిట్టూర్వ-శిరమ్ము' అది మార్చటంతో అద్భుతమైన విచిత్రార్థం వచ్చి రమణీయమైన పూరణ లభించింది.

ప్రొద్దుటూరు భువనవిజయంలో ఇచ్చిన సమస్య- "భామయు భామయున్ గలయ బాలుడు పుట్టెను సత్యభామకున్"

కరుణశ్రీ పూరణ:

"శ్రీమతి లేఖ బంపినది, చేయడు కార్యము మామ, తానట
గ్రామణియైన యల్లు డొక రాతిరి కూతురి చెల్మి కత్తెయై
మామ గృహంబు జేరి తన మానినిగూడెను, ఆ యసత్యపుం
భామయు భామయున్ గలియ బాలుడు పుట్టెను సత్యభామకున్"

అసత్యపుం భామ అనటంలో అసత్యమైన భామ-అనగా భామ కానిది అని, అసత్య-పుం-భామ-అని-పుం అంటే పురుషుడు-పురుషుడైన భామ అని-అర్థాలు.

ఇటువంటి అందమైన పూరణ లెన్నింటినో చేసి పాపయ్యశాస్త్రిగారు సాహితీ రూపకాలకు వన్నె చేకూర్చారు.

## చాటువుల నీటు

**ఛ**ప్పన్న దేశాలు తిరిగి చెప్పిన దానిమీద చెప్పకుండా అనేక చాటు పద్యాలు చెప్పినవాడు శ్రీనాథుడు. నచ్చితే మెచ్చుకొన్నాడు. నచ్చకపోతే నిర్మొహమాటంగా నచ్చలేదని అనేసేవాడు. అందువల్ల అతని చాటువులలో చతురోక్తులు, ఛలోక్తులు వ్యంగ్యోక్తులు, అసహనోక్తులు ఎన్నో కనిపిస్తాయి.

కవిసార్వభౌముడు ఒక ఊరికి వెళ్ళాడు. ఊరి పేరు పులిపాడు. కరణం శేషయ్య. కాపు హనుమయ్య. ఊరి పెద్ద పుల్లయ్య. ఎవరూ ఈయన నాదరించలేదు సరిగదా, తిరస్కామయుతంగా ప్రవర్తించారు. కవిరాజుకు కోపం వచ్చింది. వాళ్ళ ప్రవర్తనను పద్యంలో శాశ్వతంగా నిలిపివేశాడు.

ఊరు వ్యాఘ్ర నగర మురగంబు కరణంబు
కాపు కపివరుండు కనవు నేడు
గుంపుగా గ నిచట గురజాల సీమలో
నోగు లెల్ల కూడి రొక్కచోట

అటువంటి అనుభవం, పరాభవం నెమలిపురంలో కూడా జరిగింది. బాధితుడైన కవి నోట వెలువడిన పద్యమిది:

నెమలిపురి యమపురముగా
యముడాయెను బసివిరెడ్డి యంతకు మిగులన్
యమదూతలైరి కాపులు
క్రమ మెరుగని దున్నలైరి కరణాలెల్లన్.

నెమలిపురం నరకంలా ఉంది. అందులో యముడు బసివిరెడ్డి, కాపులు యమదూతలు. యముని వాహనం మహిషం కదా! కరణాలంతా ఆవిధంగా అయినారట! ఎంత ఇబ్బంది పడకపోతే అటువంటి పద్యం రాస్తాడు!

అదేవిధంగా కడిదిపురం వెళితే ముసలి విటులు, వేశ్యలైన వితంతువులు, పదకవితలు, మారుబాస మాట్లాడే బ్రాహ్మణులు, పైకి పండితుల్లా నటిస్తున్న విద్యాహీనులు, పోరులో నిలవలేని వీరులు అంతటా కనిపించారు. వారి నందరినీ ఒక కందంలో బందీలు చేశాడు.

ముది విటులు, విధవలంజెలు
పద కవితలు, మారుబాస బావన వారల్
చదువని పండితవర్యులు
కదనాస్థిర వీరవరులు కడిదిపురమునన్.

వారకాంత లా రోజుల్లో లలిత కళా నిపుణలై రసికులను చక్కగా అలరించేవారు. కేవలం కామక్రీడ మాత్రమే వారి లక్ష్యం కాదు. శారీరకంగానే కాక మానసికంగా కూడా సంతోషపెట్టగల శక్తి, లక్షణం వారి కుండేవి. అలా అలంకారాలు ధరించి, నిజమైన శృంగార నైపుణ్యం లేని వారకాంతలను చూసి శ్రీనాథు డిలా అంటాడు.

ఉ. చీరయు ముక్కు ముంగరయు చెంపల గంధము చుక్కబొట్టు మం
జీర ఝణం ఝణారవము చేతుల కంకణ నిక్వణంబు నొ
య్యారపు జారు కొప్పును గయాళితనంబును గాని లోన శృం
గార మొకింత లేదనుట గంటిని ఈ పురి వారకాంతలన్

వికారంగా ఉన్న ఒక అరవపిల్లను చూసి, ఆమె ఆహార విహార ప్రవర్తనలు చూసి వెగటు గలిగి ఈ రకంగా అన్నాడు.

మేత కరిపిల్ల పోరున మేకపిల్ల
పారుబోతుతనంబున పందిపిల్ల
ఎల్ల పనులను జెరుపంగ పిల్లిపిల్ల
అందమున కోతిపిల్ల యీ అరవపిల్ల.

చివరి పాదంలో అరవపిల్ల కాదు అరవపిళ్ళ అని కొందరి పాఠభేదం. అరవపిల్ల లందరూ అలా వికారంగా ఉంటారని కాదు. వికారంగా ఉన్న ఒక పిల్లను గురించి చెప్పిందది. కంచి అరవతల సౌందర్య శృంగారాలను మెచ్చుకొంటూ చెప్పిన పద్యం చూడండి.

పయ్యెదయు సిగ్గు పాలిండ్ల బాకనీరు
తరచు పూయుదు రోల గందంబు పసపు
బంది కత్తెలు సురత ప్రపంచవేళ
కంచి అరవతల సమాస్త్రు ఖడ్గలతలు.

చాటువులకు నీటుదనం తెచ్చిన నేర్పు కవిసార్వభౌమునిది.

## కృష్ణానుభూతి

పదిహేడవశతాబ్దం ఉత్తరార్ధంలోని కవులలో పుసులూరి సోమరాజ కవి పేర్కొనదగినవాడు. ఈతని చరిత్ర, కవితలలోని కొన్ని విశేషాలను బొమ్మకంటి శ్రీనివాసాచార్యులు, బాలంత్రపు నళినీకాంతరావు సేకరించి ప్రచురించారు. కృష్ణభక్తుడుగా, మహిమాన్వితుడుగా ఇతని గూర్చి చాలా కథలు వ్యాపించాయి. చాటుకవిగా, శతక కవిగా ఇతనికి ఎంతో విశిష్టమై స్థానం ఉంది. బాలగోపాలుని పేర రచించిన శతకంలో పూర్వకవులను ఇతను స్మరించిన తీరు చూడండి

ప్రా చేతసార్పిత రామాయణము భంగి వ్యాస కల్పిత భాగవతము మాడ్కి
ద్రావిడ వాఙ్మయోదార వేదమురీతి నారద మధురగానంబు సరణి
లీలాశుక స్తుతి లాలన ప్రక్రియ జయదేవకవి సరస్వతి విధమున
బమ్మెర పోతన్న భారతీక్రమమున దాసగీత ప్రబంధముల పోల్కి

బాల కృష్ణాంఘ్రి దాసోక్త పద్య శతము
దయను కనుగొను మాచంద్రతారకముగ
బాలగోపాల ! కరుణాలవాల ! నీల
శైల పాలావనీపాల ! చారులీల!

ఇందులో సంస్కృతాంధ్ర తమిళ కర్నాట కవులను స్మరించడం గమనించదగిన అంశం. అంతేకాదు. భక్త కవులను మాత్రమే ఇందులో స్తుతించటం జరిగింది.

నంద నందన శతకంలో గోపికా కృష్ణుల దివ్యవిహార లీలలను రమణీయంగా వర్ణించిన తీరు పేర్కొనదగినది.

పుక్కిట తమ్ములం బడుగు బోటికి నోటికి నియ్య జూచి వే
రొక్కతె కోపగింప కనకోత్పల మాలిక లిచ్చినట్టి మే
లిక్కడ చూప వచ్చితి బళీ యను రాధిక నూరడించు నీ
చక్కదనంబు జూడ మనసైనది చూపుము నందనందనా!

కృష్ణుడు తాంబూలం వేసుకొన్నాడు. ఒక గోపిక తన కిమ్మని అడిగితే ఆమె నోటి కందించాడు. దీన్ని చూసి ఇంకో గోపికకు కోపం వచ్చింది. ఆమె అలుక తీర్చటానికి తాను ధరించిన చంపకోత్పలమాల

లిచ్చాడు. ఇటువంటి చేతలు, చాతుర్యాలు నా దగ్గరా -అనే రాధను ఊరడించే నీ సౌందర్యం చూడాలని మనసైంది. నాకు చూపించవలసింది-అని కవి తానూ ఒక గోపిక అయి అర్థిస్తున్నాడు.

"ఇందూ! నందుని మందనుండి కద నీ వేతెంచుటల్ రాకలన్' అనే మకుటంతో 116 పద్యాలు లలిత శృంగార సుందరంగా రచించా డీ కవి. శార్దూలాల్లో ఇన్ని పద్యాలు ఇంత మృదుమధురంగా రచించిటం చాలా కష్టం. రసానుగుణమైన వృత్తా లివి అని, అందులో శార్దూలం గంభీరమై వీర రౌద్రాది రసాలకు పనికివస్తుందని సంస్కృతాలంకారికులు చెప్పారు. అయితే తెలుగు కవులు ఈ నిబంధన నంతగా పట్టించుకోలేదు. చంపకమాలలో భీషణత్వాన్ని శార్దూలంలో మార్దవాన్ని సృష్టించగల నేర్పు తెలుగు వారి సొమ్ము. నిసర్గ సుందరమైన ఈ శార్దూలాలను చూడండి!

బృందారణ్యము సేమమా! అచటి గో బృందంబులున్ లెస్సలా?
నందుండున్ సతియున్ సుఖాన్వితులె? నానా గోపగోపాలికా
సందోహంబులతో హలాయుధుడు కృష్ణస్వామి క్రీడింతురా?
ఇందూ! నందుని మందనుండి కద నీ వేతెంచుటల్ రాకలన్?

తరువాతి కాలంలో తిరుపతి వేంకటేశ్వరుల ఉద్యోగ విజయాలలోని

బావా! ఎప్పుడు వచ్చి తీవు? సుఖులే భ్రాతల్ నఖుల్ చుట్టముల్
నీ వాల్లభ్యము పట్టు కర్ణుడును మన్నీలున్ సుఖోపేతులే?
మీ వంశోన్నతి గోరు భీష్ముడును మీ మేల్గోరు ద్రోణాది భూ
దేవుల్ సేమము మై నెసంగుదురె నీ తేజంబు వెల్గించుచున్

వంటి పద్యాలకు సోమరాజు మార్గదర్శకుడంటే అతిశయోక్తి, అత్యుక్తి కాదు.

జయదేవుని గీత గోవిందంలోని గోపికా కృష్ణుల విరహ మధురభావన సుప్రసిద్ధమూ, సుమనోహరమూ. దాన్ని స్మరిస్తాడు కవి-

బృందారణ్యమునందు రాధ కడు కోపింపన్ మహాగీత గో
విందప్రోక్త కథా ప్రకారముల తన్విన్ వేడుకొన్నట్టి ఆ
నందాభీరకుమార చేష్టితము లానందంబుగా కంటివా?
ఇందూ !.... ... .... ....

రామాయణంలో సీతా విరహ వ్యథితుడైన రాముడు సీత మీదినుంచి తన మీదకు వీచలసిందిగా వాయువును వేడుకొంటాడు. 'వాహివాత! యతస్సీతా' అని. అదేవిధంగా జగత్సాక్షులలో ఒకడైన చంద్రుణ్ణి రచయిత ఇలా వేడుకొంటాడు.

ఛందో వీధుల సంచరించు హరి స్వేచ్ఛా క్రీడలన్ గోపికా
సందోహంబుల కూడి యాడె నను వాచా ప్రౌఢిమన్ వింటి మా
చందంబంతయు చూచి వచ్చితె జగత్సాక్షి ప్రమాసింధువౌ
ఇందూ ! ... ... .. ..

చంద్రుణ్ణి దూతగా భావించి రచించిన ఈ తీరు చూస్తుంటే కాళిదాసు మేఘదూతం స్ఫురించక తప్పదు. తనను కూడా ఒక స్త్రీగా భావించుకొని మధుర భక్తిభావనతో గోవిందుని పొందుకోసం పరితపించే ఈ పద్యం చదవండి-

మందన్ గోపిక లిందు నేను హరి పల్మాయల్ వినోదించి గో
విందున్ నాథునిగా వరించితిమి, ఆ వ్రేతల్ నిజాభీష్టముల్
పొందన్ జాలిరి నాకు నవ్విధ మ దే పుణ్యంబునున్ గల్గునో
యిందూ ! ........ ......... ......... .

ఇంతటి భక్తి పారవశ్యాన్ని జీవితంలోనూ, కవిత్వంలోనూ పొందిన సోమరాజు కృష్ణాను గ్రహాన్ని పొందటంలో విశేష మేముంది? బృందావన వల్లభుడు తప్పక స్వీకరించి, ఇతని కవిత్వానికి, ఇతనికి కృతార్థత ప్రసాదించి ఉంటాడు.

## పద్యంలోపద్యం

కవితా కళానిధి బిరుదాంచితులైన పొత్తూరి వీర రాఘవ వరప్రసాదయరాయ శర్మగారు గుంటూరుజిల్లా సంతమాగులూరు గ్రామ వాసులు. వరలక్ష్మీ శతకము, తిరుపతి పుర వేంకటేశ శతకము, హనుమచ్ఛతకము మొదలైన శతకములు, దండకములు, వంశ చరిత్రలు సుమారు ముప్పై గ్రంథాలు రచించారు. ప్రాచీన ప్రబంధ ధోరణిలో రచన చేసే ఇటువంటి వారు ఇప్పటికీ మన గ్రామాలలో చాలాచోట్ల కనిపిస్తారు. ఆధునిక అభ్యుదయ వచన కవిత వాసనలు సోకని పూర్వ మార్గీయులు వీరంతా. శర్మ గారు ప్రాబంధికమైన చిత్ర కవితా ధోరణులెన్నో తమ గ్రంథాలలో, పద్యాలలో ప్రదర్శించారు. ద్వ్యక్షర, త్ర్యక్షర, చతురక్షర ప్రాసలు, ముక్త పద గ్రస్తాలు, గోమూత్ర, ఛత్ర, పద్మమాలికాది బంధాలు, ఏకాక్షర, ద్వ్యక్షర పద్యాలు, బహువిధ గర్భకవిత్వాలు- ఎన్నో సాముగరిడీలు వీరి రచనలో కనిపిస్తాయి. గర్భ కవితకు సంబంధించిన కొన్ని ఉదాహరణలు వీరి గ్రంథాల నుంచి చూడండి!

ఇది కందగర్భిత శార్దూల వృత్తం -

శ్రీమద్భక్త జనావన స్ఫురిత ధీచిస్ఫూర్తి! లోకేశ్వరా!
రామా మానిత పూజ్యభావ! మహిభృద్రాజాళి సంపూజితా!
కామారిస్తుత రాజితాత్మ చరితా! కారుణ్య రత్నాకరా!
శ్రీమా మాన్యద! చారురూప మహిత శ్రీశాఢ్య ! శ్రీ రాఘవా!

దీనిలో గర్భితమైన ఉన్న కందం-

శ్రీమద్భక్త జనావన
మా మానిత పూజ్యభావ! మహిభృద్రాజా!
కామారిస్తుత రాజిత!
మా మాన్యద చారు రూప! మహిత శ్రీశా!

ఈ కింది మంజుభాషిణీ గర్భితోత్పలమాల-

శ్రీ నవమోహనా! మహిత సింధుసుతా ప్రమదోద్ధతా ! విధూ!
భానుకులోత్తమా! విహిత భవ్య సురూప! విశారదా ! గురూ!
దీన జనావనా! సుహిత దివ్య సుకాంతి సుధారసా! మనో
జ్ఞాన విశేషదా! గృహిణి జానకి నామ! కృపాద! రాఘవా!

ఈ పద్యంలో ఉన్న మంజుభాషిణి-
మహిత సింధుసుతా ప్రమదోద్ధతా!
విహిత భవ్య సురూప విశారదా!
సుహిత దివ్య సుకాంతి సుధారసా!
గృహిణి జానకి నామ! కృపాదరా!

కందం, గీతం గర్భితమైన ఈ క్రింది చంపకమాలను చూడండి!

సిరిచర! పూజ్యతా మహిమ! సేవ్యరమాధిప ! మంగళాంగ ! బం
ధుర గిరిజాధిపా! సువిబుధోత్తమ చిన్మయ సూరి వంద్య! భూ
భర వర పూరుషా!వినుతభావ రఘూద్వహ విశ్వ కీర్తిదా!
గురు కరుణా విలాస రస కోవిద భూజన సామి రామయా!

దీని లోపల ఉన్న కంద పద్యమిది -

వర పూజ్యతా మహిమ సే
వ్యరమాధిప మంగళాంగ!బంధుర గిరిజా
వర పూరుషా వినుత భా
వరఘూద్వహ విశ్వ కీర్తి భా గురు కరుణా!

అలానే గర్భగీతం గమనించండి!

గీ॥ మహిమ సే వ్యరమాధిప మంగళాంగ!
సువిభుధోత్తమ చిన్మయ సూరి పంద్య!
వినుత భావర ఘూద్వహ! విశ్వకీర్తి!
సరస కోవిద భూజన సామి రామ!

ఇటువంటి పండిత కవిని బ్రహ్మశ్రీ మిన్నికంటి గురునాథ శర్మగారీవిధంగా ఆశీర్వదించారు.

కం॥ విమలమగు భక్తి నిర్దు
ష్టమైన కవితా ఝరమ్ము సరసమ్ముగు భా
వము నీదు సొమ్ము కంటిన్
బ్రమదము పొత్తూరి వీర రాఘవ శర్మా!

శతావధాని శ్రీ కొప్పరపు సీతా రామ ప్రసాదరాయ కవి ప్రశంస కూడా అటువంటిదే!

తే.గీ. స్థిర భావజ్ఞాన దీప సందీప్త సుకృతి
హర్మ్యమున సకలాభ్యుదయంబు లొలయు
గాత పొత్తూరి వీర రాఘవ వర ప్ర
సాదరాయ శర్మ! సుకృత శతక ధర్మ!

సుకృత శతక ధర్మ అనే పదం ద్వ్యర్థి అయి కవి విశిష్టతను చక్కగా తెలియజేస్తున్నది.

## చాటు పాండిత్యం

దూరార్థ చాటువులు చిత్రమైన ప్రక్రియా విశేషానికి ఉదాహరణలు. ఎక్కడో మొదలై ఎక్కడో తుది వస్తుంది. వినే వాళ్లకు వింతగానూ, అర్థం చెప్పే వాళ్ళకు చింతగానూ ఉండే విలక్షణత్వం దీంట్లో ఉంది.

ఒకసారి విటుడొకడు వేశ్య ఇంటికి వెళ్ళాడు. ఆమె మంచి విద్వాంసురాలు. ఇతనూ చదువుకొన్నవాడే.వారి సంభాషణలో నరసాలకూ, చాతుర్యాలకూ కొదవేముంటుంది? ఆమె ఇతనికి వక్కలాకు లిచ్చింది. ఇక సున్నం కావాలి. అతనొక పద్యంలో ఇలా అడిగాడు.

పర్వత శ్రేష్ఠ పుత్రికా పతి విరోధి
అన్న పెండ్లాము అత్తను గన్న తండ్రి
పేర్మి మీరిన ముద్దుల పెద్ద బిడ్డ!
సున్నమింపుక తేగదే! సుందరాంగి!

పర్వత శ్రేష్ఠ పుత్రిక! పార్వతి, (ఆమె)పతిఃశివుడు,(అతని) విరోధిఃమన్మథుడు, (అతని)అన్నఃబ్రహ్మ(అతని) పెండ్లాముఃసరస్వతి,(ఆమె)అత్తఃలక్ష్మి(ఆవిడ)కన్న తండ్రిః సముద్రుడు,(అతని)పెద్దబిడ్డఃజ్యేష్ఠాదేవి.(దరిద్రగొట్టు)పెద్దమ్మా!సున్నం తెమ్మని అర్థం.

ఆ వారకాంత నెరజాణ.ఆమె సున్నం తెచ్చి తీసుకోమంటూ అటువంటి పద్యమే చెప్పింది.

శత పత్రంబుల మిత్రుని
సుతు జంపిన వాని బావ సూనుని మామన్
సతతము దాల్చెడు నాతని
సుతు వాహన వైరి వైరి సున్నం బిదిగో!

శతపత్రంబుల మిత్రునిఃతామరల కాప్తుడై సూర్యుని,సుతు జంపిన వాని కుమారుడైనః కర్ణుని జంపిన అర్జునుని, బావః కృష్ణుని, సూనుని ః కుమారుడైన మన్మథుని, మామన్ః మామ అయిన చంద్రుని, సతతము దాల్చెడు నాతనిః ఎప్పుడూ ధరించి ఉండే శివుని,సుతుః కొడుకైన గణపతి, వాహనః వాహనమైన ఎలుకకు, వైరిః శత్రువైన పిల్లి,వైరిఃశత్రువైన కుక్కా! సున్నం బిదిగో!

పెద్దమ్మా! సున్నమేదీ! అని అతనంటే కుక్కా! ఇదిగో సున్నమని ఆమె ఇచ్చింది.

వేరొక కవి ఒక వ్యక్తిని గురించి సూటిగా,వ్యతిరేకంగా చెపితే బాగుండదని ఈ విధంగా అన్నాడు.

శతపత్ర మిత్రు సుతుని తమ్ముని బావ
పెద్ద అగ్రజుండు ప్రీతి దాల్చు
నట్టి యాయుధంబు నవనిని మోచిన
యాతడు యితడు సుమ్మీ అంబుజాక్షి!

శతపత్రాల మిత్రుడైన సూర్యుని కుమారుడైన కర్ణుని తమ్ముడైన అర్జునుని బావ కృష్ణుడు, అతని అగ్రజుడు బలరాముడు ధరించేది నాగలి. దాన్ని భూమిపైన మోసేది ఎద్దు లేక దున్నపోతు.ఇతనలాంటి వాడని కవి భావం.

మరొక పద్యం - అటువంటిదే

సురచర గురునకు సతి సుతు
వర జనకుని తండ్రి కూతు వరసుతు మామన్
శిరమందుగొన్న వరసుతు
నిరతము సేవింతు నియమ నిష్కలుషమతిన్.

సురవరగురుః బృహస్పతి, సతిః భార్య అయిన తార,సుతు కుమారుడైన బుధుని, వరజనకునిః తండ్రి అయిన చంద్రుని, తండ్రి సముద్రుని, కూతురుఃపుత్రిక యైన లక్ష్మీదేవి, వరసుతుః మన్మథుని,మామన్ః చంద్రుని, శిరమందు గొన్న వరః తలనుదాల్చు శివుని,సుతుః వినాయకుని నిరతమూ సేవిస్తాను అని అర్థం.

ఇంకో పద్యం ఈవిధంగా రచించిందే చూడండి.

ఇలరుహ వైరి వైరిని ధరించిన యాతనిసామి పుత్రుతో
బలమరిచన్న రేని పురి భస్మ మొనర్చిన యుగ్ర వైరికిన్
బళిబళి తమ్ముడౌ నతని బావ కుమారుని వైరి శేఖరో
జ్వలుని సుపుత్రు తాత తను జాత యొసంగుత సర్వ సంపదల్.

ఇలరుహః భూమికి పుట్టినవి చెట్లు, వాని వైరిః అగ్ని, అతని వైరిః జలం, ధరించి యాతని ః మేఘుని, సామిః ఇంద్రుని పుత్రుతోః వాలితో, బలమరిచన్న రేడుః రావణాసురుడు, (వాని) పురి భస్మ మొనర్చిన యుగ్రవైరికిన్ః లంకను, బూడిద చేసిన ఆంజనేయుని, తమ్ముడౌ నతనిః భీముని, బావః కృష్ణుని (అతని)కుమారునిః మన్మథుని, వైరి ః శత్రువైన శివుని, శేఖరోజ్వలునిః సిగలో ప్రకాశించే చంద్రుని,సుపుత్రుః బుధుని,తాతః సముద్రుని, తనుజాతః కుమార్తె అయిన లక్ష్మీదేవి- మీకు సమస్త సంపదల నిచ్చుగాకః అని అర్థం.

ప్రాచీన సాహిత్యంలో ఇటువంటి పాండితీ ప్రదర్శనలు ఎక్కువగా ఉండేవి. వాటి పట్ల ప్రీతి గలవారూ ఎక్కువగానే ఉండేవారు.

## కాంత కవిత

ఈశతాబ్ది ప్రథమ భాగంలో గృహలక్ష్మి పత్రిక స్త్రీలకు ఆదర్శప్రాయమైన రీతిలోనడిచేది. మహిళల రచన లెన్నో దానిలోసింగారించుకొని దర్శన మిచ్చేవి. ఆచార్య లలితగారు అందులో ముద్రితమైన స్త్రీల చాటువులు కొన్ని సేకరించి తమ గ్రంథంలో ఉదాహరించారు.

చీమలకొండ రామసుబ్బలక్ష్మి ప్రకటించిన ఒక ప్రశ్నల పద్యం చూడండి!

తే.గీ॥ చెడ్డవానికి నూరను జేరునేది?-1
విలువగల లోహమున కేది పేరు భువిని?-2
వరగ సరసీరుహముకేది మారుపేరు?-3
నిదుర కన్నుల చేరగనీయ దేది?-4
పక్షులెట్టుల నుదయాన పాడుచుండు?-5
పెద్ద లెవ్వరు జనియింప ప్రీతులగుదు?-6
రన్ని ప్రశ్నలకు జవాబు లందు గూడ

నమరుచుండును నాల్గేసి యక్కరములు
మొదటి మూడవ అక్షర మొకటి యగును
చిక్కు విడదీయరమ్మ! మా యక్కలార!

జవాబులుః

1. కళంకము,కంటకము, నాశనము 2. కనకము
3. జలజము, నలినము 4. కలికము 5. కలకల, కిలకిల
6. మనుషులు

పసుమర్తి లక్ష్మాయమ్మగా రిటువంటిదే ఒక చిత్రాన్ని సీసంలో రాశారు.

పంచాక్షరము లొక్క పంక్తిగా వ్రాయగా నేకదంతుండయ్యె ప్రాకటముగ
మొదటి వర్ణము మాని ముదముతో జదువగా నబ్జాసనుండయ్యె నంతలోన
ఇరు వర్ణములు మాని గరిమతో బల్కగా వారి పౌత్రుండయ్యె వైభవమున
తిగవర్ణములు పంపి తేటగా వర్ణింప అలరు విల్తుండయ్యె సలిలతముగ
ఏకవర్ణము నిల్పి యెలమితో పఠియింప హవ్య వాహనుడయ్యె నందముగను

ఇట్టి శబ్దార్థములు మీరలింపు తోడ
మది విచారించి పదునైదు మాసములకు
చెప్పగదరయ్య! సత్కవిశ్రేష్ఠులార!

అయిదక్షరాల మాట. దాని కర్థం వినాయకుడు.మొదటి అక్షరం తీసేస్తే బ్రహ్మ. మొదటి రెండక్షరాలు తీసేస్తే కుమారస్వామి.మూడక్షరాలు తీసేస్తే మన్మథుడు, నాలుగక్షరాలు తీసేస్తే మిగిలిన ఒక అక్షరానికి అగ్ని అని అర్థం. దీని కీలకం। ఉమాకుమార.

ఆచంట సత్యవతమ్మ గారు చిత్రించిన చిత్రప్రశ్న పద్యము కూడా చమత్కారయుతమైంది. చూడండిః

ఆరక్షరంబుల ఆర్యుల గ్రంథంబు అతి వ్యాప్తి నొందుచు నలరుచుండు
ఆద్యక్షర ద్వయంబనువుగా భగవంతు గొలుచు వారిని దెల్పు కొమరు మిగిలి
ఒకటైదునారులు నొనరంగ గలిపిన భీతికి మారుపేరతికి యుండు
నాలుగైదారక్షరాలను గలపంగ గెలుపున కర్థంబు నెలమిగాంచు
మూడు నాల్గయిదారు మోదంబు దీపించు సంపూర్ణ జయమును సరవి దెలుపు

అట్టి పుస్తక నామంబు నరసి మీరు ఆర్యమత జ్ఞాన మభివృద్ధి యగు విధాన
పత్రికాబాల గృహలక్ష్మి కందజేసి యశము నొందంగ బూనుడోయమ్మలార!
జవాబుః భక్త విజయము

i ఆ రక్షరముల ఆర్య్యగ్రంథం- భక్త విజయము ii మొదటి రెండక్షరాలు దేవుని గొలిచేవారిని తెలుపుతుంది - భక్తః iii. 1,5,6 అక్షరాలు కలిపితే భీతి - భయము iV. 4, 5,.6 అక్షరాలు కలిపితే గెలుపు - జయము V 3,4,5,6 అక్షరాలు కలిపితే పూర్తి గెలుపు- విజయము

ఇటువంటి చమత్కారాలు సృష్టించటం,సమస్యలుపూరించటం, ఆశువుగా కవిత నల్లటం- విదుషీమణులై చర్చలలోపాల్గొని వాదోపవాదాలు చేయటం- ఎందరో మహిళలు నేర్పుతో కావించారు. కవిరాణి బిరుదు గాంచిన చిల్కపాటి సీతాంబగారు ఈక్రింది సంస్కృత శ్లోకాన్ని వినగానే ఆశువుగా పూరించారట.

శ్లో: కమఠ పృష్ఠ కఠోర మిదంధనుః
మధురమూర్తి రసే రఘునందనః
కథమధిజ్య మనేక విధీయతాం
అహహశాత ఫణః ఖలుదారుణః

అనువాదంః

కమఠ పృష్ఠ కఠోర మీ కార్ముకంబు
సరస సుకుమారు డీ రామచంద్రమూర్తి
ఎటుల నెక్కిడ నేర్చునొ? యేమి యగునొ?
కటకటాః యేమి శపథంబు? కన్నతండ్రి!

'ముదితల్ నేర్వగరాని విద్యగలదే ముద్దార నేర్పించినన్' అనే వాక్యాన్ని కుదాహరణలై ప్రకాశించారీ రచయిత్రులంతా.

## రాజుకు సవాల్ !

ఆంధ్ర. సాహిత్య చరిత్రలో శ్రీనాథుడు విజయనగరానికి వెళ్ళి,అక్కడి ప్రౌఢ దేవరాయల ఆస్థానంలో గౌడ డిండిమభట్టు నోడించి, కంచు ఢక్కను పగులగొట్టించి విజయపతాక నెగురవేసిన ఘట్టమొక సువర్ణాధ్యాయం, కొండవీడులో శ్రీనాథుడు విద్యాధికారి. విద్యా పరీక్షణ వేళలందు బహుదేశబుధులతో ప్రసంగించి, వారి తారతమ్యాలను గ్రహించి మహారాజుచేత వారికి సత్కారాలు చేయించేవాడు. అంతటి మహితాత్మునికి కూడా కర్ణాటక రాజధానిలో సరైన ఆదరం లభించలేదు. అక్కడి ఆస్థాన పండితులలో ఒకరైన ముమ్మ కవి దగ్గరకు వెళ్ళి, రాజదర్శనం కోసం అర్థించాడు. శ్రీనాథుని శక్తి సామర్థ్యాల విషయమై ముమ్మకవికి సందేహమే కలిగిందో,ఈర్ష్య కలిగిందో - కవి రాజీ పద్యం పలికాడు.

సీ. పంపా విరూపాక్ష బహు జటాజూటికా రగ్వధ ప్రసవ సౌరభ్యములకు
తుంగభద్రా సముత్తుంగ వీచీ ఘటా గంభీర ఘుమ ఘుమా రంభములకు
కళసాపుర ప్రాంత కదళీ వనాంతర ద్రాక్షాలతా ఫల స్తబకములకు
కర్ణాట కామినీ కర్ణ హాటక రత్న తాటంక యుగధాళ ధళ్యములకు

గీ. నిర్ణిబంధ నిబంధమై నెనయు కవిత తెలుగునను సంస్కృతంబున బలుక నేర్తు
ప్రౌఢ దేవేంద్ర రాయ భూపాల వరుని సమ్ముఖంబున దయజూడు ముమ్మ సుకవి॥

సౌందర్య దార్శనికుడైన శ్రీనాథుడు తానే ప్రాంతం వెళితే అక్కడి విశేషాలను మంచిగానీ,చెడుగాని, నచ్చినవిగానీ, నచ్చనవిగానీ, ఉన్నది ఉన్నట్లు నిర్మొహమాటంగా చెప్పేవాడు. కన్నడ భూమిలోని తుంగభద్ర,అరటి తోటలు, ద్రాక్ష గుత్తులు,తావులీను రేల పూలు, రత్న తాటంకినులు - విశేషించి విరూపాక్షస్వామి- ఆ కవి హృదయాన్ని ఆకర్షించి ముద్ర వేయటం జరిగింది. అందువల్లనే ముమ్మ కవితో చెప్పేటప్పుడు అక్కడి ఉపమానాలనే స్వీకరించి తన కవితా లక్షణాన్ని నిర్వచించాడు.ఆ పద్యాన్ని బట్టి విరూపాక్షుని జడలలో అలంకరించే రేల పూల పరిమళం, తుంగభద్రానది అలలు చేసే ఘుమ ఘుమనాదం, కళసాపురపు అరటి తోటలలోని ద్రాక్ష తీగలకు వ్రేలాడే పండ్ల గుత్తుల తీయదనం, కన్నడ కాంతలుచెవులకు ధరించే ఆభరణాలలో పొదిగిన రత్నాల కాంతి - అతని కవితలో ఉంటాయన్నమాట. అంటే కవిత్వానికి వాసన,నాదం,రుచి,కాంతి ఉంటాయని శ్రీనాథుడు పరోక్షంగా చెప్పాడు. అంతేకాదు అలంకార శాస్త్ర దృష్టితోచెపితే నాలుగు పాదాలు వరుసగా ప్రసాద, ఓజస్, మాధుర్య,కాంతి గుణాలను అభివ్యక్తం చేస్తాయి. ఇంత సర్వాంగసుందరంగా కవిత్వ లక్షణాలను చెప్పినవారు అరుదు.

ఇంతగా అద్భుతమైన పద్యం చెపితే ముమ్మ కవికి తృప్తి కలుగలేదు. ఇంకా అడిగాడు - ' నీ కేమైనా బిరుదు లున్నాయా' అని అప్పుడు మళ్ళీ శ్రీనాథుడిలా అన్నాడు.

చం॥ తరువున గాండివం బిడడె ధర్మజు నాన కిరీటి -యేను వా
క్సరసిజ నేత్ర ఆనతి విచారము చొప్పున దిగ్జయంబుతో
మరలి తెనుంగు భూమి కసమాన గతిన్ గొనిపోవు వాడనై
బిరుదులు నారివాగు కడ బెట్టితి సత్కవి సార్వభౌముడన్.

తమ ఆస్థానంలో కవి సార్వభౌముడు డిండిమభట్టు, ఇతను తాను సత్కవి సార్వభౌముడననటం ముమ్మకవికి ఎంతమాత్రమూ రుచించలేదు. రాజదర్శనానికి సహాయం చేయకూడదని నిశ్చయించుకున్నాడు.

శ్రీనాథుని పని మళ్ళీ మొదటి కొచ్చింది. విసుగుతో,బాధతో, వేదనతో నిరాశతో తిరిగి పోవలసి వస్తుందా- అనిపించింది. ఏమి చెయ్యాలో తోచలేదు.

చివరకు వెలుగు రేక తోచింది. ఎవరో ఒకరి ద్వారా ఈ సవాలు పద్యాన్ని రాజుగారికి చేర్చగలిగాడు. రాజదర్శనం లభించింది.

సీ॥ డంబు సూపి ధరాతలంబుపై దిరుగాడు కవి మీద గాని నా కవచమేయ
దుష్ప్రయోగంబులు దొరకొని చెప్పెడు కవి శిరస్సున గాని కాలు చాప
సంగీత సాహిత్య సరస విద్యలు నేర్చు కవుల రొమ్ములు గాని కాల్చి విడువ
చదివి చెప్పగ నేర్చి సభయందు విలసిల్లు కవి నోరు గాని వ్రక్కలు గదన్న
గీ॥ దంట కవులకు బలులైన యింటి మగడ కవుల వాదంబు విన వేడ్క గల్గెనేని
నన్ను బిలిపింపు మాస్థాన సన్నిధికిని లక్షణోపేంద్ర ! ప్రౌఢరాయక్షితీంద్ర!

## శ్రీనాథ చమత్కారం

విజయనగరాస్థానంలో శ్రీనాథుడు ప్రదర్శించిన కవితా పాండిత్య విన్యాసం మహాద్భుతమైనది. అనితర సాధ్యమైనది. ఆస్థానంలో ప్రవేశం లభించగానే ముందు ప్రౌఢరాయలు తమ దే ఊరని అడిగాడు. దానికి శ్రీనాథుడిచ్చిన సమాధానం చూడండి.

సీ. పరరాజ పరదుర్గ పరవైభవశ్రీల గొనకొని బెడనాడు కొండవీడు
పరిపంథి రాజన్య బలముల బంధించి కొమరు మించినబోడు కొండవీడు
ముగురు రాజులకును మోహంబు బుట్టించు గురుతైన యురిత్రాడు కొండవీడు
చటుల విక్రమ కళా సాహసం బొనరించు కుటిలాత్ములకు కాడు కొండవీడు.

గీ. జవన ఘోటక సామంత సారవీర భటనటానేక హాటక ప్రకటగంధ
సింధురార్భటి మోహనశ్రీలదనరు కూర్మినమరావతికి జోడు కొండవీడు.

తన బ్రాహ్మీదత్త వరప్రసాదవైభవం,బ్రహ్మాండాది నానా పురాణ విజ్ఞాన నిరతి అతిశయించే విధంగా రాయల ముందు తన సారస్వత ప్రభావాన్ని చూపించాడు. మహారాజు మెచ్చుకొని తన ఆస్థాన పండితుడైన డిండిమభట్టుతో వాదయుద్ధం ఏర్పాటు చేశాడు. ఈ డిండిమభట్టు బిరుదనామం. అసలు పేరు అరుణ గిరినాథుడు, కవితార్కికసింహ, సర్వతంత్ర స్వతంత్ర బిరుదాలుకలవాడు. అష్టభాషా కవితా సమ్రాట్టు. తన శక్తి సంపదలను గూర్చి ఇలా అతను చెప్పేవాడట.

శా॥ అగ్రే డిండిమ తాడనం తత ఇతో వంది ప్రజోద్ఘోషణం
ద్విత్రాశ్చిత్రపటాః కియంతి బిరుద ప్రోతాని పద్యానినః
అస్తాం తావదిదం మహేశమకుటీ కోటీర కల్లోలినీ
కల్లోల ప్రతిమల్ల సూక్తి విభవైర్ద్వేష్యాన్ విజేష్యామహే.

ఢక్క మోగిస్తూ, బిరుద గద్యలు పఠిస్తూ వందిమాగధులు, శిష్యులు ముందు నడుస్తూ ఉంటే శివజటాజూటం నించి దూకే గంగాతరంగోల్లసితమైన వాక్కులతో ఎంత శత్రువునైనా సరే, జయిస్తాను - అని అతని ప్రతిజ్ఞ.

సాహిత్య వ్యాకరణాది శాస్త్రాల్లో ఉద్భట వివాదం రోజుల తరబడి సాగింది. చివరకు డిండిమభట్టు ఓడిపోయినట్లూ, శ్రీనాథుడు గెలిచినట్లూ మధ్యవర్తిగా నియమితుడైన చంద్రశేఖరక్రియాశక్తిపండితుడు తీర్పిచ్చాడు. డిండిముని డిండిమం బద్దలైంది. అతని కవిసార్వభౌమబిరుదు శ్రీనాథునికి సమర్పితమైంది. రాజుగారు ఘనసన్మానం చేశారు. సన్మానానికి కృతజ్ఞతాసూచకంగా రాయలమీద పద్యాలు చెప్పాలి. ఒక్కసారి సభాస్థలి వైపు రాయలవైపు చూసి శ్రీనాథుడిలా పలికాడు.

మ॥ జననాథోత్తమ! దేవరాయ నృపతీ! చక్రేశ ! శ్రీవత్సలాం
ఛనసంకాశ ! మహాప్రభావ ! హరిరక్షాదక్ష ! నాబోటికిన్
కున్నవస్తోత్ర సముద్భవంబయిన వాగ్ఘోషంబు శాంతింపగా
కనకస్నానము చేసి గాక పొగడంగా శక్యమే దేవరన్?

మహాప్రభూ! అల్పులైన రాజులను పొగడటంచేత కలిగిన వాగ్దోషం పోయే విధంగా,సువర్ణ స్నానం చేస్తే తప్ప మీవంటి రాజ చూడామణిని స్తుతించటం సాధ్యమా? అని చతురంగా అన్నాడు. గుణగ్రహణ పాండితీ రసజ్ఞశేఖరుడు అయిన ప్రౌఢరాయలు తన ముత్యాలశాలలో సభికుల సమక్షంలో శ్రీనాథునికి కనకాభిషేకం -దీనారటంకాలతో చేయిచాడు. ఆనంద పారవశ్యంతోశ్రీనాథుడు రాయల నీవిధంగా సరస్వతీ సుతుడుని ఆశీర్వదించాడు.

శా॥ **జోటీ! భారతి! అర్భటిన్ నమొరయుమీ ! చోద్యంబుగా నేను క**
**ర్ణాటాధీశ్వరు ప్రౌఢ దేవనృపతిన్ నాసీరధాటీచమూ**
**కోటీ ఘోటక ధట్టికా ఖుర పుటీకుట్టాక సంఘట్టన**
**స్ఫోటీ ధూత ధరా రజశ్చుళుకితాంబోధిన్ ప్రశంసించెదన్.**

ఇటువంటి పద్యాలెన్నో ఆ కవిసార్వభౌముని వదనం నుండి గంభీర నిర్ఘోషంతో,వెలువడి రాయలవారిని,సదస్యులను పరవశింపచేసి ఇక ఆ ఆస్థానంలోశ్రీనాథు డెటువంటి కవితా విలాసాలు చూపించాడో. విశేషాలు వివరించాడో చెప్పతరం కాదు. ఒకసారి రాయలు బాల,ప్రౌఢ, లోల - వీరిని గురించి పద్యాలు చెప్పమన్నాడుట! బాలను గురించి చెప్పిన పద్యం మాత్రమే పరిశోధకులకు లభించింది.

సీ. కమనీయ కరపల్లవము మేను గదియంగ నొయ్యన చాచిన నులికిపడును
**ఆలింగనమునకు** నక్కున జేర్చిన చేదోయి యురమున చేర్చుకొనును
చుంబనమ్మున కోష్ఠబింబమ్ము గమకింప వదనమొయ్యె నొకింత వంచుకొనును
గిలిగింత సేతకు కినుకయు,సిగ్గును మొదవంగ కన్నులు మోడ్చుకొనును

గీ. **అట్టి** బాల రతిక్రీడ ననువు పరుప నేర్పు గల్గునె పరులకు నీకు గాక
రాజ పరమేశ ! రాజాధిరాజ విభావ లక్షణోపేంద్ర ! ప్రౌఢరాయక్షితీంద్ర
మిగతామూడూ దొరికితే ఎంత బాగుండేవో!

## ఏమితపంబు ..

నెల్లూరి ప్రభువు మనుమసిద్ది సైన్యాలకూ, కనిగిరి సీమలోని ఎర్రగడ్డ రాజైన కాటమరాజు సైన్యాలకూ పుల్లరి విషయమై భయంకరమైన యుద్ధం జరిగింది. సిద్దిరాజు సేనాపతి సిద్ధయ తిక్కన. ఇతనికే ఖడ్గతిక్కన అని పేరు. ఆ యుద్ధంలో ఖడ్గతిక్కన అసహాయశూరుడైనా శత్రు సైన్యాలు మిక్కుటం కావడంవల్ల, తన సైన్యమంతా హతమై ఒక్కడే మిగిలాడు. అప్పుడు కాటమరాజు సేనానాయకుల్లో ఒకడైన పిన్నమనాయుడు.

**"పోరు నిలుపుమోయి భూసురోత్తముడ!**
**సరిగాదు మాతోడ సమరంబు సేయ**
**అగ్రజుల్ మీరలు యాదవు లేము**
**ఉగ్రము మామీద ఉంపంగరాదు"**అన్నాడు. దానితో పరిస్థితి గుర్తించి మళ్ళీ సైన్యాన్ని

తీసుకువచ్చి యుద్ధం చేయవచ్చని గుర్రాన్ని తిప్పుకొని వెళ్ళాడు. శత్రువులకు ఓడి,వెన్నిచ్చి వచ్చాడని తండ్రి సిద్ధనామాత్యుడు కఠినంగా నిందించాడు. అంతటితో ఆగలేదు. తిక్కన స్నానానికి పోగా,ఆయన భార్య చానమ్మ స్త్రీలకు ఉంచినట్లుగా రహస్య స్థలంలో నీళ్ళ బిందెను ఉంచి, దానిపైన పసుపు ముద్దను పెట్టి, నులకమంచం చాటు పెట్టిందట. దాన్ని చూసి ఆయన లజ్జా విషాదాలు పొందుతూంటే ఆవిడ ఇలా అంది.

కం॥ పగరకు వెన్నిచ్చినచో
నగరే నిను మగతనంపు నాయకు లెల్లన్
ముగురాడు వారమైతిమి
వగపేటికి జలకమాడ వచ్చిన వేళన్.

తరువాత కాసేపటికి భోజనం దగ్గర వడ్డిస్తున్న తల్లి పోలమాంబ అన్నంలో చివర విరిగిన పాలు పోసింది. అదేమిటన్నట్లుగా తల్లివైపు చూశాడు తిక్కన. ఆమె పరిహాసపూర్వకంగా ఈ పద్యాన్ని పలికింది.

కం॥ అసదృశముగ అరివీరుల
పసమీరగ గెలువలేక పందక్రియన్ నీ
వసివైచి విరిగి వచ్చిన
పసులున్ విరిగినవి తిక్క ! పాలున్ విరిగెన్

మానధనుడైన ఆ మహావీరుడు వేదన చెంది, రోషపడి విజయమో, వీరస్వర్గమో అనుకొని లభించిన కొద్ది సైన్యాన్ని తీసుకొని యుద్ధానికి వెళ్ళాడు. ఈసారి మరింత దారుణయుద్ధం జరిగింది. ఈ రణభీషణతను ఒక చాటువు ఇలా వర్ణిస్తోంది.

చ. పదటున వాజిరాహుతులపై దుమికించుచు తిక్క డార్చినన్
బెదరి పరిభ్రమించి కడు పిమ్మట వీరులు భీతచిత్తులై
యదెయదె డాలు వాల్మెరుగు లల్లవె యల్లదె యాతడంచనన్
గొదుకక యాజిజేసె రిపుకోటుల కందరకన్ని రూపులై

శత్రు సైనిక సముదాయాన్ని భయ భ్రాంతులనుచేసి - " అదిగో, అదే తిక్కన కత్తి తళతళలు, అదే డాలు,అడుగో అతను ఇక్కడ ఇక్కడ "ని ప్రతి యోధుడు అనుకొనేటట్లుగా , అందరికీ అన్ని రూపాలుగా కనిపించే వేగంతో రణతిక్కన యుద్ధం చేశాడు ప్రాణాలకు తెగించిన ఆ మహావీరుని ముందు ఎవరూ నిలువలేక పోయారు.

ఆ స్థితిలో శత్రు సేనాపతి బ్రహ్మరుద్రయ్య వచ్చి ఎదిరించాడు. ఆయన సామాన్యుడు కాడు. ఆ ద్వంద్వయుద్ధం దేవతలే ఆకాశాన్నుంచి మెచ్చి చూశారట.పోరు కొనసాగుతున్నది. ఇద్దరి గుర్రాలూ ఈటె పోట్లకు నేల కూలాయి. ఇద్దరూ కత్తులు దూసి - " హర హర" అని అభిమన్య - లక్ష్మణ కుమారుల వలె యుద్ధం చేసి, ఉభయ సైన్యాలనూ నివ్వెరపరచి తుదకు నేల కొరిగారు ఉభయ పక్షాలూ హాహాకారాలు చేశాయి. ఆ పరిస్థితిని ఒక చాటువు ఈ విధంగా అభివర్ణిస్తున్నది.

సీ. ధైర్యంబు నీమేన తగిలియుండుట చేసి చరియించి మందరాచలము తిరిగె
గాంభీర్య మెల్ల నీ కడనయుండుట చేసి కొకుత్స్థు చే వార్ధి కట్టునడియె
జయలక్ష్మి నీ ఉరస్థలినె ఉండుట చేసి హరి పోయి బలిదాన ముడుగుకొనియె
ఆకారమెల్ల నీయందె ఉండుట చేసి మరుడు చిచ్చునపడి మడిసి చనియె.

గీ. తిక్క దండనాథ ! దేవేంద్రపురికి నీ వరుగు టెరిగి నగము తిరుగు టుడుగు
అబ్ధి కట్టు విడుచు నచ్యుతు కొరమాను మరుడు మరల కలుగు మగలరాజ!

తిక్కన దండనాథుని ధైర్య, గాంభీర్య జయలక్ష్మీ రూప వైభవాలను పరమోదాత్తంగా ఈ పద్యంలో వర్ణించారు.

ఎంత తపస్సు చేసి పరమేశ్వరుని వేనితో పూజ చేశారో, రాముని తల్లి- కౌసల్య, పరశురాముని తల్లి-రేణుక, భీముని తల్లి-కుంతి, కాముని తల్లి-లక్ష్మి, కృష్ణుని తల్లి-దేవకి, తిక్కన తల్లి-పోలమ్మ ఎంత పుణ్యాత్ముఠాండ్రో కదా అనే భావం ఈ కింది చాటు పద్యంలో కమనీయంగా కనిపిస్తుంది.

ఉ. ఏమి తపంబు చేసి పరమేశ్వరు నేమిట పూజ చేసిరో
రాముని తల్లియున్, పరశురాముని తల్లియు, భీము తల్లియున్,
కాముని కన్నతల్లియును, కంజ దళాక్షు ననుంగు తల్లియున్
శ్రీమహిత ప్రతాపుడు సిద్ధన తిక్కన కన్నతల్లియున్.

హరిహర బ్రహ్మేంద్రులు తమ లోకాలకు రమ్మని ఖడ్గతిక్కన కోసం తమ వాహనాలను పంపిస్తే-దివ్యయోగి అయిన తిక్కన సూర్యమండలాన్ని ఛేదించుకొని అపునరావృత్త లోకాలకు వెళ్ళాడనే అద్భుత చిత్రాన్ని ఈ కింది చాటువు మన కళ్ళకు కట్టినట్లుగా చూపుతుంది.

సీ. నందిని పుత్తెంచె ఇందుశేఖరుడు నీ వన్న! ఏతెమ్ము తారాద్రికడకు
గరుడుని పుత్తెంచె నరహరి రామయ్య వడి సిద్ధతిక్క! కైవల్యమునకు
హంసను పుత్తెంచె హరుడు నీకడకు ఉ భయ కులమిత్ర! రా బ్రహ్మ సభకు
ఐరావతము పంపె అమరేంద్రు డిప్పుడు దివమున కేతెమ్ము తిక్కయోధ !

ఆ. అనుచు వేరు వేర నర్థితో పిలువంగ వారు వీరు గూడ వచ్చి వచ్చి
దివ్య యోగియైన తిక్కనామాత్యుడు సూర్యమండలంబు చొచ్చిపోయె.

మొదటి రెండు పద్యాలు చానమ్మ, పోలమ్మ చెప్పారనీ, కాంతాకర్తృకాలని భావించినా, మిగిలినవి ఇంచుమించు అజ్ఞాత కర్తృకాలూ, ఆపాత రమణీయాలూ, అద్భుత వీరరసోల్బణములూను.

## నిందాస్తుతి

కృష్ణా జిల్లా విజయవాడ సమీపంలోని శ్రీకాకుళంలో వెలసిన విష్ణువు దేవాలయం అత్యంత ప్రాచీనమైంది. ఆదిమకాలంలో విష్ణువు అవతరించి నిశుంభుడు అనే రాక్షసుణ్ణి సంహరించి, ఆంధ్ర జాతి విజయ వీరవైభవాన్ని దిగ్దగంతాల్లో ప్రసరింపచేశాడని ఐతిహ్యం.

నాగదేవ భట్టారకుని ఇంట పుట్టిన శ్రీకాకుళనాధుడు లోక రక్షకునిగా పేరుగాంచాడు. క్రీడాభిరామంలో ఈ దేవుని గురించి, ఈ దేవుని ఉత్సవాల గురించి వర్ణితమైంది.

ఉ॥ ఈరస మెత్తు వేదములు క్రీవహియించు పురాణ సంహితల్
సౌరభ హీనమౌ నుపనిషత్తులు లేబడు నాగమావళుల్
గౌరవ ముల్లసిల్ల సిరికాకుళ నాధుడు నాగదేవ భ
ట్టారకు నింట పుట్టి ప్రకటంబుగ వేడుక నాదరింపగన్.

ఆంధ్ర విష్ణువుకే తెలుగురాయడు అనే పేరు కూడా ఉంది. దవనపున్నమకు ఇక్కడ పెద్దఎత్తున ఉత్సవాలు జరిగేవి. కవి సార్వభౌముడైన శ్రీనాథునికీ, వినుకొండ వల్లభరాయనికీ ఈ ఉత్సవాలతో బాగా పరిచయమున్నట్లే కనిపిస్తుంది. తరువాతి కాలంలో శ్రీకృష్ణదేవరాయలు దిగ్విజయయాత్రకు వచ్చినప్పుడు ఒక రాత్రి విడిది సేయటం, ఈ తెలుగురాయడు ఆ కన్నడ రాయనికి కలలో దర్శనమిచ్చి- "సంస్కృతంలో ఇంతకుముందు ఎన్నో కావ్యాలు రచించావు. ఇప్పుడు తెలుగులో కావ్యం రాయవలసింది'

'.ఆ॥ "తెలుగదేల యన్న దేశంబు తెలుగేను
తెలుగు వల్లభుండ తెలుగొకొండ
ఎల్ల నృపులయందు ఎరుగవే బాసాడి
దేశ భాషలందు తెలుగు లెస్స" అని అన్నాడు.

ఆ ప్రేరణవల్ల శ్రీకృష్ణదేవరాయలు ఆముక్తమాల్యద రచించాడు. కొంతకాలానికి దేవాలయం శిథిలమై, పూజా,పునస్కారాలు లేని స్థితి వచ్చినప్పుడు చల్లపల్లి జమీందారు అంకినీడు ఆ దేవాలయానికి జీర్ణోద్ధరణ,పునఃప్రతిష్ఠలు చేయించాడు. ఆ సందర్భాన్ని వర్ణించే చాటువు ఒకటి లభించింది.

మ॥ కలలో కన్నడి కృష్ణరాయ విభుచే కబ్బంబు చెప్పించి, పే
ర్వెలయన్ ము న్నొకనాటి సేవ గొని ఆ శ్రీకాకుళాంధ్రేశ్వరుం
డలరంగా ఇపు డంకినిణ్ణపతి సేయంబూను విద్యోత్సవా
కలనన్ తా నిక నెన్ని సన్నుతకృతుల్ కావింపగా చేయునో!

ఈ ఘట్టంలో రాజావారి అభ్యర్థనను అనుసరించి మహాభక్తుడైన కాసుల పురుషోత్తమ కవి 'ఆంధ్రనాయక శతకము'చెప్పి, స్వామిని ఆలయంలోనికి పునరావాహన చేశాడని చెబుతారు. ఈ శతకం ముఖ్యంగా వ్యాజ నిందాభరితంగా ఉంటుంది.

విష్ణుమూర్తి గొప్పతనమంతా ఆలుబిడ్డలవల్ల లభించిందే తప్ప, ఆయన దేమీ లేదంటూ ఎత్తిపొడుపుగా చెప్పిన ఈ కింది పద్యం ప్రసిద్ధమే.

సీ॥ ఆలు నిర్వాహకురాలు భూదేవియై అఖిల భారకుడన్న ఆఖ్య తెచ్చె
ఇష్ట సంపన్నురా లిందిర భార్యయై కామితార్థదు డన్న ఘనత తెచ్చె
కమల గర్భుడు సృష్టికర్త తనూజుడై బహు కుటుంబికు డన్న బలిమి తెచ్చె
కలుష విధ్వంసిని గంగ కుమారియై పతితపావను డన్న ప్రతిభ తెచ్చె

గీ. ఆంధ్రు బిడ్డలు తెచ్చు ప్రఖ్యాతి గాని మొదటి నుండియు నీవు దామోదరుడవె!
చిత్ర చిత్ర ప్రభావ ! దాక్షిణ్య భావ! హత వివిమత జీవ! శ్రీకాకుళాంధ్రదేవ!

జగదీశ్వరుడు తోలు బొమ్మ లాడించే వాడిలా చరాచరాలనూ ఆడిస్తూంటాడు. కనుకట్టు కట్టే గారడీ వానిలాగా అసత్తు అయిన ఈ ప్రపంచాన్ని సత్యంగా తోపింపచేస్తాడు. తాను ఒకడే అయినా ఎన్నో దేవతల ఆకారాలు ధరించి జనులను భ్రాంతులను చేస్తాడు. ఇంకా ఎన్నెనా నేర్చినవాడు సుమా ఈ ఆంధ్రదేవుడు - అని అనిపించే విధంగా ఉన్న ఈ కింది పద్యాన్ని నిర్మించిన తీరు చూడండి.

సీ॥ ఆడించెదవు బొమ్మలాట వాడును బోలె సర్వ చరాచర జంతువులను
కనుకట్టు కట్టెదు గారడీడును బోలె మిథ్యా ప్రపంచంబు తథ్యముగను
వేర్వేర తోతువు వేషధారియు బోలె బహువిధ దేవతా భద్రకళల
తెలివి మాన్పుదువు జక్కుల వాని చందాన ప్రజల సంపద్రంగ వల్లి చేర్చి
గీః ఇట్టివే కద నీ విద్యలెన్నియైన ఇంక నేమిట ఘనుడవో ఎరుగరాదు
చిత్ర చిత్ర భావ! దాక్షిణ్యభావ! హత విమతజీవ ! శ్రీకారుళాంధ్రదేవ!

దేవుడన్నవాడు గుడిలో భక్తుల పూజ లందుకుంటూ,ఆర్తుల కోరికలు తీరుస్తూ, అవసరమైనప్పుడు ఆశ్రితులకు నిదర్శనాలు చూపిస్తూ ఉండాలి. ఆలయం శిథిలమై ధూపదీప నైవేద్యాలు లేకపోతే,ఆ దేవుని గురించి లోకులు తక్కువ చేసి మాట్లాడతారు. ఆ భావాలను పురుషోత్తమకవి ఈ రకంగా అందించాడు.

సీ॥ భక్తి చేసిన శిలాప్రతిమ మాత్రమె కాని హరి ఇందు కలుగునా అనెడు వారు
స్వామి ఇందుండిన సత్యంబు చూపక ఉండునే అని పల్కుచుండువారు
బుద్ధావతారంబు పూనినా డఖిలంబు కని కననట్లుండు ననెడువారు
దేవతా మహిమంబు తెలియునో ఏమేమి నడువ నున్నదో అని నుడువువారు.

ఇంతటి మహాభక్తుడు,మహా ఉపాసకుడు కాసుల పురుషోత్తము కవి రచించిన ప్రతి పద్యమూ చమత్కారచారువూ, నిసర్గ సుందరమూ,సూక్తి సురభిళమూ అయ్యాయి. " మనసా హరిపాదము లాశ్రయింపుమా!" అనే మకుటంతోనూ, "రామా! భక్తకల్పద్రుమా!" అనే మకుటంతోనూ రెండు శతకాలు రచించాడు. అయితే,ఇవి దొరకలేదు. హంసలదీవి గోపాలస్వామి పైన చెప్పిన మరొక శతకం మాత్రం దొరికింది.

## అనువాద ఔచిత్యం

**18** వ శతాబ్దపు కవులలో పేర్కొనదగినవాడు ఏనుగు లక్ష్మణ కవి. భర్తృహరి సుభాషితాలకు ఇతను రచించిన అనువాదానికి ఎంతో ప్రశస్తి వచ్చింది. ఎలకూచి బాలసరస్వతి,పుష్పగిరి తిమ్మన కూడా అనువదించారు గాని లక్ష్మణకవి అనువాదానికి వచ్చిన పేరు వాటికి రాలేదు. సంస్కృతంలో ఉన్న

శ్లోకాలకు అనువైన భిన్న ఛందస్సు లెన్నుకొని,ఇతను అనువదిస్తే, మిగిలిన ఇద్దరూ వృత్తనియమం పెట్టుకొని ఇబ్బందులు తెచ్చుకొన్నారు. భావం చిన్నదైనా, పెద్దదైనా మూసలో ఇమడ్చవలసి రావటం వల్ల వ్యర్థ పదాలు రావటం,ఒకోసారి భావం పట్టకపోవటం వంటి క్లేశాలు వచ్చాయి. ఉదాహరణకు సుభాషిత త్రిశతిలోని మొదటి శ్లోకం చూడండి.

శ్లో. బోద్ధారో మత్సర గ్రస్తాః ప్రభవాః స్మయదూషితాః
అబోధోప హతా శ్చాన్యే జీర్ణ మంగే సుభాషితం

ప్రబోధకులను అసూయ ఆవరించి ఉంది. ప్రభువులు పొగరెక్కి చెడినారు. ఇతరులు అజ్ఞానులు కనుక మంచి మాట నాలోనే అణగిపోయింది. ఈ శ్లోకాన్ని ముగ్గురు అనువదించిన తీరు చూడండి-

గీ. బోద్ధ లగువారు మత్సరపూర్ణమతులు
ప్రబల గర్వ విదూషితుల్ ప్రభులెన్న
ఇతర మనుజులబోధోపహతుల్ గాన
భావమున జీర్ణమయ్యె సుభాషితంబు.

అనుష్టుప్ శ్లోకం చిన్నది. దాన్ని క్లుప్తంగా గీత పద్యంలోకి అనువదించాడు ఏనుగు లక్ష్మణ కవి.

ఎలకూచి బాలసరస్వతి అనువాదం మత్తేభంలో సాగింది. దీనికి కారణం అత నెన్నుకొన్న మకుటం.

మ. సతతంబున్ మది మత్సరాఢ్యులు పరిజ్ఞాతల్ మహీనాథు లా
తత సంప న్మద దుష్ట చిత్తు లితరుల్ తర్కింప నజ్ఞాన దూ
షిత భావుల్వినువార లేరి? యొడలన్ జీర్ణంబులే గాక ఆ
ర్యతతుల్ నేర్చిన సూక్తముల్ సురభిమల్లా! నీతి వాచస్పతీ!

పుష్పగిరి తిమ్మన అనువాదం పరికించండి.

ఉ. బోద్ధలు మత్సరోచ్ఛలిత బుద్ధులనూ కొనబోర హంక్రియా
బద్ధులు గావునన్ ప్రభులు బాళిమెయిన్ వినలే రబోధ పుం
బద్ధతి నున్కి తక్కిన అపండితు లొల్ల రసద్వివేద స
న్నద్ధ సుభాషితంబు లివి నా తను వందె యణంగుగా కిలన్.

అనువాద మని చెప్పకపోతే స్వతంత్ర పద్యాలలా ఎంతో అందంగా మధురంగా ఉంటాయి లక్ష్మణ కవి పద్యాలు.

చం. తెలివి యొకింత లేని యెడ తృప్తుడనై కరిభంగి సర్వమున్
దెలిసితి నంచు గర్విత మతిన్ విహరించితి తొల్లి యిప్పుడు
జ్వల మతులైన పండితుల సన్నిధి నించుక బోధశాలినై
తెలియని వాడనై మెలగితిన్ గతమయ్యె నితాంత గర్వమున్.

కొద్దిగా తెలిసిన కాలంలో ఏనుగులా అంతా తెలుసని పొగరుతో తిరిగాను. ఇప్పుడు పండితుల చెంత చదివి జ్ఞానోదయమై-నాకేమి తెలియదని తెలుసుకొన్నాను. గర్వం అణిగింది

శ్లో॥ జయంతితే సుకృతి నో రసి సిద్ధాః కవీశ్వరాః
నాస్తి తేషాం యశః కాయే జరామరణ జం భయం
అనే శ్లోకానికి ఎంత చక్కని అనువాదం వచ్చిందో గమనించండి

కం॥ సుకృతాత్ములు రససిద్ధులు
సుకవీంద్రులు విజయనిధులు సుమ్ము తదీ యా
ధిక కీర్తి శరీరంబులు
ప్రకట జరామరణ జన్మ భయరహితంబుల్

శృంగార వీర కరుణాది రస సిద్ధులూ,సుకృతాత్ములూ అయిన కవీంద్రుల కీర్తి శరీరాలకు ముసలితనం,చావు అనే భయాలు లేవు. వారు శాశ్వతులు. యోగుల్లా నిత్యులు - అనే భావం అందమైన కందంలో మాకందరసంలా ప్రవహించింది.

అభిమానవంతుడు, శౌర్యవంతుడు ఎన్ని కష్టాలు నష్టాలు ఎదురైనా నీచానికి దిగజార డనే భావం ఎంత ధీరగంభీరంగా ఉత్పలంలో ఉత్క్రమించిందో చూడండి.

ఉ॥ గ్రాసము లేక సుక్కిన జరాకృశమైన విశీర్ణమైన సా
యాసమునైన నష్ట రుచియైనను ప్రాణభయార్తమైన సం
త్రాస మదేభ కుంభ పి శిత గ్రహలాలస శీల సాగ్రహా
గ్రేసర భాసమానమగు కేసరి జీర్ణతృణంబు మేయునే?

ఆహారం లేక డస్సినా,ముసలితనం చేత కృశించినా, అయాసపడినా,కాంతిపోయినా,ప్రాణాలుపోతున్నా ఏనుగు కుంభస్థలాన్ని బద్దలు కొట్టి మాంసం తినే సింహం ఎండు గడ్డి తింటుందా? ఆవిధంగానే మానశూరుడూ అల్పత్వానికి పాల్పడడు.

గీ॥ తివిరి యిసుమున తైలంబు దియవచ్చు
తవిలి మృగతృష్ణలో నీరు త్రాగవచ్చు
తిరిగి కుందేటి కొమ్ము సాధించవచ్చు
చేరి మూర్ఖుని మనసు రంజింపరాదు

అంటాడు లక్ష్మణ కవి. ఇసుకలో తైలాన్ని పిండవచ్చు. ఎండ మావిలో నీరు తాగవచ్చు. కుందేటి కొమ్ము సాధించవచ్చు. ఇంతటివైనా చేయవచ్చు గాని మూర్ఖుని మనసు మార్చలేము అంటాడు. చక్కని నుడికారపు వంపు సొంపులతో ఇంతటి గొప్ప రచయిత కసుకనే కనుచినుంచి తిమ్మకవి ఇతన్ని మనసారా మెచ్చుకొన్నాడు.

సీ॥ భారతీ వదనాంబుజ భ్రాజమాన
కలిత కర్పూర తాంబూల కబళ గంధ
బంధురంబులు నీ మంజుభాషణములు

**లలిత గుణధుర్య! ఏనుగు లక్ష్మణార్య!**

సరస్వతీ దేవి వేసుకొన్న కర్పూర తాంబూలపు తావుల వంటివి నీ మెత్తని పలుకులు--అనే ప్రశంస సామాన్యమైనది కాదు. అయితే లక్ష్మణ కవికి యోగ్యమైనదే!

## శివాంఘ్రి పూజగా...

పుష్పగిరి తిమ్మకవి పదిహేడవ శతాబ్దపు కవులలోపేర్కొనదగినవాడు. చోడేగుండి గ్రామంలోని సరస్వతీ పీఠానికి ఇతను అధ్యక్షుడు. సమీరకుమార విజయమనే ప్రబంధాన్ని భర్తృహరి నీతిశతకానువాదాన్ని రచించాడు. ఇతను చాలా ప్రతిభావంతుడుగా, పాండిత్య సముదీర్ణుడుగా ఖ్యాతి గాంచాడు. అంతేకాదు, పేదరికం వల్లనో, లేక మరే కారణం వల్లనో తాను రాసిన గ్రంథాలను ఇతరులకిస్తే వారు వారి పేర ప్రకటితం చేశారని ఒక పేరు లోకంలొపుట్టింది. కంకటి పాపరాజు ఉత్తర రామాయణాన్ని, టేకుమళ్ళ రంగశాయి ద్విపద భాగవతాన్ని, దరణి దేవుల రామయ్య దశావతార చరిత్రను ఇతనే రాసి ఇచ్చాడని ఒక వాదు పుట్టింది. విద్వత్కవి మాత్రమే కాక వినయశీలుడనీ, అహంకార మమకారాలు లేని సత్పురుషుడనీ కవులితన్ని స్తుతించారు. ఒక విద్వత్కవి ఇతనిపైన చెప్పిన చాటువు చూడండి!

మ॥ కమనీయంబగు నీదు కావ్య రసమాకర్ణించి నానాబుధుల్
సముడౌ నీతడు పూర్వ సత్కవులకున్ శాబాసురేయంచు స్తో
త్రము గావింతురు శంభుజూటతటినీ రంగత్తరంగార్పటిన్
మమతాహంకృతి దూర! పుష్పగిరి తిమ్మా! సత్కవి గ్రామణీ!

తిమ్మకవి సుభాషితానువాదాలు లక్ష్మణకవి రచనల వలె ప్రాచుర్యాన్ని పొందకపోయినా, ప్రచారాన్ని అందుకోలేకపోయినా రచన రమణీయంగానే ఉంటుంది. విద్య గొప్పతనాన్ని వర్ణించే ఈ పద్యం ఎంతో సుందరమైనది.

చం॥ నరులకు దాచిపెట్టిన ధనంబును చక్కనిరూపు శ్రీయశ
స్కరియును భోగభాగ్య సుఖకారిణియున్ గురుకోటికిన్ మహా
గురువు విదేశ బంధువును గూర్చిన దైవము రాజవశ్యమున్
**వెరవు సువిద్యయే ధర నవిద్యుడెపో పశు వర్గ మిట్టిదే!**

విద్య దాచుకొన్న డబ్బు - కీర్తిని,భోగభాగ్యాలను కలిగిస్తుంది. విదేశాలలోచుట్టమిదే. రాజవశ్యకరి. విద్య లేనివాడు పశువు అంటాడు తిమ్మయ్య.

స్నాన,గంధకుసుమాభరణధారణం వైభవ చిహ్నాలు. కాని ఇవి నిజమైన అలంకారాలుకావు. చెడని భూషణం సంస్కృతవాణి ఒక్కటే. ఈ భావాన్ని మెత్తని చంపకమాలలో కవి ఎలా కూర్చాడో పరికించండి

చం॥ జలకము గంధమున్ కుసుమచారు శిరోజములున్ భుజాంగదం
బులు శశిగౌర హార ముఖ భూషలు మర్త్యు నలంకరింపలే
వలర నలంకరించు విమలాంచిత సంస్కృతవాణి యొక్కటే
**పొలుపరు సొమ్ములెల్ల చెడిపోవదు వాక్కను భూషణంబిలన్**

క్షమాగుణముంటే కవచమెందుకు ? కోపముంటే వేరే శత్రువెందుకు? జ్ఞాతి ఉంటే నిప్పు ఎందుకు? స్నేహితుడుంటే ఔషధ మెందుకు? మూర్ఖుడుంటే వేరే పామెందుకు? మంచి విద్య ఉంటే ధనమెందుకు? సిగ్గుంటే అలంకార మెందుకు? కవిత్వముంటే రాజ్యమెందుకు? ఈ హృదయంగమమైన నీతిబోధక భావన ఇమిడిన తీరు గమనించండి-

చం॥ క్షమమది యున్న నేల కవచం బరి యేటికి క్రోధ మున్న దా
య మలయ నేల చిచ్చు పరమౌషధ మేల సుహృత్తు కల్గ మూ
ర్ఖ మనుజుడున్న నేల ఫణి ద్రవ్య మదేల సువిద్య యున్న సి
గ్గమరిన సొమ్ము లేల కవితాఢ్యత కల్గిన రాజ్యమేటికిన్?

సింహకిశోరం చిన్నదైనా దాని సహజ లక్షణం తగ్గదు. మదమత్తమైన ఏనుగుమీదకు లెక్కసేయకుండా దూకుతుంది. వయస్సు కాదు జాతి గుణం ప్రధానమనే భావం ఎలా వచ్చిందో చూడండి!

ఉ॥ సింగముగన్న యక్కొదమ చిన్నది యయ్యు నభంగవాననా
సంగత భృంగ దానఝుర సంఘ మలీమస గండ రంగ మా
సంగత భృంగి భంగులకు దాటు బలాఢ్యులకున్ స్వభావ మీ
రంగు వయో విశేషము పరాక్రమ సంపదకున్ ప్రధానమే!

ఈ ప్రపంచంలో ధనమే ప్రధానం. ధనమున్న వానినే రసికుడని,రూపసి అని,పండితుడని కీర్తిస్తారు. సర్వగుణాలు కాంచనాన్ని ఆశ్రయించి ఉంటాయనే సత్యాన్ని చెప్పిన తీరిది.

ఉ॥ వాడె కులీను డుత్తముడు వాడె రసజ్ఞుడు వాడె యార్యుడున్
వాడె బహుశ్రుతుండు మరి వాడె గుణాఢ్యుడు వాడె వక్తయున్
వాడె సురూపియంచు ధనవంతుని నందరు నెంతు రెంతయున్
బోడిమి గాన సర్వగుణముల్ కనకాశ్రయభూతముల్ గదా!

ఉత్తముడు పరధనం కోరక, అసత్యాలు పలుకక, శత్రువును వధ్యుడైనా చంపక పరదూషణ చేయక ఉంటాడు.

చం॥ ఒకరి ధనంబు గోరకనృతోక్తులు బల్కక వధ్యునైన జం
పక తగువేళ నీవి తగుమాత్రము మానక నన్యుగూర్చి ప
ల్కక గురుభక్తి వీడ కతి కాంక్షల గూడక భూతమైత్రి బా
యక నరుడున్న మంచి తెరువంచు శ్రుతుల్ స్మృతులెంచు నెప్పుడున్

ఇంకా అటువంటివాడు గురుభక్తుడై, దురాశకు పోక భూతమైత్రి కలిగి ఉంటాడుసుమా అని పూర్వోక్తులు చెపుతాడు కవి. ఈ విధంగా పుష్పగిరి తిమ్మన భర్తృహరి శ్లోకాలకు చేసిన అనువాదోత్పల చంపకమాలలు అతను భావించిన విధంగా శివాంఘ్రి పూజలుగా, పండిత సంతోషకరంగా భాసిల్లాయి అనటంలో సంశయంలేదు.

# మనసా ! హరిపాదము...

**18** వ శతాబ్దం చివర జీవించిన తాడేపల్లి పానకాలరాయ కవిని గూర్చి బొమ్మకంటి వారు, బాలాంత్రపు వారు కొన్ని విశేషాలు చెప్పారు. 'మనసా! హరి పాదము లాశ్రయింపుమా' అనే మకుటంతో కాసుల పురుషోత్తమ కవి పద్యాలు హృద్యాలుగా తీర్చితే ఆ మకుటమే తానూ తీసుకొని 'భువనవల్లభ చరణ భూషణంగా' మధుర మనోహరమైన ఉత్పల-చంపకమాలలతో రమానాథుని సేవించాడు.

వేదాంత తత్వ విలసితమైన పద్యం చూడండిః

**ఉ॥ గోవు లనేక వర్ణముల గ్రుమ్మర పా లొకటైన భంగి నా**
**నావిధ భూషణంబుల ఘనస్థితిగాంచు కడాని మాడ్కి లో**
**కావళిలోన తానును తదాకృతి లోకము లయ్యు నంతరా**
**త్మావహ డచ్యుతుండు మనసా! హరి పాదము లాశ్రయింపుమా!**

ఆవు లెన్నో రంగులలో ఉండవచ్చు. అయినా పాలొకటే. ఆభరణాలు ఎన్నో ఆకారాలు ఉండవచ్చు. అయినా బంగారం ఒక్కటే. అదేవిధంగా మానవులెన్నో ఆకృతులలో ఉంటారు. అయినా అంతరాత్మలో ఉండే అచ్యుతు డొకడే.

**శ్లో॥ ఈశ్వర స్సర్వభూతానాం హృద్దేశే ర్జున తిష్ఠతి**
భ్రామయన్ సర్వభూతాని యంత్రారూఢాని మాయయా

అని భగవద్గీతలోచెప్పిన విధంగా తానే లోకాలై మళ్ళీ ఆ లోకస్థులలో తానే ఉంటూ పరమేశ్వరుడైన హరి విచిత్ర లీలలను ప్రదర్శిస్తున్నాడు. ఆ విలాసాలను కవి ఎంతో రమణీయంగా చిత్రించాడు.

ఈ ప్రపంచంలో అనేకులు బాల్య యౌవన కౌమారాది దశలలో స్వేచ్ఛగా దేవుణ్ణి గురించి పట్టించుకోకుండా తిరిగి చివర ముసలితనం,రోగాలు వచ్చి మృత్యువు సమీపించినప్పుడు రక్షించవలసిందిగా భగవంతుని వేడుకొంటారు. అది ఇల్లు కాలినప్పుడు బావి తవ్వటం వంటిది సుమా-అంటాడు రచయిత.

**చం॥ నిలయము కాలగా జడుదు నీటికినై ఇల త్రవ్వునట్లు నీ**
విల అవసానవేళ పరమేశ్వరు గొల్చి తరింతునంచు నా
సల పడనేల నేడె హరి! సర్వశరణ్యా! రమేశ! కావవే
జలజ దళాక్ష! యంచు మనసా! హరి పాదము లాశ్రయింపుమా.

ఇటువంటి భావాన్నే మరొక విధమైన అందంతో గోపన్న దాశరథీ శతకంలో చెప్పాడు.

ఉ॥ ముప్పున కాలకింకరులు ముంగిట నిల్చిన వేళ రోగముల్
గొప్పరమైనచో కఫము కుత్తుక నిండినవేళ బాంధవుల్
కప్పినవేళ నీ స్మరణ కల్గునొ కల్గదొ నాటికిప్పుడే
తప్పక చేతు నీ స్మరణ దాశరథీ! కరుణాపయోనిధీ!

రోగాలు ముదిరి,గొంతుకు కఫ్ఫె అడ్డం పడి,చుట్టూ చుట్టాలు మూగి యమకింకరులు

**తీసుకెళ్ళటానికి ముంగిట నిల్చిన సమయంలో, నిన్ను స్మరించగలనో, లేనో అప్పటికోసం ఇప్పుడే నిన్ను** స్మరిస్తున్నాను అని కరుణాసాగరుడైన శ్రీరాముని వేడుకొన్నాడు రామదాసు. భక్తులైన కవులు చేసే రచనల **తీరులు ఈవిధంగా భక్తిప్రేరకంగా ఉంటాయి.**

**తిరుపతి, నీలాచలం,** సింహాద్రి,మంగళగిరి, శ్రీరంగం, ప్రసిద్ధమైన, ప్రధానమైన విష్ణు క్షేత్రాలు. విష్ణుమూర్తిని తిరుమలలో భక్తులు " శ్రీ వేంకటాచలపతే! తవ సుప్రభాతం" అని నిద్ర లేపితే లేచి ప్రభాత విధులు తీర్చి,నీలాచలంలో నైవేద్యం స్వీకరించి, సింహాచలంలో గంధం పూసుకొని, మంగళగిరిలో పానకం తాగి దాహం తీర్చుకొని,శ్రీరంగంలో దేవేరితో రంగశాయి అయి పవళిస్తాడట! మనోహరమైన **ఊహకు రూపకల్పన** పానకాలరాయ కవి రచితమైన ఈ పద్యం.

చం॥ **తిరుమలలో ప్రభాత విధి తీరిచి,నీలగిరిన్ భుజించి,కే**
సరగిరి చందనం బలది చల్లని దాహము మంగళాద్రిలో
గురు రుచి ద్రావి రంగపురి కోమలితో పవళించునట్టి నా
సరసుని జేర నీవు మనసా! హరిపాదము లాశ్రయింపుమాః

మనసా! అని రాసినట్లే 'చిత్తమా' అనే మకుటంతో చిత్తబోధ శతక మొకదాన్ని ఈ కవి రచించాడు. ఇందులో పద్యాలు కూడా ఎంతో హృదయంగమంగా లలిత మధుర భావభరితంగా అలరారుతూ ఉంటాయి.

చం॥ విరిసరు లీయ కైకొనుచు వింతనెరుక సరులందు గాంచి భూ
వరుడలుగన్ త దర్చకుని వాక్యము నిక్కముగా శిరోజముల్
విరివిగ జూపి ఆ బెడద వీడగ జేసెను మున్ను కాకుళాం
తరమున అట్టి శ్రీహరి పదమ్ములు కోరి భజించు చిత్తమా!

శ్రీకాకుళాంధ్ర విష్ణువు దేవాలయార్చకుడు శృంగారి. స్వామి పూజకోసం కోసిన పూలను అతని ప్రియురాలు సిగలో తురుముకొన్నది. హడావిడిలో ఆ పూలను పూజకు తీసుకెళ్లాడు. పూజారి. దేవుని పూజించిన పూమాలను ప్రసాదంగా రాజుకు పంపాడు పూజారి. అందులో ఉన్న వెంట్రుకను చూసి రాజు మండిపడ్డాడు. అర్చకుని పిలిపించి అడిగితే 'స్వామి శిరోజమే' అన్నాడు. 'రాతి విగ్రహానికి శిరోజా లెక్కడి' వన్నాడు ప్రభువు. 'నిరూపించకపోతే శిక్షిస్తా'నన్నాడు. తన భక్తుడైన అర్చకుని కాపాడటానికి ఆంధ్ర విష్ణువు మరునాడు రాజు వచ్చిన సమయానికి శిరోజాలను చూపించాడు. రాజు దిగ్భ్రాంతుడై అర్చకుని భక్తిని మెచ్చుకొన్నాడు. ఇటువంటి గాథ లీ శతకంలో మనోహరంగా పాదిగాడు కవి. ఈ కవి రచించిన పార్థసారథి, లక్ష్మీనృసింహ,రుక్మిణీపతి శతకాలు కూడా కవితా సుందరాలై ఇతని కీర్తిని చిరస్థాయి చేస్తున్నాయి.

## దాస వైభవం

**హ**రికథా పితామహుడైన ఆదిభట్ట నారాయణదాసు కవితా విశేషాలను అనేక గ్రంథాలుగా ఆచార్య యస్వీ జోగారావుగారు సంకలనం చేయటం, దాసభారతీ ప్రచారము తన జీవిత ధ్యేయంగా పెట్టుకొన్న శ్రీ కర్రా ఈశ్వరరావుగారు వాటిని ప్రకటించటం జరిగిన తరువాత, నారాయణదాస సారస్వత వైభవం పునరుద్భాసితమైంది. చమత్కార సుందరమైన చాటువు లెన్నో దాసుగారి నోట సమయ

సముచితంగా వెలువడిన విషయం వారి సాహిత్యాన్ని పరిశీలిస్తే తెలుస్తుంది. రాష్ట్ర భక్తి భరితమైన హృదయంతో తెనుగు సీమను గూర్చి వారిలా పలికారు.

సీ॥ **పాడి పంటలనెల్ల నాడులన్ మించిన దనయము మన మంచి తెనుగు సీమ-**
**కలిమికి నలువనెచ్చెలి కున్కిపట్టు నిచ్చలు మన పుట్టిన తెలుగు సీమ**
వేయేం డ్లెదురు లేక రాయలు మొదలు రేండ్లలరిన మన మేటి తెలుగు సీమ
తిక్కన పోతన్న తిమ్మన్న పెద్దన్న వెలసిన మన గొప్ప తెలుగు సీమ

గీ॥ **చెలగు నన్నియిమ్ముల మన తెలుగు సీమ చెలగుపెద్ద యేరుల మన తెలుగు సీమ**
**తనరు పొడవు గుడుల మన తెనుగు సీమ పొనరు వేల్పు కొండల మన తెనుగు సీమ**

దాసుగారు అచ్చ తెలుగు పట్ల మోజు పెంచుకున్నారు. కాని అది కొంత మితిమీరిందేమో అనిపిస్తుంది.

"తెలుగు పలుకు చేను వలనుగా పెరుగదు
వేల్పు నుడువు కలుపు బెరుక కున్న"

ఆంధ్ర సాహితీక్షేత్రంలో సంస్కృత పదాలు కలుపు మొక్కలవంటివి అనడం అత్యంత సాహసం. అనేక సందర్భాలలో సంస్కృత భాషాభక్తిని ప్రకటించిన దాసుగారు ఈ విధంగా పలకడానికి ఏ ఆవేశం కారణమో!దాసుగారు చాలా అవధానాలు చేశారు. వారి గంగా ప్రవాహం వంటి ఆశుధార,అపార పాండిత్యం, దానికి వన్నె చేకూర్చాయి. కాని, హరికథకుడుగా వారికి వచ్చిన కీర్తి ఇతర నైపుణ్య ప్రజ్ఞాప్రాభవ లబ్ధకీర్తులను మింగేసింది. ఒక అవధానంలో "అమిత విజృంభణమ్ము లబలా! తగునా? సుజనాళి కెప్పుడున్" అనే సమస్య నిచ్చారు. దాన్ని దాసుగా రెంత శృంగార మధురంగా పూరించారో చూడండి!

చం॥ క్రమ మెరుగంగ లేని విధి వ్రాత బలమ్మున తమ్ము మోయు మ
ధ్యముపయి నీదు చన్ను లిసుమంతయు నక్కటి కంబు మాని యు
బ్బి మదకఠోర భావమున విస్తరమంది చలింపజేసి జృం
భము నటు చూపకున్న క్షతమర్దన బాధల పాలుగావుగా
అమిత విజృంభణమ్ము లబలా! తగునా? సుజనాళి కెప్పుడున్.

అదేవిధమైన మరొక వర్ణనను కూడా పఠించండి-

చం॥ వలపుల మీరి మీరి నునువాతెర తేనియ లాని యాని గు
బ్బల నెద గ్రుమ్మి క్రుమ్మి పలుభంగుల ముద్దులు పెట్టి పెట్టి నే
వలచిన వన్నెకాడ! యిక వద్దుర జాగని పైకిలాగు నిన్
దలచిన గుండె ఝల్లుమని తల్లడమందు గదే! తలోదరీ!

ఆనందగజపతిగా రొకసారి ఇచ్చిన సమస్యను దాసుగారు పూరించిన తీరు గమనించండి!

ఉ॥ సానుల యొద్ద నిచ్చరము సల్పుచు లొంగుచునుంట కర్ణ మా
దానము సేయకుంటకు వృథాదినముల్ సరిపుచ్చుకొంటకున్

జ్ఞానము జాణయైన తన నాథుని కన్గొనునప్పు భార్యకున్
మానము ప్రేమలజ్జయును మాటికి బోరగ బ్రీతిమీరెడున్.

విజయనగర ప్రభువు దర్శనం అంత సులభంగా ఉండేది కాదు. ఈర్ష్యాళువులైన పండితులు ఇతరులను కొలువులోనికి రానిచ్చేవారు కారు. లింగం లక్ష్మాజి పంతులు దాసుగారిని గురించి చెప్పి రాజావారి దర్శనం ఇప్పించారు. ఆ పంతులు మీద నారాయణదాసుగా రొక చక్కని సీస పద్యం చెప్పారు. ఆ పద్యంలో తప్పుందని రాజుగారికి పండితులు మనవి చేశారు. ఒకనాడు ఆ పద్యం చదివి వినిపించమని రాజవారు కోరారు. దాసుగారు మొదలుపెట్టారు.అఖిల లోక వ్యవహార ధర్మంబుల నడిపింపజాలిన నల్ల వేల్పుజగముపై నొరగియు చలియింపని ఘనుండు వానగాలులకు పర్వతము బోలి-ఇంతవరకు చదవగానే ఆపమన్నారు ప్రభువు. "ఇందులో క్త్వార్థకం భిన్నకర్తృకంగా ప్రయోగించారు గదా! దీన్ని తప్పని ఒప్పుకుంటారా లేక లక్ష్యాలేమైనా చూపిస్తారా" అని అన్నారు. అప్పుడు దాసుగారు " నృమాంసంబు కూడ్తై యేనెట్లు భరించువాడు" అనే మనుచరిత్రలోని పద్యాన్ని । " రాహుకంతము తెగి దేహము ధరణి బడియె" అనే భారత లక్ష్యాన్ని వినిపిస్తే ఆనందగజపతి ఎంతో సంతోషించాడు.

దాసుగారి పాండిత్యమంతా స్వయంకృషివల్లనే లభించింది. పతంజలికృతమైన మహా భాష్యాన్ని కూడా వారు స్వంతంగానే చదువుకొన్నారంటేవారి ప్రజ్ఞ ఎంతటిదో ఊహించవచ్చు.

"నాల్గేండ్ల యీడున నా కెల్లచదువు
లబ్బె తమంత నే నరసిన కొలది
నే పుట్టులయ కాడ నే మాట కాడ
నాట పాటల మేటి యనిపించుకొంటి
నా కెదుర్లేరి కేనాడులనైన
వే వేలమందికి వినుచు నా గొంతు"

అని చెప్పిన దాసుగారి మాటలు అహంకార పూరితాలుకావు. స్వభావోక్తులు మాత్రమే.

## జాతి తపఃఫలం

**ఆ**దిభట్ల నారాయణదాస సారస్వత విరాట్ స్వరూపం అనన్యం. దాని వెలుగులను ప్రదర్శించుటకు గుంటూరు జిల్లా రచయితల సహకార సంఘం ప్రయత్నించి ఒక బృహత్సంపుటి వెలువరించింది. దాదాపు నలభైమంది ప్రసిద్ధ పండితవరేణ్యులు అందు పరిశోధక వ్యాసాలు రాశారు. తరువాత శ్రీ గుండవరపు లక్ష్మీనారాయణ దాసుగారి రచనలపైన పరిశోధనచేసి డాక్టరేట్ పట్టా పొందాడు.

కొందరు దాసుగారిని కేవలం హరికథా పితామహుడుగా ఎరుగుదురు. కాని ఆ కాలంలో వారి సర్వాంగీణ ప్రజ్ఞా విశేషాల నెరిగిన వాళ్ళున్నారు. శ్రీ చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారు నారాయణుడు కృష్ణావతారంలో ఆడుతూ పాడాడు గాని కవిత్వం చెప్పలేదు. ఆలోపం తీర్చుకోటానికి నేడు దాస రూపంలో ఉదయించాడని అన్నారు.

మ॥ **అల నారాయణు డప్డు కృష్ణుడయి గేయమ్మందు సంతోషమున్**
**గొలిపెం గాని కవిత్వమందు గొలుపన్ గొంతేనియున్ నోచుకో**

**డల లోపమ్మును దీర్చుకోదలచి కాదా యిట్టి రూపమ్ముతో**
**నిల నారాయణ దాస నామమున నిట్లేపారెనా జెల్లదే!**

ఇతను కేవలం పాటగాడు మాత్రమే కాదు. సత్కావ్యాలు రచించిన కవి. వాక్పటిమ గలవాడు, అయిదారు భాషలు నేర్చినవాడు - ఇటువంటి వాడు భూమిపైన మరొక్కడు పుట్టడని చెళ్ళపిళ్ళ వారి వాక్కు. ఈ సమస్తంలో పరమేశ్వరుడెలా నిండి ఉన్నాడో,ఆ సమస్తమూ తనలో ఉన్నవాడు - సర్వశిల్ప విద్యామూర్తి నారాయణదాసు - అని విశ్వనాథ వారీ విధంగా రాశారు.

ఉ॥ ఈ యఖిలమ్మునందు పరమేశ్వరు డెట్టుల నిండియుండెనో
యా యఖిలమ్ము వచ్చి తన యందున నుండెన ఆదిభట్ల నా
రాయణదాసులో హరికథాకృతి భారతి సర్వశిల్ప వి
ద్యాయుతి సంస్కృతాంధ్రముల యాకృతియై పెరమూర్తులై మరిన్.

శ్రీ యస్వీ జోగారావుగా రొక విచిత్రమైన కల్పన భావించారు. నావి నాలుగు ముఖాలు కదా ఎలా ముద్దు పెట్టుకుంటా వన్నాడట సరస్వతితో బ్రహ్మ. నేను అనంత ముఖను -(అసంఖ్యాక జనుల ముఖాలలో నివసిస్తుంది వాణి) నన్ను ఎలా చుంబిస్తావన్నది వెంటనే భారతి. చతురాస్యుడు నారాయణ దాసైనాడు. సరస్వతి సిగ్గుపడింది. అటువంటి వాగ్దేవికి నమస్కారం - ఈ భావాన్నిచ్చే పద్యం చూడండి.

ఉ॥ నాయవి నాల్గు మోములవునా! యెటు ముద్దిడెదంచు నల్వ యా
ప్యాయముగా హసింపగ అనంతముఖన్ ననునెట్లు ముద్దిడం
బోయెదొయంచుచెల్వనగ ముద్దిడెదన్ గనుమంచు నల్వ నా
రాయణదాసు గాగ త్రపనందు సరస్వతికిన్ నమస్కృతుల్.

'కరుణశ్రీ' జంధ్యాల పాపయ్యశాస్త్రిగారు దాసుగారి మూర్తిని ఎంత మోహనంగా,సుందరంగా, భక్తి రసాకృతిగా, లలితకలారూపుడుగా భావించారో పరికించండి.

సీ॥ సంగీత సాహిత్య జగ దంగణము ధగ ద్ధగిత మ్మొనర్పు గంధర్వ తార
వాసి గాంచిన మహా వాగ్గేయకారుడై భారతి నర్చించు భక్త మౌళి
అమరుడౌ ఉమరుఖయ్యాం రుబాయతు లాంధ్ర సంస్కృతమ్ముల కెత్తు సవ్యసాచి
హరికథా రాజ్య మూర్ధాభిషిక్తుండయ్యు స్వార్థం బెరుంగని పార్థివుండు
గీ॥ వాలు మెలిమీసకట్టు జుల్పాల జుట్టు నొసట కుంకుమబొట్టు మేన పసిడిగట్టు
విద్దెలకు పట్టు నడయాడు వేల్పు జెట్టు హరికథా శిల్ప సమ్రాట్టు! ఆదిభట్టు!

మహాపండితులు కాశీ కృష్ణాచార్యులుగారు దాసుగారి శక్తిని దర్శించి హర్షించి ఈ విధంగా పలికారు.

సీ॥ అపురూప రాగమ్ములందు గేయ మొనర్చి రసము జిమ్మిన త్యాగరాజు వీవు
ఏకకాలము నందనేక తాళములతో పాడగల్గిన బ్రహ్మదేవు
అచ్చ తెన్గుల కైతనల్లి పెంచిన మహోద్దండుడౌ ఆదివిష్ణుండ వీవు
భరతాది మునులు చూపని విలక్షణ నర్తనం బొనర్చెడు మహానటుడ వీవు.
గీ॥ పేర్కొనగ నేల పల్వురి పేళ్ళ జెప్పి
బ్రహ్మ విష్ణీశ్వమూల రూపంబ వగుచు
హరికథామృత వారాశి నన్వహంబు పండి యున్నాది నారాయణుండ నీవె.

హరికథ అనే పాలసముద్రంలో పడుకొని ఉన్న ఆదినారాయణుడే ఇతనని ఆచార్యుల వారి భావన.

ఈరకంగా ఎందరో ఎన్ని రకాలుగానో దాసుగారి మహత్వాన్ని కీర్తించారు.

అంతటి దాసుగారు కవి సాక్షాద్దేవతామూర్తి యని,కావ్యమే ధర్మార్థ కామ మోక్ష సాధనమని భావించారు.

శ్లో॥ ధర్మార్థ కామ మోక్షాణాం కావ్య మేకైక సాధనం
ప్రత్యక్ష దేవతామూర్తిః కవిరేవ నసంశయః

కవి, గాయకుడు,నాట్య కోవిదుడు - అయిన నారాయణదాసు గారు ఆంధ్ర జాతి తపః ఫలం.

## పద్యవిద్యానురక్తుడు

తెలుగు సాహిత్యంలో చారిత్రక ప్రబంధ నిర్మాతలుగా పేరుగాంచిన వారు రాణాప్రతాప సింహ చరిత్ర గ్రంథకర్త శ్రీ రాజశేఖర శతావధాని, శివభారత గ్రంథకర్త శ్రీ గడియారం వేంకటశేషశాస్త్రి. వారి మార్గంలో కవితా యాత్ర కొనసాగించి శ్రీకృష్ణదేవరాయల జీవిత చరిత్రను పద్య కావ్యంగా తీర్చినవారు శ్రీ భూతపురి సుబ్రహ్మణ్యశర్మ. అవధాన విద్యలో ఆరితేరిన శర్మగారు శ్రీరామభక్తులు. చిన్నతనంలో ఒక అవధూత ఉపదేశించగా రామ మంత్రాన్ని అక్షరకోటి జపించి, తత్ప్రభావం చేత అనేక విద్యలలో నైపుణ్యం సంపాదించినవారు. ఆ భక్తితోనే తమ రచనను రామాంకితంచేసి జీవితాన్ని చరితార్థం చేసుకొన్నారు.

అధునాతన కాలంలో పద్య రచనకు ప్రాభవం తగ్గి, గద్య గేయ రచనలకు ప్రాముఖ్యం పెరగటానికి ఎన్నో కారణాలుండవచ్చునని శర్మగారి ఆలోచన.

ఉ॥ పద్య కృతుల్ రచింపగల ప్రాభవ మారెనొ లేక భావ మై
శద్యము లంతరించెనొ? ప్రసన్నత రూపరెనో? స్థిరత్వ మే
ధాద్యుతి సన్నగిల్లెనొ? ప్రధాన మెరుంగను,హౌణ మేమొ! యే
గద్యమొ గేయమో కవితగా కృతి గూర్తురు నేటి వారలున్.

పెద్దన మొదలైన మహనీయులు గొప్ప ప్రబంధాలను రచించి ఆంధ్ర సరస్వతి పాదపద్మాల నలంకరించారు. ఆ తరువాత అప్పుడొకడు,అప్పుడొకడు ఎక్కడో ఒకడు అయినారు. ఇప్పుడు వేళ్ళమీద లెక్క పెట్టటానికి కూడా దొరకటం లేదు.

ఉ॥ ఆ విధి కొంతకాలము మహాకృతు లెన్నియొ ఉద్భవించి ఆం
ధ్రావళి నుద్ధరించినవి యాపయి నామడ కొక్కడుండె స
ద్భావుకతన్ మహాకృతుల బల్కెడు వాడు నిజాని కిప్పు డాం
ధ్రావని వ్రేళ్ళపై గణన కందరు కాలపురీతి యేమొకో!

సుబ్రహ్మణ్యశర్మగారి మిత్రుడు షడ్దర్శనం సుబ్బరామశర్మగారు కలిసినప్పుడు పద్య స్థితిని గురించి ఈ విధంగా చర్చించుకుంటూ ఉండేవారు. ఆ గోష్ఠి కావ్య రచనకు ప్రేరణ కలిగించింది.

శృంగేరి పీఠాన్ని అధిష్ఠించిన శంకరాచార్యులలో విద్యారణ్యస్వామి అనితర ప్రాభవుడు. కేవలం

విద్యానగర సామ్రాజ్య స్థాపకునిగా మాత్రమే కాక, హిందూ ధర్మ రక్షకుడుగా, ఉపనిషత్తత్వ బోధకుడుగా ఆ మహానుభావుడు శర్మగారి హృదయాన పూజ లందుకొన్నాడు.

సీ॥ ఏ ముని మూర్ధన్యు నిద్ధ కృపాంబు శైతల్యంబు శ్రితుల హైందవుల జేసె
ఏ వాగ్విదాంవరు నిచ్చా విభవ మాత్ర ప్రాజ్య విద్యాపుర రాజ్య మొప్పె

ఏ వేద వేదాంగ కోవిదు భావవై పుల్యాన నుపనిషద్బోధ వెలసె
ఏ బృహతాంపతి ప్రాబల్య నామాన నవ విజయారూఢ నగర మొప్పె
గీ॥ ఏ పశూనాంపతి సదృశు దృగమృతాన దైవతత్వ నందనము పూదరి రహించె
అత డనఘుడు విద్యారణ్య యతి ఘనుండు సత మతని గొల్తు జ్ఞానబిక్షా ప్రతీక్ష!

పశూనాంపతి సదృశుడైన విద్యారణ్యస్వామి దివ్యాకృతితో ఉంటాడనీ, జ్ఞాన భిక్ష ప్రసాదిస్తాడనీ శర్మగారి విశ్వాసం. అటువంటి విశ్వాసాలే మహాకార్య ప్రేరకాలై అద్భుత సిద్ధిని కలిగిస్తూ ఉంటాయి.

వీరి పాండిత్యం సామాన్యమైనది కాదు. రామ స్తుతిని భావించిన ఈ కంద పద్యంచూడండి! ఎంత శబ్దాధికార ప్రాభావాన్ని ప్రదర్శిస్తుందో!

కం॥ కోద్భవ కోద్భవ భవ భవ
కోద్భవ కోద్భవ భవ భవ కోద్భవ భవ సత్
కోద్భవ కోద్భవ నుత ది
వ్యాద్భుత పరిపూత చరిత! అబ్ధి గభీరా!

కోద్భవ= నీటినుంచి పుట్టినవాడు -చంద్రుడు కోద్భవ భవ భవ= నీటినుంచి పుట్టినది తామర. దానినుంచి పుట్టినవాడు బ్రహ్మ- అతని కొడుకు రుద్రుడు.

కోద్భవ= నీటినుంచి పుట్టినది- అగ్ని.కోద్భవ భవ భవ= బ్రహ్మ పుత్రుడు నారదుడు. కోద్భవ భవ= బ్రహ్మ.సత్కోద్భవ= సత్య స్వరూపుడైన సూర్యుని కుమారుడు - సుగ్రీవుడు కోద్భవ= అగ్నిజుడు - కుమారస్వామి. పైవారిచేత స్తుతి పొందిన అద్భుత చరిత్ర గలడాడా సముద్ర గంభీరుడా! శ్రీరామచంద్రా! -అని అర్థం.

మతాలు వేరైనా మానవులంతా ఒకటే అనే విశ్వాసం గల శర్మగారు, నామరూపాల పేర జరిగే యుద్ధాలను చూసి ' అయ్యో ఎంత మూర్ఖులు వీరు' అని బాధపడుతూ ఉంటారు.

చం॥ మతములు గాబడిన మాత్రాన మర్త్యత వేరు గాదు, భూ
త తతికి దేవుడొక్కడె యధార్థ మయయ్యది వారి వారి స
న్మతముల బట్టి కాల్పనిక మార్గము గొంటయె గాని నామ రూ
పతలకు బోరుచుండుట అపావృత మూర్ఖత గాక యేమగున్.

భారతీయమైన ఆలోచనా ధోరణి,సంప్రదాయ ప్రవణత, పద్యవిద్యపైన అనురక్తి,మహా కావ్య నిర్మాణ దీక్ష శర్మగారికి ప్రత్యేక స్థానం ఇయ్యగల వనటంలో సందేహం లేదు.

# ధరణియె బొమ్మరిల్లు..

**శ్రీ** నాథుడు పెదకోమటి వేమారెడ్డికి విద్యాధికారిగా సుమారు ఇరవై సంవత్సరాలున్నట్లు ఆధారాలు కనిపిస్తున్నవి. ఆయన మంత్రి అయిన మామిడి సింగనకు నైషధాన్ని కృతి ఇచ్చి సింగనామాత్యుని ద్వారా రాజు ప్రాపు సంపాదించి ఉంటాడు. ఆస్థానంలో ప్రవేశించి రాజ దర్శనం చేసినప్పుడు చెప్పిన చాటువులని కొన్ని పద్యాలు దొరికాయి. వాటిలో శ్రీనాథుని ప్రత్యేక ముద్ర స్పష్టంగా కనిపిస్తుంది.

రాజాస్థానంలో ప్రవేశించిన వారు సహజంగా రాజస్తుతిగా అందమైన పద్యాలు చెపుతారు. అది అందరూ చేసే పనే. విలక్షణంగా దిగ్భ్రాంతి కలిగించే విధంగా మొదలుపెట్టాడు శ్రీనాథుడు.

సీ॥ కానీన కాకోక కానీన కాకోక కానీన కాకోక కాద్రవేయ
కాద్రవేయా ధర్మ కాద్రవేయా ధర్మకాద్ర వేయా ధర్మ కాల కాల
కాల కాల ప్రాంగ కాల కాల ప్రాంగ కాల కాల ప్రాంగ కార కార
కార కార గ్రాహ కార కార గ్రాహకార కార గ్రాహ గాహ గాహ
గీ. గాహ గాహను గాహను కైన ధూమ! ధూమ నాటీక నాటీక దురభిమాన!
రమ్య గుణలోల! సంగడి రక్షపాల! అమిత గుణధామ ! పెదకోమ టన్న వేమ!

అందరూ ఆశ్చర్యంతో చూస్తున్నారు. ఏమిటి దీని అర్థం? నిజంగా అర్థమేదైనా ఉందా? లేక బుకాయంపా? ఏమో సంస్కృత భాష విచిత్రమైంది. ఏకాక్షర నిఘంటువు ఉన్న భాష. పండితుడు కావాలే కాని ఏదైనా సాధించవచ్చు. సభలోని వారు మంత్రముగ్ధులైనట్లు చూస్తుండగానే రెండో పద్యాస్త్రం విడిచాడు కవిరాజు.

సీ॥ కపట కంఠీర వాకార నారాయణ క్ష్వేళా నినాదంబు గేలి సేయు
కల్పాంత దుర్దాంత కాలభైరవ భేరిడమరు కోన్మాదం బడంగజేయు
ప్రళయ కాలాభీల పటు ఘోర నిర్ఘాతఫట ఫటా రావంబు చటుల పరచు
కుహనా మహాకాల కోలాహలోత్తాల పాతాళ నినదంబు భంగపరచు
గండు మెరసిన రిపు కోటి గుండె లవియచండ గతి మ్రోయు నీ రణోద్దండ భేరి
జయరమా సంగ రాయ వేశ్యాభుజంగ అతుల బలధామ! పెదకోమటన్న వేమ!

ఈ పద్యం కాస్త మామూలు పండితులకు కూడా అందుబాటులోనే ఉంది. వేమారెడ్డి యుద్ధ భేరీ నినాదం నరసింహుని పెనుకేకను,ప్రళయ కాలంలోని భైరవుని డమరుక రావాన్ని , పిడుగుల చప్పుళ్ళను, మహాకాలుని కోలాహలాన్ని అతిశయించి శత్రువుల గుండె లవిసే విధంగా ఉద్దండంగా మోగుతున్నదని అర్థం. ఆ శైలి, ధార, భావం అన్నీ అసామాన్యంగా,అనుపమానంగా ఉన్నాయి. అటువంటిదే మరొక భావబంధురమైన చంపకం వెలువడింది.

ధరణియె బొమ్మరిల్లు వసుధావర పంక్తులు బొమ్మ లంబుధుల్
గురుగులు చక్రవాళగిరి కోట నభం బది సేన కోర ని
ర్జరగిరి గద్దెపీట యిన చంద్రులు మేటి నివాళి పళ్ళెముల్
గురుతర పుణ్యుడైన పెదకోమటి వేమన కీర్తి కాంతకున్.

వేమారెడ్డి యశోలతాంగికి సుమేరువు సింహాసనం,సూర్యచంద్రులు హారతి పళ్ళేలు - భూమే

బొమ్మరిల్లు, రాజులు బొమ్మలు - ఇలా మనోహరమైన భావనతో సాగింది. పెదకోమటి వేమన శ్రీనాథుడునికవితా పాండిత్యాలకు ముగ్ధుడై విద్యాధికారిగా నియమించాడు

అయితే శ్రీనాథుడు కేవలం విద్యాధికారిగా మాత్రమే లేడు. రాజ్యం క్లిష్టదశలో ఉన్నప్పుడు తిక్కన మనుమసిద్దికి సాయపడినట్లుగా రెడ్డి రాజులకు సాయం చేశాడు. నందికంత పోతరాజు - రెడ్డి రాజుల వంశంలో చిరకాలంగా వస్తున్న గొప్ప కరారి. ఒకప్పుడు మాదయ లింగమనీడు వీరిని జయించి ఆ కఠారిని తీసుకువెళ్ళాడు. అదిరెడ్డిప్రభువులకు అవమానంగానూ,అపశకునంగానూ తోచింది. శ్రీనాథుడు ఆ లింగమనేని ఆస్థానానికి వెళ్ళి, తన సాహితీ ప్రాభవంతో అతన్ని మెప్పించి ఆ కఠారిని బహుమతిగా స్వీకరించి రెడ్డి రాజులకు తెచ్చి ఇచ్చాడు. ఆ లింగమనీడు ప్రభువును సంతోషపెట్టిన పద్యాలలో ఒకటి.

జగనొబ్బ గండాంక! సంగ్రామ నిశ్శంక! జగతీశ! రాయ వేశ్యా భుజంగ!
అఖిల కోటల గొంగ! అరిరాయ మదభంగ! మే లందు ధరణీశ మీనజాల!
మూరు రాయరగండ! మరియు రాజుల మిండ! అభివృద్ధి మీరు చౌహత్తమల్ల!
ఘనగాయ గోవాళ! కామినీ పాంచాల! బ్రహ్మాయు శశివంశ పరశురామ!
దండి బిరుదుల సురతాణి గుండె దిగుల! బళిర! అల్లయ వేముని నగరమిండ!
రమణ మించిన మేదిని రావు బిరుద! సంగరా బోప! మాదయ లింగ భూప!

కాలవశాన కొండువీడు పతనమైంది. ఆ తరువాత శ్రీనాథుడు అనుభవించిన కష్టసుఖాల గాథలు ఎన్నో కమనీయ కవితా రూపాలు ధరించాయి.

## చివుకుల చినుకులు

ఈ శతాబ్ద ప్రథమ భాగంలో గర్గ భాగవతానికి చక్కని అనువాదం వచ్చింది. శ్రీ చివుకుల అప్పయ్యశాస్త్రిగారు సంస్కృతాంధ్రాలలో, బహు శాస్త్రాలలో పాండిత్య ప్రాభవం కలిగిన వారు. ఎన్నో గ్రంథాలు రచించినవారు. మూలంలోని పన్నెండు వేల శ్లోకాలు తెలుగులో సుమారు ఆరువేల గద్య పద్యాలలోనికి వచ్చాయి.

సంప్రదాయ భావ భావుకులైన, శాస్త్రిగారు తెలుగు వారికి అంతగా పరిచయం లేని గోలోక రాధాకృష్ణ విశేషాలెన్నో తెలియజేసి కృతార్థులైనారు. వాగ్దేవి అయిన సరస్వతిని శాస్త్రిగారు స్తుతించిన తీరు శబ్ద బ్రహ్మోపాసకులకు ఆరాధ్యమై, సౌందర్యనిధి అయి అలరారుతూంది.

అంబా ! సర్వ సుపర్వ నాథ చతుర స్యాంభోజ కాసార కా
దంబా! అంబుజ కీర పుస్తక ముద్యన్మాలికాంచత్కరా
లంబా! తుంబురు నారదాది ముని సంశ్లాఘూర్ధ వీణా కళా
లంబా! సంబర మింబుగా నిడి వచశ్శ్యాఖ్యున్ ననున్ సల్పవే.

చదివిన ప్రతి పండితుడూ,పద్యాలు రాసిన ప్రతి కవీ, ఉపన్యాసాలు చెప్పిన ప్రతి వక్తా ప్రవక్త కాలేడని శాస్త్రిగారి అభిప్రాయం.సమస్త శాస్త్ర చణుడు, సద్గుణ వంశ సంభవుడు,విష్ణుభక్తి పూరితుడు, దయ,ఔదార్యం, వివేకం కలవాడు, అనుమానాలు తొలగించగలవాడు,వివరించి - బోధించే సామర్థ్యం కలవాడు మాత్రమే ప్రవక్త కాగలడని వారి భావన.

ఎవడు సమస్త శాస్త్రచణు డెవ్వరు సద్గుణవంశ సంభవుం
డెవడు కృపాపరుండు మరి ఎవ్వడు మాధవ భక్తి పూరితుం
డెవడనుమాన వారకుడు నెవ్వ డుదారుడు సాధు బోధనా
వివరణ ధక్షు డెవ్వడు వివేకి యతండె ప్రవక్త యయ్యెడిన్.

ప్రవచనం చేసేవాడు ఎలా ఉండాలో చెబుతూ, ఎటువంటివాడు ప్రవచనానికి పనికిరాడో నిర్మొగమాటంగా చెప్పారు శాస్త్రిగారు.

పండిత పుత్రుడై భారత కథలని ముసలమ్మ కతలను మూల్గువాని
శ్రీరంగ నీతుల చెప్పుచు దొమ్మరి గుడిసెలలో దూరు కొంటెవాని
దబ్బర నొరులను తబ్బిబ్బు నొనరించి లిబ్బులగా చేయు లేకి వాని
వైష్ణవుండ నటంచు విష్ణు మిత్రుండైన శివు నహర్నిశము దూషించు వాని
కామ క్రోధాది వైరి షట్కంబు వలన పరుగు వానిని,హరి శర వాదములను
చేయు వానిని వక్తగ చేయరాదుగాన పొరపాటు పడకుమీ కార్యమందు.

తెలుగు సీమలోని భక్త కవులందరినీ పోతన ప్రభావితం చేసినంతగా మరెవరూ చేయలేదు. ఆ సహజ పాండిత్యాని రచనా ధోరణిని అనుకరిస్తూ చివుకుల వారు చేసిన తులసీ మహాత్మ్య వర్ణనా చాతుర్యాన్ని పరికించండి.

ఏవీడు తులసిచే ఎసగి ఉండగ లేదొ వీడు కాదది వట్టిబీడు గాని
ఏవాడ తులసిచే ఎసగి ఉండగ లేదొ వాడ కాదది పల్లకాడు గాని
ఏయిక్క తులసిచే ఎసగి ఉండగ లేదొ ఇక్క కాదది నక్కబొక్కగాని
ఏ తోట తులసిచే ఎసగి ఉండగ లేదొ తోట కాదది ఈత తోట గాని
తులసి లేనట్టి చోటుల చెలగు జనము జడ మగును గాని యయ్యది జనము గాద
టంచు నెరుగుచు పూజల అహరహంబు సల్పుచుండుమ! తులసికి శ్రద్ధతోడ.

ధనం కంటే శరీరం,శరీరం కంటే మానం, అంతకంటే మిత్రకార్యం ముఖ్యాలని శాస్త్రిగారి భావన, దాన్ని చక్కని చంపకమాలలో ఏవిధంగా ఇమిడించారో చూడండి.

"ధనము నొసంగి దేహమును తప్పక ఒప్పుగ బ్రోవనౌను; త
త్తనువును నిచ్చి మానము యథావిధి రక్ష నొనర్పనౌను, త
ద్ధనతను మానముల్ మిగుల దాన మొనర్చి సుమిత్ర కార్య మె
గ్గున బడకుండ గాచి అనుకూలముగా నెరవేర్పనౌ కదా!"

భర్తృహరి సుభాషితాలను అనువదిస్తూ ఏనుగు లక్ష్మణ కవి విద్యను గురించి ఒక చక్కని పద్యం రాశాడు.

విద్య నిగూఢ గుప్తమగు విత్తము, రూపము పూరుషాళికిన్,
విద్య యశస్సు, భోగకరి, విద్య గురుండు, విదేశ బంధుడున్,
విద్య విశిష్ట దైవతము, విద్యకు సాటి ధనంబు లేదిలన్,
విద్య నృపాల పూజితము . విద్య నెరుంగనివాడు మర్త్యుడే!

ఈ పద్యాన్ని మనసులో ఉంచుకొని కాబోలు ప్రేమను వర్ణించవలసి వచ్చినప్పుడు ఈ పద్ధతిలో మనోహరమైన ఉత్పలమాలను వెలయించారు శాస్త్రిగారు.

"ప్రేమ మనోవికారమగు, ప్రేమ గృహస్థ శుభ ప్రదంబగున్,
ప్రేమయె సృష్టి మూలమగు, ప్రేమయె పోషణ ముఖ్య హేతువౌ,
ప్రేమ వినాశకంబగును, ప్రేమయె ధర్మ నిదాన మయ్యెడిన్,
ప్రేమ సర్వవశ్యమగు, ప్రేమను మించిన లాతి ఉన్నదే!"

శాస్త్రిగారి కవిత్వాన్ని సమకాలికులైన చెళ్ళపిళ్ళవారు, కాశీవారు, సన్నిధానం వారు, రాళ్ళపల్లి వారు మొదలైన వారెందరో మెచ్చుకున్నారు. వారిలో రాయప్రోలు సుబ్బారావుగారు చేసిన ప్రశంస లాలిత్య రమణీయం.

జ్యోతిర్మయ మగు శబ్ద
శ్వేతారణ్యమున మానుషీ హృన్మథి తా
కూతి నరసి పాడిన వా
చాతీర్థుల సాహితీ స్రృజనకగు జయముల్.
మా తెనుగు తోట సంస్కృత
చూతంబులు మొలిచినట్లు సుఖముగ పెరిగెన్
ప్రీతి పులకింప శుకపిక
జాత కషాయ కలకంఠ శైలి ధ్వనింపన్.

ఈ ప్రశంసకు తగినదే శాస్త్రిగారి రచన. అనర్గళ ధారతో, ప్రసాదగుణంతో పోతన శైలిని స్మృతికి తెస్తూ, మనోహర మంజులమైన రచన చేసిన చివుకుల అప్పయ్యశాస్త్రిగారు సాహితీ ప్రపంచంలో ఉన్నత స్థానాన్ని అలంకరించారు.

# విరుపుల మెరుపులు

ఆధునిక కాలంలోని అవధానులలో నరాల రామారెడ్డిగారు పేరెన్నికగన్నవారు. అవధానాలు చేసే సమయంలో పృచ్ఛకుల తత్వాన్ని బట్టి చిత్రమైన ప్రశ్నలు వస్తూ ఉంటాయి. ప్రతి అవధానీ చమత్కార చాతుర్యంతో సమాధానాలు చెప్పాల్సి ఉంటుంది.

రెడ్డిగారు వివిధ ప్రదేశాలలో పూరించిన సమస్యలు, దత్తపదులు కొన్ని చూద్దాం.

సమస్య: తల నరకుట హింస కాదు ధర్మమ్మె అగున్.

పూరణ: బలవంతులు దుర్జనులై
బలహీనుల అణగద్రొక్కి బాధింపగ ఆ
తల పొగరు నిండిన నియం
తల నరకుట హింస కాదు ధర్మమ్మె అగున్.

తల నరకుట కాదు. దుర్మార్గులైన నియంతలను సంహరించటం అని అనటంతో పూరణ సౌందర్యాన్ని సంతరించుకొన్నది.

నెల్లూరు అవధానంలో ఇచ్చిన సమస్య: దుఃఖము కాదె చక్కని వధూటి రతంబు విలాసి కెప్పుడున్

పూరణ: స్వఃఖర దేవనాథ కర వజ్రము ముక్కలు చేసినాడు, రో
చిః ఖుర వాజి వల్గన విశీర్ణ దిగంతుడు, రావణుండు, సం
తఃఖల మన్మథాగ్ని వనితా! దహియించెను, కాదు పొమ్మనస్
దుఃఖము కాదె చక్కని వధూటి రతంబు విలాసి కెప్పుడున్.

కఠిన ప్రాసతో, అర్థ వైపరీత్యంతో ఇచ్చిన సమస్యను సమయస్ఫూర్తితో, పాండితీ ప్రాభవంతో పూరించటం ఎంతైనా ప్రశంసనీయం.

హోసూరులో అవధానం చేసేటప్పుడు కాఫీ, టోపీ, హ్యాపీ, కూపీ-ఈ పదాలను నిర్ణీతార్థంలో కాకుండా వేరే అర్థంలో ఉపయోగించి భారత సైనికులు యుద్ధరంగంలో పాకిస్థాన్‌కు గుణపాఠం చెప్పిన దృశ్యాన్ని వర్ణించమని అడిగారు. పూరణలోని నేర్పు గమనించండి.

**కా పీనేలకు లేడటంచు దురహంకారంబునన్ సంగరా**
**టోపీ! నీ విటు దాడి చేసితివి నాడున్ నేడటే! నీతి బా**
**హ్యా!పీనమ్మగు మద్భుజాబలము నీ అస్రమ్మునే త్రాగు నా**
**కూపీ గల్గును దేశభక్తి రుధిరం బుప్పొంగె పాగ్రాక్షసా!**

ఇందులో 'కాపు ఈ నేలకు రక్ష' అని అర్థం. 'సంగరా టోపీ' అన్నచోట సంగరమునందు ఆటోపము గలవాడు, 'నీతిబాహ్యా'-సంబోధన-అవినీతుడా అని అర్థం. పీనమ్మగు బలిసిన నాకు ఊపు ఈగల్గును 'నాకూపీ గల్గును' అయినది. 'పాకిస్తాన్ రాక్షసుడా! ఈ భూమికి కాపు లేదని గర్వంతో దాడి చేశావు. నా బహుబలంతో నీతిబాహ్యుడవైన నీ నెత్తురు తాగుతాను. దేశభక్తి నా నెత్తురును పొంగిస్తున్నది' -అని భావం. ఈ పదాల విరువు సామాన్యం కాదు. ఎంతో ప్రతిభా పాటవాలున్న అవధానికి గానీ వచ్చేవి కావు.

ఆవిధంగానే గుంతకల్ అవధానంలో ఉబ్బసం, మసూచి, క్షయ, కలరా ఈ నాలుగు జబ్బుల పేర్లను తీసుకొని అందమైన, ఆరోగ్యవతి అయిన అమ్మాయిని వర్ణించమని కోరగా రెడ్డిగారు చెప్పిన పద్యమిది.

**ఉబ్బ సముద్రమై హృదయ ముయ్యేల లూగగ కోడె కోరికల్**
**నిబ్బరమైన నిగ్గు పయనించెను చూపుల ప్రేమ సూచికగా**
**అబ్బురమయ్యె నీ ప్రణయ మక్షయ మవ్యయ మప్రమేయమై**
**రబ్బరు బంతి! ఇంతి! కలరా! నిను పోలెడి కన్యకామణుల్?**

ఉబ్బసము-ఉబ్బ సముద్రమై సముద్రమై ఉబ్బగా, ఉప్పొంగగా అని అర్థంలోనూ, మసూచి అనే మాట ప్రేమ సూచిగా ప్రేమ సూచిక అనే దానిలోను, క్షయ అక్షయము అనే పదంలోనూ, కలరా అనేది ఉన్నారా అనే అర్థంలోనూ ఉపయోగించారు.

బెంగుళూరు అవధానంలో 'రామా' అనే శబ్దం రాముడు అనే అర్థం రాకుండా పాదాదిలో వచ్చే విధంగా రామపరంగా వర్ణించమని అడిగినప్పుడు చెప్పిన పద్యం.

**రా! మాకంద మనోజ్ఞమూర్తి! ప్రణయ ప్రాణేశ! నీ నందనా**

రామాలోకన శీత చంద్రికలు నా రాగమ్ము పండించులే
రా! మాధ్వీక హృదంత సౌధమున నీ రమ్యాకృతిన్ కాంతి ధా
రా మాహాత్మ్యము చూపరా! రఘువరా! రమ్మన్నదీ సీతరా!

శబ్దాలను విరిచి, భిన్నార్థాలలో ప్రయోగించి, అందమైన శార్దూలాన్ని ఉరికించారు నరాల వారు. పద్యం అవధానంలోనైనా, మరెక్కడైనా అందంగా, పొందికగా నేర్పుతో, చక్కని కూర్పుతో తీర్చటం రెడ్డిగారి ప్రత్యేక సామర్థ్యం అది వారి ప్రతి పద్యంలోనూ ద్యోతకమౌతుంది.

ఒక అవధానంలో పూరించిన సమస్యను చూడండి. 'కపిని పెండ్లియాడె కమలపాణి'

పూరణ: పత్తి పూల వంటి పసిడి చెక్కిళ్ళపై
వలపు చిందు సిగ్గు పరిమళింప
పూలమాల వేసి పాల నవ్వుల వృషా
కపిని పెండ్లియాడె కమలపాణి.

నరసరావుపేటలో ఆకాశవాణి ఆధ్వర్యంలో జరిగిన ఒక కార్యక్రమంలో ఇచ్చిన దత్తపది రామాయణార్థంలో పూరించమని అడిగారు-కోకో, కబాడీ, క్రికెట్టు, వాలీబాలు.

పూరణ: నీలో ద్వేషము ప్రజ్వలించె, సమరాగ్ని జ్వాల కోకో యనెన్.
బాలత్వమ్మున తాక బాడి యగునా! వాల్లభ్యమున్ వీడు నీ
శీలం బిట్టిది, వక్రి కెట్టు ఫలయించెన్ శౌర్య విక్రాంతి, ఓ
వాలీ ! బాలుని వోలె పల్కెదవు నీ వైరమ్ము వర్జింపుమా!

కోకో అన్నది ఆట అర్థంలో కాక ప్రోత్సాహకరమైన ధ్వన్యనుకరణ శబ్దంగా ఉంది. తాకన్ పాడి అగునా-తాకబాడి అగునాలో కబాడి ఇమిడి ఉంది. వక్రికి ఎట్టు అన్న దానిలో క్రికెట్టు సరిపోయింది. వాలీ బాలుని వోలె- వాలీ అనేది సంబోధన, బాలుని వోలె అన్నచోట పిల్లవాని వలె అను అర్థం వచ్చి వాలీబాలు వచ్చింది.

ప్రొద్దుటూరు అవధానంలో దోస్తీ, షోలే, డాన్, బాబీ-ఈ హిందీ సినిమా పేర్లతో పద్మవ్యూహంలో అభిమన్యుని స్వైరవిహారాన్ని వర్ణించమని అడిగినప్పుడు చెప్పిన పద్యమిది.

తన దోస్తీవ్రబలాతిరేకమున ఉద్దామ ప్రతాపాగ్ని చ
ల్లిన సౌభద్రుడు విక్రమింపగ ఉషో లేఖామయూఖాకృతిన్
కినుకన్ కౌరవ కుంజరమ్ము లదరన్ క్రీడాన్వితోత్సాహియై
చెనకెన్ సింగమువోలె సంగరమునన్ చిన్నారి బాబీగతిన్.

హిందీ పదాలు పద్యంలో ఎంత చమత్కారంగా ఇమిడాయో, అంత చాతుర్యధుర్యంగా పద్య రచన చేయగలిగిన సమర్థుడు, భావుకుడు రామారెడ్డిగారు.

## దొంగకు మ్రొక్కినన్..

ఈనాడు తెలుగు సాహితీ ప్రపంచంలో అష్టావధానాలు చేయగలవారు అక్కడక్కడా కనిపిస్తూనే ఉన్నారు గానీ, శతావధానాలు చేయగలవారి సంఖ్య మాత్రం చాలా పరిమితం. వారిలో శ్రీ కడిమెళ్ళ వరప్రసాద కవి ఒకరు.

నరసాపురం టైలర్ హైస్కూలులో తెలుగు పండితులుగా ఉన్న ఈ యువకవి, సుమారు 150 అష్టావధానాలు, దాదాపు పది శతావధానాలు చేశారు. ప్రత్యేకంగా ఆశు కవితా ప్రదర్శనలు కూడా కావించారు. భారతీ పుత్ర, అవధాని చూడామణి, అవధాని సార్వభౌమ మొదలైన బిరుదు లెన్నో అతన్ని వరించాయి. ఆ యా సందర్భాలలో వారు పూరించిన కొన్ని సమస్యలు, దత్తపదులు ఉదాహరిస్తున్నాను.

సమస్య: కారము తీపియై సుఖముగా మురిపించెను భక్త బృందమున్.

పూరణ: శ్రీరమణీయ రూపమున చెన్నలరారెడి శ్రీనివాసు డా
హార మటన్నచో ప్రణవ మన్నది నిక్క మెరుంగడయ్య్య సం
సారము నందునన్ మునిగి జాణవు గావు పవిత్రమైన ఓం
కారము తీపియై సుఖముగా మురిపించెను భక్త బృందమున్.

ఓంకారం భక్తులకు మధురంగా ఉంటుందనటంలో కేవల పూరణమే కాక, భక్తి రసానుభవ లక్షణం కూడా ద్యోతక మవుతున్నది.

మరొక సమస్య: దొంగకు మ్రొక్కినన్ నవనిధుల్ లభియించు శుభంబు చేకురున్.

పూరణ: సంగర మందు గాని సరసమ్ముల యందున గాని శత్రు స
స్తంగతు చేయగాని నిజ సంతతి కాచుటయందు గాని ప్ర
జ్ఞం గనుపింప చేయగల జ్ఞానియ అయ్యును వెన్న దోచు - ఆ
దొంగకు మ్రొక్కినన్ నవనిధుల్ లభియించు శుభంబు చేకురున్.

వేరొక సమస్య: టీవీ లుండెను చూచి మెచ్చ మునివాటిన్ పూర్వకాలంబునన్.

పూరణః

ధీ వైదుష్యము చూచి మెచ్చదగు నెంతే స్పర్థ చూపించినన్
ప్రావృట్కాలము వోలె వాదముల సంభారమ్ము ముమ్మారుగా
కావింపం గమనింపగా వలయు సంఖ్యావత్ ప్రకాండాళి బో
టీ! వీలుండెను చూచి మెచ్చ మునివాటిన్ పూర్వకాలంబునన్.

టీవీ అనగానే టెలివిజన్ అని అందరికి స్ఫురిస్తుంది. దాన్ని బోటీ, వీలుండెను' అని మార్చటంవల్ల ఆంగ్ల పద భ్రాంతి పోయి చమత్కారమైన అర్థం చేకూరింది.

అవధాన సభ ఎలా ఉందో చెప్పమని అడిగినప్పుడు ఈ క్రింది సీసంలో సభావైభవమే కాక, ప్రాంతవైభవం, అంతేకాక కవి వినయ విధేయతలు కనిపిస్తున్నాయి.

సంస్కృతాంధ్రము లందు సర్వకాలము లందు కృషి చేసి ఎదిగిన ఋషులు కలరు.
ప్రాపంచికాలోక పర్యవేక్షణలందు మసలు కొన్నట్టి తాపసులు కలరు.
అవధానముల యందు అభ్యాసముల తోడి అనుభవాస్పదులైన మునులు కలరు.

విద్యతో బాటుగా వినయ సంపదల సంగతి పెంచుకొను బృహస్పతులు కలరు.
అట్టి కోనసీమను నిలిచి ఆర్యజనులు ప్రోత్సహింపంగ ఇష్టికై పూనియుంటి
ఆప్తజనులార! హితులార! ఆర్యులార! విజయవాణి వరింప దీవింపుడయ్య!

సినిమా పాటలలో అనౌచిత్యాన్ని గూర్చి చెప్పమన్నప్పుడు చెప్పిన పద్యం ఇప్పటి పరిస్థితి తెలియచేస్తూంది.

చలన చిత్రములందున చలన మంది
పోయె సాహిత్య మెప్పుడో బూజు పట్టి
కలిమి కోరుచు చెప్పెడి కైతగాని
కైత లందున బలిమిని కానగలమె?

త్యాగయ్య "ఎందరో మహానుభావులు అందరికీ వందనాలు" అన్నాడు. మరి మీ రేమంటారు? అని అడిగినప్పుడు కడిమెళ్ళ కవి చెప్పిన చతురోక్తి భరితమైన పద్యం.

భావకవికోటికై భావ వందనములు
సరస కవికోటికై రస చందనములు
ఎసగు విప్లవ కవులకు ఎఱ్ఱ నతులు
కవుల కందరకును కూడ కవన నుతులు

తోటకూర విత్తనం మీద శార్దూలాన్ని చెప్పమన్నప్పుడు చెప్పిన పద్యం.

సారార్థమ్మును చెప్పుచుంటి కడు విస్తారంపు విశ్వమ్ములో
చేరున్ తా పరమాణు రూపుడగు రాజీవాక్షు డౌన్నత్య సం
భారుండై వనశాక బీజమును సన్మానించి వాక్రుత్తు ఆ
తీరున్ చూడగ చిన్న సౌఖ్య మిడగా దేహానకున్ పెద్దయే.

పరమాణు రూపుడైన పరమేశ్వరుడు విశ్వంలో నిండి ఉన్నట్లుగానే, గింజ చిన్నదైనా దాని గొప్పదనం దానికుందని కవి చమత్కరించారు.

అలాగే స్త్రీలు గృహంలో చేసే అష్టావధానం గురించి కూడా చమత్కార చారువైన చంపకమాల వచ్చింది. చూడండి.

అకట విధాన మన్నయది ఆడుది పుట్టుకతోడ నేర్చి ఊ
రక పిలువంగ చూచు తన రాజును పిల్లలు అత్త మామలున్
ఒక పరి శాకపాకముల నొద్దికగా ఘటియించుచుండు ఆ
లికి అవధాన తత్వము ఫలించినదో సహజాతమై ఇలన్.

"కుచ వస్త్రంబు పరిత్యజించి సతి తా కోరెన్ తమిన్ మామనున్" అనే సమస్య పూరించిన తీరు చూడండి.

శుచి సాహస్రము మిన్నుముట్టినదియో! చోద్యమ్ముగా సూర్యుడే
అచలుండౌచును ఆత ప్రసరణ వ్యాపారమున్ పూనెనో
విచలత్ గాత్రి హిడింబ గాత్రమున పెన్వేకుల్ జనింపంగ తత్
కుచ వస్త్రంబు పరిత్యజించి సతి తా కోరెన్ తమిన్ మామనున్.

చాలా సంవత్సరాల కింద కావ్యకంఠ గణపతి ముని నవద్వీప పండిత పరిషత్తులో పూరించిన ఈ కింది సమస్యలోని భావమే పై పద్యంలో ఇమిడింది.

**హిడింబా భీమ దయితా నిదాఘే ఘర్మ పీడితా**
స్తన వస్త్రం పరిత్యజ్య వధూః శ్వశుర మిచ్ఛతి.

ఈవిధంగా కడిమెళ్ళ వరప్రసాద కవి అవధాన ఆశు కవితా సామర్థ్యానికి ఎన్ని ఉదాహరణలైనా చూపించవచ్చు. సంగమేశ్వర శతకం, మధుజీవనం మొదలైన కావ్యాలు కూడా రచించిన ఈ కవి ప్రజ్ఞా సరస్సులో ఇంకెన్నో కావ్య కమలాలు వికసించగలవని మనం ఆశించవచ్చు.

## అమావాస్య వెన్నెల

ఈనాడు తెలుగుదేశంలో శతావధాన కవితా శంఖారావాన్ని పూరించి ఆ స్నిగ్ధ గంభీర నాదాన్ని దశదిశలా నింపిన యువకవి, అవధాన చక్రవర్తి శ్రీ మేడసాని మోహన్. పూర్వజన్మ సంస్కార ఫలితమో, శివానందస్వామి మంత్రోపదేశ మహిమయో, తీవ్రసాధనా లబ్ధ కవితా వైభవమో ఏదైతేనేమి, అష్ట శతావధానాలు అలవోకగా చేసి శ్రీ మోహన్ కీర్తి ప్రతిష్ఠలను అందుకొన్నారు. చతుర్గుణిత, షడ్గుణిత, దశగుణిత, షోడశగుణిత అష్టావధానాలు చేసి, వేలాది రసజ్ఞులను అలరించి కనకాభిషేక, స్వర్ణ కంకణాది. సత్కారాలెన్నో చిన్న వయసులోనే పొందారు. విజయవాడలో, విజయనగరంలో, గుంటూరులో, హైదరాబాద్‌లో వందమందికి పైగా పృచ్ఛకులకు జవాబు చెప్పి, ధారణ చేసి విజయవంతంగా అవధానాలు చేసిన సాహిత్య వీరు డితను.

ఇతడు అవధానాలలో పూరించిన దత్తపదులు, సమస్యలు కొన్ని చూడండి.

సమస్య:

**జోత్స్నా లేప మమాసరేయి కొదవెన్ చోద్యంబు నల్మూలలన్.**

పూరణ:

**కృత్స్నాభావన వీడి ఈశ్వరుని సౌహిత్యంబు దీపింప , సం**
**పత్స్నిగ్ధాకృతి విశ్వరూపమును సంభావించి హర్షించుచో**
**సత్స్నేహంబున నాంబికేయు డిటులన్ స్వాంతాన భావించె తాన్**
**జోత్స్నా లేప మమాసరేయి కొదవెన్ చోద్యంబు నలూశిలలన్.**

ధృతరాష్ట్రుడు కృష్ణుని విశ్వరూపాన్ని చూసి అమావాస్య రాత్రికి వెన్నెల సాంగత్యం కలిగినట్లుగా భావించి ఆనందించాడు.

మరొక సమస్య: కర్ణుని తోడ ద్రౌపదికి కల్గె వివాహము వైభవంబుగన్.

పూరణ:

**దీర్ణ దుదాత్త విక్రమ మతి ప్రవరోత్తము లైన పాండవుల్**
**పూర్ణ మనోజ్ఞ మూర్తులయి పొల్చిరి నేడు తదీయ విక్రమా**
**కీర్ణ మహాగ్నిలో శలభ కీలితు డీతడు ఏల వాద మీ**
**కర్ణుని తోడ? ద్రౌపదికి కల్గె వివాహము వైభవంబుగన్.**

పాండవుల పరాక్రమాగ్నిలో శలభంలాగా కాదగినవాడు కర్ణుడు. అతనితో వాద మెందుకు? ద్రౌపదికి వైభవంగా పాండవులతో వివాహం జరిగింది గదా-అని భావం.

వేరొక సమస్య.

'బారులె శరణ్యములు వేద పండితులకు

పూరణ:

కలియుగంబున వేంకటాచలము నందు
స్వామియే పరదైవమై వరలు కతన
వచ్చి దర్శించి పోషించు భక్తవరుల
బారులె శరణ్యములు వేద పండితులకు

భక్తుల సమూహాలు స్వామివారికి సమర్పించే కానుకలు వేదపండితుల పోషణకు మూలభూతాలు, బారులు అంటే సమూహాలు అనే అర్థం ఇక్కడ స్వీకరించారు.

మేషాది రాసుల పేర్లలో ఆరింటిని ఉపయోగిస్తూ పరమేశ్వరీ స్తుతి అడిగినప్పుడు చెప్పిన పద్యం.

అనిమేషంబుగ నీ మహాకృతిని భావాంతర్గతిం చూచి, సం
జనితోల్లాసము మై నుతింతు వృషభాంచత్ వాహనాధీశ్వరీ!
నిను కన్యా మృదుమూర్తిగా, మిథున సందీప్రాఢ్యగా, సింహ వా
హనగా మ్రొక్కుచు నుంద్రు భక్తులు సమస్తాకార! కుంభస్తనీ!

ధాత, ఈశ్వర, దుర్మతి, దుందుభి-ఇవి సంవత్సరాల పేర్లు. వీటితో రావణ పాత్ర చిత్రణ చేయమని అడిగినప్పుడు చెప్పిన పద్యం.

పొందెను ధాత వర విభూషణముల్ పటు యోగ భావనా
స్పందిత లీల నీశ్వర శుభంకర లింగము నొందె దేవతా
క్రందనముల్ వినం దొడగి రాక్షసు లందున దుర్మతిం బలెన్
దుందుడుకున్ వహించె జయ దుందుభి రాముని మ్రోల మ్రోగగన్.

రావణుడు బ్రహ్మచే వరాలు పొందాడు. ఈశ్వరుని ఆత్మలింగం సాధించాడు. కానీ, దేవతలను కష్టపెడుతూ గర్వంగా చరించాడు. అందుకే జయభేరి రాముని పక్షాన మోగింది.

చైనా, జపాన్, ఇరాక్, ఇరాన్ శబ్దాలను ఉపయోగించి భారతార్థంలో చెప్పమన్నప్పుడు పలికిన పద్యం ఇది.

శ్రీహరి పెలు చైనాడవు మోహమూని
నీ జపానురాగులు పాండు నృపతి సుతులె
పోయి రా కురు సమ్రాట్టు మ్రోల మాయ
లోయి రాను నీ నిర్ణయం బొప్పుకొనగ.

వేంకటాచల శిఖరాన్ని చూసినప్పటి అన్నమయ్య భావాలను వర్ణించమని అడిగినప్పుడు చెప్పిన పద్యం ఇది.

అదిగో! స్వర్ణ రుచిచ్ఛటా కలిత శేషాద్రీంద్ర సాంద్రప్రభా
భ్యుదయానంద రస ప్రపంచ కలనామోద ప్రభావావళుల్
విదితంబై హరిరాగ రంజిత మతిన్ వెల్గొంది చెన్నొందె నా
ఎదలో నంచు తలంచు అన్నమయ ధీహేలల్ పిసాళింపగన్.

అన్నమయ్య అనుభూతి భరితమైన తన బుద్ధి విశేషాన్ని ప్రసరించి, బంగారు కాంతులతో విరాజిల్లే వేంకటాచల శిఖరాలను చూశాడు. వేంకటేశ్వరస్వామి భక్తుల పట్ల ఉండే అనురక్తి పుంజీ భూత కాంతిమంతమై ప్రకాశిస్తూ ఉన్నట్లు ఆయనకు తోచింది.

ఈ విధంగా ఎంతో సామర్థ్యంతో అవధాన పరాక్రమం చూపిన మేడసాని కవిని శ్రీ తుమ్మల సీతారామమూర్తి ఇలా ప్రశంసించారు.

అప్పుడు భట్టుమూర్తి మొదలైన కవుల్ బుజ మప్పళించినా
రిప్పుడు మేడసాని సిడమెత్తె వధాన విధాన చాతురిన్
ముప్పిరిగొన్న మోదమున మోహనుపై తెరగంటి తోటపూల్
గుప్పి "రయారె!" అంచు సరికొండ మనీషియు మాడభూషియున్,

అదే విధంగా శతావధాన సౌందర్య పరవశులైన డా. కరుణశ్రీ ఈ విధంగా పలికారు.

అల తొలినాటి గర్తపుర మండలి చక్కని మేడలోని ప
ల్కుల దొరసాని నిప్పుడనుకొందరు కొందురు మేడసానిగా
పలుకు వెలంది మోహన శుభాకృతి తాల్చి శతావధానమున్
సలిపెను మేడమీది కళాశాలకు బంగరు నీరు పోయుచున్

శ్రీమాన్ కోగంటి సీతారామాచార్యులు శ్రీ మోహన్ సామర్థ్యాన్ని ఇలా ప్రశంసించారు.

పిడుగుల వంటి పండితులు పృచ్ఛకు లెల్లరు నీ వధానమే
ఎడ ఎడమీని ధాటి ఎలయించును అర్జును అస్త్ర వైఖరిన్
పొడి పొడి మాట లేమిటికి పోడిమి మీర ఒసంగుచున్న మా
యుడుగర నీ కవిత్వ సతి కొప్పును గావుత కంఠ సూత్రమై.

ఇటువంటి ప్రశంస లెన్నింటికైనా తగిన శ్రీ మేడసాని కవి అవధాన ఆశు కవితా రంగంలో అద్భుత ప్రజ్ఞా పాటవాలను ప్రదర్శిస్తూ, సహృయ హృదయాలను చూరగొన్నారు. భవిష్యత్తులో శాశ్వతమైన మహా కావ్యనిర్మాతలు కాగలరని ఆంధ్రావని ఆశిస్తున్నది.

## దృష్టద్యుమ్నుడు ద్రౌపది భర్త!

**శ**తావధానాలు చేసి ఖ్యాతి గాంచిన వారిలో శ్రీ కాకర్ల కొండలరావు పేరు పేర్కొనదగినది. ఈ శతాబ్ది ప్రథమార్ధంలో ప్రకాశించిన పండిత కవులలో వీరొకరు. నరసాపురంలో శతావధానం చేస్తూ అంతకుముందు సుమారు నూరు అవధానాలు చేసినట్లు చెప్పారు.

**జరిగెను నేటిదాక శత సంఖ్యకు దాపు వధాన రాజి నే**
**డిరువది పైని తొమ్మిదవ యేడు సమాప్తిని చెందుచుండ నీ**

నరసపురంబునన్ రసికనాథులు కూడిన సత్సభా స్థలాం
తరమున యందు నే శత వధానము సేయుట గల్గె భారతీ!

వీరు సహజ పాండిత్యులని, ప్రత్యేకంగా ఎవరి దగ్గర చదవక పరమేశ్వరునే గురువుగా భావించారని ఈ కింది పద్యాన్ని బట్టి తెలుస్తున్నది.

ఆంధ్ర సంస్కృత వాఙ్మయాభ్యాసమునకు
కవిత కవధానమునకు నొక్కరుడు గాని
నాకు గురుడుండమినిజేసి నతుల నెల్ల
సకల లోకైక గురునకే సంఘటింతు.

వీరు తపతీసంవరణ కథను, ప్రసన్న రాఘవాన్ని, అభిజ్ఞానశాంకుతలాన్ని, విక్రమోర్వశీయము మొదలైన గ్రంథాలను ఆంధ్రీకరించారు. వీరు ఏలూరులో చేసిన శతావధానాన్ని విజయవాడ భువనవిజయ సంస్థ ప్రకటించింది. అంతేకాక పాలకొల్లు నుంచి శ్రీమతి కె. కామేశ్వరీదేవి కొన్ని సమస్యా పూరణలు రాసి పంపారు. ధార, పలుకు పొందిక, ప్రతిభా పాటవం వీరి పద్యాలలో పుష్కలంగా కనిపిస్తాయి. ఏలూరులో వీరు చేసిన శతావధానం ఆ రోజుల్లో ఎంతో ప్రశస్తి కెక్కింది. దానిలోని కొన్ని సమస్యా పూరణలు పరికించదగినవి.

సమస్య: దృష్టద్యుమ్నుండు ద్రౌపదికి భర్త యగున్.

పూరణ:

భ్రష్టాంభశ్చర యంత్ర
స్పృష్టీకృత విక్రముండు పార్థుడు స్వభుజా
చేష్టా బహు సంప్రీణిత
ధృష్టద్యుమ్నుండు ద్రౌపదికి భర్త యగున్.

ద్రౌపదికి భర్త అయినది దృష్టద్యుమ్నుడు కాడు-తన విలువిద్య నేర్పు చేత మత్స్యయంత్రాన్ని కొట్టి ఆ పనిచేత సంతోషం పొందిన దృష్టధ్యుమ్నుడు గల అర్జునుడు అని భావం రూపొంది, పూరణ అందాన్ని సంతరించుకొన్నది.

మరొక సమస్య: పాలను తునియలుగా జేసె పటు భల్లమునన్

పూరణ:

చాలగ ద్రావి యొకడమి
త్రాళి వధింపంగ నేగి యా సదనములన్
వ్రేలెడు ఛాయాప రూ
పాలను తునియలుగ చేసె పటు భల్లమునన్

ఒకడు బాగా తాగి శత్రువులను చంపటానికి పోయి వారి ఇళ్ళలో గోడలకు వేలాడుతున్న వారి పటాలను బల్లెంతో పొడిచి తునకలు చేశాడట. పాలను గాదు చిత్రపట రూపాలను పొడిచాడు-అని పూరణ.

రాధేయుడు గంగ దెచ్చి రావణు జంపెన్ అనే సమస్యను పూరించటంలో క్రమాలంకారాన్ని ఆశ్రయించటం జరిగింది. ఇతర మార్గాలలో పూరణకు అవకాశం లేనప్పుడు ఈ పద్ధతిని కవులు

గ్రహిస్తారు.

**బాధించె నెవడు నరు? సం**
**భోధి భగీరథుడు దేన పూరించె? మహీ**
**జాధవు పనేమి?-క్రమమున**
**రాధేయుడు గంగ దెచ్చి రావణు జంపెన్,**

అర్జునుని ఎవడు బాధించాడు?-రాధేయుడు=కర్ణుడు. భగీరథుడు సముద్రాన్ని దేనితో నింపాడు?-గంగను తెచ్చి, మహీజాధవు-రాముని పనేమి?-రావణు చంపెన్-ప్రశ్న-జవాబుల రూపంలో ఉండే పద్ధతి ఇదొక వైచిత్రి.

లక్ష్మీపార్వతుల కలహాన్ని వర్ణించమని ఒక పృచ్ఛకు డడిగితే చెప్పిన చమత్కార ధోరణి గల సీసాన్ని చూడండి!

**పునుక దండలు దాల్చి భూతి నిండుగ బూయుసుభగుండు నీ మనోవిభుడు గిరిజ!**
**సమయానుకూలమై తను వేసములు దాల్చు మాయలమారి నీ మగడు కమల !**
**వల్లకాడే నిజావాసమ్ముగా జేసి తిరుగాడు జోగి నీ వరుడు గిరిజ!**
**నడి సముద్రమ్ములో నాగమ్ము మేనిపై పవళించు నీ మనోధవుడు కమల !**
**అనుచు అన్యోన్యమును భర్తలందు తమకుగ్రాలు నభిమానమున మచ్చరమ్ము హెచ్చు**
**పద్మదళ నేత్రుభార్యయు పార్వతియును కలహమాడ గడంగి రిక్కరణిదాము.**

మరణము గోరి వచ్చి నది మానిని నీ వెటు లాదరించెదో- అనే సమస్యను శృంగార సుందరంగా కాకర్లవారు పూరించిన తీరు చూడండి-

**సరసుడ వంచు సూనశరశాస్త్ర పటిష్టుడ వంచు పండితా**
**భరణుడ వంచు సన్మధుర వాక్చతురత్వయుతుండ వంచు భా**
**సుర నవయౌవన స్ఫురిత సుందరగాత్రుడవం చెరింగి కా**
**మ-రణము కోరి వచ్చినది మానిని నీ వెటు లాదరించెదో?**

మానిని కోరింది మరణం కాదు; కామ రణం. అంటే మన్మథ యుద్ధం- రతిక్రీడ అని వచ్చే విధంగా పద్యాన్ని నిర్మించి ప్రజ్ఞ ప్రదర్శించాడు కవి.

ఈ శతాబ్దం ప్రథమార్థంలోని శతావధానులలో పేరెన్నిక గన్నవారు, పేర్కొనదగినవారు శ్రీ కాకర్ల కొండలరావు గారు.

## కుపతి కనిమెచ్చె!

**ఒ**కసారి వసంతోత్సవాల వేడుకలలో గుంటూరులో శ్రీనాథపీఠము, నాగార్జున సాంస్కృతిక సంస్థ నిర్వహించిన కార్యక్రమంలో ద్రోణాచలం వాస్తవ్యులు శ్రీ గండ్లూరి దత్తాత్రేయశర్మ శతావధానం విజయవంతంగా చేసి సదస్యుల మన్ననలను పొందారు. అందులోని విశేషాలు కొన్ని చూడండి!

సమస్య: శంకరుడెత్తె నక్కనకశైలము మాధవు కోర్కె దీరగన్

పూరణ:

**అంకిలి లేమి రాక్షసుల అగడముల్ చెలరేగె-ఇంక స**

ర్వంకష విక్రమాప్తి త్రిపురమ్ముల దగ్ధము చేయబూనినన్
శంకరు చాపమై కనకశైలము నిల్చిన శక్తియుక్తితో
శంకరుడెత్తె నక్కనకశైలము మాధవు కోర్కె తీరగన్.

త్రిపురా సుర సంహార వేళ శివుడు మేరు పర్వతాన్ని ధనువుగా ధరించిన ఘట్టం ఇందులో వర్ణితం.

మరో సమస్య: కుపతిని గని మెచ్చె సాధ్వి కోర్కెలు మించన్
పతివ్రత చెడ్డ భర్తను మెచ్చుకొన్నదట-దీని పూరణ-

విపుల స్వభావ భరితున్
కృపారస ఝరీవిలోల హృదయ స్ఫురితున్
అపరిమిత రాగు నిక్ష్వా
కుపతిని గని మెచ్చె సాధ్వి కోర్కెలు మించన్.

ఇక్ష్వాకుపతి-శ్రీరామచంద్రుడు అనే స్ఫురణ కల్గి రమణీయార్థం లభించింది.

వేరొక సమస్య: తురకల దండు చెండె నహితుండగు శ్రీ రఘురాము డాజిలోన్
పూరణ:

పరమ పరాక్రమ ప్రభల భాస్కర తత్త్వము గన్నవాడు ని
ష్ఠుర నిశితాస్త్ర శస్త్ర పరిశోభిత దీర్ఘ భుజార్గళుండు సం
గరమున నిల్వగా కపులు కన్గొని దైత్యుల లెక్కకుం గ్రహిం
తుర? కలదండు చెండె నహితుండగు శ్రీ రఘురాము డాజిలోన్.

రాముడు తురకల దండును నాశం చేశాడు-అనే అసంబద్ధమైన అంశాన్ని-రాముడు యుద్ధంలో నిలిస్తే కపులు రాక్షసులను లెక్కజేస్తారా? అనే ప్రశ్నార్థక క్రియగా గ్రహింతుర-అని ప్రయోగించి కలదండును-ఉన్న సైన్యాన్ని రఘురాముడు చెండాడు అని చెప్పటం ద్వారా ఒక కొత్త విధమైన పూరణను తెచ్చారు గండ్లూరి వారు.

అష్ట శత నేత్ర నాట్యావధానాలను దత్తపదిగా చెప్పమన్నప్పుడు వచ్చిన పద్యంలోని సరళత్వం గమనించండి-

అలరున్ పల్కుల తల్లి మిన్కులదియే యష్టావధానంబు తే
నెలు చిందించు శతావధాన మటుపై నేత్రావధానమ్ము ప్రా
జ్ఞులకున్ దిగ్భ్రమ కూర్చు హృద్య నటనా కూలంకష ప్రజ్ఞ పూ
ర్ణలసత్కౌతుకరీతి మించ చెలగున్ నాట్యావధానమ్మహో!

**తిరుపతి వేంకటకవుల అవధాన సభలో కొప్పరపు సోదర కవులు పృచ్ఛకులైతే** వారి మనోభావన ఎలా ఉంటుందో వర్ణించమని చెప్పినప్పుడు సామరస్య సుందరంగా సౌమనస్యబంధురంగా ఉండేరీతిలో చెప్పిన పద్యం పరికించండి.

తిరుపతి వేంకటేశకవిదేశికు లష్టవధానమున్ సభన్
సరససరస్వతీ చరణ సారస పుష్ప విహాయమాన ధీ
**వరవరణీయ వైఖరిని పల్కిన కొప్రపుసత్కవీశ్వరుల్**
**పరవశమందరే!పలుకు పైదలి సంగతి వా రెరుంగరే!**

దిగజారిన. గేయ రచనను చూసిన వాణీ హృదయ వేదనను వర్ణించమని పృచ్ఛకుడడిగినప్పుడు చెప్పిన ఈ కింది సీసంలో శర్మగారిలోని సంప్రదాయ ప్రవణుడు భాసిస్తాడు.

అధివాస్త కవిత్వమని బుకాయించుచు వెర్రి గీతలు గోకి వేయువారు
గణయతి ప్రాస లక్షణ శృంఖలమ్ముల త్రెంచినామని యికిలించువారు
సంధి సమాస దోషముల పాటింపక విప్లవమని రంకె వేయువారు
ఒకటికి రెండు మార్లూపి యూపి చదివి చప్పట్లకై సైగ సలుపువారు
పొట్టి పంక్తిని అటుమీద పొడుగు పంక్తి పెంచి భావాలకై దేబెరించువారు
గేయమని వీరు చేసెడి గాయములకు ఎంత కుమిలితివో క్షమియించు వాణీ!

గ్రీష్మఋతువులో మండిపడే సూర్యుని వర్ణింపుమని ఒక పృచ్ఛకురాలు కోరగా, దూకిన మత్తేభాన్ని, అందులోని రచనా పటిష్టతను, రసోచిత శబ్దప్రయోగ సామర్థ్యాన్ని చూడండి.

అది కల్పాంత విజృంభమాణ హరనేత్రాంతాగ్ని కీలమ్మొ-అ
య్యది బ్రహ్మాప్రతిబద్ధ భస్త్రిక చలద్ వ్యగ్రాగ్ని గోళమ్మొ నా
చదలన్ మండుచునుండె భాస్కరుడు భీష్మగ్రీష్మ సంపాదియై
బుధరాజ్ఞీ! యతిలోక భీకరముగా పూర్ణ ప్రభారాశియై

నీటిలో మునిగిన బుద్ధుని ఆవేదన వర్ణించమన్నప్పుడు చెప్పిన చిన్న పద్యం రసస్పందనతో అలరారింది-

సకలలోక శరణ్యుడౌ సత్యమూర్తి
జలములో మున్గి శరణము శరణ మనుచు
నేడు గొంతెత్తి అరచుచున్నాడు చూడు
భిక్షకుండయ్యె లోకైక రక్షకుండు.

కేవలం వంద పద్యాలు మొక్కుబడిగా పూర్తి చేసినట్లు గాక ప్రతిపద్యంలోను అంతో ఇంతో సౌందర్య స్ఫూర్తి కలిగించటానికి ప్రయత్నించినందువల్ల, దత్తాత్రేయశర్మ గారి అవధానం బాగా రక్తికట్టి పండితుల మన్ననల నందుకొంది.

## దృష్టి ప్రసాదం

చక్రపాణి రంగనాథుడు వైష్ణవ కవి. పరమ మాహేశ్వరుడగు పాల్కురికి సోమనాథునితో ఇతనికి మతవాదం కలిగింది. సోమనాథుని కుమారుడైన చతుర్ముఖ బసవేశ్వరు డీతనిని తన తీవ్రవాద నైపుణ్యంతో ఓడించాడు. పరాజయంతో బాధపడుతూ రంగనాథుడు తిరిగి వెళ్ళే దోవలో శ్రీశైలం ఉంది. వాదంలో ఓడిపోయినాడే గాని విశ్వాసం మాత్రం విష్ణువుమీదే ఉంది. రంగనాథునకు. శివద్వేషంవల్ల శ్రీశైల మల్లికార్జునకు నమస్కరించక, దర్శించక వెళ్ళిపోయాడు. ఆ దోషంవల్ల అతడు గుడ్డివాడైనాడు. అహూబిలానికి వెళ్ళి నరసింహస్వామిని ప్రార్థిస్తే స్వామి కలలో కనిపించి శివపారమ్యాన్ని బోధించాడు. దానితో సిగ్గుపడి మళ్ళీ శ్రీశైలం వచ్చి మల్లికార్జునుని దర్శించి స్తుతించాడు. ఫలితంగా ఒక కన్ను వచ్చింది. అక్కడి నుండి పాల్కురికి సోమనాథుని దర్శించి ఆయన అనుగ్రహంవల్ల రెండవ కన్ను పొందగలిగాడు. చతుర్ముఖ బసవేశ్వరుడితనికి శివదీక్ష ఇచ్చాడు. ఆ తరువాత రంగనాథుడు శైవ

గ్రంథాలెన్నో రచించాడు. శివభక్తి దీపికయైన నయనరగడ, కన్ను లిచ్చిన మల్లన్నపై చెప్పిన భక్తి గీతం. ఆనందావేశపూరితమైన ఈ కవిత రంగనాథుని హృదయ పరిణామానికి నిదర్శనం.

శ్రీ పార్వతీశు జూడక
పాపాత్ముడ నగుచు బోవ పథమున చక్షుల్
దీపించు దృష్టి తొలగిన
శ్రీపతి నడుగంగ కర్త శివుడని చెప్పెన్

నయనరగడ:

శ్రీశైల వల్లభుని శిఖరంబు పొడగంటి
కాశీపురాధీశు గౌరీశు పొడగంటి
సర్వలోకేశ్వరుని సర్వేశు బొడగంటి
సర్వసంరక్షకుని సర్వంబు బొడగంటి ..

ప్రబంధ రత్నావళిలో ఇతని పద్యాలు కొన్ని ఉదాహరింపబడినవి.

అందులో నొకటి.

గో శత పంచవార్ధులును గో యుగవార్ధులు గో త్రివార్ధులున్
గో శరవార్ధులున్ విదిత గో శతకార్ధక పంచవార్ధు లా
కేశవ తల్పు పద్మభవ కేకిప వాహన దానవేశ దే
వేశుల కిచ్చినట్టి పరమేశ్వరు డీవుత మా కభీష్టముల్

గో = కన్ను. శత పంచవార్ధులు = 100 × 5 × 4 = 2000.

యుగ వార్ధులు = 2 × 4 = 8. త్రి వార్ధులు = 3 × 4 = 12.

శరవార్ధులు = 5 × 4 = 20.శత కార్ధక పంచవార్ధులు = 100జ2 × 5 = 4 = 1000

శేషునకు, బ్రహ్మకు, కుమారస్వామికి, రావణునకు, ఇంద్రునకు వరుసగా 2000, 8, 12, 20, 1000 కన్నుల నిచ్చిన పరమేశ్వరుడు మాకు కావలసిన విచ్చును గాక - అని అర్థం.

శేషునకు వేయి, బ్రహ్మకు నాలుగు, కుమారునకు ఆరు, రావణునకు పది తలలని గమనించిన కన్నుల సంఖ్య సరిపోతుంది. ఇంద్రునకు తల ఒకటైనా కళ్ళు వెయ్యి. ఈ విధమైన చమత్కారాన్ని చూపించిన రంగనాథుడు శివభక్తి యుతమైన పద్యాలెన్నో రచించాడు. అరుదుగా కనిపించే తోటక వృత్తంలో నూరు పద్యాలు రాశాడట. చందో గ్రంథాలలో రెండు మాత్రం కనిపిస్తున్నవి.

ఉపవాసము లెల్లను నుండుట నీ
కృప వచ్చుటకా? అది రిత్తసుమీ!
అపవిత్రుని పుల్లని అంబలికై
సుపవిత్రుని జేయుట సుద్దిగదే!
చెలువారగ జాజిన చేలముతో
గళ నీలిమతో నహికంకణుడై

తల చంద్రకళంగల దైవము మా
కుల దైవము దైవత కోటులలోన్

శబ్దాలంకార సుందర రమణీయార్థ మనోహరమైన మరొక శివ భావనను చూడండి :

అదలని తేరు తేరికిని ఆదరువై తగు విల్లు వింటికిన్
గుదురగు నారి నారి పయి గూన్కు శరంబు శరంబు బొడ్డునన్
బొదలిన యంత యంత ముఖముల్ నిజ వాసములైన గుర్రముల్
చెదరక నీకు నెట్టి పని సేయునయా! గిరిజాధినాయకా!

త్రిపురాసుర సంహార వేళ-కనక క్షోణీధరంబు కార్ముకముగా, కద్రూతనూజుడు శింజినిగా, మాధవుడమ్ముగా బయలుదేరిన మహాదేవుని పరికరాలను చమత్కార సుందరంగా చెప్పిన తీరు తీరైనది.

ఇంతటి గొప్ప కవి. భక్తుడు గనుకనే తరువాతి కవులీతనిని ఎంతగానో స్తుతించారు. కొలని గణపతి దేవుడు 'శివయోగ సారము'లో ఇలా సన్నుతించాడు.

అసమ శివభక్తి రస మా
నసునిన్ బాల్కురికి సోమనాథుని, కవిరా
జ సమున్నత యశు సద్య :
ప్రసాదియగు చక్రపాణి రంగన గొలుతున్

భద్రకవి లింగకవి సానందోపాఖ్యానములో ఈ విధంగా ప్రస్తుతించాడు.

ద్విపద: రంగ ద్విశాలాంతరంగమ్మునందు
రంగనాథుని కవి రాజన్యు దలచి

భక్తి భావుకుడై శివానుభూతిని పొంది ధన్యుడైన రంగనాథుడు తెనుగు సాహిత్య చరిత్రకారులలో వివాదాస్పదుడు కావటం ఒక వింత.

## తెలుగు కవి మధుర భక్తి

శ్రీకృష్ణదేవరాయల కాలంనాటి కవులలో కందుకూరి రుద్రకవి ఒకరు. అష్టదిగ్గజ కవులలో ఒకడుగా అతడుండేవాడని, ఈశాన్య సింహాసనాధిష్టితుడై ఉండేవాడని కొందరు రాశారు. సుగ్రీవవిజయాది రచన లీతని అద్భుత సృష్టిలోనివే. ఈతని పేర కొన్ని చాటువులు ప్రసిద్ధి కెక్కినవి. కొన్ని సమస్యా పూరణలు వాసి నందుకొన్నవి. అయితే ఇవన్నీ ఒక ఎత్తు. ఈతని జనార్ధనాష్టక మొక ఎత్తు. మిగతావి ఏవి రాయకపోయినా ఆ ఎనిమిదిపద్యాలూ రుద్రకవిని ఉన్నత స్థాయి కవిగా ఆంధ్ర సాహిత్యంలో నిలబెట్టగలవు.

గోపీకృష్ణాశ్రితమైన మధురభక్తి సంప్రదాయం తెలుగులో తక్కువ. గోదాదేవి రంగనాథుని

ఆరాధించిన తీరు రాయలవారి రచనలో రమణీయంగా ఉన్నది. కాదనలేము. కాని పారవశ్యం కలిగించదు. రసదేవుడైన శ్రీకృష్ణుని ప్రియునిగా భావించుకొని, తనను ప్రియురాలిగా భావించుకొని గోపీభావనతో తాదాత్మ్యం చెందిన సాధకు లుంటారు. కాని దానిని కవితా మనోహరం చేసిన వారు తక్కువ. రుద్రకవి రచన ఆ ఉదాత్తస్థాయి నందుకొన్నది.

కృష్ణునకెందరో ప్రియురాండ్రున్నారు. ఒకరి దగ్గరకు వెళితే మరొకరికి ఈర్ష్య. ప్రతి ప్రేయసి ఎప్పుడో ఒకప్పుడు అష్టవిధ నాయికల స్థితులను పొందుతుంది. ఖండిత, ప్రోషితపతిక, వాసకసజ్జక మొదలైన భావాలను అనుభవిస్తుంది.

రుద్రకవి తమ ఊరి జనార్దనస్వామిని నాయకునిగా చేసి ఒక గోపిక-ఒక ప్రియురాలు పడిన అనుభవించిన శృంగార భావనలను తీయని కవితలో చిత్రించాడు. తానే గోపికయై పలికినాడేమో!

సిరులు మించిన పసిమి బంగరు జిలుగు దుప్పటి జారగా
చరణపద్మముమీద దేహము చంద్రకాంతులు దేరగా
మురువు జూపగ వచ్చినావో మోహనాకృతి మీరగా
గరుడ వాహన! దనుజ మర్దన-కందుకూరి జనార్దనా!

పీతాంబరుని - పసిమి బంగరు జిలుగు దుప్పటి జారినట్లు వర్ణించటంలోని సొగసు-ఆ తెలుగు పదాల జిలుగు వెలుగులు అనుపమానం-అనితరం. భువన మోహనుడు చల్లగా వెన్నెలలు కురుస్తూ వస్తుంటే ఆ అదృష్టాన్ని పొందిన వారిని ఎంతని వర్ణించగలం?

నాయిక ఒట్టు పెట్టుకుంది అటు మొన్న. అయినా ప్రభువు రాలేదు. మొన్న పూనుకొని పిలిచింది. అయినా రాలేదు. పొంచి పొంచి తప్పించుకుపోయాడు. నిన్ననో, చూస్తూ ఉండగానే ఇంకొక ప్రియురాలి దగ్గరకు వెళ్ళాడు . ఆమె ఇలా అంటుంది.

అన పెట్టిన రాకపోతిని ఆయెబో అటు మొన్నను
పూని పిలువగ వినకపోతిని పొంచి పొంచి పోవుచు మొన్నను
నేను చూడగ గడచిపోతిని నీటు చేసుకు నిన్నను
కానిలేరా! దనుజ మర్దన!కందుకూరి జనార్దనా!

మరొక ప్రియురాలితో అతడు కలిసి క్రీడించిన సంగతి ఒక స్త్రీ ద్వారా విన్నది. వినటమే కాదు- ఆ వీధిలో పోతుంటే స్వయంగా చూసింది. ఇక భరించలేక ఈ విధంగా ఎత్తి పొడుస్తున్నది.

నిన్న రాతిరి చవికె లోపల నీవు చెలి కూడుంటిరా
ఉన్న మార్గము లన్నియును నే నొకతె చేతను వింటిరా
విన్న మాత్రము కాదురా నిను వీధిలో కనుగొంటిరా
కన్నులారా! దనుజ మర్దన! కందుకూరి జనార్ధనా!

ఆ జనార్ధనుడు దక్షిణ నాయకుడు. ఆయన కెందరో ప్రియురాండ్రు. ఈమె అన్నా అతడికి ఇష్టమే. ప్రేమే. ఒకసారి ఈమె దగ్గరికి వచ్చాడు. ప్రేమ చూపించాడు. కబుర్లు చెప్పాడు. ఒంటిమీద చేయ వేయబోయాడు. కాని ఆమె అలిగింది. అతడంతకుముందే మరొకరితో క్రీడించి వచ్చిన సంగతి గ్రహించి ఆ గుర్తులు చూసి ఈ రకంగా ఉపాలంభిస్తున్నది.

బిత్తరంబున మొలక కెంపులు పెదవి నెవ్వతె ఉంచెరా!
గుత్తమైన మిటారి గుబ్బల గుమ్మ యెవ్వతె మెచ్చెరా
చిత్తగించక జీరువారను చెక్కిలెవ్వతె నొక్కెరా!
కత్తిగోరుల దనుజ మర్దన! కందుకూరి జనార్దనా!

దబ్బు లన్నియు తెలిసికొంటిని తప్పు బాసలు చేయకూ!
మబ్బు దేరెడి కన్నుగవతో మాటి మాటికి డాయకూ!
ఉబ్బు చేసుకు తత్తరంబున ఒడలిపై చేయి వేయకూ!
గబ్బితనమున దనుజ మర్దన! కందుకూరి జనార్దనా!

నా కెప్పుడైనా నవరత్నాల సొమ్ములు పెట్టావా? అని అడగటం వంటి మాటలు గోపికాతత్వం కంటె కొంచెం భిన్నంగా కనిపించినా శృంగార మధురమైన ఇటువంటి రచన-ప్రబంధ యుగానికి అలంకారమని అంగీకరించక తప్పదు. మధురభక్తిభావనకు తెలుగు కవి పట్టిన నీరాజనమని చెప్పక తప్పదు.

## రమణీయ భావన

అందమైన రసకందమైన చాటువులు రచించిన వారెందరో తెలుగు కవిత్వాన్ని ఆనందనిష్యందంగా తీర్చారు. అయ్యనవోలి రామన్న అటువంటి వారిలో ఒకడు. నారాయణుడు, గరుత్మంతుడు, శివుడు, పార్వతి-వీరిని గురించిన చక్కని పద్యాలను పలికా డీ కవి. శ్మశాన వాసి, దిగంబరుడు, చితాభస్మధారి, గజచర్మాంబరుడు. కపాలధారి అయిన శివునిమీద చతురోక్తులు చాలా మంది పలికారు. ఇతను కూడా ఆ ధోరణిలో ఇలా అన్నాడు.

పూయ గందము లేదు భూతి పూతే గాని యెక్క గుఱ్ఱము లేదు ఎద్దె గాని
త్రాగ కంచము లేదు తల పుర్రెయే గాని మణుల సొమ్ములు లేవు ఫణులె గాని
కొండమీదనె గాని ఉండ చోటే లేదు తలను పూవులు లేవు జడలె గాని
గజ చర్మమే కాని కట్ట వస్త్రము లేదు జోగి రూపే కాని సొగసు లేదు
ఇట్టి నిరుపేద వొట ని న్నెరిగి యెరిగి భ్రాంతి పడియెట్లు పెండ్లాడె పార్వతమ్మ
యైన నీ భాగ్య మేమని యనగవచ్చు భక్తజనసంగ ! మగితేల ముక్తిలింగ !

పెళ్ళి అయిన తరువాత శివపార్వతులు ద్యూత క్రీడకు కూర్చున్నారు. చెలికత్తెలు పార్వతిని ప్రోత్సహిస్తున్నారు. పందెం పెడుతున్నారు. శివుడు తన శిరోభూషణమైన బాలచంద్రుణ్ణి పందె మొడ్డినాడు. పార్వతీ సఖులకు ఉత్సాహంగా ఉంది. ఎలాగైనా గెలవాలి-మనం పెంచిన చకోరికా శిశువుల ఆకలి పోవాలంటే, తోటలోని చంద్రకాంతపు పాదులలో నీళ్ళు నిలిచి ఉండాలంటే, దిగుడు బావిలోని కలువపూలు ముడుచుకోకుండా ఉండాలంటే సరస్సులోని జక్కవలు నీ స్తనాలతో పోటీ పడకుండా ఉండాలంటే నీవు చంద్రుణ్ణి గెలుచుకోవాలి. ఈ హృదయంగమమైన భావ చమత్కారాన్ని చూపే పద్యమిది-

**మనము గారామున బెనిచిన యట్టి చ కోరికా శిశువు లాకొనకయుండ**
**మన గొజ్జగుల తోట మహి నిందు కాంతంపు పాదులలో నీళ్ళు పాయకుండ**

మన కేళికావన మధ్య దీర్ఘికలోని తొగ లొక యప్పుడు మొగడకుండ
మన స రోజనిలోన మరగిన జక్కవదోయి నీ చనుదోయి దొరయకుండ
ఉండుగాని సదాశివుం డొడ్డినాడు మొలక చందురు గెలుపు మీ పలక ననుచు
అగజ చెలులాడు మాటల కలరు శివుడు మనల కరుణా విధేయుడై మనుచుగాక!

శివుని గురించి ఎంత భక్తితో రచన చేశాడో, విష్ణువును గురించి కూడా అంతే భక్తితో రచన చేసిన ఈ కవి, అంతతో ఆగక అతని వాహనమైన గరుత్మంతునిమీద కూడా చక్కని పద్యం సృష్టించాడు. సామాన్యంగా తీవ్ర వైష్ణవులు మాత్రమే గరుడాది స్తుతులు చేస్తారు.

పక్ష విక్షేపణ ప్రభవ ఝుంఝూమారు తా లోల సకల కులాచలుండు
చారుజాంబూనద శైలాగ్ర పూర్ణిమా హరిణ లాంఛన సన్నిభాననుండు
తారకా పథన టత్సమయరయ భ్రామ్యమాణ దివ్య విమాన మండలుండు
అమృతాపహృతి ని మిత్తాహపరంగ నిర్గత బహు శౌర్య దిక్పాలకుండు
అంబుజోదర వహన మహోక్షముండు వజ్రమయ కాయు డాశ్రిత వత్సలుండు
భుజగ భూషణు డఖిలైక పూజితుండు వైనతేయుం డొసంగు మద్వాంఛితములు.

నాగాంతకుడైన గరుడుని నాగాభరణుడుగా వర్ణించే సంప్రదాయ మొకటి ఈ దేశంలోని కొన్ని ప్రాంతాలలో ఉంది. కొన్ని ఆలయాలలో సుపర్ణుని విగ్రహం ఈ విధంగానే కనిపిస్తుంది. శ్రీకృష్ణదేవరాయలురచించిన-ఖనటత్పయోబ్ధి వీక్ష్యరసాతలాన్యోన్య పిండీకృతాంగ భీతాండజములు- వంటి పద్యమిది. అయితే రాయలవారి పద్యం ఓజోగుణ ప్రధానం. ఇందులోనూ దీర్ఘ సమాన రచన ఉన్నా పదసారళ్యం ఎక్కువ.

గ్రహరాజైన సూర్యుని వర్ణన ఇతని రచనలలో ప్రత్యేకంగా భాసిస్తుంది. సూర్య మండలాంతర్గతుడైన నారాయణుని హిరణ్మయయవపువుగా, శంఖచక్రధారిగా కొందరు ధ్యానిస్తారు. గాయత్రీ మంత్ర వైష్ణవధ్యాన పద్ధతి ఇది. ఇతను సూర్యుణ్ణే సూర్యనారాయణునిగా భావించి చెప్పిన పద్యం చూడండి!

కాశ్యప గోత్రుడై ఘనత కెక్కినవాడు ధర లక్ష యోజనాంతరము వాడు
గ్రహరాజు వర్తులాకార మండలుడును హేమదృష్టి కళింగ భూమి విభుడు
మాణిక్య కుండల మకుట హారములతో మేరు ప్రదక్షిణ మెలగువాడు
సప్తాశ్వ రథ శంఖ చక్రముల్ గలవాడు రక్తవర్ణుడు సింహ రాశివాడు

అంబుజాప్తుండు మరియు ఛాయా విభుండు శమన కర్ణుల గన్నట్టి జనకు డనగ
రాజ గురుడైన సూర్యనారాయణుండు మనల కరుణావిధేయుడై మనుచుగాక!

ఇటువంటి వర్ణన లెన్నో చక్కని సమర్థతతో రచించి రామన్న కవి కీర్తి శరీరుడైనాడు.

## రసదర్శనం

సౌందర్యారాధకుడైన శివభక్తుడు శ్రీనాథ మహాకవి. ఏ దృశ్యాన్ని దర్శించినా అందులో రస దర్శనం చేయటం ఆయన లక్షణం. శివార్చనకు వచ్చే భక్తురాలిని చూసినప్పుడు కూడా, ఆయన హృదయం అందాన్ని చూసి ఆనందంతో పొంగుతుంది. పరకాంతను కోరితే తప్పు గాని, చూసి సౌందర్యాస్వాదనం చేస్తే తప్పు లేదని అతని అభిప్రాయం. ముక్కంటి సేవకు వెళ్తున్న ఒక మచ్చెకంటిని చూసి ఇలా అంటాడు.

బొమ వింట దొడిగిన పూవింటి దొర ముల్కి పోల్కి కస్తురి సోగ బొట్టు దీర్చి
చక చక లీను తారకల రేకల వోలె కొలుకులు వెడల కజ్జలము దీర్చి
పొడుపు గుబ్బలిమీద పొడము నీ రెండ నా రంగు చందుర కాని రైక దొడిగి
పిరుదు పొక్కిలియను మెరక పల్లము గప్ప పాలవెల్లువ వంటి చేల గట్టి
అంచ కొదమల గమి బెదరించు పోల్కి అందె చప్పుళ్ళు ఘల్లు ఘల్లనుచు మొరయు
నడుము జవజవ లాడ కీల్జడ ఘటించి వచ్చె ముక్కంటి సేవకు మచ్చెకంటి

ఆవిడ కస్తూరి బొట్టు పెట్టుకొన్నది. బొమలనే వింటికి మన్మథుడు తొడిగిన బాణవు ములికిలాగా అది అలరుతూ ఉంది. ఉన్నత స్తనాల మీద ఎర్రని రవిక తొడిగితే అది ఉదయ పర్వతం మీద నీరెండవలె ఉన్నది. ఎంత అద్భుతమైన భావన! ఎంత మనోహరమైన ఊహ! ఇంతటి శక్తి కవిరాజుకే చెల్లు!

మరొక వన్నెలాడి సింహాద్రి ఎక్కుతున్నది. ఆమె కూడా శివ భక్తురాలే. నొసట విభూతి ధరించింది. ఆవిడను కవి సార్వభౌముడు చూసిన తీరు చూడండి:

పొలు పొందగ విభూతి బొట్టు నెన్నొసలిపై తళుకొత్తు చెమట కుత్తల పడంగ
సొగసుగా పూదండ జొనిపిన కీల్గొప్పు జారగ నొక చేత సర్దుకొనుచు
బిగి చన్నుగవ మీద బిరుసు పయ్యెద చెంగు దిగజారి శివ సూత్ర మగపడంగ
ముక్కున హురు మంజి ముత్యాల ముంగర కమ్మ వాతెరమీద గంతు లిడగ
కాలు జవ్వాడ మట్టియల్ కదిపి మ్రోయకమ్మ విలుకాని జాళువా బొమ్మ యనగ
మెల్ల మెల్లన సింహాద్రి మీద కేగె కన్నె పూబోడి అగసాలి వన్నెలాడి.

మెట్లెక్కే శ్రమ వల్ల చెమటపట్టి ముఖాన విభూతి బొట్టు తడిసిపోతున్నది. అందంగా పూలదండ జొనిపిన కొప్పు జారుతుంటే ఒక చేత్తో సర్దుకొంటున్నది. ఇంతలో స్తనాలమీది పైటచెంగు దిగజారి శివసూత్రం కనిపిస్తున్నది. ముక్కున ముంగరలో హురమంజి ముత్యం పొదిగి ఉన్నది. దాని కాంతి పెదవిమీద గంతులు వేస్తున్నది. బంగారు బొమ్మవంటి ఆ మచ్చెకంటిని చూసినవాడు అదృష్టవంతుడు.

విశ్వేశ్వరుని అర్చించే సమయంలో ఒక జంగమురాలు గిరిగిండ్లు వాయిస్తున్నది. ఆ వాద్య ధ్వని మాత్రమే కాదు, ఆ వాయించే వనిత కూడా కవిరాజు నాకర్షించి ఈ పద్యం చెప్పించింది:

దాయాదు ల్వలె గుబ్బ చన్ను లొరయన్ ధావళ్య నేత్రాంబుజ
చ్ఛాయల్ తాండవమాడ గేరి పురుష స్వాంతంబునన్ మన్మథుం
డేయన్ జంగమ వారి చంద్రముఖి విశ్వేశార్చనా వేళలన్
వాయించెం గిరిగిండ్లు బహుకుశల వ్యాపార పారీణతన్.

ఆమె వాయిస్తుంటే మన్మథుడు మగమనస్సులను వాయిస్తున్నాడట. పెద్ద క్షేత్రాలకు వెళ్ళినప్పుడు దేవతా దర్శనం చేసుకొన్న తరువాత స్నేహితులతో కలిసి క్షేత్రంలోని ఇతర విశేషాలు, చూడదగ్గ చోట్లు సరదాగా కబుర్లు చెప్పుకొంటూ చూడటం యాత్రికులకు సహజం. ఒక కలకంఠి అనుగు చేడియలతో ముచ్చట లాడుకొంటూ సింహాచలం మీద తిరుగుతున్న దృశ్యాన్ని కవిరాయ డిలా వర్ణించాడు.

విడిన కొప్పున జాజి విరు లొప్ప గారాల చిట్టి కుంకుమ చుక్క బొట్టు చెదర
చక్కగా బటువారు సందెడు కుచ్చిళ్ళు చెలగి మెట్టియలపై చిందులాడ
కొదమ గుబ్బల పైటకొంగు నొయ్యన జార ముక్కు నత్తెక వింత ముద్దు గుల్క
మొలగంట లిమ్మగు మ్రోతతో రంజిల్ల కనకంపుం టందియల్ ఘల్లు రనగ
పొసగ కప్రంపు వీడెమున్ పొందుపరచి అనుగు చేడెలతో ముచ్చటాడు కొనుచు
అలరు సింహాద్రి పైనెక్కి హర్మమునను వచ్చె కలకంఠి వేపారి మచ్చెకంటి

సౌందర్యాన్ని ఆరాధించే వాళ్ళు రాసిక్యాన్ని జీవిత భాగంగా చేసుకొన్నవాళ్ళు ఇటువంటి పద్యాలంటే ఎక్కువ ఇష్టపడతారు.

## తల్లికి మగడౌట..

రాయలసీమ నుంచి ప్రసిద్ధి కెక్కిన అవధానులలో శ్రీ సి.వి. సుబ్బన్న పేరెన్నిక గన్నారు. ఆంధ్రదేశంలోనే కాక తెలుగువారున్న ఇతర రాష్ట్రాలలో చాలా చోట్ల అవధానాలు చేసి, ప్రత్యేకమైన ప్రశస్తినీ, బహు సన్మానాలనూ పొందినవారు. ఆ యా సందర్భాలలో వారు పూరించిన సమస్యలు మొదలైనవి కొన్ని ఉదాహరిస్తాను.

భీమవరం అవధానంలో ఇచ్చిన సమస్య-

గర్భములో నున్న బిడ్డ గ్రక్కున తుమ్మెన్
పూరణ: నిర్భయ గతి నిద్రించుచు
స్వర్భువనాధిపు విధాన సస్మిత ముఖ సం
దర్భుడు మందిర డోలా
గర్భములో నున్న బిడ్డ గ్రక్కున తుమ్మెన్

తుమ్మినది కడుపులో ఉన్న బిడ్డగాదు. ఇంటిలోని ఊయలలో ఉన్న బిడ్డ అని అర్థం వచ్చింది.

భద్రాచలంలో ఇచ్చిన సమస్య :
తల్లికి మగ డౌట కంటె ధన్యత కలదే!
పూరణ: పల్లవ పాణీ రమా సమ
సల్లలితాంబుజ వదన విశాలేక్షణ శో
భిల్లు నల రెడ్డి సుత కని
తల్లికి మగ డౌట కంటె ధన్యత కలదే!

కాటయ వేముని పుత్రిక అని తల్లిని వీరభద్రారెడ్డి పెండ్లాడి, రాజమహేంద్రవర రాజ్య ప్రభువైన ఘట్టం. మగడైనది తల్లికికాదు-అని తల్లి అనే పేరున్న రాజ పుత్రికి-అని రుచిరమైన పూరణ వచ్చింది.

బేతంచెర్ల అవధానంలో-పూరీ, లారీ, గోరీ, మోరీ-దత్తపది -గౌరీ కళ్యాణము చెప్పమంటే వచ్చిన పద్యం.

పూ రీతిన్ వికసించు జవ్వనముతో పొల్పొందు కళ్యాణి! యే
లా రీ ధామతి క్రుంగెదంచు గిరిజన్ లాలించుచున్ దాకెనే
గో రీ చోట నటంచు ముద్దు గొని చెక్కుం దువ్వి కౌమారి యే
మో రీణ క్రుధు డూని పెండ్లి కొడుకై పొందెన్ మహానందమున్.

పూ రీతిన్-పుష్పం వలె వికసించే యౌవనంతో అలరారే కళ్యాణీ! ఏలా రీఢామతి= తిరస్కార బుద్ధితో క్రుంగి పోతావని పార్వతిని లాలిస్తూ అయ్యో నా గోరిక్కడ తాకిందా అని ఆ చోట ముద్దు పెట్టుకొంటూ, చెక్కు దువ్వి మదనవైరి రీణ క్రుధుడు=తొలగిన కినుక గలవాడై కొత్త పెండ్లికొడుకుగా ఆనందం పొందాడు

మదనపల్లెలోని అవధానంలో పూరించిన సమస్య-

ఒకరా! యిద్దర! ముగ్గురా! నలుగురా! ఊహింప నింకెందరో!

పూరణ: ప్రకటౌద్ధత్యము తోడ వీచె జనతా పార్టీ మహా వాత్య స
భ్య కదంబం బడి వచ్చె కాంగ్రెసు ప్రతిద్వంద్వి స్ఫురత్ స్థాన దీ
పకమై పండిన ఆకులై పడిరి భూభాగమ్మునన్ మేటులే
ఒకరా! యిద్దర! ముగ్గురా! నలుగురా! యూహింప నింకెందరో!

జనతా పార్టీ విజృంభణానికి కాంగ్రెసు వారు తుపాను గాలికి రాలిన పండుటాకుల్లా పడిపోయారు. వారు ఒకరా యిద్దరా ముగ్గురా నలుగురా ఎందరో-అని సమకాలీన రాజకీయాలను జోడించి చేసిన అందమైన పూరణ.

మదరాసులోని అవధానంలో భావక్లిష్టతే కాక ప్రాసక్లిష్టత కూడా కలిపి ఇచ్చిన సమస్య:

లక్ష్మీ వల్లభుడయ్యె భర్త ఉమకున్ లక్ష్మింపుడీ! పండితుల్

పూరణ:సూక్ష్మ భ్రాంతి కృదంగ జైక్షవ ధనుః క్షిబ్ధాంతరుండై హరుం
డా క్ష్మాభృత్సుత నొల్లడయ్యె స్మరు నేత్రాగ్నిన్ దహించెన్ చలత్
ప క్ష్మన్ క్రమ్మర చేరదీసె మును లభ్యర్థింప కైలాస భూ
లక్ష్మీవల్లభు డయ్యె భర్త ఉమకున్ లక్ష్మింపుడీ పండితుల్

ఉమకు భర్త అయినది లక్ష్మీవల్లభుడు విష్ణువని సమస్య. అలా కాదు. కైలాస భూలక్ష్మికి ప్రభువైన శివుడు భర్త అయినాడని మలుపు. అందులోనూ కామ దహనం చేసిన వాడే లొంగాడనటంలో భావ విశేషం.

శ్రీకాళహస్తిలో కంచి కామకోటి పీఠాధిపతిపైన చెప్పిన ఈ కింది పద్యం వీరి భక్తిభావ వైఖరిని తెలుపుతున్నది.

ఏ మహాత్ముని దయామృత వీక్షణము జన స్తోమమునకును శ్రీరామరక్ష
ఏ పండితోత్తము హిత మితోపన్యాస నిర్మలధార పన్నీటి జల్లు
ఏ తపస్సంపన్ను నీడిత శక్తి ప్రాక్ ప్రచిత సంస్కృతికిని పట్టుగొమ్మ
ఏ సంయమివరేణ్య దృబ్ధ సంస్థాయవైభవ మాప్తలోక కైవల్య లక్ష్మి
ఆ జగద్గురునకు సుధీ వ్యాఘ్రమునకు నిగమ కర్మఠునకు కమనీయ కామ
కోటి పీఠాధిపతి కివె యేటి కోళ్ళు ప్రణతు లంజలి బంధముల్ వందనములు.

ప్రతిభ, పాండిత్యం, ధార, ధారణ అన్నీ ఉల్లసిల్లే ఈ అవధాని శేఖరుని పిన్నతనాననే తీర్చిదిద్దిన వ్యక్తి మహాకవి శ్రీ గడియారం వెంకట శేషశాస్త్రి. ఆశీస్సు లిచ్చినవారు ఆంధ్రావనిలోని మహా కవి పండితులు. అందులో పుట్టపర్తి వారి ముద్దైన దీవెన చూడండి-

ఇంత వాడ వటంచు ని న్నెంచలేదు

ఇంత వైతివి ముందు కింకెంత వగుదొ
బ్రదుకరా! బిడ్డ! ఆయువు పట్టు లెరిగి
ఉద్ధరింతువు మన సీమ నొక్కరుడవె!
విశ్వనాథ వారి చిత్ర సుందరమైన పలుకుబడి చూడండి-
శాంతు డమత్సరుండు గుణశాలి దయామతి పండితుండు సం
క్రాంత పురామహాసుకవి కవ్యామనోజ్ఞ గుణుండు భావుకుం
డాంతర లౌకికేతర నిరంతర సూక్ష్మతరార్థ భావనా
వంతుడు లోకవేత్త కవి-వాడవు వాడుగఁగమ్ము సుబ్బనా!
వాడవువాడుగ అయ్యాడు సుబ్బన్న కవి యనటంలో ఎటువంటి సందేహమూలేదు.

## శివానుగ్రహమే

తెలుగు కవులలో మొదటినుంచీ శివభక్తులు ఎక్కువమంది. రామాయణాది గ్రంథ రచన చేసినవారు కూడా శివభక్తులు కావటం విశేషం. శైవ వాఙ్మయం తెలుగు సారస్వతంలో అత్యంత ప్రధానమైన స్థానాన్ని ఆక్రమించుకొన్నది. అయితే ఈశ్వరార్చన కళాశీలుడైన శ్రీనాథ మహాకవి వంటివాడు కూడా కాశీఖండ భీమ ఖండాలను అనువదించాడే కాని, ముఖ్యమైన శివ పురాణం జోలికి ఎందుకో పోలేదు.

పండితాగ్రణి అయిన శ్రీ ముదిగొండ నాగవీరయ్యశాస్త్రిగా రా మహాకార్యాన్ని తలపెట్టి ఈ విధంగా అన్నారు-

శ్రీనాథాది మహా కవీశ్వరులు నిస్సీమోల్ల సద్వాగధీ
శానీ దత్తవరప్రసాదకవితా సామ్రాజ్య ధౌరంధర
శ్రీనాథుల్ ముసు నీ పురాణమును నాంధ్రిన్ గూర్ప నూహింపర
ద్దానన్ నాయది భాగధేయమని చేతం బందు భావించితిన్.

సహజ పాండిత్యుడూ, మహాభక్తుడూ అయిన పోతన ఇలాగే భావించి రచించిన సంగతి సాహితేయులకు తెలిసినదే.

ఒనరన్ నన్నయ తిక్కనాది కవు లీ యుర్విన్ పురాణావళుల్
తెనుగున్ జేయుచు మత్పురాకృత శుభాధిక్యంబు తా నెట్టిదో
తెనుగుం జేయరు మున్ను భాగవతమున్ దీనిన్ దెనిగించినా
జననంబున్ సఫలంబు జెసెద పునర్జన్మంబు లేకుండగన్.

పోతనగారు నన్నయ తిక్కనాది మహాకవులు తెనిగించక పోవటం వల్ల తన సుకృతవశాన భాగవతానువాదం దక్కిందని భావిస్తే, ముదిగొండవారు కూడా శివభక్తులైన శ్రీనాథాదులు ఆంధ్రీకరించకపోవటంవల్ల తనకు శివపురాణానువాద భాగ్యం దక్కిందని భావించారు.

శైవులైనా వైష్ణవులయినా వాగ్దేవతను స్తుతించక ప్రాచీనులు కావ్యరచన చేయలేదు. ఆ సంప్రదాయాన్ని నాగ వీరయ్య శాస్త్రిగారు పాటించి ఈ సీసాన్ని అందించారు:

మధుర సౌరభ చారు మకరంద బంధుర శోణాబ్జ మొక కేల సొంపు చిలుక
లలిత రాగాయ తాలాప శోభిత హేమ వల్లకి యొక చేత వన్నె దొలుక
రసవస్త్యలంకార రమ్య భావోదార పుస్తక మొక కేల పొంక మొలుక
భర్గపావననామ పరమ జపోజ్వల మణిమాల యొకచేత మానుగులన్
సురభి సౌవర్ణ పుష్కరాంతర మనోజ్ఞ కర్ణికాసీన ధాతృ ముఖమున నమరు
వాణి నిర్జిత శుకపికవాణి వాణి గరిమ నొసగ భజింతు చొక్కమగు భక్తి.

వీణా పుస్తక మాలికా శుక పాణి అయిన వాణి నారాధించి కవివరులు మధుర వాక్కును పొందారు.

గ్రంథ ముద్రణవేళ అనారోగ్యం కలిగి బాధపడుతూ శ్రీశైల భ్రమరాంబను ప్రార్థించిన పద్ధతి వారి భక్తిని తెలియజేస్తున్నది.

ఈ నా దేహమునందు తేజము బలం బీవిప్పు చేకూర్చి యే
గ్లానుల్ లేక మనంగ జేయు నెడనే కాత్యాయనీ దేవిరో!
నీ నాథోరుపురాణ కావ్యమా కడున్ నీ టొప్ప ముద్రించుటే
కానీ! కాని యెడన్ భరంబగు కృపన్ కన్గొమ్మికన్ భారతీ!

కవితా సృష్టివేళ అన్నిటికంటె శబ్ద బ్రహ్మబోధమే అత్యున్నతమైన దన్న భావన కలిగి జపాది మార్గాలతో పని లేదని ఇలా అన్నారు రచయిత-

అక్కరలేదు మంత్రజప మక్కర లేదిక బీజ సంచయం
బక్కర లేది కా ప్రణవ మక్కర లేదిక లాతి మార్గముల్
చక్కగ నిట్లు శబ్దమయ చారు తరంబగు బ్రహ్మమున్ జనుం
డెక్కుడు యత్నమున్ గాని యపేక్ష నెరుంగగ జెల్లు కోమలీ!

పోతన భాగవతంలో

పలికెడిది భాగవతమట
పలికించెడి వాడు రామభద్రుండట నే
పలికిన భవహర మగునట
పలికెద వేరొండు గాథ పలుకగ నేలా ?

అనిన విధంగానే, నాగవీరయ్యశాస్త్రిగారు శివుని ఉద్బోధకుడుగా భావించి ఇలా అంటారు-

ఉద్బోధకు డీశ్వరుడట!
సద్భావముతోడ నిద్ది సల్పుటయట నీ
షద్భంగము లేకయె కృతి
యద్భుత గతి పూర్తి నొంది యలరుట అరుదే!

శైలీ రమ్యతకు, పాక సౌష్టవానికి ఉదాహరణగా విశ్వనాథవారు ముదిగొండ వారి ఈ కింది పద్యాన్ని ఇచ్చారు.

అరుణ మరీచి యంత సుదయాచల పీఠము నెక్కి వర్వత
స్ఫుర దసమాన మంజుకర పుంజములన్ వెలయించి యూర్ధ్వ ని
స్సరదయ లాంశుజాలముల శైల వరోన్నత శృంగ పల్వ లాం
తర నళినాళి గూడి ప్రమదమ్మున పూయగ జెసె వాసిగన్.

నన్నయ శ్రీనాథులను, ఎఱ్ఱన పెద్దనలను స్ఫురింపజేసే పద్య మిది. ఇటువంటి ఉదాత్త గ్రంథ నిర్మాణం చేయటం, ఉన్నత కవిత్వాన్ని సృష్టించటం సామాన్యమైన పని కాదు. శివానుగ్రహంవల్ల ముదిగొండ వారీ మహా కార్యసాధనలో కృతకృత్యులైనారు.



# పతాక బంధము



ఉ.

వేద పద ప్రదర్శన !నవీన ఘనద్యుతి దేహ !దేవ దే
వా! దరసారధారణ ! శుభప్రభవా భరన ప్రదీప్త! దా
మోదర ! వాద భేదనదమోదయ ! మానసవాస వాజరు
ద్రాదిమభావ ! భావిత పదాంబుజ ! తాపసబృందమోదదా!